

# ద్రుత ప్రకృతికావలోకనం

- డా॥ అంబడిపూడి నాగభూషణం


Mohan Publications
Mohanpublication.com
Granthanidhi.blogspot.in

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533 101.

# ద్రుతప్రకృతికావలోకనము

ద్రుతవిషయసామగ్రి – ద్వితీయభాగము



అంబడిపూడి నాగభూషణం

డిసెంబరు - 1985

ప్రతులు : 500

రూ. 30 లు

ప్రకాశకులు :

అంబడిపూడి రామకృష్ణమూర్తి

అంబడిపూడి నాగభూషణం

డా. కె. వి. కె. సంస్కృతకళాశాల,

8/3. అరండల్ పేట,

గుంటూరు - 2.

స్వరాజ్య లక్ష్మి ప్రెస్,

లాలాపేట, గుంటూరు - 3.



అంబడిపూడి ప్రసాద్, అంబడిపూడి ఆదిలక్ష్మి

మనఁగా ఆమార్గములోనివారు ఈప్రాచీనసంప్రదాయమార్గములోని వారు కూడ దానినే మెచ్చుచున్నారు. నాచిన్నతనమున ఈభాషా శాస్త్రగ్రంథములను ప్రమాణములుగ స్వీకరించెడువారు కారు. పోఁగా ఇవి ఆభాసము లని మామనసుల కెక్కఁ బలికెడివారు. వారికిని వీరికిని వివాద మప్పుడు ముదురుపాకమునఁ బడియెడిది. భాషా నియమము లేనియీరోజులలో వ్యాకరణశబ్దము వినఁబడుట గాని సహించుట గాని అంతరించిపోవుచున్న సమయమున ఇట్టి యింతటి గ్రంథమును వ్రాయఁబూనుట యాశ్చర్యమే.

లక్షణ మెప్పుడును లక్ష్యానురోధిగా ఉండవలెను. ఆలక్ష్యము శిష్టప్రయోగారూఢ మైయుండవలెను. పాఠభేదములను గమనించి ఏపాఠ మర్థవంతమో ప్రకృతమున కెంత ఉపకరించునో దానిసమన్వయప్రకార మెట్లో ఇన్ని ఆలోచించుకొని లక్షణముతో నేకవాక్యత కుదుర్చవలెను. ఈలక్షణగ్రంథానుశీలనమునందుఁ గాని వ్యాఖ్యానమునందుఁ గాని యిన్నిరకము లైనచిక్కు లున్నవి. అంతటి శ్రమకోర్చి యిట్టిగ్రంథరచన చేయుటలోనికష్ట మనుభవైకవేద్యము.

తెలుఁగువ్యాకరణమునందు సంస్కృతవ్యాకరణన్యాయములు కొన్నిచోట్ల సాధకము లగును గాని కొన్నిచోట్ల బాధకములు గూడ నగును. లక్షణగ్రంథములను పాఠము చెప్పువారు చాలమంది సాధకము లైనఆద్యవ్యాకరణపరిభాషలను న్యాయములను స్వీకరించి బాధకము లైనవానిని-విడిచిపెట్టుచున్నారు. ఈవిమర్శగ్రంథమునందు ఆంధ్రలక్షణగ్రంథములసమన్వయమార్గమున ఈతనిగ్రంథాభినివేశము ముచ్చటగొల్పును.

ఆంధ్రవ్యాకరణమునకు ఆద్యగ్రంథము నన్నయభట్టారక విరచిత మైనఆంధ్రశబ్దచింతామణి. ఈచింతామణిలో — చింతామణిలో నేమి? తెలుఁగువ్యాకరణగ్రంథములలో ద్రుతము ద్రుతప్రకృతికములు ద్రుతకార్యములు తన్నిర్ణయములు కొంచెము చికాకును పెట్టుచునే

కలిగితిరని నని నా విశ్వాసము. 'ప్రమాదో ధీమతా మపి' అన్న పెద్దల మాట నిరర్థకము కాదు గదా.



ద్రు.ప్ర.స్వరూపాదినిర్ణయమే కాక వైకల్పికద్రు.ప్ర.లు కళలద్రు.ప్ర.త్వము మొ॥ సంశయములమీఁద చక్కనిసూచనలు చేసినాను. ఇవి సూచన లనుటకంటె సిద్ధాంతము లనుటయే యథార్థము. ద్రు.ప్ర.విభాగ మీరీతిగా ఇప్పటికి నాచదివినవ్యాఖ్యానములందుఁ గాని విమర్శనములందుఁ గాని కానరాలేదు. ఇట్టిరచనకు అనుశీలనముతోపాటు ఒకఅపూర్వమైనవ్యుత్పత్తివైచిత్ర్యము ఉండవలె. యథాశ్రుతగ్రాహిత్వము పనికిరాదు. అందుచేతనే యిది సిద్ధాంతగ్రంథ మగుచున్నది.

తాను నేను పదములవిషయములో వజ్ఝలవారు భారతప్రయోగము నొకదాని నుదాహరించుచు కళ లనుచున్నారు. అది 'యేను-విడవ'. ద్రుతాంతమైనచో గసడదవాదేశము కుదురదు. కాక సరళాదేశము చేసిన ఏను బిడవ నని వ్రాయ వ్రాస తప్పును. భారతప్రతులలో ఏన విడవ నని కానవచ్చుచున్నది. మఱియొకచోట మేఁ డివియెద నన్నది. ఈఅన్నిపాఠములును ప్రకృతార్థమునకు భంగము కల్గింపనివే. ఈపాఠములలో - మూలమునందు పశ్చాత్ అని ప్రయోగింపఁబడి యుండుటచేత ఏను వెనుక అనుపాఠమే సమంజసమేమో. ఏఁ డివియెదను అనుట తిక్కనపలుకుబడిపద్ధతియే కాని వేరు కాదు.

సాధారణముగా గ్రంథనామములకును కృతవిభాగములకును వానిశీర్షికలకును ప్రతిష్ఠాప్యమానవిషయమునకును అనుసార్యతత అంతగా కుదురదు. ఈ - అన్వేషణ - అవలోకన - అనుశీలనములయందు ఈమూఁడింటికిని ఐక్యము కుదురుట గమనింపవచ్చును.

విమర్శించునప్పటియీతనివాగ్వైదగ్ధ్యత మెచ్చఁదగియున్నది. వారిసిద్ధాంతము ననువదించి అం దసమ్మతము లైనఅంశములను

ప్రమాణములతో నిరూపించి - మరల వారికి పక్షస్థాపన మొనరించు కొనుటకు యుక్తులు నశించి ఆయుక్తులను పునః పూర్వపక్షాశంక లేకుండునట్లు ఖండించి స్వపక్షమును స్థాపించునంతవరకు వారికి తమ వాదము లొంగిపోయిన దని తెలియదు. దీనిని వైదగ్ధ్య మందురు. ఈతనిశరీరమువలెం గాక దుర్బలము కానియీ వాగ్వైదగ్ధ్యము ఈతని పూర్వజన్మసంస్కారముచే నేర్పడినదే కాని శాస్త్రసమాలోచనముచే నేర్పడునది కాదు.

చిత్రమే మనంగా ఈతనికి సందిగ్ధము లైనఅంశములున్నట్లున ఇంకను విచారించి తెలిసికొనవలయు నని నిరహంకారముగా వినయముతోం జెప్పెను. తనకు తెలియనిఅంశమును సందిగ్ధమైనఅంశమును తెలిసినట్లు వాదించి నిరూపించుకొంద మన్న యూరాట యీతనికి లేదు.

నావిన్నవించినఅంశములకన్నింటికిని గ్రంథమే ప్రమాణము. ఇంకను విడివిడిగా విస్తరించి చెప్పవలసినవిషయము లెన్నియో యున్నవి. గ్రంథస్వరూపమును ఉదాహృతముగా సూచించుటయే ముఖ్యోద్దేశము కావున ఇట్లు మనవి చేయుచున్నాను.

ఆంధ్రవ్యాకరణపరిశ్రమము కల్గినవారైన ఈతండే బాలవ్యాకరణమునకు విస్తృతమైన ఉపపత్తులతో సమగ్రమైనవ్యాఖ్యానము చేయుట అపేక్షణీయము.

లోకమునందు బహుగ్రంథపరిచయపరిశీలనములతో జ్ఞానము సుష్ఠుగా నేర్పడినపిమ్మట ఈపని చేయవచ్చును ఆపని చేయవచ్చు నను కొనువారు చివరకేమియుం జేయంజాలక పోవుచున్నారు. ఇట్టిమంచిపనులకు జ్ఞానమే కాని వయోనియమము మనావశ్యకము. పెద్దలు చెప్పనే చెప్పుచున్నారు.

"గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః."

కోగంటి సీతారామాచార్యులు

## ముందుమాట :

అందఱకు నభివందనములు !



ప్రమతవిషయసామగ్రిలో ద్వితీయభాగ మగు ప్రమతప్రకాశికావలోకనము పెక్కులు చిక్కులకు లోనయి యెట్లోఁ బూర్తియైనది. అచ్చుతప్పులు నింతధికముగనే చోటు చేసికొనుట పాఠకులను గొంత చిక్కు పెట్టునదే యైనను సహృదయు లది సహింపఁగలరని నమ్మిక.

ఈ గ్రంథముద్రణమునకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వసాంస్కృతిక వ్యవహారాలశాఖ నార్థికసహాయము కోర ప్రభుత్వము నియమించిన సంఘ మీ గ్రంథ మందు కళాత్మకముగా నిర్ణయించ నట్టిసహాయమునకుఁ దిరస్కరింపఁబడినది. అట్టితిరస్కారము నొక ప్రత్యేకతగా ప్రముఖముగ గుర్తించుచు సమర్థ మైనలాక్షణికలోకము సర్వాధికి మని భగవత్కృపావలంబముతో నిది ముద్రణ మందినది.

నిష్పాక్షికముగాఁ దన గ్రంథము నచ్చినటుల పరామర్శించుటలోఁ బ్రోత్సహించిన మా పూజ్యగురువర్యులు శ్రీ కేతవోలు రామబ్రహ్మం గారికే వినమ్రముగా నమస్కరింతును

ఈ గ్రంథమునకుఁ బమయామోదమును దెల్పిన పూజ్యగురువులు శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులుగారి కెంతయుఁ గృతజ్ఞతలతో నమస్కరించుచున్నాఁడను.

మా ముద్రణపనిలో నెంతయు సహకరించిన మా విద్యార్థులు చిరంజీవులు కె. శ్రీరామమూర్తి, ధనకుధరం శ్రీనివాసాచార్యులు ప్రభృతు లందఱ శ్రమను బ్రత్యేకముగ గుర్తింతును.

సిద్ధార్థప్రింటర్స్, అరండల్ పేట, గుంటూరువారు, పెక్కు కొనవలసినయాలస్యముతో నడపి నడుమనె తనువలనఁ గా దన్న యీ గ్రంథముద్రణమును సాధ్యమైనంతత్వరలో పూర్తి చేసిన స్వరాజ్యలక్ష్మీప్రింటర్స్, లాలాపేట వారికిఁ గృతజ్ఞతలు.

**అంబడిపూడి నాగభూషణం**

# ముఖ్యసంకేతవివరణము

*



ఆం.కౌ.(సం.) ఆంధ్రకౌముది (P.R. 1246 వ్రాతప్రతి. O.R.I తిరుపతి.) మండలక్ష్మీనృసింహకవి.

ఆం.భా.ని. ఆంధ్రమహాభారతనిఘంటువు.

ఆం.సా.ప. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

గాణ. గాణపతవివరణము. చల్ల గణపతిశాస్త్రి.

తి.ప.కో. తిక్కనపదప్రయోగకోశము.

తె.ప్ర. తెలుగువ్యాకరణాలపై సంస్కృతప్రాకృతవ్యాకరణాల ప్రభావం. మాపూజ్యగురువర్యులు, బేతవోలు రామబ్రహ్మంగారు.

త్రి.శ. త్రిలిఙ్గశబ్దానుశాసనమ్ (D 1215. వ్రాతప్రతి. గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మద్రాస్.) అథర్వణుఁడు.

ద్రు. ద్రుతిస్వరూపాన్వేషణము, అంబడిపూడి నాగ

ద్రు.కా. ద్రుతకార్యానుశీలనము ,, [భూషణం

ధా.వి. ధాతుజవిశేషణము.

సం.ము. ఆంధ్రమహాభారతము, సంశోధితముద్రణము ఉస్మానియాయూనివర్సిటీముద్రణ.

సా.త్రి.శ. సారస్వతత్రిలిఙ్గశబ్దానుశాసనమ్ (D. 1223. వ్రాతప్రతి. గవర్నమెంట్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మద్రాస్.) మం. లక్ష్మీనృసింహకవి.

ఇతరములను: చూ. ముఖ్యసంకేతవివరణము, ద్రు., ద్రు.కా.

—*—

# ద్రుతప్రకృతికావలోకనము

'అన్యే ద్రుతప్రకృతయో దే స్యుర్వ్యక్తానుజీవితద్రుతా నిత్యం' మ్మను సూత్రముచేఁ జింతామణి ద్రుతప్రకృతిసంజ్ఞ నుచ్చరించియున్నది. పిదప ద్రుతమున కగుకార్యములు చెప్పుసందర్భమున 'పరుషాః ద్రుతప్రకృతికా త్సరళా' యని ద్రుతప్రకృతిక మని పేర్కొన్నది. దానినుండియే యీసంజ్ఞలు ప్రసిద్ధము లైన వనవచ్చును.

### ద్రుతప్రకృతి-ద్రుతప్రకృతికము భిన్నములా ?

'ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికంబులు, ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళ లనంబడు' ననుచు సూరి యీరెంటిని సమానార్థకములుగనే ప్రయోగించెను. భిన్నార్థకము లగుట కిం బాధారమును గానరాదు.

కాని శ్రీకాశీభట్ల కృష్ణరామశాస్త్రిగారు ద్రుతప్రకృతు లని సంజ్ఞాపరిచ్ఛేదములోఁ జెప్పి సంధిలో ద్రుతప్రకృతికము లని వాడె ననునంశము ప్రధానము చేసి "ద్రుతప్రకృతికములు ద్రుతప్రకృతిమాత్రములు గా వని యర్థము సేయవలయును" (47.పుట. ఆం.సా.ప. జ్యేష్ఠాషాఢ 1934) అనిరి. ఏల యనుట కాధారము సూత్ర మగు చింతామణియం దిట్లు భావింపఁ బడినది. 'వాత్మానస్మదోః' అనుసూత్రము ననుసరించి చింతామణిలోఁ దానునేనులు ద్రుతాంతములే యని యర్థ మయినది. ఇవి ద్రుతప్రకృతికములే యైన బుగ్వా ద్రుతప్రకృతికాత్తనుదానిచే నాకార్యము సిద్ధించును. అని శంకించి సిద్ధాంతముగా "తానునేనులు ద్రుతప్రకృతు లగును గాని ద్రుతప్రకృతికములు గావు. ద్రుతప్రకృతిద్రుతప్రకృతికసామాన్యవిధి చేయునపుడు ద్రుతప్రకృతిక మనియు విశేషముగఁ జెప్పవలసివచ్చినచో ద్రుతప్రకృతి యనియుఁ జెప్పును. కావుననే "వాత్మానస్మదోః"అనుసూత్రము ప్రారంభించెను." (47) ఇత్యాదిగాఁ బేర్కొనిరి. కాని యిది విశ్వసింపఁదగినదిగా లేదు. తాను నేనులు ద్రుతాం

తములే యని యంగీకరించినపుడు ద్రుతప్రకృతికము లనక తప్పదు. ద్రుతప్రకృతులే కాని ద్రుతప్రకృతికములు గా వనుటకుఁ జిం.లో నాధార మేది? అవుఁ గాక. ద్రుతప్రకృతిక మని ప్రయోగించినస్థలములందు ద్రుతప్రకృతిమాత్రమే గ్రహింపఁబడదన్నయితఃపూర్వప్రవీరవచనము ననుసరించియే లుగ్వా యను సూత్రము ద్రుతప్రకృతులయెడ వర్తించును. "ద్రుతప్రకృతిమాత్రమే గ్రహింపఁబడ" దనుచోట ద్రుతప్రకృత మన్నపుడు ద్రుతప్రకృతికశబ్దము ద్రుతప్రకృతులను బోధింపఁ గల్గినపుడు దానునేనులయెడ లుగ్వా సూత్ర మేల వర్తింపదు? ద్రుతప్రకృతిక శబ్దము ద్రుతప్రకృతులను గూడ గ్రహింపఁ గల్గినప్పు డసలు దాను నేనులు ద్రుతప్రకృతులే కాని ద్రుతప్రకృతికములు గా వని చెప్పుట యెట్లు గుదురును? ఇట్టి భేదమును గుర్తింపవలె నన్న ద్రుతకార్యములను ద్రుతప్రకృతులందే చెప్పి దాను నేనులు ద్రుతప్రకృతికములే కాని ద్రుతప్రకృతులు గా వనియు ద్రుతప్రకృతి శబ్దము ద్రుతప్రకృతికములను గ్రహింపఁజాల దనియుఁ జెప్పవలె నేమో. (లేదా ద్రుతప్రకృతికశబ్దము ద్రుతప్రకృతులను గ్రహింపఁజాల దనవలె.)

కాక వీరివాక్యములలో 'ద్రుతప్రకృతికములు ద్రుతప్రకృతిమాత్రములు గా' వన ద్రుతప్రకృతులమాత్రమే ద్రుతప్రకృతికములు గా వనియు ద్రుతప్రకృతీతరము లెల్ల ద్రుతప్రకృతికశబ్దముచే గ్రహింపఁబడు ననియుఁ జెప్పవలెనా? అది వారియభిప్రాయము గాకపోవచ్చు. రాముఁడిత్యాది కళలను ద్రుతప్రకృతికములు గావలసివచ్చుట విరుద్ధము. ద్రుతాంతము లైన రామునిన్ ఇత్యాదులు అన్యే యనుదానిచే ద్రుతప్రకృతులు గాకతప్పదు. ఈ ద్రుతప్రకృతులు ద్రుతప్రకృతికములు గా వని యేల ననరు గదా. ఇం తేల? ప్రస్తుతస్థలముననే ద్రుతప్రకృతి, ద్రుతప్రకృతికసామాన్యవిధి చేయునపుడు ద్రుతప్రకృతిక మని చెప్పు ననియు విశేషవిధిస్థలములలోనే ద్రుతప్రకృతిశబ్దమును వాడు ననియుఁ జెప్పిరే కదా. ఇది ద్రుతాంతము లైనవాని కెల్ల సమానముగనే చెల్లు నని చెప్పవలె. దానింబట్టి 'లుగ్వా' యని చెప్పఁబడినకార్యము దాను నేనుల ద్రుతాంతములయెడఁ జెల్లుట కవరోధము లేదు గదా. ద్రుతాంతము లెల్ల

పద మై ద్రుతప్రకృతి యనఁదగియుంట నప్పుషమున నెట్లును సర్వత్ర యని లోపము రాకతప్పునా? కాకయుఁ బ్రత్యేకముగా విహిత మైయున్నసుమాగమ ద్రుతము సర్వత్ర యని లోపించునో నుమాగమవిధానము వ్యర్థము కాలేదా? అందుకే గదా సూరి విధానసామర్థ్యముచే నా ద్రుతమునకు లోపము లేమిని స్పష్టము చేసెను. కాన నందుకయి పై రీతి సమన్వయ మనవసరము. అసలు పై రీతిభేద కల్పనమునకు లక్షణమున నాధారము లేమి యెల్లనున్నది. ప్రకృతిపయి నుమాగమ మవునది (విష్ణువునుగూర్చి) జ్ఞానమునుబట్టి భుజింపఁగలఁడు భుజింపఁబడును అనురీతిస్థలములలో ననఁగాఁ గూర్చి, పట్టి, కం, పముపరకస్థలములలో మాత్రమె యని నిశ్చయింపవచ్చు. వీనికి ద్రుతప్రకృతికము లని విశేషసంజ్ఞను గల్పింప వలెనా? ద్రుతప్రకృతికము లగునిట్టివానిని ద్రుతప్రకృతు లనియు ననఁదగు నన్న నయ్యది సామాన్యసంజ్ఞ యనియు ద్రుతప్రకృతిక మన్నది విశేషసంజ్ఞ యనియుఁ జెప్ప వలెను. అయయి ద్రుతకార్యములు ద్రుతప్రకృతికములకుఁ జెప్పిన వగుటంజేసి యట విశేషసంజ్ఞోపయోగమువలన ద్రుతప్రకృతు లగువాని కెల్ల నాకార్యములు రా వన్నమాట. అందుకే ద్రుతప్రకృతికములు గాక ద్రుతప్రకృతులు మాత్రమె యైనకానునేనుల విషయమునఁ బ్రక్రియ ప్రత్యేకముగాఁ జెప్పఁబడినది. అయిన భాషలో నేనువాదులు కంటే (ద్రుతప్రకృతికములు గాక) కేవలద్రుతప్రకృతులావి ద్రుతప్రకృతులద్రుతమున కగుకేషకార్యములు విశేషముగాఁ జెప్ప నన్న: నాత్మాస్మచ్ఛబ్దములకే గదా సం. చెప్పినది.

ఇంక ద్రుతప్రకృతు లేవి? అట్టివానిని వీ రిం కొక్కటి చూపలేదు. అయినను సర్వత్ర లుక్సమాసము అనుమాత్రముచే ద్రుతము లోపించుట ద్రుతప్రకృతులయందే (పదము) యనిరి. కాఁగా రామునియొక్క....ఆజ్ఞ రామునిన్ + ఆజ్ఞ అనుచో ద్రుతము లోపింపవలయును గదా. లేకున్న రామునియాజ్ఞ యనునిష్ట రూపము గాకపోఁగా రామునినాజ్ఞ యని రావలసియుండును. కాన సర్వత్ర యను దానిచేతనె ద్రుతము లోపింపవలె. ప్రస్తుత సూత్రము లోపము చెప్పునది ద్రుతప్రకృతులందు. ఎల్లన్ + పాపములు-ఎల్లపాపము లనుచో ఎల్లన్ ము న్నగున

ద్రుతప్రకృతులే. ద్రుతప్రకృతులకు ద్రుతప్రకృతిక మనుసంజ్ఞ యుండునా ? ద్రుతప్రకృతిక మనునది సామాన్యసంజ్ఞ యనియు (సమాసమువలె) ద్రుతప్రకృతి యనునది విశేషసంజ్ఞ యనియు (సమాసకమువలె) చెప్పినపుడు ద్రుతప్రకృతియును ద్రుతప్రకృతిక మగును(సమాసకమును సమాసమె యైనట్లుగా)గాని ద్రుతప్రకృతికము ద్రుతప్రకృతిమాత్రమే కాదు. అనఁగా ద్రుతప్రకృతికిఁ జెప్పినకార్యములు ద్రుతప్రకృతికముల కెల్ల రావు. సమాసకమునఁ జెప్పినవిభక్త్యాదిలోపము సాధ్యమగు సమాసములందుఁ గాదు గదా. ఇట సామాసికద్రుతలోపము ద్రుతప్రకృతులందే యనెఁ గావున నీద్రుతప్రకృతికములలో రాదే దనుట కొకయాధార మున్నదా ? చిగురుంగైదు వనురీతి వన్యథాసిద్ధము లగుట స్పష్టము. అట్టిచోటల నిది ద్రుతప్రకృతులందే యనుటలోఁ బ్రయోజనము లే దనియేచెప్పవచ్చు. ద్రుతప్రకృతికే భోక్తులుత్సంశ్లేషౌ నాద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు అను సూత్రములోఁ బూర్వము ద్రుతప్రకృతికశబ్దము ప్రయుక్త మగుట ద్రుతప్రకృతికములద్రుతమునకు సమాసమున లోపమగుట సాధారణముగుఁ గాని ద్రుతప్రకృతికములకంటె విశిష్టముగాఁ జెప్పఁబడి ద్రుతప్రకృతి యనుదాని నిటఁ బ్రస్తావించుట కాధార మేది ?

కాదు ద్రుతప్రకృతి యన్నది సామాన్యసంజ్ఞ యనియు ద్రుతప్రకృతిక మన్నది విశేష మనియుఁ జెప్పవలెనా ? ఇట్లయిన ద్రుతాంతము లెల్ల సాధారణముగా ద్రుతప్రకృతులే యగును. అన్య ద్రుతప్రకృతులు యనిచెం. ముందుగాఁ బ్రస్తావించిన విధమే. ద్రుతాంతము లవుట ననుసరించి కానసేనలు ద్రుతప్రకృతు లగుఁ గాని ద్రుతప్రకృతికములు గావని మీరు చెప్పుటలో నభిప్రాయ మిది కావలసియుండును. కాని యిట్టి చోటల ద్రుతప్రకృతి యను దానిచే ద్రుతప్రకృతికము గ్రహింపఁబడు నవకాశము గలదు గాని మీ రింతకు ముందు చెప్పినట్లు ద్రుతప్రకృతిక మనుదానిచే (ద్రుతప్రకృతిమాత్రమే గ్రహింపఁబడ దని) ద్రుతప్రకృతియు గ్రహింపఁబడుట కుదురదు. పైఁగా సామాన్యముగాఁ జెప్పఁదలచిన ద్రుతప్రకృతిక మనియు విశేషముగాఁ జెప్పఁదలఁచిన ద్రుతప్రకృతి యనియుఁ జెప్పు ననిరి. దీనింబట్టి ద్రుతప్రకృతిక మనునదే సామాన్య మనియు

ప్రయోజన మల్పము కాఁగా ననర్థము యధిక మైనది. అందుచే ద్రుతప్రకృతిక మనువానిచే ద్రుతప్రకృతిమాత్రమె కాక (ద్రుతాంతము లగుపదములు) యితరము లను (ద్రుతాంతము లగుప్రకృతులను) గ్రహింపఁబడు నని వీరు చెప్పఁదలఁచిరి. కాని తామనేనులు ద్రుతప్రకృతులే కాని ద్రుతప్రకృతికములు గా వనుటకుఁ బా.లో నెట్టి యాధారము లేకుండ వీరి వివరణము ననుసరించియు వీలు లేకున్నది. సమాద్యాగమాంతములు ద్రుతప్రకృతికము లనుటలోఁ జిగురుంగైదువంటివాని నుద్దేశించియున్నయెడల నదృష్టి ప్రామాదిక మని స్పష్టము. సామాసికముగాఁ మాంతములు ద్రుతాంతము లగుపదములే యగుట ద్రుతప్రకృతు లవుటలో వాని వివరణము ననుసరించుటే బాధ లేదు. కాఁగా ద్రుతప్రకృతు లనరాక కేవలము ద్రుతప్రకృతికములే యన వలసినవి ద్రుతాంతము లగు ప్రకృతులు మాత్రమే. ఇవి ద్రుతప్రకృతులు గా వని సాధించు ప్రయోజన మేమి? సర్వత్ర యని లోపము రావలయునా? జ్ఞానము (బుద్ధి) లాయని (గూర్పు) కొలువన్ (గండు) పడయన్ (పడసి) ఇత్యాదులు సమాసగతము లై యున్నఁ గదా సమాసమునందుఁ జెప్పిన వంటిలోపమునకుఁ బ్రసక్తి యేర్పడునది? కావున ద్రుతాంతము లగు ప్రకృతులను ద్రుతప్రకృతు లనుటలో విప్రతిపత్తి లేదు.

సర్వత్ర యని వ్యాఖ్యానించు అనుదానివలఁ బదాంతమునందలి ద్రుతము లోపించి ఎల్లన్ + పాపములు — ఎల్ల పాపములు అని యగును. అవికారగతే యనుమాత్ర మున కిటఁ బ్రసక్తి లేదు. అది ద్రుతప్రకృతికసామాన్యము. ఇది పదము, ఇది ప్రాతిపదికము నను నిర్ణయజ్ఞాన మాంధ్రమున నుపేక్షింపఁబడుటచే నిర్ణయప మార్గములు ద్రొక్కుచున్నారు'' (48) అని వ్రాసినారు వీరు. ఎల్లన్ అనునది పదము. ద్రుతలోపానంతర మది పదము గాకపోదు గదా. ద్రుతప్రకృతి యైనది ద్రుతాంత మగుట యగుటచే సమాసమున ద్రుతము లోపించినమాత్రమున నదృష్టి యపదము గాదు గావున ద్రుతప్రకృతియే యగును. 'అవికారగతే' యనువాని కిటఁ బ్రసక్తి లేకుండుటకును ద్రుతప్రకృతిజ్ఞానము లేకుంట కారణ మగు టెట్లో యను నీ రెంటికి సంబంధ మేమియో స్పష్ట మగుట లేదు. ద్రుత

ప్రకృతు లనియే యుండదు. వాని కైనను ద్రుతప్రకృతికసంజ్ఞ సిద్ధించుటకుఁ గాని యాయాయి ద్రుతకార్యము లప్పుటకుఁ గాని యవకాశము లేదు. ద్రుతాంతము లగు ప్రకృతులు ద్రుతప్రకృతికములే యగు ననియు ద్రుతప్రకృతులు గా వనియుఁ జెప్పుటకు నెట్టియాధారమును లేదు. ప్రకృతులు ద్రుతాంతము లగుటను జిం. స్పష్టముగాఁ జెప్పియు నుండలేదు. వనమునుగూర్చి యిత్యాదులలో నుమ్మోతి యనుదానిచేతను పెదలఁగలఁడు ఇత్యాదులలోఁ బునరాగమః క్రియాణాం ప్మను దానిచేతను నుమ్మును జేయ వే లున్నది. నుమంతము ద్రుతప్రకృతిక మని చెప్పవలెను. ఇట లక్ష్యము లనఁదగిన చిగురుంగైదు విత్యాదులలో నుమంత మునకు వనమును(గూర్చి) అనుదానిని చదివిన్న (ద్రుతప్రకృతిక) మనుటకు నాధార మే మున్నది?

సంజ్ఞలో ద్రుతప్రకృతి యనియు సంధిలో ద్రుతప్రకృతిక మనియుఁ జిం ప్రయోగించుటనుబట్టి యవి భిన్నము లని భ్రమింపరా దని సూచించుట వారి యుద్దేశించెనో లేదో కాని యట్టిది భ్రాంతియే యని మాత్రము సూరివచనముల వలన గ్రహింపవచ్చును. ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికములు అనుచో ద్రుతప్రకృతికము లని పేర్కొన్న వారి యా వెంటనే ద్రుతప్రకృతులు గానిశబ్దములు కళ లని సూత్రించుటలో ద్రుతప్రకృతిశబ్దమును ప్రయోగించి యవి యభిన్నములుగా స్పష్టము చేసెను.

మొత్తముమీఁద ద్రుతప్రకృతి, ద్రుతప్రకృతికము లన్నవి భిన్నము లనుటకు నైని వీరు చూపినయాధార మేదియును సరి యైన దని చెప్ప వీలు లేమి నంగీకారయోగ్యముగా లేదు.

కాఁగా ద్రుతాంతము లైనశబ్దములకు ద్రుతప్రకృతి లేదా ద్రుతప్రకృతిక మన్నది సంజ్ఞ యని గుర్తింపఁదగును. సారాంశముగా ద్రుతప్రకృతి, ద్రుత ప్రకృతికము లన్నవి భిన్నములు గా వనియు నట్లు చెప్పుటకుఁ జింతామణ్యాదు లగునేవ్యాకరణములందును నాధారము లే దనియు నింక నట్లు చెప్పుట యనర్థము లనే కల్పించు ననియు స్పష్ట మగుచున్నది.

### ద్రుతప్రకృతి (క) శబ్దార్థము :-

(స్వార్థమునందు) కప్రత్యయము చేయుటయుఁ జేరకపోవుటయు ద్వారాన నేర్పడిన ద్రుతప్రకృతిక, ద్రుతప్రకృతిశబ్దము లభిన్నములు. అన్యే ద్రుత ప్రకృతయ యని చిం. ముందుగా ద్రుతప్రకృతిని జేర్కొన్నది. పిదప ద్రుత ప్రకృతిక మనియుఁ జెప్పినది. ద్రుతప్రకృతికస్వరూపనిర్ణయమునకు నీశబ్దము యొక్క యర్థవిచారము గూడఁ గొంత వివాదము రేపినది. శ్రీ చర్ల గణపతి శాస్త్రిగారు 'ద్రుతమునకుఁ బ్రకృతి యైనది ద్రుతప్రకృతిక మనఁబడు' నని (అం.సా.ప. ప్రజోత్పత్తి శ్రావణ, భాద్రపద 1291) పేర్కొనియున్నారు. కాని యిది సరి గా దని యితరులు స్పష్టము చేసియున్నారు. (తె.ప్ర.74) అదే విధముగా తె.వ్యా.వి. 'ప్రథమాచార్యుఁడు అవయవికము కాని యిట్టినకారము ద్రుత మనియు నీనకారమునకుఁ బ్రకృతు లైనపదములను ద్రుతప్రకృతికము లనియు సంజ్ఞలను కల్పించె' (357) ననుటలో ప్రకృతు లైనపదము లనుటయందలి యసామంజస్యమును తె.ప్ర. స్పష్టము చేసినది. ఇంకను తె.వ్యా.వి. వివరణమున నావయవికము గానిన కారమే ద్రుత మని చిం. చెప్పినట్లు వివరించుటయు విచార్యము. చిం., వి.వి.ల మతమున నావయవికనకారము ద్రుతము గాదు. కాని యట్టిది ద్రుతము గా దని 'ద్రుతాఖ్యో నః' అను ద్రుతనిరూపకలక్షణము చెప్పుచున్న దనుటలో నాధారము గానరాదు. అవయవికనకారము ద్రుతము గామి నన్యత్ర గుర్తింపఁదగు.

ఏ దే మైనను నీవివరణములో ద్రుతము చేయుటకు మూలరూప మేదో యది ద్రుతప్రకృతిక మని చెప్పుట గానవచ్చును. ఇదియు సరి గాదు. జ్ఞానమును బట్టి యిట్టి యాద్యులలోఁ బ్రకృతులే ద్రుతాంతము లవుట గలదు. యథాగమన్యాయము ననుసరించి యీ ద్రుతము ప్రకృతి కవయ మై జ్ఞానమును అనుభాగ మెల్లఁ బ్రకృతియే యవును గాక. ఆ ప్రకృతికిని ద్రుతప్రకృతికసంజ్ఞ చెప్పఁదలఁచి నప్పటికి ద్రుతముతోఁ గలిపి మొత్తమునే ద్రుతప్రకృతికముగా గుర్తింపవలసియున్నది.

రాముచేన్ ప్రత్యయముచే ద్రుతాంత మైనది. ఇది యేకపదమే కాని రెండు పదములు కావు. ప్రకృతులను ప్రత్యయములను విడఁదీసి కళాద్రుతప్రకృతిక విభాగము జరుగవలయు నన్నచో నవ్యయములలో నాంతము లైనవానినే ద్రు.ప్ర. లనవలసి యుండును. ఈ పద్ధతి శాస్త్రవిరుద్ధము (388) ద్రుతము ప్రకృతియందుఁ గల శబ్దములు ద్రుతప్రకృతికము లని యన్నచో నవ్యయమాత్రములె ద్రుతప్రకృతికము లని యర్థ మగు (ఆంధ్రి- తద్వికోష్ఠత. ఆం.సా.ప. జ్యేష్ఠాషాఢ.)

ఈ విమర్శనము సరి కాదు. రాముఁడు అన్నది కళయే. కాని ప్రత్యయముచే ద్రుతాంత మగుట యనఁగా రాముచేన్ అని యుదాహరించుట సంగతము కాదు. రాముఁడు అనువంటికళాపదము ప్రత్యయముచే ననఁగా సముచ్చయాద్యర్థకను వర్ణకముచే ద్రుతాంత మైనప్పు డది ద్రు. ప్ర. గాదు. ద్రుతాంత మగును. అని యుద్యోతినియభిప్రాయ మై యుండవచ్చు. కళ ప్రత్యయముచే ద్రుతాంత మగు చుండఁగా నని తద్వ్యాఖ్యాత పేర్కొనుచుండఁగా రాముఁడు అనుకళను జూపి నపుడు దానిపై నే దేని ప్రత్యయమును జేసి ద్రుతాంతతను దెల్పవలయుఁ గాని యన లాపదమున వదలి ప్రాతిపదికమాత్రమును గ్రహించి దానిపైఁ ప్రత్యయము చేసి చూపు టెట్లు గుదురును? ప్రకృతిపదము ననుసరించి రాముఁడు అనుస్థలమున సయితము రామ అనుప్రాతిపదికనే చూపియుండవలసినదే.

ప్రకృతిలో ద్రుత ముండుట యనఁగా శబ్దగతమ యై ద్రుత ముండవలయు నని తె.వ్యా.వి అభిప్రాయపడినట్లు స్పష్టము. రాముచేన్ అనురీతివి ద్రు.ప్ర.లు గావనియే యుద్యోతిని తలఁచినదా? ఈవ్యాఖ్యాతయే పరుషా ద్రుతప్రకృతికాత్తనుసూత్రవివరణమున ప్రత్యయముచేతఁ గాక ప్రకృతియందే నాన్తశబ్దము ద్రుతప్రకృతిక(44)మని యిచ్చోటవలెనె వివరించి ముదముతోఁ గొనుచున్, తనరఁ జేయుచును ఎల్లఁ ద్రోచుచు నని యుదాహరించె నిందు నాగమము ప్రత్యయము నైనద్రుత మంతమందుఁ గలవానిని ద్రు.ప్ర.లుగనే భావించె నని చెప్పక తప్పదు గదా. తానునేనులలో సువర్ణము ప్రత్యయమే. ద్రు.ప్ర. లనియే

పేర్కొనె (47)కాఁగాఁ గళలు ప్రత్యయముచే ద్రుతాంతము లైన అనువివరణ మునుబట్టి ప్రకృతియందు ద్రుత మనగాఁ దద్వ్యాఖ్యాతృమతమున వలె నిత్యాదులే కాక రామునిచేన్ ము న్నగునవి గూడ గ్రాహ్యములే యని స్పష్టము. ఇంకఁ బ్రకృతిలోనే యనుటలోఁ బ్రకృతిశబ్ద ముద్దిష్టార్థము నీయఁజాలకున్న దనవచ్చును రామునిచేన్ ము న్నగునవి ప్రకృతు లనలేము గదా. ప్రకృతి ప్రాతిపదిక(ధాతు) మాత్రబోధక మగుటచేఁ బ్రకృతిలో ననుట పొసఁగ దనఁదగు. ప్రత్యయముచే ననుటలోఁ బొసఁగమి లేదు. ఈనుశబ్దమును వి.వి. యువర్ణక స్యాద్యన్తాత్తు నువర్ణక ఉతో భవే త్తని వర్ణకమనియే వ్యవహరించె. కావున దాని ననుస రించిన నిటఁ బ్రత్యయముచే ననుట పొసఁగు.

ఇట్లు ప్రత్యయాంతము లైనకళలు (లేకను అనురీతి ననవచ్చు) ద్రుతాంతము లైనను ద్రు.ప్ర.లు గా ననుటలో లేకను అనురీతివి ద్రుతాంతములె కాని ద్రుత ప్రకృతికము లని భ్రమయరా దనువాక్యము ప్రభావమె గల దని తోఁచుచున్నది. కావున నీయుద్ద్యోతినియందు ద్రు.ప్ర. లనఁగాఁ బ్రత్యయాగమద్రుత మంతమందుఁ గల వని గుర్తింపవచ్చును.

తె.ప్ర. ద్రుతప్రకృతికసంజ్ఞలోని ప్రకృతిశబ్దమును ప్రాతిపదికార్థమునఁ గాక స్వభావార్థకముగా మాత్రమె స్వీకరింపవలె ననుచు "ద్రుతము ప్రకృతిగా కలిగినది ద్రుతప్రకృతికము. ద్రుతః ప్రకృతిః స్వభావః యస్య సః ద్రుత ప్రకృతిః" స్వభావసిద్ధముగా ద్రుతము అంతమందుఁ గలిగినవి ద్రుతప్రకృతు (75)లని పేర్కొన్నది. ద్రుతప్రకృతికశబ్దార్థము నిట్లు వివరించుట లక్ష్యసంగ్రహ ణమునఁ గొంతవఱ కుపయోగించుచు సమంజసమ వైై యున్నది. ద్రుతస్య యా ప్రకృతిః స్వభావః సా యస్య సః ద్రుతప్రకృతిః ద్రుతప్రకార మెల్ల నేపద మున ననువర్తించుచున్నదో అది ద్రుతప్రకృతి. (అం.సా.ప. జ్యేష్ఠాషాఢ.1934 పుట 48) అని కాశీభట్టకృష్ణరాయశాస్త్రిగారు తెల్పిరి. సహజముగా ద్రుతము గలవి యని పేటికాదివ్యాఖ్యలు పేర్కొన్నవి.

ద్రుతప్రకృతికశబ్దమునర్థము చెప్పవలసినచో నిట్లు  చెప్పవలయుఁ గాక. కాని యాసంజ్ఞ లేర్పఱచినలక్షణకర్త దానిచేత నేయవి సంగ్రహింపఁదలఁచెనో వాని నెల్ల ద్రుతప్రకృతికశబ్దార్థము నిరూపింపఁగలదా?

రాముఁడును భక్తుఁడను ఇత్యాదులందలి ద్రుతము స్వాభావికము గా దనియు నయ్యవి యట్టి ద్రు.ప్ర. లు గా వనియే యెంచినాము. ద్రు.ప్ర. శబ్దముచే రాముఁడు ఇత్యాదులు గ్రహింపఁబడవలెను గదా. ఇవి యెప్పుడును ద్రు.ప్ర.లై యుండును గాని యొకప్పుడును గళలు గావు. పై యర్థము వీనిని ద్రు.ప్ర.లుగా నిరూపించునా? ఈసువర్ణ మన్యే యనుశాస్త్రముచే సిద్ధించునది. అయినను శబ్దమున ద్రుత ముండుట సహజము కాఁగాఁ బ్రకృతిప్రత్యయాదివిభాగము చేసి చూపులక్షణ గ్రంథ మాద్రుతమును బ్రత్యేకముగ విధించినను నది కృతకము గా దనియు స్వాభావికమె యనియుఁ దలంపవచ్చు ననుట పరిశీలింపవలసియే యున్నది. రాముఁడు అనుచో డువర్ణమును గాని పూర్ణబిందువును గాని సహజసిద్ధ మందుమా? అట బిందువు సాధ్య మయినట్లుగా నిట నీద్రుతమును సాధ్యమె. అయ్యు దీన నెప్పుడు ద్రుత ముండు నని యిది యెప్పుడుఁ గళ గా దనియుఁ గావున ద్రుత ముండుట యీశబ్దముస్వభావ మనియు గుర్తించి యిట్టివాని నెల్ల ద్రు.ప్ర.లే యందము.

సమాగమాంతములు ద్రు.ప్ర. లపునా? చిగురు + కయిదువు చిగురున్ + కయిదు వగుచోఁ జిగురున్ అన్నది ద్రుతప్రకృతికమా? అగుట కింద సమాసమున నాగమముగాఁ జేరినద్రుత మాశబ్దమున స్వాభావిక మనఁగలమా? అనఁగా రాముఁడును అనురీతి వానితోపాటు సామాసికసమాగమాంతములు నీ ద్రు.ప్ర. శబ్దమునర్థముచే సంగ్రహింపఁబడుట లే దన్నమాట.

అయిన లక్షణకర్త రాముఁడును, చిగురున్(కైదువు) అనురీతివానిని ద్రు.ప్ర.లుగాఁ దలంపలేదా? ద్రు.ప్ర.శబ్దముచే నాతఁ డుద్దేశించిన దేమి? ఈ సంజ్ఞను సూరియుఁ జిం.నుండియె గ్రహించె ననవచ్చును. అయ్యును అనుదాని నాతఁడు ద్రు.ప్ర.గానే చూపెనే. అనఁగా స్వాభావిక మైనద్రుతము గలదానినే

కాక యస్వాభావిక మైన ద్రుతము గల దైనను నన లాద్రుత మెట్టి దనుదానితో సంబంధము లేక ద్రుతాంత మగుపదము నెల్ల ద్రు.ప్ర.గా సూరి నిర్ణయించె నన్నమాట. అయిన నాద్యుఁ డగుచిం.కర్తృమాత్రము ద్రు.ప్ర. యనుదానిచే నిట్టి ద్రుతాంతము లెల్లఁ జెప్పఁదలఁపలేదా? అది తెలియుటకుఁ జిం.కర్త చెప్పిన లక్షణము నెన్నవలయును. అది అన్యే ద్రుతప్రకృతయో యే స్వర్థ్యానుజీవిత ద్రుతా నిత్య మ్మనునది. ద్రు.ప్ర.స్వరూపమును వర్ణించుచో నీసూత్రమందు అనుజీవిత ద్రుతాః అనునది. స్వాభావిక మైనద్రుతము గల దనురీతియర్థము నది యిచ్చునా? బాలసరస్వతి మొదలుకొని వ్యాఖ్యాత లెవ్వరును దీని కిట్టియర్థ మును జెప్పినట్లు గానరాదు.

ఇట వ్యాఖ్యాత లందఱయందును నొకయభిప్రాయము సమానముగా గుర్తింపవచ్చును. ద్రుతప్రకృతిక మనుశబ్దమున కర్థ మేదియో యది యాసంజ్ఞ చే సంగ్రహింపఁబడు నట్టివానిని జెప్పవలయు ననవలయునా? ప్రక్రియాదులందు లాఘవాదిప్రయోజనముల నుద్దేశించి లక్షణకర్త సంజ్ఞల నేర్పఱచుకొనును. అట్టి యపుడు ప్రయుక్త మగుశబ్దముచే నేయర్థము లభ్య మగుచున్నదో యదే యర్థ మాసంజ్ఞ కుండవలె నని నియమము లేదు గదా. కర్మప్రవచనీయాదు లెట్టివి? ఇట ద్రు.ప్ర.సంజ్ఞ య ట్లేర్పఱుపఁబడినట్లు గుర్తింపఁదగును గదా. దానియర్థ మును నిరూపింప యత్నింప నేల? అవకాశము లేనిచోటఁ దప్పదు. పదముతుది నున్నద్రుతము స్వాభావిక మైనను నస్వాభావిక మైనను బ్రయోజనము సమా నము. అట్టియెడల ననవసరభేదము నేల కల్పింపవలె? ద్రుతప్రకృతి యను శబ్దమును ద్రుతాంత మైనశబ్ద మనునర్థమున లక్షణకర్త సంజ్ఞగా నేర్పఱుపఁగా నాశబ్దము స్వాభావికద్రుతాంతములను బోధించున దగుటచే ద్రు.ప్ర. లన నవియే యని చెప్పుట యొప్పునా? ద్రు.ప్ర.శబ్ద మె ట్లేర్పడినదో దానికి సహజముగా నర్థ మేదియో యది యప్రస్తుతము. లక్షణకర్త యెట్టివానిని బోధించుట కది సంజ్ఞగా నుపయోగించెనో యది యట్టివానిని బోధింపఁగలదు. కావున ద్రు.ప్ర. శబ్దమున కర్థము వెదకుట యవసరము కాదు. ఇంక లక్షణకర్త దృష్టితో (వేనికి దీనిని సంజ్ఞగా నిర్ణయించెనో యట్టి) ద్రు.ప్ర.ల స్వరూపము చూతము.

ద్రుతప్రకృతికస్వరూపము :-

చింతామణి "తిఙ్మధ్యశేషషష్ఠీ" యనుమ న్నగుసూత్రముచేఁ గళలను చెప్పి వెంటనే యన్యే ద్రుతప్రకృతయ యని ద్రుతప్రకృతికములను చెప్పియు న్నది. ఈసూత్రము ననుసరించి ద్రు.ప్ర.లుగా వేనిని గుర్తింపవలెఁ? సహజముగా ద్రుతము గలది స్వభావసిద్ధ మైనద్రుతము గలది యనుద్రు.ప్ర. శబ్దము నర్థము నాశ్రయించి నిర్ణయించినచో రాముఁడును, కవిని మొద లగునవి ద్రు.ప్ర. లని చెప్ప వీలులేదు. వీనఁ జివర ద్రుత మున్నను నది స్వాభావికము గాక యర్థ విశేషమునం దయినది గదా. కాఁగాఁ బదములు ద్రుతాంతాలు, ద్రుతాంతాలు కానివి యని విభాగింపఁగా నందు ద్రుతాంతాలు మఱల స్వాభావికద్రుతాంతాలు, అస్వాభావిక ద్రుతాంతాలు అని రెండురకా లై మొత్తము తెలుఁగుపదాలు మూఁడు విధా లై యున్నట్లు చెప్పవలె. స్వాభావికద్రుతాంతాలు ద్రు.ప్ర.లు కాఁగా నస్వాభావికద్రుతాంతాలు కళ లగునా? అగుటకు వీలు లేదు. చిం. ద్రు.ప్ర.లను చెప్పి యవి కానివి కళ లనక కళలనే పేర్కొని యితరములు ద్రు.ప్ర. లన్నది. "తిఙ్మధ్యశేషషష్ఠీ' ఇత్యాదిగాఁ గళలను చెప్పునచోఁ జిం. ద్రుతో న యేషాం స్యా త్తని వివరించి నది. (ఏషా మ్మనుపాఠ మొక్కచోఁ గానవచ్చి నను యేషా మ్మనునదే ప్రచురము.) కాఁగా వేనికిఁ జివర ద్రుతము లేదో యాతిఙ్మధ్యశేషషష్ఠ్యాదులు కళ లని యాసూత్రమునభిప్రాయము స్పష్టము. తిఙ్మధ్యాదులు గూడ ద్రుతము లేనివే కళలు, ఏ కారణముననే నవి ద్రుతాంతము లై వినఁడును గానఁడు నిత్యాదిగా నున్నపుడు ద్రుతో న యేషాం స్యా త్తనుదానిచేఁ గళలుమాత్రము గా వని గుర్తింపకతప్పదు. కాఁగా ద్రుతాంతము లైన తిఙ్మధ్యాదులను ద్రుతాంతములగు) తిఙ్మధ్యాదిభిన్నములును కళలు గావు. ద్రుతో న యేషాం స్యా త్తనుదానిచే నీయర్థ మిట స్పష్టము. కాఁబట్టి యీసూత్రమునకు యే స్వర్థానుజీవితద్రుతాః అనుతరువాతిసూత్రముతో నపేక్ష యున్న దనియు, అనుజీవితద్రుతాః అనుస్థలమున నున్న 'అనుజీవిత' అనుపూర్వావయవము మాత్రము నీకళలసూత్రములోని కపకర్షించుకొని యన్వయింపఁజేయవలయు

ననియు మొదలుగాఁ (తె.ప్ర.79) దేర్కొనవలసిన యవసరము గానరాకున్నది. పైఁగా నిట్టియన్వయము తెలుఁగున నెచ్చటను లే దనియే చెప్పఁదగియున్నది. (రాహు)దేహము (ప్రౌఢ.సమా.34) విలాససంపదన్ వంచితపంచబాణుఁడు (ప్రౌఢ.సమా.35) అనురీతివానియందలియన్వయమునకును ద్రుతో న యేషాం స్యాత్ అన్యే ద్రుతప్రకృతయో యే స్యు స్త్వనుజీవితద్రుతా నిత్య మ్మనుచో అనుజీవితద్రుతో న యేషాం స్యా త్తనునన్వయమునకు సామ్యమును గానరాదు. ఇంకఁ బై వానిలోఁ జేరని తద్విలక్షణ మగువిశేషస్థలముగా నీయన్వయమును గుర్తింపవలసియుండు. ఇందుఁ గలవ్యవధానము నైతము విశేషమే యనక తప్పదు. ఇట్టి దెచ్చటనేఁ గల దేమో పరిశీలింపవలసి యున్నది. ఇట్టియన్వయ మార్గము నుపేక్షించి యనుజీవితశబ్దము నపకర్షించుకొనుటలో వైరుధ్యము లేకపోవచ్చు నేమో కాని యట్టి యవసరము లే దని గుర్తింపవచ్చును.

తె.ప్ర. అనుజీవితశబ్దము నపకర్షించి అనుజీవితద్రుతః యేషాం న స్యాత్ తే కళాః అని (78-80) యన్వయించినది. ఉభయపక్షమున స్వాభావిక ద్రుతాంతాలు (ద్రు.ప్ర.లును)గానివి కళ లని యర్థ మగుచున్నది. (అనుజీవిత శబ్దమునకు తె.ప్ర. స్వాభావిక మని యర్థము చెప్పినది.) కాఁగా రాముఁడును అనునది ద్రుతాంత మయ్యును నాద్రుతము స్వాభావికము గామిం జేసి స్వాభావిక ద్రుతాంతము గాదు గావున (అనుజీవితద్రుతము గామి)నీశబ్దము కళయే యని నిర్ణయింపవలసియున్నది. అనుజీవిత (స్వాభావిక) ద్రుతాంతాలు ద్రు.ప్రలు. అనుజీవితద్రుతాంతాలు కానివి కళలు. అనఁగా అననుజీవిత (అస్వాభావిక) ద్రుతాంతాలును గళలే యగు ననిదె గదా యర్థ మగుచున్నది. దీనినిబట్టి రాముఁడును భక్తుఁడను ఇత్యాదులు కళలే యనవలె. అట్టియెడల నస్వాభావిక మని యే నానకారమును ద్రుతముగాఁ జెప్పుటవలనఁ బ్రయోజన మేమియు లే దనవలె. చిం. ద్రుతమున కాయాకార్యములు విధించునపుడు ద్రుతప్రకృతిక శబ్దము నుచ్చరించి యందలిద్రుతమున కని చెప్పుట గమనింపవచ్చును. పేను ఇత్యాదులలో నువర్ణము ద్రుతము గా దన్నను రాముఁడును అనుచో నువర్ణము (అస్వాభావిక మైన)ద్రుత మన్నను ఫలిత మొక్కటే యగుచున్నది. ద్రుతకార్య ములు వర్తింపవు.

అయిన నస్వాభావికద్రుతాంతాలు కళలు గా వని తే.ప్ర. కొన్నియాధారములను ప్రస్తావించినది. అనుజీవితద్రుతాః యేషాం తే నిత్యం ద్రుతప్రకృతయః అన్నట్లుగా అనుజీవితద్రుతః యేషాం న తే కళాః అనుచో నిత్యం కళాః అనలేదు గాఁబట్టి తిక్కనాదు లెప్పుడును గళలే కావలె ననునియమము లేదు. కాఁబట్టి రాముఁడనుఇత్యాదిగా ద్రుతాంతాలు కళలు గా వనుట యొకటి. అనుజీవితద్రుతాంతాలు కానివి కళ లనఁగా నిత్యముగాఁ గళ లనలేదు గావునఁ గళలు గాకుండ నుండవచ్చు ననుట యుచితముగాఁ గానరాకున్నది. అట్ల యన్న వినఁడు అనునది యనుజీవితద్రుతాంతము గాదు గాఁబట్టి కళ కాని నిత్యముగా ననలేదు గాఁబట్టి కళ కాకపోవు నవకాశ మున్నది. అనఁగా వినఁడు అనునదే కళ యవుటతోపా టొక్కొక్కచోఁ గళేతరము నవు ననవలె. వినఁడును అనురీతిగ నస్వాభావికముగ నైనను ద్రుతాంత మయినప్పుడే కళ కాకుండు నని నిర్ణయింప నాధార మేమి? నిత్యం కళాః అనకపోవుటకును నస్వాభావికద్రుతాంత మయినఁ గళ గా దనుటకు సంబంధము గానరాదు. దీనిచే నే ద్రుతప్రకృతికత్వము సాధించుకొనఁగల్గు నెడలఁ గళ గా దని చెప్ప నక్కఱ లేదు. ఇంతకును నిత్య మ్మనకుంట ద్రుతప్రకృతికత్వనిరూపకము గాఁజాల దనక తప్పకున్నది. అట్లే వినఁడు అనుదానివయి (నర్థవిశేషమున) నువర్ణకము చేరి వినఁడును అని యైనది. ఇది యస్వాభావికద్రుతాంతము. అనుజీవితద్రుతాంతము గాదు. కావునఁ గళ యవును. కాని నిత్యం కళాః అనలేదు గాఁబట్టి నిత్యముగాఁ గళ గాదు. కళేతరము నవును. వినఁడును అన్నది కళయు నవు నని చెప్పుట లక్ష్యానుగుణమా? వినఁడు అనునది యెప్పుడును గళేతరము గాదు. వినఁడును అనునది యెప్పుడును గళ గాదు. అనఁగా ద్రుతాంత మయినపుడు కళ యవుట లేదు. ద్రుతాంతము కానపుడు కళ గాకుండుటయు లేదు. కాఁగా నస్వాభావికము లైనను ద్రుతము చివర నున్న నయ్యది నిత్యముగా ద్రు.ప్ర.యే యనకతప్పదు.

పోనీ నిత్యం కళా యనలేదు గాఁబట్టి వినఁడు అనునది యెప్పుడును గళయే యనియు వినఁడును అని ద్రుతాంత మైనపుడు కళ గానేర దనియుఁ జెప్పుదము. అంతమాత్రమున నీయది ద్రు.ప్ర.యే యవుట కవకాశ మేది? అన్యే ద్రుతప్రకృతయః అనుస్థలమున అనుజీవితద్రుతాః యే తే నిత్యం ద్రుతప్రకృతయః అని యన్వయించుట (తె.ప్ర.) ననుసరించి యస్వాభావికద్రుతాంతములు నిత్యద్రుతప్రకృతికములును గా వని స్పష్టము. అనఁగా వినఁడును అనునది నిత్యద్రుతప్రకృతికము కా దన్నమాట.

నిత్యద్రు.ప్ర. లనుస్థలమున నిత్యశబ్దమునకుఁ బ్రయోజన మిట్లు వివరింపఁ బడినది. వాటిచివరిద్రుతం కనిపించినా లోపించినాకూడా అవ్వి ద్రుతప్రకృతిక సంజ్ఞకు అర్హాలే. ఇది నిత్యతలోనిసార్థక్యం. (తె.పు.77) ద్రు.ప్ర.లయొక్క నిత్యతలోని యీసార్థక్య మస్వాభావికద్రుతాంతాలయందు నున్నట్లు గుర్తింప వచ్చును. హరియును శ్రీయును అనునవి యస్వాభావికద్రుతాంతములు. హరియు శ్రీయు అనురీతిగా నాద్రుతము కారణాంతరములచే లోపించినది. ఇపు డివి ద్రు.ప్ర.లు గా వనియే చెప్పవలెనా? నే భక్తుఁడ వచ్చితి ననుచోను భక్తుఁడ ననునది యస్వాభావికద్రుతాంతమె. ద్రుతము లోపించినను నిది కళ యనుట యొప్పునా? (ద్రుతము పోయినను మం దత్వము నిల్చియే యున్నది.) వీని సామ్యమున రాముఁడు లక్ష్మణుఁడును వచ్చిరి. నేఁ గవి వచ్చితి నిత్యాదిస్థలము లందును ద్రుతము లోపించుటను గుర్తింపనగును. అపుడు నవి ద్రు.ప్ర.లే కదా. కాఁగాఁ గారణాంతరాలవలన ద్రుతము లోపించినను (దదంతమగు) నా శబ్దము ద్రుతప్రకృతియే యగుట యన్నలక్షణ మస్వాభావికద్రుతాంతములయెడఁ గూడఁ జెల్లును. కాఁబట్టి నిత్య మ్మనుదళము స్వాభావికద్రుతాంతాలవిషయమునందు వలెనె యస్వాభావికద్రుతాంతాల విషయమునను (సమానమైనప్రయోజనము గల్గి చరితార్థ మగుచున్నది. అట్టియెడల స్వాభావికద్రుతాంతాలుమాత్రమే నిత్య ద్రు.ప్ర అని యస్వాభావికద్రుతాంతముల నటఁ బరిహరించు టేల? ఇంక "అర్థవిశేషాలలో ద్రుతాంతతను బొందినకళలు నిత్యద్రుతప్రకృతికాలు కావు. వీటిచివరి ద్రుతం కనిపించుతున్నంతవఱకూ ఇవి ద్రుతప్రకృతికాలు కనిపించనప్పుడు కళలు

మాత్రమె (తె.ప్ర.77) అని చెప్పుపక్షమున హరియు శ్రీయు, భక్తుఁడ వచ్చితి

ఇత్యాదిస్థలములందు లోపించినద్రుతము కనిపింపదు గావున నవి కళలే యనవలసి వచ్చు. అది సమంజసమా? కాఁబట్టి స్వాభావికాస్వాభావికవివక్ష లేకుండ ద్రుతము తుదిఁ గల వెల్ల నిత్యద్రు.ప్ర.లే యని చెప్పవలె.

స్వాభావికద్రుతాంతము లనఁబడువానికిని నస్వాభావిక ద్రుతాంతము లనఁ బడువానికిని భేదము స్పష్టమే. రామునిఁ గాంచెను॥ ఎప్పుడును ద్రు.ప్ర.లు మాత్రమే యగును. రాముఁడు అనునది కళ, ఇది యర్థవిశేషమున ద్రుతమును బొందినపుడే ద్రుతప్రకృతిక మగును. నువర్ణకము చేర నపుడు అర్థవిశేష మున్నను లేకున్నను నిది ద్రు.ప్ర.కాదు. కాన నెప్పుడును ద్రుతాంతము లై యుండునవి మాత్రము నిత్యద్రు.ప్ర. లనియు ద్రుతము చేరినకళలు నిత్యద్రు.ప్ర.లు కా వనియుఁ జెప్పుట చిం.అభిప్రాయమా?(ద్రు.ప్ర.లపైఁ గూడ నర్థవిశేషములఁ గాకుస్వరము చేరిన (నీచేతనా?ఇత్యాది)దదంతమును ద్రు.ప్ర. కాదు)అట్లు యనుకొందము. అపుడు నిత్యశబ్దమునకు ద్రుతము లోపించినను నది ద్రు.ప్ర.యే యవుట ప్రయోజనముగా నెన్నరా దనిగుర్తింపవలయును.

అయినఁ గళలు ద్రుతాంతము లయినప్పుడు వాని నే మనవలె? "క్షీణశక్తిక మయిననిత్యమ్ అనేమాట యిక్కడకు (కళలసూత్రములోనికి) అన్వయింపదు కాఁబట్టి ఇటువంటివాటికికూడా కళాత్వాన్నికల్పించే అవకాశం లేదు గాఁబట్టి ఇవి ద్రుతప్రకృతికాలే అవుతాయి(తె.ప్ర.77)అనుటకు నవకాశము చాల కున్నది. వ్యాకర్తలు కళలను జెప్పినవారు తక్కిన వన్నియు ద్రు.ప్ర. లనియు ద్రు.ప్ర.లను జెప్పినవారు తక్కినవి కళ లనియుఁ జెప్పుటనుబట్టి 'భాషలోనిపదా లన్నీ ఈ రెండువిభాగాల్లోనూ దేనిలోనో ఒకదానిలో చేరి తీరాలి'(తె.ప్ర.77) అనియే చెప్పవలె. అట్టియెడలఁ గళలను జెప్పినచిం. తక్కిన వన్నియు ద్రు.ప్ర. లని చెప్పిన దన్నమాటయే. అట్టియపుడు అన్యే ద్రుతప్రకృతయః కళలు గానివి ద్రు.ప్ర. లన్నసరిపోవుదానికి నిత్యద్రు.ప్ర. లని యేల చెప్పెను. దీనివలనఁ గళలును నిత్యద్రు.ప్ర.లును గాక యిం కొకవిభాగ మనిత్యద్రుతప్రకృతికా లన్నది

మూఁడవది గల దని చెప్పవలసివచ్చుచున్నది. ఇయ్యది చిం.లో మాత్రమె ప్రస్తావింపఁబడిన ప్రయోజనహీన మగు ప్రత్యేకాంశ మన్నమాట.

అస్వాభావికద్రుతాంతా లైనవానికిఁగూడఁ గళాత్వము కల్పించునవకాశము లే దనుటయుఁ గుదురునది గాదు. తరువాతిసూత్రమునుండి యపకర్షింపఁబడినయను జీవితశబ్దమువలన స్వాభావికద్రుతాంతాలు గానివి కళ లని యర్థము సిద్ధము. కాఁబట్టి (తిజ్మధ్యాదులు) ద్రుతాంతాలేఁ యైనను నాచివర నున్న ద్రుత మస్వాభావిక మయిన నది కళ గావుటకు లక్షణము ననుసరించి యవకాశ ముండనే యున్నది. అనఁగా ద్రుతాంతములు గానివియు నస్వాభావికద్రుతాంతము లైనవియు నైన శబ్దములు కళ లని సారాంశ మగు. కాఁగా నస్వాభావికద్రుతాంతా లైన రాముఁడును అనురీతి వెల్ల లక్షణము ననుసరించి కళలే యవు నని నిశ్చయింపవలసియున్నది.

ఇది యనర్థ మనక తీరదు. ఇట్టి యనర్థ మనుజీవితశబ్దము నపకర్షించు కొనుటవలన నేర్పడిన దని చెప్పవచ్చును. అపకర్షవలననే అనుజీవితద్రుతః యేషాం న స్యాత్ తే కళా యనునన్వయముతో స్వాభావిక మైన ద్రుతము లేనివి కళ లని యర్థ మయి యస్వాభావికద్రుతాంతములు గళలు గావలసివచ్చె. అనుజీవిత శబ్దము నపకర్షింపకుందము. ద్రుతః యేషాం న స్యాత్ తే కళా యను నన్వయ ముతో ద్రుతము లేని తిజ్మధ్యాదులు కళ లగు నని యర్థ మగును. ద్రుతము లేని వన న్ద్రుతము స్వాభావికమా యస్వాభావికమా యనువివక్ష యుండదు గాన నెట్టి దైనను(అస్వాభావికమ యైనను) ద్రుత ముండరాదు. ఉన్న నది కళ గాదు. రాముఁడును అనుచో నస్వాభావికమ యగుఁ గాక ద్రుత మున్నది గదా. కావున నది కళ గాదు. కాఁగా ననుజీవితశబ్దము నపకర్షించుకొన్నపు డస్వాభావికద్రుతాంతములు కళలు గాక తప్ప దనియు న ట్లపకర్షించుకొనకున్నపుడే యవి కళలు గావలసిన యనర్థ ముండ దనియు గుర్తింపవచ్చు. అనఁగా నట్టియపకర్షణయత్నము సరి గా దనక తప్పకున్నది'

నిత్యశబ్దము నిచ్చట కపకర్షింపకున్నందువలనఁ బ్రయోజన విశేషము గల దా? "పీటికళాత్వానికి నిత్యత లేదు గాఁబట్టి అస్వాభావికద్రుతాంతతను బొందినపుడు కళాత్వాన్ని కోల్పోయి ద్రుతప్రకృతికాలతో సాదృశ్యం పొందుతాయనీ, తాత్పర్యా

ర్థం లభిస్తుంది. అననుజీవితః ద్రుతః యేషాం తే న కళాః స్యుః కిం తు ద్రుత ప్రకృతికా ఏవ.' (తె.ప్ర.77)అని చెప్పుట కవకాశము చాలదు. స్వాభావిక మైన ద్రుతము చివర లేనివి కళ లని చెప్పినచోట నిత్యముగాఁ గళ లని చెప్పవలసిన యవసరము గాని యట్లు చెప్పకుండుటవలన నవి కళలు గాకుండుటకుఁ గాని యవకాశ మేది? నిత్యం ద్రుతప్రకృతికా యనుచోట నిత్యశబ్దమునకు నేరీతి ప్రయోజనము వివరింపఁబడినదో యట్టిప్రయోజనము కళలవిషయమునఁ గుదురునది కాదు. వచ్చె(ను)వాఁ డనుచో ద్రుతము లోపించినను(నది కళ కాక?) ద్రు.ప్ర.యే యవు ననుటకు నిత్యశబ్దము ప్రయుక్త మైన దందురు. కళలపక్షమున వాని కళాత్వము ననుమానింపవలసినయవకాశ మేది? నిత్యముగాఁ గళలే యగు నను టకు? అర్థవిశేషాదులలో నీకళాపదములపయిని ద్రుతము చేరి (యస్వాభావిక) ద్రుతాంతము లవు నపుడు ద్రుతాంతతచే (స్వాభావికద్రుతాంతము లైన)ద్రు.ప్ర. లతో సాదృశ్య మేర్పడినది. ఇది కళయా కాదా యని యనుమాన మున్నదా? ద్రుతో న యేషాం స్వత్వసుదానిచేఁ గళలు గానేరవు గదా. (ఇట ననుజీవిత శబ్దమును చెప్పుకొన్న నవి కళలే కాకతప్పదు కాన నాపక్షమునను సందేహమున కవకాశము లేదు. ఇంకఁ గళ లవుట విరుద్ధ మగుటయే యనర్థము. దానిని నిత్య మ్మన్నది యున్నను వారింపఁజాలదు. స్వాభావికద్రుతాంతములు గానివే నిత్యముగా, గళ లన్న నస్వాభావికద్రుతాంతములు కళలే యవును గాని యవునా కాదా యని సందేహము గల్గునా?

అయినఁ గళలమీఁద నేకారణముచే నయినను ద్రుతము చేరి యవి ద్రు.ప్ర. లతో సాదృశ్యమును బొందుచున్నమాట వాస్తవమె. అంతమాత్రమున కళాః న స్యుః ద్రుతప్రకృతికా ఏవయని నిర్ణయించు టెట్లు? ద్రుతప్రకృతికము లైన తానునేను(లేదా తాన్,నేన్) అనువానితో మేను,మీను(లేదా మేన్, మీన్)అనుకొన్ని సదృశము లైయున్నవి. అయిన నివి ద్రు.ప్ర.లా? అట్లు రాముఁడు అనునది ప్రథమాంత మవుటంజేసి కళ. దానిమీఁద నువర్ణకము చేరి రాముఁడును అని కాఁగా స్వాభావికద్రుతాంతము కానియిది కళ. కాకుండుటయు ద్రు.ప్ర. యవుటయు లక్షణ ముచే సరిపడునవి కావు.

నిత్యం కళాః అనమింజేసి యస్వాభావికద్రుతాంతములు కళలు గాక స్వాభావిక ద్రుతాంతాలు గాని నిత్యద్రు.ప్ర.లును గాక యస్వాభావికద్రుతాంతము లేమవు. అనిత్యద్రుతప్రకృతికము లవు నన్నమాట. రాముఁడును అనునది యనిత్య ద్రుతప్రకృతికము. కాని నిత్యద్రుతప్రకృతికములందువలె నిట నిత్యశబ్దము సార్థక మవుటంజేసి యివియు నిత్యద్రు.ప్ర.లే యనవలె ననుట యుండే స్పష్టము. అనఁగా, స్వాభావికమ యైనను ద్రుతము చివర లేనిది కళ యవుచున్నదై స్వాభావిక మైనను లేదా యస్వాభావికమె యైనను ద్రుతము చివరఁ గలవి ద్రు.ప్ర.లే యగుచున్నవి. అనఁగా స్వాభావికద్రుతాంతములు గానివి కళ లని చెప్పుటకువలెనె స్వాభావిక ద్రుతాంతము లైనవి ద్రు.ప్ర. లని చెప్పుటయుఁ గుదుర్చునది కా దని గుర్తింపవచ్చు

ఇంకను "ప్రత్యయాగమావ్యయాత్మక మయినద్రుతాంతత కల వన్నీ అను జీవితద్రుతాః నిత్యం ద్రుతప్రకృతయః అనే భావం లభిస్తుంది,(తె.ప్ర.77)అనుటయు సముచితముగా లేదు. ఇందులో అవ్యయాత్మక మైనద్రుత మంతమందుఁగలవి యనఁగా రాముఁడును అనుమొద లగునవి యనవచ్చును. ఇవి యస్వాభావిక ద్రుతాంతా లని గదా చెప్పఁబడుచున్నది. కాఁగా తె.ప్ర. ఇంతకుముందు చేసిన సమన్వయము ననుసరించియవ్యయాత్మకద్రుతాంతాలు నిత్యద్రు.ప్ర. లనుటకు వీలు లేదు. వలెప్రభృత్యవ్యయములలో ద్రుత మంతమం దున్నది కాని యది యవ్యయావయవమె కాని యవ్యయాత్మక మయినది గాదు. నువర్ణ మొక్కటి యవ్యయము కాదు గదా. కాఁగా నిత్యద్రు.ప్ర.లను ప్రస్తావించుసందర్భమునఁ ప్రత్యయాగమములు రెండే ప్రస్తావింపఁదగినవి. అందును బండితుఁడను అనుచో నువర్ణము ప్రత్యయమ యన్ననది స్వాభావికద్రుతాంతము కాదు. చిగురుఁ (కియుదువు)ఇత్యాదులలో నాగమాంతములు స్వాభావికద్రుతాంతము లను టెట్లు? మొత్తముమీఁద నీసమన్వయము ననుసరించి రాముఁడును అనురీతి యస్వాభావిక ద్రుతాంతములు ద్రు.ప్ర.లగుట యట్టుంచి కళలే కావలసివచ్చుచున్నది.

కళలసూత్రములోనికి ననుజీవితశబ్దము నపకర్షింపకయు ద్రుతో న యేషాం సా త్తని చెప్పుచో నాద్రుతము స్వాభావికమా యస్వాభావికమా యనువివక్ష

లేక యే దైనను ద్రుతము నిది కళ యని యర్థ మగును. దేనికి ద్రుతముండే లేదో యాతిఙ్మధ్యాదులు కళ లని యర్థము. విన రనునది తిఙ్మధ్యము. ఇందు ద్రుతము లేదు గాన నిది కళయె. వినరును, అనుచోను నయ్యది తిఙ్మధ్యమె కాని ద్రుత మున్నది. ద్రుతము లేనితిఙ్మధ్యాదులే కళ లనుటవలన ద్రుత మున్న తిఙ్మధ్యాదులు కళలు గావు. అనఁగా నీరీతియర్థముతో నస్వాభావికద్రుతాంతాలు కళలు గానేర వని విస్పష్ట మవుచున్నది. కళలు గాకున్న నివి ద్రు.ప్ర. లగునా? స్వాభావికద్రుతాంతాలే ద్రు.ప్ర. లని చెప్పిన నివి (కళలతోపాటు) ద్రు.ప్ర. లును గానేర వని నిశ్చయింపవలెను.

కాని యసలు ద్రు.ప్ర. లన స్వాభావికద్రుతాంతాలే యని నిర్ణయింపనగునా? ద్రుతము చివర లేనితిఙ్మధ్యాదులు కళలు. అన్యే ద్రుతప్రకృతయ యని చిం. చెప్పు చున్నది. ఇట నన్యశబ్దము పూర్వోక్తము గాని దెల్ల గ్రహింపవలెను గదా. పూర్వసూత్రము ద్రుతాంతములు గానితిఙ్మధ్యాదులను బ్రస్తావించి యవి కళ లన్నది. కాఁగాఁ దద్భిన్నములే యిచ్చోటియన్యములు. అనఁగా ద్రుతాంతము లైనతిఙ్మధ్యాదులు తిఙ్మధ్యాదిభిన్నములు నీయన్యశబ్దముచే సంగ్రహింపఁబడు. అనఁగా వినదు కళ కాఁగా నిది ద్రుతాంత మయి వినఁడును అని యైనపుడు ద్రు.ప్ర. అగు నని యర్థము. ద్రుతాంతము లైనతిఙ్మధ్యాదులన నస్వాభావిక ద్రుతాంతాలు. తిఙ్మధ్యాదిభిన్నము లన స్వాభావికద్రుతాంతాలు. అనఁగా నన్యే ద్రుతప్రకృతయ యనుసూత్రమునందలి యన్యశబ్దము స్వాభావికాస్వాభావిక ద్రుతాంతములు రెంటిని బోధించుచున్న దని స్పష్టము. అట్టియెడ స్వాభావిక ద్రుతాంతాలె ద్రు.ప్ర లను టెట్లు? తిఙ్మధ్యాదిభిన్నములమాత్రమె యుద్దేశించి ద్రు.ప్ర.సంజ్ఞ విధింపఁబడుచో ద్రుతాంతములు గానివి కళ లని చెప్పినవాఁడు స్వాభావికద్రుతాంతములు ద్రు.ప్రలని చెప్పినసరిపోవుదానికి అన్యే యని యేల పేర్కొనెను. అన్యపదము సూత్రమున లేకున్న నెట్టియిబ్బంది లేమి నిష్ప్రయోజన నది వ్యర్థ మన వలెను. కళాద్రుతప్రకృతికలక్షణక్రమమునుబట్టి చూచినను ద్రుతాంతములు గానివి కళలు. ద్రుతాంతము లైనవి ద్రు.ప్ర. లని సాధారణముగాఁ జెప్పుటయే సూత్రకృదభిప్రాయముగా స్పష్టము. ఇంతకంటెను ద్రుతప్రకృతి

సూత్రమునం దున్నయనుజీవితశబ్దము నటఁ దొలఁగించి ద్రుతోన యేషాం స్యాత్తన్నస్థలమున నుండుట కొంతవఱ కే నొప్పును గదా.

వజ్ఝలవారు కూడ 'ప్రకృతిసిద్ధ మగుద్రుతము తుదిని గల వని తాత్పర్య' (వ్యా.సం.స.84) మని చెప్పియున్నారు. ప్రకృతిసిద్ధము లేదా స్వాభావికము నైనద్రుత మేయది? అవ్యయాత్మక మయిన ద్రుతమును దొలఁగింపవలసియున్నది గానఁ (వలెప్రభృతులందలిదియు) ప్రత్యయాగమాత్మక మైననకారము స్వాభావిక మనవచ్చునా? చిగురు + కయిదు వన్నపుడు నుమ్ము రాఁగా చిగురున్ (కయిదువు) అని యగు. చిగురున్ అనునది ద్రు.ప్ర. అయిననే" 'మహా ద్రుతప్రకృతికాత్తనుము స్నగులక్షణములచే ద్రుతకార్యము లగును. మఱి యిది ద్రు.ప్ర. అగు టెట్లు? సామాసిక మైనయీయాగమమును ప్రకృతిసిద్ధ మనవచ్చునా? అనఁగా సామాసికద్రుతాంతాలును ద్రుతోపజీవులో మఱి యేవియో కావలసినవే గాని ద్రు.ప్ర.లు గావు. అనఁగా నాగమనకారము స్వాభావికద్రుత మగుట యెల్లెడలకఁ గుదురునది కాదు.

నిజమున కాయాద్రు.ప్ర.లకు నాగమముగా వచ్చుననుకొను నకారము మాత్రము ప్రకృతిసిద్ధమె యను టెట్లు? సీతనున్, రామునికొఱకున్ అనురీతిగా నివి ద్రు.ప్ర. లని వజ్ఝలవారు పేర్కొన్నారు. అయావిభక్తులు ప్రకృతివికారాలు వ్యాకరణము సాధించియున్నది. ఇవి యెల్లఁ గాక చివరిద్రుతము ప్రకృతిసిద్ధ మగు టెట్లు? సీతనున్ రామునికొఱకున్ మొద లగునీద్రు.ప్ర.పదముల ప్రక్రియను లక్షణగ్రంథము చెప్పకున్నపుడు వలెప్రభృతులలోవలె నివ్వానియందలి ద్రుతమును ప్రకృతిసిద్ధముగా గుర్తింప నవకాశ ముండును. వజ్ఝలవారీద్రుతమును గూడ "నన్యే" యన్నసూత్రము ననుసరించి యవు నట్లు స్పష్టము చేసియున్నారు. ఇట్లీద్రుతమును లక్షణముచే సాధింపఁబడుచు సాధ్య మయి యుండఁగాఁ ప్రకృతిసిద్ధ మనుట యెట్లు? చిగురున్(కయిదువు) అనుచోట నుమాగమ మెట్టిదో యీద్రుతము నట్టిదే కాఁగా నాగమ మగునది వ్యాకరణముచే సాధింపఁబడున దగుటచేఁ దదంతము స్వాభావికద్రుతాంత మయి ద్రు.ప్ర. అగు టొప్పదు. ఇదే విధముగాఁ ప్రత్యయము నయితము ప్రకృతిసిద్ధ మనుట గుదురునది గాదు.

సూరిగారి ప్రణాళిక ననుసరించి భట్టుఁడు అను ప్రథమాంత విశేషణము మీఁద నువర్ణ మంతాగమముగా వచ్చును. అనఁగా నిదియుఁ బ్రకృతిసిద్ధ మగు ద్రుత మంతమందుఁ గలది గాదు. దీనిపై నువర్ణ మంతాగమముగా నెట్లు చెప్పఁబడినదో యట్లే తృతీయాదులకుఁ జెప్పిన నునాగమము సైత మని స్పష్టము. అపు డిది ప్రకృతిసిద్ధ మని నిర్ణయించుట పొసఁగునా?

కాఁగా నాగమ మైన ద్రుతమునకువలెనె ఘటింతును (చిం.లో భట్టుఁడను అనురీతివి సైతము) మొ॥స్థలములందలి ప్రత్యయ మైన ద్రుతము సైతము ప్రకృతిసిద్ధము గా దని గుర్తింపఁదగు. కాఁబట్టి ప్రత్యయాగమ ద్రుతాంతాలు ద్రు.ప్ర. లనుట కవకాశము లేదు.

ప్రకృతిసిద్ధ ద్రుతాంతాలు లేదా స్వాభావిక ద్రుతాంతా లనఁగా నిఁక మిగులు నవి వలె ప్రభృతులే యని చెప్పవలె. వలెను అనుచోట నున్న ద్రుతము శబ్దమున సహజముగా నున్నది. దీని నేశాస్త్రమును సాధించుట లేదు. కావున లాక్షణికుల ప్రణాళిక ననుసరించియు నివ్వానియందలి ద్రుతము ప్రకృతిసిద్ధమె కాని లక్షణ సాధ్యము కాదు. అనఁగా వీరినిర్వచనాల ననుసరించి వలె ప్రభృతులే (నిత్య) ద్రుత ప్రకృతికా లవును. బా.సా.పే. పేర్కొన్నట్లు వలె ప్రభృతులే సహజ ద్రుతాంతాలు. ఇట్టియభిప్రాయము సూత్రకర్త కున్నట్లు చెప్ప వీలు లేదు గదా.

ఇటఁ జేటిక యాయా ప్రత్యయములమూలమునను అర్థవిశేషప్రకాశక మై చేరెడు నువర్ణముమూలమునను నాగమ నువర్ణము మూలమునను ద్రుత ప్రకృతికము లగుచుండుటం జేసియు శబ్దసహజము లగు నకారములకు ద్రుతసంజ్ఞ సిద్ధింపమింజేసియు వ్యాకరణసిద్ధ ద్రుతాంతములకే సూరి ద్రుత ప్రకృతికమును బర్యాయముగఁ జేసెను. చింతామణి ప్రణాళికలోని ట్లాయావానికి వేర్వేఱు ద్రుతవిధానములు లేకుండుటేకాక "అన్యే ద్రుతప్రకృతయః .... అనువానిచేఁ గళలు గానివాని కెల్ల నకారము నిత్యముగ నగుట నందలి ద్రుతప్రకృతికసంజ్ఞ సార్థకము. ఇం దిట్టి ప్రక్రియ లేమి ద్రుత

ప్రకృతికము లనుట నేతిబీరకాయను బోలె (౨౦)అనుచున్నది. చింతామణిని జిన్నయమతమునకును భేద మున్నట్లుగా నీవ్యాఖ్య పేర్కొనుచున్నది. కాని యిది నిరాధార మనక తీరదు.

సూరి శబ్దసహజ మగునకారమునకు ద్రుతత్వము చెప్పలే దనుట పొర పాటు. పోలెప్రభృతులే సూరిమతమున ద్రు.ప్ర లవు చున్నవని యీపేటికయే పేర్కొన్నది కదా. పోలెను ద్రు.ప్ర.లో సువర్ణము ద్రుతమే. ఇది యే సూత్రముచే సిద్ధించుచున్నది? ఏసూత్రముచే నైన సిద్ధించునో యయ్యది వ్యాకరణ ముచే సాధింపఁబడినదే యవును గాని సహజ మనరాదు. పోలెప్రభృతులను మాత్రము ద్రు.ప్ర. లని చెప్పుట యెట్లు గుదురును? వ్యాకరణముచే నాగమాదులుగా సిద్ధించుటనుబట్టియే గదా పోలెప్రభృతులుమాత్రమె ద్రు.ప్ర. లవు నని సూరిసూత్రసందర్భమునఁ బేర్కొనిరి. ఈ పోలె ననుదానిని సూరి వలెప్రభృతు లలోఁ జేర్చి చూపినాఁడు. కాఁగా వలెప్రభృతు లనుపోటిద్రు.ప్ర.లలోనిద్రుతము శబ్దసహజమే యవుటంజేసి శబ్దసహజ మగునకారమునకుఁ గొండొకచో ద్రుత సంజ్ఞ యుండుట గమనార్హము.

### ద్రుతప్రకృతికములు-ద్రుతాంతములు :-

సహజముగా ద్రుతము గలవి కావున వలెప్రభృతులే ద్రు.ప్ర. లనుచున్న పేటిక "తక్కుంగలవి ద్రుతాంతములు"గాఁ బేర్కొన్నది. అనఁగా రామునిన్ మొద లగునవి (చిం.మతమున ద్రు.ప్ర.లు గాఁగా) చిన్నయ ప్రణాళిక, ననుస రించి ద్రుతాంతములే యవుఁ గాని ద్రు.ప్ర లనరాదని యభిప్రాయము. దీనివలన ద్రుతప్రకృతికము ద్రుతాంతము నన్నవి భిన్నము లగుచున్నవి. లేకను అన్నది ద్రు.ప్ర. యని బ్రమయరా దనియు నయ్యది ద్రుతాంతమే యనియుఁ జెప్పినప్రౌఢ వ్యాకర్తృవచనముల ప్రకార మిం దుండియుండవచ్చును. ప్రౌఢ. అభిప్రాయము స్థలాంతరమున స్పష్టము (త్రి.శే.)అది య ట్లుండఁగా ద్రుతాంత మని యంగీకరి ంచినప్పు డది ద్రు.ప్ర. గా దని చెప్ప నెట్లు గుదురు? స్తూరి ద్రుతాంతము లైన

పదములు ద్రుతప్రకృతు లని సూత్రించెను. రామునిన్ మున్నగునివి ద్రుతాంతము లనుట విస్పష్టమె. అట్టియపుడు ద్రుతాంతము లగునిప్పదములు ద్రు.ప్ర. లేవుట లక్షణానుగుణము కదా. ఇవి ద్రు.ప్ర.లు గా వనుట కట లక్షణవివరణము లేవియుఁ దోడ్పడవు. కాఁగా ద్రుతాంతములు ద్రు.ప్ర.లే కావున ద్రు.ప్ర.భిన్నము లై ద్రుతాంతము లనునవి వేఱు గల వని చెప్పుట కవకాశము గానరాదు.

ఇంకను నట్లు నిర్ణయించుచో ద్రుతాంతము లగుప్రకృతులను ద్రుతాంతము లనఁ దగుఁ గాని ద్రు.ప్ర. లనరా దనిచెప్పినఁ జెప్పవచ్చును. వండిఁగలఁ డిత్యాదుల వండన్ అనునది పదము గామింజేసియు 'ద్రుతకార్యంబు' అని ప్రత్యేకముగా ద్రుతకార్యములను సూచించుటనుబట్టి యట ద్రుతకార్యము లయినను నాశబ్దము ద్రు. ప్ర. అనరా దన్న ననవచ్చును. రామునిన్ మున్నగువానిని ద్రు.ప్ర. లనరా దనుట లక్షణవిరుద్ధము.

ద్రు.ప్ర.శబ్దమువ్యుత్పత్తి ననుసరించి యట్లు సహజద్రుతాంతము లన రామి రామునిన్ ఇత్యాదులను ద్రు.ప్ర. లనరా దని చెప్పవచ్చును. కాని యట్టి యర్థము లక్షణకర్త పేర్కొన్నలక్షణమునకే విరుద్ధ మయినప్పు డాసంజ్ఞకు వ్యుత్పత్త్యర్థమును జెప్పుట సూత్రకృన్మతవిరుద్ధ మగును. అట్టియపుడు వ్యుత్పత్తిని జెప్పరా దని గుర్తింపవలయును. శాస్త్రకర్త యేర్పఱచినసంజ్ఞ కర్థము చెప్పఁ కొనుచు దానివలన నాశాస్త్రమునకె యసామంజస్యమును నిల్పుట సక్రమము గాదు గదా. అయ్యది యవ్యుత్పన్న మయినసంజ్ఞగా గ్రహింపఁదగును గదా.

కాఁగా సూత్రకర్త ద్రుతాంతము లైనపదముల కన్నింటికిని ద్రు.ప్ర. అను సంజ్ఞ నేర్పఱచెను. కావునఁ బ్రకృతిసిద్ధద్రుతాంతాలె ద్రు.ప్ర. లనియుఁ దద్భిన్నము లైనద్రుతాంతములు ద్రు.ప్ర.లు గాక ద్రుతాంతములుమాత్రమ యవు ననియుఁ జెప్పుట సంగతము గాదు. కాఁగా ద్రు.ప్ర.లు గాకుండ ద్రుతాంతము లనుచు నొకవర్గము వేఱుగా లే దనియు నాద్రుత మెట్టి దైనను ద్రుతాంతము లగునట్టి పదము లెల్లను ద్రు.ప్ర.లే యనియు లక్షణానుగుణముగా గుర్తింపఁదగు.

కళాపదమున కట నేయర్థముతో నాసంజ్ఞను స్వీకరించిరి, ద్రు.ప్ర.సంజ్ఞ నేతిబీరకాయను బోలుటకు?

ఈ ద్రు.ప్ర.సంజ్ఞ చింతామణియందు సార్థక మనుటమాత్రము కుదురునా? వ్యాకరణముప్రకారము సాధింపఁబడినద్రుతము గలపదములు ద్రుప్ర.లు గా ననునప్పుడు చిం.లోఁ గూడ రామునిన్ అను మొద లగునవి ద్రు.ప్ర.లు గా ననియే చెప్పవలసియున్నది. కశేతరా లైనశబ్దములకుఁ జివరనుండుద్రుతమును 'అన్యే' యనుసూత్రము నిత్యముగా సాధించుచున్నట్లు పేటిక స్పష్టము చేసినది. అట్లు అన్యే యను సూత్రముచే వచ్చుచున్నవు డాద్రుతముమాత్రము వ్యాకరణముప్రకారము సాధింపఁబడినది కాదా? సూరి యాయాద్రు.ప్ర.లద్రుతమును వేర్వేఱుసూత్రములచే సాధింపఁగాఁ జిం. యొకేసూత్రముచేత సాధించియుండవచ్చును. అంతమాత్రమున వ్యాకరణము(నొకేసూత్రము)ప్రకారము సాధింపఁబడినయాద్రుతము ప్రకృతిసిద్ధమో సహజమో యనుకొనుట యెట్లు? రామునిచేతన్ అన్నపుడు చేతప్రత్యయమును నివర్ణాగమమును వ్యాకరణము సాధించుచున్నది గదా. పైని ద్రుతము నట్ల వ్యాకరణసాధ్య మనకతప్పదు. అదొక్కటి ప్రకృతిసిద్ధ మనుట యెట్లు? ఇంకఁ జిం.లో పోలెనుప్రభృతులందలిద్రుతము గూడ 'అన్యే' యనుసూత్రముచేతనె సిద్ధించునా? అట్లే యయిన పోలెప్రభృతు లేని ద్రుతప్రకృతికము లగుట చిన్నయ ప్రణాళిక ననుసరించి కుదురును గాని చిం. మతమున ద్రుతప్రకృతికము లనఁ దగిన వేవియు లే వనవలసివచ్చును. ద్రుతప్రకృతికసంజ్ఞ యెంతమాత్రమును సార్థకము గాకపోవుట చింతామణియందుఁ జెప్పవలసియుండును.

కాఁగా రామునిని అనుమొదలైనవి చిం.మతమున ద్రు.ప్ర. లగు నన్నచో నదే విధముగాఁ జిన్నయమతమునందును గాకతప్పదు. ఇం దొకదాన నెచ్చును నిం కొకదాన లొచ్చును లేదు. కావునఁ జిం.లోనివి యెల్ల ద్రు.ప్రలు కాఁగాఁ జిన్నయమతమున పోలెప్రభృతులుమాత్రమె ద్రుప్ర లగు నని చెప్పుటకు వీలు లేదు.

రామునిన్ మొద లగుచోట్ల ద్రుప్ర.లద్రుతము చిం.లోను నాగమముగాఁ జేరున దని ప్రౌఢవ్యాకర్తయు భావించెను. ప్రౌఢవ్యాకర్త 'నన్నును' అనుచోట నువర్ణము నాగమద్రుతముగాఁ జెప్పుట గమనింపవచ్చును. దానిన్, వానిన్

మొదలగుచోట్ల ద్వితీయమయి ద్విత్వ మాగమముగాఁ జేయుట చిం.అభిప్రాయమున కనుగుణము. సూరి తృతీయాదులకుఁ గదా నుగాగమము చెప్పెను. (త్రి.శే) దీనినిబట్టి ద్వి.ప్ర.లకు ద్విత్వము చిం.లో నాగమమే యని స్పష్టము.

ప్రత్యయాగమావ్యయాత్మక మైనవువర్ణము ద్విత్వ మగుటయుఁ జిం.సమ్మతముగనే ప్రౌఢవ్యాకర్త యుద్దేశించినట్లు స్పష్టము. అట్టియెడల 'వలెనిత్యాదు లవ్యయము లగుట వానితుదిని ద్విత్వము నవ్యయరూప మగు' నన్నది. కాని యది సమంజసముగాఁ గనఁబడదు. 'వలెను'అనునది మొత్త మవ్యయ మైనప్పు డందలి నువర్ణము అవ్యయావయవ మగును గాని యవ్యయ మగుట యెట్లు? వలె అనునదే యసలు శబ్ద మనియు వీనికిఁ బైని అన్యే ద్రుతప్రకృతయః అని ద్రుతము చేరిన దని చెప్పుట కవకాశము చాలదు. ఇటఁ బ్రౌఢవ్యాకర్త యభిప్రాయ మేమియో తెలిసికొనుటకు నాతఁ డవ్యయాత్మక మైనద్విత్వము నుదాహరించుటలో రెండులక్ష్యములందును నుశబ్దమునే చూపియుండెను గాని వలెప్రభృతులలోనిది యనఁగా నవ్యయావయవ మగుద్విత్వము గలదాని నొక్కటిని జూపియుండలేదు.

ద్విత్వాంతము లైనపదములు ద్విత్వప్రకృతికము లనుసూరిలక్షణమునుబట్టి (ఇట శబ్దావయవ మైనను నువర్ణము ద్విత్వ మగును)ఇవి ద్వి.ప్ర. లని గుర్తించు చున్నమార్గములోనే చిం.లోను వీని ద్రు.ప్ర.త్వమును దదనుగుణముగా నావయవిక మగునువర్ణమునందు ద్రుతత్వమును గుర్తించుట యుచిత మగుమార్గము.

ఇట్లే చిం.లో "పరేషాం తు, అనివిధింపఁబడినవువర్ణము, ప్రత్యయము (భక్తుఁడను కొలుతును మొ॥) వ్యాకరణముచేత సాధింపఁబడినదే కద.

ప్రత్యయాగమములు పోఁగా సూరిమతసందర్భమున పేటిక అర్థవిశేషములో నువర్ణము వచ్చుటయు ద్రుతాంత మగుటయుఁ బ్రస్తావించినది. చిం. ప్రకారము నువర్ణాంతాలు ద్రు.ప్ర.లే యగునా? చిం. వీనిని విధించియుండలేదు. అట్లని యవి ద్రు.ప్ర.లు గా వన్నా ద్రుతమునకు ద్రుతకార్యము లేవియు రా వని గమనింపవలసియున్నది. అన్యే అనుసూత్రము ప్రకారము కళలు కాని వాని కెల్ల నకారము నిత్యముగా వచ్చుచున్నట్లు పేటిక పేర్కొన్నది. వినదు అనునది

తిజ్మధ్యేత్యాదిసూత్రము ననుసరించి కళ కదా. దాని పయి నన్యే యనుసూత్రము
చేత ద్రుతము చేరునా? చేరినచో నిత్యముగాఁ గదా చేరు నని పీఠిక పేర్కొన్నది.
అనఁగా వినయము అనురూపమే కాని వినయ అనురూప ముండదా? కళలు గాని
వానికి నిత్యముగా నకారము చేరు ననుట ననుసరించి యింతకు ముందు ప్రస్తా
వింపఁబడినస్వాభావికద్రుతాంతములే ద్రు.ప్ర.లుగాఁ జిం.సూ.డఁ జెప్పిన ట్లయి
నది. ఏ దే మైనను రాముఁడును అనురీతిస్థలములలో (కళ మైనదానిపయిని
ద్రుత మనిత్యముగాఁ జేరున దవుటచేతనుమాత్రమే కాక) ద్రుతము ప్రకృతి
సిద్ధ మనుట కెంతమాత్రమును వీలు లేదు గావున నట్టివి ద్రు.ప్ర.లు గావు. వి.వి.
సవర్ణక ఉతో భవే త్తని దీనిని ప్రత్యయముగా విధించినది. రామునిన్ ఇత్యా
దులలోని ద్రుతము బాల.ప్రణాళిక ననుసరించి ప్రకృతిసిద్ధము కాదు గావున
ద్రు.ప్ర.కాక ద్రుతాంతమే యగు ననిరి కదా. అట్టిది చిం.లో నైతము ప్రకృతి
సిద్ధ మనరాము ద్రుతాంతమె కాని ద్రుతప్రకృతికము కా దనవలసియుండు. అట్టి
యెడల ద్రుతప్రకృతిసంజ్ఞ చిం.లో సార్థకముగాఁ జెప్పునపుడు సూరిమతమున
ద్రుతాంతములలో నుకర్ణాంతములను బ్రస్తావించియు నట్టివానింగూర్చి చిం.మత
మెట్టిదో వివరింపవలదా?

మొత్తము మీఁద ద్రు.ప్ర.ల విషయమునఁ జిం.యొక్కయుఁ జిన్నయ
యొక్కయు నభిప్రాయములు భిన్నములుగాఁ జెప్ప వీలు లేదు. ప్రకృతిసిద్ధ
మైనద్రుత మంతమందుఁ గలవె ద్రు.ప్ర.లని యర్థము చేయునవు డాసంజ్ఞ
వ్యుత్పత్త్యర్థము లక్ష్యసంగ్రాహకము కాకుంట చిన్నయమతమునవలెనె చిం.మత
మునను సమానమే యనియు నీసంజ్ఞ నవ్యుత్పన్నముగనే గ్రహింపఁదగు ననియు
స్పష్టము. కాఁగా స్వాభావికద్రుతాంతములె ద్రు.ప్ర. లనరాదు.

సూరి కూడ ద్రుతాంతములయినపదములు ద్రుతప్రకృతికము లని పేర్కొ
న్నాఁడు గదా. ఇట ద్రుతాంతము లైనపదము లన నేమి? పదముచివర ద్రుత
ముండవలె. ఆద్రుతము పదమున నవయవ మైయుండవలెనా? లేక పదము
పై నుండవలెనా? అనఁగాఁ జివర ద్రుత మున్నపుడు ద్రుతమునకు ముందటిభాగము
పదము గావలెనా? లేక ద్రుతముతోడిదే పదము గావలెనా? వచ్చెదను అనుపదములో

ను అనుద్రుతము చేరినపదమనే యిది మొత్తము పద మగును. సమువర్ణము లేకుండ (దానికిముం దున్న) వచ్చెన అనుదానికిఁ బదత్వ ముండదు. అసలు సువర్ణము పద మైనపుడే వచ్చెద(ను) అనురూపము నేర్పడును. అనఁగా నిందు ద్రుతము తోనే పదత్వము సిద్ధ మగును. రాముఁడు అనునది ప్రథమాంత మయి పద మైనది. దీనిమీఁద సముచ్చయాద్యర్థవిశేషాలలో సువర్ణము చేరిన రాముఁడును అని యగును. ఇందు ద్రుత మున్నను నది చేరకముం దున్నశబ్దము పదము. ఇట ద్రుతము పదము పైనే చేరినది. అర్థవిశేష మున్నను సువర్ణము చేరకపో వచ్చును. సువర్ణము చేరినను జేరకున్నను రాముఁడు అనునది పదమే యగును. ఇట్లే భక్తుఁడను అనురీతిస్థలములందును గమనింపవచ్చును. వచ్చెదను, భక్తుఁడను అనునవి రెండును ద్రుతాంతములె యైనను వీనితీరులో భేద మున్నది. ద్రుతాంతా లైనపదా లనఁగా నిం దేతీరునది గ్రహింపవలె?

అనఁగా రెండును గ్రహింపవలసినదే. వచ్చెదను అనునదియు భక్తుఁడను అనునదియు రెండును ద్రుత మంతమం దున్నపదములే యనుటలో విప్రతిపత్తి లేదు గదా. పదమున నొకభాగ మైయుండుటయు పదము పైని ద్రుతము చేరుటయు ననునట్టిభేదము వివక్షింపఁబడదే దీలక్షణమున. ద్రుతాంతము లగుపదము లగుట యన్నది రెండింట సమానమే. కాఁబట్టి ద్రుతాంతా లైనపదా లనఁగా నిట్టి వన్నియు గ్రహింపఁబడుచునే యుండును. అందులకే సూరి అయ్యున్ ఎంతయున్ అనుదానిని గూడ నిట (ద్రుతప్రకృతిక) లక్ష్యములుగాఁ జూపియున్నాఁడు. కాఁగా ద్రు.ప్ర. అనఁగాఁ జివర ద్రుత మున్నపదము అంతే. ఆద్రుతము స్వాభావికమా లేక యర్థవిశేషాదులలోఁ జేరిన దై యస్వాభావికమా? అను ప్రశ్నకుఁ దావు లేదు. ఎట్టి దైనను ద్రుతము చివర నుంటయే ద్రు.ప్ర.లక్షణము. అనగా స్వాభావిక ద్రుతాంతాలు అస్వాభావికద్రుతాంతాలు అనురెంటికీ ద్రుతప్రకృతికము అనునది సామాన్యముగా సంజ్ఞగా నేర్పఱుపఁబడినది.

ఇందువలననే పద్యాంధ్రవ్యాకరణములోఁ గూడఁ జిన్నయసూరి "వలసినచోఁ గడ ద్రుతములు తల చూపనిపదము లెల్లఁ గళలన లాఁతులు దనయ ద్రుతప్రకృతి కములు నా మంగామనోజ్ఞభాష సువేషా" అని చెప్పెను. ఇందు వలసినచో

నను దానికిఁ బ్రత్యేకప్రయోజన మేమియుఁ గనఁబడుట లేదు. మొత్తముమీఁదఁ జివర ద్రుతము లేనిచోఁ గళ లనియు ద్రుత మున్నచో ద్రు.ప్ర. లనియు స్పష్టము. చివర నుండు ద్రుతము స్వాభావికమా? అస్వాభావికమా యనువివక్ష లే దని ఏ పైన ద్రుత మున్న ద్రుతప్రకృతికమే యగు నని యీపద్యాంధ్రవ్యాకరణము నందు సూరియభిప్రాయము బాలవ్యాకరణమున నున్నట్లే యున్నది.

చిన్నయసూరికి ముం దప్పకవి గూడఁ గొంతవఱ కిట్లే చెప్పియున్నాఁడు. వలసినచోఁ దుది ద్రుతములు తలచూపెడుశబ్దములు ద్రుతప్రకృతు లనన్ వెలయు నవి వొడమకుండెడుపదంబులు కళాప్రదేశము లయ్యెన్. కాని యప్పకవి పిదప ధాత ధాతను అనుమొద లగురీతిగా ద్రుతము లిట్లు లోపము గ్గాంచి వలయునట్లఁ గనుపట్టునవి ద్రుతప్రకృతు లని(౧.౨౩) పేర్కొన్నాఁడు. దీనినిబట్టి చివర నున్న ద్రుత మున్నను గారణాంతరములవలన లోపించినను నయ్యది ద్రుతప్రకృతికమె యవు నని యప్పకవియభిప్రాయము గావచ్చును.

## వైకల్పికద్రుతప్రకృతికాలు :-

అయిన నప్పకవి యిం కొకభేదమును బ్రస్తావించెను. పదము చివర నున్నద్రుత మున్నను లోపించినను ద్రు.ప్ర.యే యగు నవి కొన్ని. (ఇవి నిత్యద్రుత ప్రకృతులనవచ్చు. మఱి కొన్నింటికిఁ జివర ద్రుత ముండుటయు లేకుండుటయుఁ గలదు. అనఁగా నప్పదము తుదిని ద్రుతము లోపించుట గాక పక్షాంతరమున నన లుండదు. ద్రుత ముండుట లేకపోవుట (కలుగకుండుట యనుస్థితి కలవి వైకల్పికద్రుతప్రకృతికములు. అప్పకవి అనాదిషు విభక్తి షూత్తో వా' యనుసూత్రమును వివరించుచు సంధి వికల్ప మనుటకు బదులుగా వికల్పంబువలన ద్రుతప్రకృతికత్వంబు గలుగుచుండు నన్నాఁడు. చోర్వా స్వ త్తనుసూత్రసందర్భమున వికల్పమున ద్రుతప్రకృతి యగు(౧-౭౬) నన్నాఁడు. వికల్పముగా ద్రు.ప్ర. లవు ననఁగా ద్రు.ప్ర.త్వాభావపక్షములో నవి యే

మగును? చూచుచున్ అన్నప్పుడది ద్రు.ప్ర. చూచుచు అనియు నుండవచ్చు.

అది కళ యవునా? అట్లు గాక ద్రు.ప్ర.త్వము వికల్ప మనఁగాఁ జివర నకార
ముండుట వికల్ప మనునభిప్రాయము మాత్రమే యనియు వీనికిఁ జివర నకారము
లేనిపక్షమునను వీనిని గళ లనుట యప్పకవియభిప్రాయము కా దని చెప్పవచ్చునా?

కాని ద్రు.ప్ర.త్వాభావపక్షమునం దద్దానిని కళ యనుటయే యప్ప. యుద్దేశ
మేమో యనిపించును. తాను చహంకృతిన్ అనురీతిగా సంధి యగురూపము
కొఱకే యప్ప. వికల్పముగా ద్రు.ప్ర.యగు నని చెప్పె ననుట స్పష్టమే. అనఁగా
ద్రు.ప్ర.పక్షమున నాంతతచేతఁ దానుచు నహంకృతి నని యగును. వికల్పతచే
ద్రు.ప్ర. కానిపక్షమున తాను+అహంకృతి అని యుండ సంధి పై తాను చహం
కృతి అని యగు నన్నమాట. తానుచు అని ద్రుతము చివర లేనిపదము కూడ
ద్రు.ప్ర. యే యగు నెట్లు? అప్ప. ద్రు.ప్ర.త్వ మనునది సంధి లేమిఁ బర్యాయ
ముగాఁ జెప్పుట గుర్తింపవచ్చు. ద్రుతప్రకృతి గాన నుత్తమైకోక్తిఁ దక్క....
సంధి చెందు(5-70) అనెను. సంధి వికల్ప మనుటకు ద్రు.ప్ర.త్వము వికల్ప
మని యిక్కడను జెప్పెను గదా. ఇక్కడ వికల్పతచేత ద్రు.ప్ర.త్వాభావ
స్థితిలో నకార ముండ దంతియ. కాని యది ద్రు.ప్ర.యే యగు నని యెంచునపుడు
ద్రు.ప్ర. గావున సంధి లే దని చెప్పెడివాఁడు గా దనవచ్చును. ద్రుతము లేన
పుడు ద్రు.ప్ర.కు సంధి చెప్పనవునే కదా. అప్ప. యెక్కడను ద్రు.ప్ర.లకు సంధిని
పేర్కొనువాఁడు గాదు. ఇంకఁ బైఁగా తిఙ్మధ్యములతోడ నెన్నుకతనఁ బ్రాణసంధి
(5-62) తిఙ్మధ్యకములు గానఁ గొన్నిటను బ్రాణసంధులు గూర్చ జెప్పు (5-72)
అనురీతిగాఁ దిఙ్మధ్యములు గాఁబట్టి సంధి యగు ననుటనుబట్టి చూడఁగాఁ గళ
యయిననే సంధి యగు నని యప్ప. యభిప్రాయపడిన ట్లూహింపఁదగియున్నది.
"ధరణి ద్రుతప్రకృతులపై స్వరపూర్వపదములు గదిసి సంధి గలయుచో నర
కాసురదమన ద్రుతాక్షరములు లోపములు గాక నిలుచున్ (5-48) అని చెప్పుటను
బట్టి చూడఁగా సంధి జరుగునప్పుడు ద్రుతమునకు లోపము వచ్చుటకు వీలు
లేదు గాఁబట్టి "తాను చహంకృతిన్" ఇత్యాదులలో ద్రుత ముండి లోపింపలే
దనియు ననఁగా సహజముగానే చివర ద్రుతము లే దని చెప్పవలసియున్నది.

ద్రుతము లోపించకపోవుటచేత ద్రు.ప్ర. లకు సంధి వచ్చుట కవకాశము లేకపోవుటనుబట్టి గూడ నప్పు. ద్రుతపూర్వస్వరమునకు సంధి జరుగుసందర్భములో నాశబ్దము ద్రు.ప్ర. గాకుండ కళయే యగు నని భావించినట్లు చెప్పుటకు వీ లున్నది. సంధిని చేర్కొనుస్థలములలో మొదటిపదము కళాత్వమును జ్ఞాపకము చేయుటను బట్టి యిక్కడ వికల్పముగా ద్రు.ప్ర అవు నని చెప్పి పక్షాంతరములో సంధిని జూపించుటనుబట్టి చూడఁగా వికల్పముగా ద్రు.ప్ర. లవు ననఁగా ద్రు.ప్ర. కానిపక్షములోఁ గళయే యగు నని యప్పు. యభిప్రాయముగాఁ జెప్పుటలోఁ దప్పు లేదు. కాఁగా వైకల్పికద్రుతప్రకృతికము లనగా నొకేశబ్దము ద్రుతాంత మయి ద్రు.ప్ర. యవుటయు ద్రుతాంతము గాక కళ యవుటయు ననురెండవస్థలును గల్గియుండు నన్నమాట.

ఇక్కడనే యప్పు. తాటక నొకకోల, సుబాహు నుక్కడంచె, మౌనుల నానందమగ్నుల, శౌరిచే నందె, జనకునిచేత నర్చనములు మొదలగువానిం జూపి "ఇవి విభక్తులు పదియును ధరణి ద్రుతప్రకృతికలు (ఇది చరిత్రాదులలోఁ జేర్పవలె నన్నమాట.) నిత్యముగ నగును" (౧-౮౦) అని నిత్యద్రుతప్రకృతులను చేర్కొన్నాఁడు.

అనఁగా అనాదిష, చోర్వా యనుసూత్రస్థలములందలివి వైకల్పిక ద్రు.ప్ర. లని పేర్కొన్నవాఁ డాదంభమునందే "అవి (ద్రుతములు) పొడమకుండెడు తెలుగుపదంబులు కళాప్రదేశము లయ్యె (౧-22) ననియు నకారము పలయుచోఁ గొనలఁ బొడము ద్రుతప్రకృతు లనుటనుబట్టి చూడఁగా నప్పు. యీద్రుతపరకస్వర సంధిని దృష్టిలో నుంచుకొని నన్నేలుకొను మనురీతి రూపములకొఱకై ద్రుతము పొడముట పొడమకుండుట యనుస్థితులను ప్రతిపాదించె నని తోఁచుచున్నది. కొనల ద్రుతము పొడమఁగా ద్రు.ప్ర. యయి నిన్ను నేలుఁగంగ నని యవును ద్రుతము పొడమకున్న నన్నేలుకొను మని సంధి యవు నన్నమాట. ఇటువంటిసంధిప్రసక్తి లేనిస్థలాలలోనివానిని నిత్యద్రుతప్రకృతు లనుటనుబట్టియు నిట వైకల్పికద్రుతప్రకృతు లనఁగా ద్రు.ప్ర.త్వాభావపక్షమున నయ్యది కళయే

యవు నని భావించెనా? వలసినచోఁ దుది ద్రుతములు తలచూపెడుశబ్దములు ద్రుతప్రకృతు లనుచోటఁ దలచూపుట యనఁగా గనఁబడుట. ద్రుతము నిల్చియుండుట యని (ద్రుతము నిల్చియున్నపుడే యవి ద్రుతప్రకృతికము లగు నని) యర్థము చేయ వీలు లేదు. అవి పొడసూపుచుండెడుతెలుఁగుపదంబులు కళాప్రదేశము లయ్యె ననుతదుపాత్తవాక్యము ననుసరించి తలచూపుట యనఁగాఁ బొడముట కలుగుట యని యర్థము చేయవలె. వలసినచోఁ దుదిద్రుతములు పొడమినశబ్దాలు ద్రు.ప్ర. లనఁగా నవసర మయినపు డాశబ్దముచివర ద్రుతము పొడమును. అనఁగాఁ జివర ద్రుత ముండుటయు లేకుండుటయు ననుభేదము గలదు. ఇవి రెండును ద్రు.ప్ర. లన వీలు లేదు. పూర్వోత్తరసందర్భమునుబట్టి ద్రుతము పొడమినశబ్దాలు ద్రు.ప్ర.లు గాఁగాఁ బొడమనిశబ్దాలు కళలే యవును. అనఁగా నన్నున్ ద్రు.ప్ర. నన్ను కళ. ఇట్టివానితోపాటు ద్రుత మెప్పుడును బొడమనిరాముఁడు ఇత్యాదులును గళలే యవును. ఇట్లు తనసంధిప్రణాళికను దృష్టియం దిడుకొని వలయుచో వలసినచో నని యప్పకవి ప్రయోజనాపేక్షతోనే ప్రయోగించె నని గుర్తింపఁదగు. ఇట్లీపద్యము కళాద్రుతప్రకృతికములను బేర్కొనఁగాఁ బిదప ద్రు.ప్ర.లను నాపిదపఁ గళలను గ్రమముగా వివరించినాఁడు.

ధాత ధాతను అనుతదుపాత్తపద్యములో ద్రుతము లోపము ల్గాంచి వలయుపట్లఁ గనుపట్టుచో నది ద్రుతప్రకృతియే యనెను. తుది ద్రుతము లోపించినను నిది ద్రు.ప్ర.యే. ధాత (ధాతను) అనుచో నున్నద్రుతము లోపించుట గల దది ద్రు.ప్ర.యే. నన్ను (నన్నున్) అనుచో ద్రుతము లోపించుట గాదు. అసలు ద్రుతము కలుగలేదు. కావున నది ద్రు.ప్ర. కాదు. కళ యవు నని యీరెండింటి భేదమును గుర్తింపఁదగును. ఇంక 'లోపము ల్గాంచి'నట్లు చెప్పినస్థలములం దింకొకవిశేషము గమనార్హము. ధాత ధాతను (తాటక నొకకోల) భూపతి ధరణిపతిని, జనకు జనకుని (సుబాహు నుక్కడంచె) (కనియెఁ గన్గొనియె ననుచు) అవి చూపిన వెల్ల నిత్యద్రుతప్రకృతికములే యగుట గమనింపవచ్చు. ఇవి వైకల్పికద్రు.ప్ర. లన్న జన కడిగె ననియుఁ గావలసియుండును గదా. మఱి యివి నిత్యద్రు.ప్ర. లయినపుడు వీనికిఁ జివరఁ గొన్నియెడల ద్రుతము కల్పించుట

లేదు గదా. ధాత (ను) ము॥ తారుచు ఇత్యాదులు వికల్పముగా ద్రు.ప్ర. లవు ననుటచేతఁ జివర ద్రుతము లేకుండుట పొసఁగినది. ఇవి నిత్యద్రు.ప్ర.లు గదా. ద్రుతము లేకుండు టెట్లు? అనఁగా లోపము ల్గాంచి యన్నాఁడు. అనఁగా నిత్య ద్రు.ప్ర. లయినశబ్దములలోఁ జివర ద్రుతము లోపించిన నవి ద్రు.ప్ర.లే యవు ననియు వైకల్పిక ద్రు.ప్ర.లలో ద్రుతము కలుగుటయే లేనిపక్ష మది యనియుఁ దత్పక్షమున నయ్యవి కళలే యనియు నప్ప. యభిప్రాయము ననుసంధింపఁదగును. వైకల్పికద్రు.ప్ర. లన్నచోటునకును లోపము ల్గాంచి యనుచోటు నకును నై రీతి నర్థనిర్ణయమున బాధ లే దని తాత్పర్యము.

సంధిసందర్భమునకయి వైకల్పికద్రు.ప్ర.త్వమును బ్రస్తావించినయప్ప. సందర్భానుసారముగ నిత్యద్రు.ప్ర. లని కొన్నింటిని బేర్కొన్నట్లు గుర్తింపవచ్చు. నిత్యద్రు.ప్ర.లని పేర్కొన్నయాస్థలమున ద్రుతపూర్వస్వరమునకు సంధి లేకుండుటను జూపుటయు నప్పకవి యుద్దేశించినప్రయోజన మనవచ్చును.

మొత్తము మీఁద నప్ప.మతమున నిత్య ద్రు.ప్ర. లని వైకల్పికద్రు.ప్ర. లనియు నియ్యవి రెండువిధము లైయున్న వని గుర్తింపవచ్చును. కాని యట్టి విభాగమునకుఁ జిం.లో నేమియు నాధారము గానరాకున్నది. చిం. నన్నయ కర్తృకము గా దనుట యథార్థ మైన నింకను నట్టియభిప్రాయమును దిరస్కరించె ననియుఁ జెప్పవలసియున్నది.

త్రి.శ. "ప్రథమా శేషషష్ఠీ చ మధ్యమ స్తిఙ్ యదా తదా తూష్ణిం కి మేవ సంతావక్త్వా కిలాది స్తథా కళాః, ....కాదయః సంకీర్ణాః స్యుః, పరే నాంతా ద్రుత ప్రకృతికా మతాః (1.కాం.) అని కళాద్రుతప్రకృతికములతోపాటు సంకీర్ణములను బేర్కొన్నది. సా.త్రి.శ. కించిత్ప్రథమా శేషషష్ఠీ కిమేవసంతావతిఙ్మధ్యకిలక్త్వా తూష్ణీం కర్మప్రవచనీయజయదాతదేదానీం ప్రశంసనాద్భుతాద్యాః కళాః-ఇత్యాద్యాః కళాసంజ్ఞాస్స్యుః, న ద్రుతమ్-కళానాం ద్రుతసంజ్ఞం న స్యాత్ అని కళలను, ద్వితీయాద్యుత్తమపలదకాంగనంతాదయస్సంకీర్ణాః అని సంకీర్ణములను ద్రుత ప్రకృతయోఽన్యే- కళాసంకీర్ణేతరా నాంతాశ్శబ్దాః ద్రుతప్రకృతికసంజ్ఞాస్స్యుః,

ద్రుతినో నిత్యమ్– యే నిత్యమనుజీవిత ద్రుతాః తే ద్రుతప్రకృతికా ఇతి బోద్ధ వ్యాః అని ద్రు.ప్ర.లను వివరించినది. సంకీర్ణములను వివరించుచో సా.త్రి.శ. ని న్నందురు నిన్ను నందురు, నీచే తేమి నీచేత నేమి–చేయ కేమి చేయక నేమి అనురీతిగాఁ జేర్కొన్నది. ని న్నందు రని సంధి యైనస్థలమును నిన్ను నందు రని ద్రుతము నిల్చినస్థలమునుబట్టి నిన్ను నిన్నున్ అనురీతిగా వికల్పముగా ద్రుతాంత మగుట సంకీర్ణములలక్షణ మని గుర్తింపవచ్చును. చేతవలనాదుల విషయమున భిన్న మైనను నప్పకవి పేర్కొన్న వైకల్పిక ద్రు.ప్ర.లవంటివె యీసంకీర్ణము లని గ్రహింపవచ్చు. సంధిసందర్భముననే వికల్పమువలన ద్రుతప్రకృతికము లవు ననునప్ప.అభిప్రాయమె సంకీర్ణముల నుదాహరించుచో సా.త్రి.శ.లోఁ గమనింపఁదగును. వై.చం.లో అప్ప.అభిప్రాయము స్పష్టముగాఁ గానగు. కళాద్రు.ప్ర.సంజ్ఞలను జేర్కొననివై.చం. ద్రుతం సద్రుతాత్– సద్రు తాద్ద్రుతం స్యా దచి. గదచేత నడచి, అందుకికుచుకావా– అందుః జమాదేశౌ కికూచ వర్తమానే చువర్ణకశ్చ క్త్వాదేశః కశ్చ సద్రుతసంజ్ఞా వా స్యుః (సంధి.8,9) అన్నది, సద్రుత మనఁగా ద్రు.ప్ర.యే యనవచ్చును. అంద్వాదులు వికల్పముగా సద్రుతములగు ననఁగా వికల్పమువలన ద్రు.ప్ర.లవు ననుటయె కదా.

వై.చం.ప్రణాళికలోఁ బెక్కు వివాదము లున్నవి. సద్రుతములకు ద్రుతం సద్రుతా త్తని ద్రుతము చెప్పఁగా దానివృత్తి యచ్పరకత్వముననే వివరించినది. దీనివలన హలవసానపరకతలో సద్రుతములకు ద్రుతము చేయనవకాశమే లేదు. అపుడు ద్రుతా త్సరళాః పరుషాణామ్, స్థిరసరళయోర్ద్రుతస్య ఇత్యాదిగా ద్రుత కార్యములవిధానము సందర్భపడునదిగా లేదు. ఇక్కడ వై.గ. ద్రుతం సద్రుతా త్తనుసూత్రమునకు విభక్తిప్రత్యయగతా లయినస్వరాలకు సంధి రా దని సామాన్యముగా విధించుటయే ప్రయోజనముగా (Liv.పుట) వివరించెఁ గాని హలవ సానపరకతలో ద్రుతము చేయుట లే దన్నది విశేష మగుననర్థము గదా.

పిదప అందుకికుచుకా వా యనుసూత్రమునకు వృత్తి చేయుచో నవి సద్రుతసంజ్ఞా వా స్యుః అన్నది. పూర్వస్థలమునఁ జెప్పిన ట్లిచట నచి యని చేర్పకుంట విశేషము. దీనినిబట్టి ద్రుతం సద్రుతా త్తనుచో వృత్తియం దచి

యన్నది చేర్పక సామాన్యముగా నెల్లెడల సదుత్రితములకు దుత్రితము చేయ నని చెప్పఁదగు. అపు డంద్వాదులు వైకల్పికసదుత్రితము లగుటయు నచ్ఛరకతయందే కాక యెల్లెడల నగు. కాని యీపక్షమున నీయందు కాంచె (నీయందుఁ గాంచె) ననురీతి హల్పరకత్వమున నిబ్బంది యేర్పడుచున్నది.

వృత్తినిబట్టి చూచిన అందుకీకుచుకా వా యను సూత్రవృత్తిలో నచి యన కున్నను బూర్వ మగుకిసూత్రవృత్తి ననుసరించియు గదచేత నడఁచి యనునచ్చోట లక్ష్యము ననుసరించియు నిటఁ గూడ నచ్ఛరకతలోనె సద్రుతసంజ్ఞ వికల్ప మనుట దానియభిప్రాయ మనవచ్చు. అట్టియెడల సద్రుతసామాన్యమునకువలెనె యీ వైకల్పికసద్రుతములకును హలవసానపరకతయందు ద్రుతస్థితి యసాధ్య మగును. కావున నీయందు కాంచె ననురీతియపరూపముల కీపక్షమునను నవకాశము తప్పు కున్నది. (కావుననె ద్రుతం సద్రుతా త్తనుచో నది యచ్ఛరకతయం దనకుంటయే కొంతవఱ కేని యుక్త మనిపించు.)

అన లచ్ఛరకతలో నైనను సద్రుతత్వవికల్పవిధాన మేలః సంధిసందర్భము నకే. సద్రుతము లగుట గదచేత నడఁచి యని యట ద్రుత ముండుట తప్పదు. వికల్పముగా సద్రుత మగు ననుట నిట సద్రుతత్వపక్షమున ద్రుతము చేరి నీయందు నుండె ననియుఁ దదభావపక్షమున ఉతోఽతద్ధర్మే(సంధి.15) యని యుత్తు లోపించి నీయం దుండె ననియు నవును. కాన వైకల్పికసద్రుతత్వము చెప్పుచో నీయంద్వాదులకు వైకల్పికసంధి (పూర్వస్వరలోపము) చెప్ప నవసరము లేదు. కాని వై.చం. అనున స్సవో వా, కృపితత్కిమామితః ఇత్యాదిగా స్వరలోపము చెప్పియేయున్నది.

నీయందు + ఉండె నని యుండఁగా సద్రుతత్వపక్షమున (ఉతోఽతద్ధర్మే యని రావలసినయుల్లోపము) న సద్రుతా త్తని నిషేధింపఁబడినది గావున స్వర లోపము రాక ద్రుతం సద్రుతా త్తని ద్రుతము చేరి నీయందు నుండె నని యవు. కానఁ దదభావపక్షముననే స్వరలోపము (సంధి యందము) రావలె. అపుడు అనున స్సవో వా యని సంధి వికల్పము గావున సంధి యైన నీయం దుండె నని కాఁగా

సంధి లేనిపక్షమున లఘురో్యచోఽౘ యని యకారము వచ్చి నీయందు యుండె

నని కావలయు. అది లక్ష్యవిరుద్ధము గదా.

ఇట వై.గ. అందుకిఁకుచుకా వా అనేసూత్రంచేత సద్రుతసంజ్ఞ రానపుడు అసున స్నుపో వా అనేసూత్రం వర్తించి సంధిభావరూపం ఏర్పడుతుం దని ద్రుత మున్నపుడు విసంధిరూపం ఏర్పడుతుం దని గ్రహించాలి (Liv పుట) అన్నది. ద్రుత మున్నపుడు విసంధిరూప మేర్పడు ననుట కుదురదు. సద్రుత సంజ్ఞ యున్నపుడు సద్రుతాత్తని సంధి లేకపోఁగా విసంధిగా నున్నపుడు ద్రుతం సద్రుతాత్తని ద్రుతము చేరు నని చెప్పు టొప్పును. వై.గ. అంతకుముందు కూడ శః ప్రత్యయాలు ద్రుతసహితా లయినపుడు వీటికి సంధి రా దనుట (Liv పుట) యుక్తము. సద్రుతత్వపక్షమున శఃప్రత్యయాలకు సంధి లేక ద్రుతసహితా లగు ననుట సక్రమము. ద్రుతం సద్రుతాత్ అనే సూత్రంచేత అచ్చు పర మౌతుంటే విభక్తిప్రత్యయానికి ద్రుతం వుంటుంది అని వృత్తి కనుగుణముగనే యర్థము చెప్పిన వై.గ. ననుసరించియు నచ్చరకతయందే (స్వరలోపము లేనపుడే) కదా ద్రుతము చేరునది. ముందే ద్రుతము చేరియున్నట్లు చెప్పు టెట్లు గుదురును? ఏ మైనను సద్రుతత్వాభావపక్షముననే కదా (అసున స్నుపో వా యని) సంధి వచ్చునది. అట్టియెడల సంధి రానిపక్షమున సద్రుతరూప మేర్పడు నను టెట్లు? అద్రుతత్వపక్షముననె సంధి చెప్పునప్పు డాపక్షమున నీయం దుండె ననురీతి సంధి యవుటమాత్రమె కలదు. నీయందు నుండె నన్నది సంధ్యభావ పక్షమందలిరూపమ యైనను నది న సద్రుతాన్మనుదానిచే సంధి వారిత మయిన స్థలము గాని యసున స్నుపో వా యనుచోటివాశబ్దముచే సాధింపఁ బడినది కాదు గదా. అనఁగా అద్రుతములకె సంధి యన్నపు డసున స్నుపః అన్నఁ జాలును. వికల్ప మనరాదు. అయిన నీయం దుండె నని సంధి యవుటయె గాని లేకుండు టెట్లు? అనఁగా సంధ్వ్యత్యాదిసూత్రముచే నిది వికల్పముగా సద్రుత మగును గాన సద్రుతపక్షమున సంధి నిషిద్ధము గాన నీయందు నుండె నను రూపము నిర్బాధమె యగును గదా. కాఁగా వృత్తియం దిట రామునికొఱకు నభివాద మని యుదాహరించుట పొరపాటు. ఇంక క్యపితత్క్యమామితః అనుచో

రామునికి యభివాద మని చూపినట్లుగా రామునికొఱకు యభివాద మని చూపవలె. క్షపితత్క్రమామిత యనుచో 'కి'లో నిల్లోపము వికల్పముగాఁ జెప్పుట నిది వైకల్పికసద్రుత మైనను సద్రుతత్వపక్షమున లోప మసలు లేదు గావునఁ దదభావ పక్షముననే గుర్తింపవలె. కాననే యిట రాముని కభివాదము, రామునికి యభివాదము నని యకారముతో నుదాహరణము లక్షణానుగుణ మైనది. అది లక్ష్యానుగుణము గామి స్పష్టమె.

కాని వై.గ. రామునికి యభివాద మని యుదాహరించుటనే విమర్శించినది. వై.గ. అద్రుతత్వపక్షముననె సంధి యని గుర్తించియు నప్పక్షమున 'వా' యని చెప్పుట నేల సమన్వయింపదు? అద్రుతత్వపక్షమున సంధి నిత్యము కాదా? సంధి వికల్ప మనుచుండ సంధి లేనిపక్షముననే సద్రుతసంజ్ఞ గల్గు నని చెప్పు టెట్లు? సద్రుతత్వమువలన సంధి లేదా? సంధి లేమివలన సద్రుతత్వ మగునా? వై.గ. సద్రుతసంజ్ఞ వున్నవుడు ఇత్వలోపం జరగక, సద్రుతసంజ్ఞ లేనపుడు ఇత్వలోపం జరిగి సంధ్యభావసంధిభావరూపాలు ఏర్పడతాయి. (LVపుట) అని వివరించినప్పుడు సంధ్యభావదశను సాధించున దిక్కడి 'వా' శబ్దమా? లేక యందుకికుచుకా వా యనుచోటి(సద్రుతత్వమును గల్పించుపక్షమా?) వాశబ్దమా? సద్రుతత్వపక్షమున సంధి లే దనుట నంద్వాదిసూత్రమందలివాశబ్దమె సాధించు. సంధ్యభావస్థితికై మఱి యిట వా యన నేల? "సద్రుతసంజ్ఞ రానప్పుడు క్షపిత త్క్రమా మితః అనేసూత్రంచేత రామునికి + అభివాదము అన్నప్పుడు ఇత్తునకు లోపం (LV) వచ్చు నని యెంచుచో నప్పక్షమున నిల్లోపము నిత్యముగనె విధింపవలెఁ గాని వికల్ప మన నేల? కాఁగా వై.గ. సూత్రకారునికి సమగ్ర నిశితదృక్పథ ముండఁగ వృత్తికారున కది లే దనురీతిఁ బేర్కొనుట సరి గాదు. అట్లై చెప్పవలసిన వృత్తికారుఁడు రామునికొఱకు నభివాద మని చూపుటలోఁ బొరవడినను సంధిప్రణాళికలోఁ బ్రమాదము ముఖ్యముగా సూత్రకర్తదే యన్ని నిశ్చయింపఁదగును.

ఇం తేల? వైకల్పికసద్రుతత్వము (లేదా ద్రు.ప్ర.త్వము) చెప్పనివారే వికల్పసంధి నిటఁ జెప్పవలె నని చింతామణ్యాదులనుబట్టి గ్రహింపవచ్చును. చిం.

కాని చిన్నయ గాని వైకల్పికద్రు.ప్ర.లను బేర్కొన్నారా? పేర్కొన్న వికల్ప సంధివిధానము వ్యర్థ మయ్యేడిది. వికల్పసంధిని జెప్పనివారే వైకల్పికద్రు.ప్ర. తయో యట్టియింకనొకటో చెప్పవలె. అప్పకవి వికల్పమువలన ద్రు.ప్ర. లగు టను బేర్కొనె నట సంధి వికల్ప మనియుండలేదు గదా.



కాఁగాఁ బాక్షికసద్రుతములనునైతము సద్రుతములుమాత్రమె యని చెప్పి నపుడే యీసంధివిధానములు (కొన్నేని) సార్థకము లగును. (నిత్య) సద్రుత తచే లోపము లేక ద్రుతము చేరవలసియుండఁగా వికల్పవిధానముచే నదిదుత్తు లట లోపించుటయుఁ దదభావపక్షమున సామాన్యశాస్త్రానుగుణముగ లోపింపక వయి ద్రుతము చేరుటయు సముచితముగా సరిపడును.

ఉతోఽతద్ధర్మే యనుచో నతద్ధర్మే యని పర్యుదాసము చేయఁబడినది. తద్ధర్మార్థక మిట వివక్షితము సద్రుతమె యని యె ట్లయినఁ జెప్పకతప్పదు. దానిని బరిహరింప నేల? ఉతః అని మాత్రమె చెప్పిన వెలయు + అతఁ డనుచో నుత్తు లోపించునా? న సద్రుతానామ్- సద్రుతానా మదిదుతాం లోపో న యని లోపము రాదు. ఇంక ద్రుతం సద్రుతా త్తని ద్రుతము చేరును. అతద్ధర్మే యన నేల? ఇది సద్రుతమే కా దన్న వెలయు నతఁ డని వృత్తిలో ద్రుతము చూపుట సంగత మగు టెట్లు? కాఁగా నిట నతద్ధర్మే యనుపర్యుదాసము సార్థకము గా దనకతప్పదు గదా. ఇంక నిది వ్యర్థ మై యిఁకాదుల స్వరలోపమును జ్ఞాపకము చేయు నను టొకమార్గము. (చూ.ద్రు.కా.ద్రుతపూర్వస్వరసంధి.)

మొత్తముపై నచ్చరకతయం దేని వైకల్పికద్రు.ప్ర.తాకల్పనము ప్రయో జనవంతము గా దనక తప్పదు. అయిన వికల్పసంధిని జెప్పక వైకల్పికద్రు.ప్ర. త్వమును మాత్రము చెప్పినయప్ప.మతము ననుసరించి వైకల్పికద్రు.ప్ర.ల నంగీకరింపవచ్చునా? హల్పరకతలో సామాన్యముగా ద్రుతలోపము చెప్పి పరుష పరకతలోను ద్రుతలోప మంగీకరించు పక్షమున నివ్వానిని (సంకీర్ణము లన్నను) వైకల్పికద్రు.ప్ర. లన్నను నిబ్బంది లేదు. కాని పరుషపరక ద్రుతలోప మంగీక రింపనియప్ప.ప్రభృతులు వైకల్పికద్రు.ప్ర.లను బేర్కొనుట పొసఁగదు గదా.

ఇట్లే పరుషపరకద్రుతలోపమును దిరస్కరించినసా.త్రి.శ. సంకీర్ణములను బేర్కొనుటయు సంగతము గాదు. ఏ మైనను బరుషపరకతలో ద్రుతలోపము సరళస్థిరపరకతయందువలె నంగీకరింపఁదగినది కా దనుట లాక్షణికసమ్మతమును లక్ష్యానుగుణము నవుట వైకల్పికద్రు.ప్ర.తాంగీకార మేపక్షమునను బొసఁగకున్నది.

ద్రుతప్రకృతికసంకీర్ణాద్బహులం సంధిలక్షణ మ్మన్నత్రి.శ. పిదప సంబోధనైకాచ్పృదంతదీర్ఘే చాం ద్రుతినాం చ న యని ద్రు.ప్ర.లకు సంధి యసలు లేదన్నది. ద్రు.ప్ర.ను ద్రుతి యను టిట విశేషము.

లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య యని రాము నాశ్రయింతు మున్నగాఁ జూపిన సా.త్రి.శ. విభాషా సంకీర్ణాత్- సంకీర్ణా దచి పరే సంధి ర్వా స్యాత్, న న్నేలు నన్ను నేలు మిత్యాదిగాఁ బేర్కొన్నది. (సంధి.) నన్ను, నన్నున్ అని రెండు తీరులుగ నుండుపక్షమున వైకల్పికసంధి విధానము వ్యర్థమె యని పైని స్పష్టము. కళాపక్షమున సంధి యవుటయు ద్రుతాంతతాపక్షమున సంధి లేక ద్రుత మట్లుయుంటయు సామాన్యము. ద్వైరూప్య మట్లు సిద్ధము. వై.చం.లో వైకల్పికసద్రుతతాకల్పనమువలె సా.త్రి.శ.లో సంకీర్ణములను బేర్కొనుటయు నిరర్థకమె.

అట్టిలోపమును గుర్తించియే కావచ్చును, సా.త్రి.శ. కళాసంకీర్ణేతరములు ద్రు.ప్ర. లని చెప్పినను అం.కౌ.(సం) కళాద్రు.ప్ర.లను రెంటినె పేర్కొన్నది. (గ్రంథస్థవచనములనుబట్టి సా.త్రి.శ.కును అం.కౌ.(సం)కును గర్త యొక్కరే. గ్రంథసామ్యము నధికము.) కించిత్ప్రథమాశేషషష్ఠీకిమేవసంతాపతిజ్మధ్యకింతూష్ణీం యథాక్త్వాయదాతదాప్రశంసాద్యుతాద్యాకళాః, న ద్రుతమ్, ద్రుతప్రకృతయో న్యే (అం.కౌ.(సం).భాషా-58-59). దీనింబట్టి కళేతరము లైనశబ్దములు ద్రు.ప్ర. లవుచున్నవి. చిం. ఇట్లే అన్యే ద్రుతప్రకృతయో యేష్వర్థ్యానుజీవితద్రుతా నిత్య మ్మని కళేతరములను ద్రు.ప్ర. లని చెప్పె. కాఁగా సంకీర్ణము (లేదా వైకల్పికద్రు.ప్ర.) లనురీతివిభాగమును జిం. తిరస్కరించిన దని చెప్పవచ్చును. అట్లనరా దన్నను నట్టిసంకీర్ణము (లేదా వైకల్పికద్రు.ప్ర.)లను గుర్తించుటకుఁ జిం.లో నాధారము లే దని మాత్రము చెప్పకతప్పదు.

అప్పకవి కళాద్రుతప్రకృతికములను బేర్కొనుచున్న చిం. సూత్రములు రెంటిని గలిపి వ్యాఖ్యానించుట స్పష్టము. అప్పకవికి ముందు బాలసరస్వతియు నీ రెండింటిని గలిపియే చూపెను. అప్ప. కందములో (౮–2౭) మొదటియర్థము. ద్రు. ప్ర. లయు రెండవయర్థము కళలయు (ద్రుతో న యేషాం స్యాత్) స్వరూపము న వర్ణించుచున్నది. పిదపఁ జెప్పిన ద్రు. ప్ర.లనుగూర్చి ముందుగను ముందే చెప్పఁబడిన కళలనుగూర్చి పిదపను నప్ప. వివరించెను.



అయినఁ జిం. "యే స్వ్యర్థ్యేన జీవిత ద్రుతాః నిత్యమ్మని చెప్పుచుండఁగా నప్ప. వలసినచో నని చెప్ప నెట్లు? ఒకవేళ బా. స. వలె) నిత్య మను జీవిత ద్రుతాః అని యర్థము చేయుట తగ దనియు తె. ప్ర. పేర్కొన్నట్లుగా అను జీవితద్రుతాః నిత్యం ద్రుతప్రకృతయః అనియే యన్వయింపవలయు ననియు నప్పకవియు నెంచెనా? ఒకవేళ నట్టి యభిప్రాయమె యప్పకవికి నున్న స్వాభావిక మైనద్రుతము గలవి లేక ప్రకృతి సిద్ధ మైనద్రుతము కలవి నిత్యముగా ద్రు. ప్ర. లని యర్థము చెప్పవలయును గదా. వలసినచో ద్రుత మున్నది ద్రు. ప్ర. యనుమాటలో బా.స. చేసినయన్వయముమాత్రమె కాక తె. ప్ర. చూపినయన్వయమార్గము సయితము గవ్యర్థిష్టము గా దనిపింపఁజేయు.

"క్షితి సముచ్చయములఁ దక్క ద్రుతము గానఁబడదు గావున నవి పల్కఁబడుఁ గళ లని (౮–28) అన్నాఁ డప్పకవి. అనఁగా సముచ్చయముల ద్రుతము గానఁబడినపు డది యే మగును? వలసినచో సముచ్చయాద్యర్థవిశేషములను వివక్షింపఁగా ద్రుతము చేరి యివి ద్రు. ప్ర.లే యవును. (లేకున్న?) అట్లు ద్రుతము వొడమకున్న నయ్యది కళయ యవు నని చెప్పనవును. ఇట్టియభిప్రాయమునే చిం.మతమున తె. ప్ర. నిరూపించినది. కానీ తె. ప్ర. చేసిన సమన్వయదృష్టి యప్పకవికి లే దనియే గుర్తింపవలె. స్వాభావిక ద్రుతాంతాలు నిత్యద్రు. ప్ర. లనియు నస్వాభావికద్రుతాంతా లనిత్య ద్రు. ప్ర. లనియు తె. ప్ర. భావించిన, అప్ప. కూడ నిత్యద్రు.ప్ర.లను వైకల్పికద్రు.ప్ర.లను బేర్కొనెను. కాని వానికిని తె. ప్ర. నిరూపించినవిత్యానిత్యద్రు. ప్ర. లకును

సామ్యము లేదు. నిత్యద్రు. ప్ర. లుగా తె.ప్ర. చెప్పిన వెల్ల నప్ప. సమన్వయమున నిత్యద్రు. ప్ర.లు కావు. నాకును ద్రు. ప్ర. నాకుఁకళ. ఇది వైకల్పిక ద్రు. ప్ర. అని అప్ప. ఇట్టివాని ననిత్యద్రు.ప్ర.లుగా తె. ప్ర. చెప్పదు. స్వాభావికద్రుతాంతము లవుటచే నివి నిత్యద్రు. ప్ర. లని తె. ప్ర. అభిప్రాయము. అప్ప. ద్రుతపరకస్వరమునకు సంధి గలసందర్భము లందు మాత్రమే వైకల్పిక ద్రు.ప్ర.లని పేర్కొనుట గమనింపవచ్చును. ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణములు స్వాభావికద్రుతాంతము లయి తె. ప్ర. ననుసరించి నిత్య ద్రు. ప్ర. లు కాఁగా నవ్వానినే యప్ప. వైకల్పిక ద్రు.ప్ర. లుగాఁ బేర్కొనెను.

ఇంక అస్వాభావికద్రుతాంతాలను రాముఁడును అనురీతిగా ద్రుతాంతము లైనకళల ననిత్య ద్రు.ప్ర.లుగా తె.ప్ర. పేర్కొన్నది. వీనిని వైకల్పిక ద్రు.ప్ర. లని యప్ప. యెచ్చటను బేర్కొనలేదు. ఆపక్షమున పండితుడన్ అనియె, పండితుఁడ ననియె ననియే కాని పండితుఁ డనియె నని యుండదు, గావున నిది నిత్యద్రు. ప్ర. యనియే యప్ప.మతముగా నెన్నవచ్చును. కోడ లైతి అను రీతిస్థలముల నైనను కోడలు ఐతి అను విభాగమె కాని కోడల ఐతి అను విభాగము కాదు. గావున వైకల్పిక ద్రు. ప్ర. యనుటకు వీ లప్ప.మతాన లేదు.

తె. ప్ర. పేర్కొన్నయనిత్యద్రు .ప్ర. లతీరునకు (రాముఁడుడ రాముఁడును) నప్ప. చూపినవైకల్పికద్రు. ప్ర. లతీరునకు (నాకు, నాకున్) స్వరూపమునను భేదము గలదు. కాఁగా తె. ప్ర. నిరూపించిననిత్యానిత్య ద్రు, ప్ర.లవివరమునకు నప్పకవీయమున నెట్టియాధారమును లే దని గుర్తింపవచ్చును.

అందువలననే యప్ప. ద్రు. ప్ర. లను బేర్కొనుచున్నసూత్రమును వ్యాఖ్యానించుసందర్భమున నీసత్యవైకల్పిక ద్రు. ప్ర. లను బ్రస్తావింపనేలేదు అనుజీవితద్రుతాః యే తే నిత్యం ద్రుతప్రకృతయః అను నన్వయమునే యుద్దేశించినపక్షమున నిక్కడనే నిత్యద్రు.ప్ర.లను బ్రస్తావింపవలసియున్నది. సంధిసందర్భమునఁ జేయుటయే యది ప్రయోజనాంతరాపేక్షతోఁ గల్పింపఁబడినదే కాని సూత్రసిద్ధము గా దని స్పష్టము చేయఁజాలుచున్నది.

ఇంకను నస్వాభావికద్రుతాంతము లైన రాముఁడును, అనురీతి వనిత్య ద్రు. ప్ర. లనునర్థమునే యుద్దేశించినయెడలఁ గళాపదములను వివరించుచో 'క్షితిని సముచ్చయ.... ఇత్యాదిగాఁ దత్త్వసక్తి కలిగినప్పు దేని వివరింపఁడా? పైఁగా నిత్యద్రు. ప్ర. లను బేర్కొన్నస్థలమునను వీయస్వాభావికద్రుతాంతముల నేపక్షమునను బేర్కొన్నవాఁడు గాదు. దీనింబట్టి నిత్యం ద్రుతప్రకృతయః అనుసమన్వయము నప్పు. యుద్దేశింపలే దని గుర్తింపవచ్చును. స్థలాంతరమున వికల్పద్రు.ప్ర.లను వివరించుచో నిత్యద్రు.ప్ర.లను వివరించుచో (దానికిఁ బ్రయోజనము లేమి) నున్న 'నిత్య' శబ్దముతో ఘుణాక్షరన్యాయమున సామ్యము నందినది. కాని సూత్రమందలినిత్యశబ్దము నుద్దేశించి యట్లు వివరింపలే దని గమనింపఁదగియున్నది.

ఇంక వైకల్పికద్రు.ప్ర. లనువాని నంగీకరింపవలెనా యని యాలోచింప వలసియున్నది. స్వరపరకతలో ద్రుతాక్షరము లోపింపక నిల్చియుండవలె నను భావముతోనే యప్పు.— (సంధికయి) వైకల్పికద్రుతప్రకృతికములను బేర్కొని యుండెను. హల్పరకత్వమున వీనికి ద్రు.ప్ర.త్వము వికల్ప మగుట ప్రస్తావింపఁబడకుండుటయు గమనార్హము. కానీ సంధిసందర్భమున నైనను ద్రు.ప్ర.త్వము లేకపోవుటను జెప్పుకొనుటకంటె స్వరపరకతలో సంధి యగునపుడు ద్రుతలోపమును జెప్పికొన్న బాగుండెడిది. దానివలన వికల్పద్రు.ప్ర.ల ప్రస్తావన గాని తన్మూలమున నిత్యద్రు.ప్ర.ల ప్రస్తావన గాని యుండెడిదే కా దనవచ్చును. ఇంక ద్రుతాంతము లైనయట్టి వన్నియు ద్రు.ప్ర.లె. అద్రుత మున్నను లోపించినను ద్రు.ప్ర.త్వమునకు భంగము లేదు. అయిన నిది నిత్యం ద్రుతప్రకృతయః అనుచోట నిత్యశబ్దమునకుఁ బ్రయోజనముగా నప్పు. తలఁచినట్లు చెప్ప వీలు లేదు. లోపము గ్గాంచి వలయుపట్లను గనుపట్టునవి ద్రుతప్రకృతు లని చెప్పినచోట ద్రు.ప్ర. త్వనిత్యతను బ్రస్తావింపనేలేదు గదా. అక్కడఁ జూపిన నప్పు.మతానుగుణముగా నిత్యద్రు.ప్ర.లే. కాని నిత్యతను నిట నాతడు పేర్కొనలేదే. దానికిఁ బ్రయోజన మదియే యని యెంచిన నిత్యత నిటఁ బ్రస్తావింపకుండునా? ఇంక నిత్యద్రు.ప్ర.లను బ్రస్తావించినస్థలములలో నీద్రుతము లోపించు

టను గూర్చినప్రస్తావనయే లేదు. అక్కడిసందర్భము ననుసరించి చూడఁగా తాటక నొకకోల, మిథిలలోపల నుద్వాహవిధిని అనురీతి చూపుటలో స్వరపర కత్వమునందు (ద్రుతపరకస్వరమునకు సంధిలే దని) ద్రుతము నిలిచియుండుట, అనఁగా నవి యెప్పుడును ద్రు.ప్ర.లె యైయుండుటయే చెప్పఁదలఁచినట్లు గుర్తింప వచ్చును. అనఁగా నప్ప. నిత్యద్రు.ప్ర.లను జెప్పుటలో ద్రుతము నిలిచియుండు టనె ప్రయోజనముగా నుద్దేశించె ననవచ్చు. సరళాదిపరకత్వములో నయిన ద్రుతమునకు లోప మగును గావున నక్కడ ద్రుతము లేకుండుట యనుదానిం బట్టి నిత్యద్రు.ప్ర.ను వైకల్పికద్రు.ప్ర.గా నిర్ణయింప వీలు లేదు. అట్టియవకాశ మున్నది స్వరపరకతలో మాత్రమె. స్వరపరకతలో ద్రుతాక్షరము లోపము గాక నిలిచియుండవలెను. కాఁబట్టి యక్కడ ద్రుతము కన్పింపకున్న లోపించిన దని చెప్పుటకు వీలు లేదు. కాఁబట్టి పూర్వశబ్దముచివర ద్రుత మసలే లే దనవలె. నా కిచ్చె(నాకు నిచ్చె) అనువానింబట్టి యది వికల్పద్రు.ప్ర. తాటక నొకకోల ననుచో తాట కొకకోల యనురూపము లేదు. కాఁబట్టి యిక్కడ ద్రుత మెప్పుడు నుండుఁ గాన నిది నిత్య ద్రు. ప్ర. కాఁగా నిత్య ద్రు. ప్ర. లనుటలో నప్ప. యుద్దేశించిన ప్రయోజనము వేఱు. అయ్యది తనసంధిప్రణాళిక కనుగుణముగా నప్ప. స్వతంత్రముగాఁ జెప్పుకొనెనే కాని దానికిఁ బిం. లో నాధారములేదు.

'వలసినచో' అనుపదము నప్ప. చూపుటకుఁ బిం.లో నాధారము లే దన నట్టి వీగ్రంథమున నపూర్వ మనియుఁ జెప్ప వీలు లేదు. చిం. సూత్రమును జూపుచునే దానితో సంబంధము లేకుండ స్వతంత్రమార్గములో వివరించుట యప్పకవీయమునఁ బెక్కుస్థలములందు గమనింపవచ్చును. ఉదాహరణమునకు న స్యాత్తద్ధర్మోక్తః అను సూత్రమును జూపి యప్ప. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథమోత్తమాఖ్యపురుష ముల నేకవచనముల్ పోవవిడిచి కడమపదములు తిఙ్మధ్యములు గానఁ గొమ్ము లను బ్రాణసంధులు గూర్చు టొప్పు (౧.౭౫) నని వివరించినాఁడు. ఈపద్యము నకుఁ బిం.సూత్ర మెంతవఱకు మూలమో వేఱ చెప్ప నక్కఱ లేదు గదా. అనాదిషు, చోర్వా మొద లగుసూత్రములవ్యాఖ్యానములోను నప్ప. స్వతంత్ర మార్గము స్పష్టము. సూత్రములు సంధిని జెప్పుచుండఁగా బా. స. యు సంధిగనే

వ్యాఖ్యానించియు నుండఁగా నప్ప. ద్రు. ప్ర. త్వమును బ్రస్తావించు టెట్లు? అప్ప చూచిన చిం. తో పాటు బా. స. కూడ నేటిగ్రంథములకు భిన్నము లగునా ?

అదే తీరుగా నిచట సయితము గూను ఇత్యాదులు ద్రు. ప్ర. లుగా వనుట మొద లగువివరణము సూత్రానుసారము గాఁజేసె ననుట కప్ప. వచనములో నాధారము లేదు. అట్లు చిం.లోని కళాద్రు. ప్ర.లక్షణముల నాధారము చేసికొని తన (సంధి) ప్రణాళిక కనుగుణ మైనమార్గములో స్వతంత్రముగనే 'వలసినచో' అను దళమును వివరణమున నిల్పె నని యెంచఁదగును. దీనికి నాధార మేమియు మూలమున లే దని స్పష్టము.

స్వరపరకతలో ద్రుతమునకు లోపము లే దనియు లోప మైన గ్రామ్య మగు ననియు భావించుటచేత నప్పకవి ద్రు. ప్ర.లకు సంధి యెక్కడను లేదొక్కనలే దని గుర్తింపఁదగును. ఇంకను ద్రు.ప్ర. లకుబ్రాణసంధి లే దనియు నప్ప. నిశ్చయించినట్లు తెలియవచ్చును. అందువలననే ద్రు. ప్ర. ల విషయమున సంధి వికల్ప మనుటకు ద్రు. ప్ర.త్వము వికల్ప మనుటయు సంధి లే దనుటకుఁ దదర్థమున (నిత్య) ద్రు.ప్ర. యగుటను బ్రస్తావించుటయు నప్పకవి వచనములలో గమనింపవచ్చును. ఇంకను, దిజ్మధ్యకములు గాన సంధి, యనురీతిస్థలముల ననుస రించియు నప్ప. కళలకే సంధి యని చెప్పుట స్పష్టము. కాఁగా ద్రు. ప్ర. యైన సంధి లే దనియె యప్ప. సిద్ధాంతము.

అయిన నీయప్ప. మార్గము సరికాదు. స్వరపరకతలో ద్రుతము లోపింప వీలు లేకున్న విశేషముగా లోపమును విధించుకొనుటయే యుచితము. అందుకయి యొకేశబ్దము (వికల్పముగా ద్రు. ప్ర. యగు ననఁగా) ద్రు. ప్ర.యును గళయు నవు నని చెప్పనేల? ఈ వికల్పద్రు. ప్ర.లకు సరళాదిపరకతలో ద్రుతలోప మవసరమా? చూచుచు వచ్చెను. అనుచో నది యెట్లును వైకల్పిక ద్రు. ప్ర. యగుటచే ద్రుతాంతము గావిశబ్దమునే స్వీకరింపనవును. అపుడు ద్రుతము లోపించుప్రసక్తి లేదు. ద్రు. ప్ర.త్వమును బహుషపరకస్థలమును నిర్ణయింపఁగలదు. చూచుచు పోయెను అనురీతిరూపము లుండునా? వైకల్పిక

ద్రు. ప్ర. లన్నవు దీట్టిరూపములకు నవకాశము గల్గుచున్నది. కాఁగా స్వరపర కతలో మాత్రమె వైకల్పిక ద్రు. ప్ర. యగు ననియు సంధికయి ద్రు. ప్ర. కళ యవు ననియుఁ జెప్పుట యనవసరము. ఒకేశబ్దము కళయు ద్రు. ప్ర. యు నవు ననుటలో నిబ్బందులు స్పష్టమే. కావున భాషలో నప్ప. చెప్పినతీరులో వైకల్పిక ద్రు. ప్ర. ల నంగీకరింపఁ బని లేదు.

వజ్ఝలవారు అప్ప. చెప్పినదానికంటె భిన్నస్థలములలోఁ గొన్నియెడల ఒకే శబ్దము ద్రుతప్రకృతికమును గళయు గావుట యన్నది యసంభవము కా దన్నారు. అనఁగా నివి వైకల్పిక ద్రు. ప్ర. లనియే చెప్పనవును. కాని వారే యాపిదప నటువంటిస్థితి లక్షణవిరుద్ధ మని నిరూపించి యంతకు ముందు వైకల్పిక ద్రు. ప్ర. లని తాము భావించినవాని ద్వైరూప్యమును మార్గాంతరమున సమన్వయించిరి, ఈ విషయము విపులముగాఁ 'పరుషపరకద్రుతలోపము'లో స్పష్టము (చూ ద్రు. కా.)

కాఁగా వైకల్పిక ద్రు. ప్ర. లన్నవి యప్ప. చెప్పిన చోట్లనే కాక యితరస్థలములందును భాషయం దసలు లే వని సారాంశమైనది.

మొత్తము మీఁదఁ బ్రకృతిసిద్ధ మైనద్రుతము గలిగినవే ద్రు. ప్ర.లు. ఇతరాలు ద్రుతాంతాలే కాని ద్రు. ప్ర.లు గా వని కాని, యస్వాభావికద్రుతాంతా లనిత్య ద్రు. ప్ర. లని కాని బా. స. ప్రభృతివ్యాఖ్యాత లూహింప లేదని స్పష్టము.

ఇట సందర్భమునుబట్టి యొకవిషయాంతరము.

అప్ప. యనుసరించిన యీ సంధిప్రణాళిక కొంతవఱకు సూరికి మార్గ దర్శక మైయున్నట్లు, చెప్పవచ్చు. అప్ప. ద్రుతస్వత్వమును 'ను,ని' వర్ణము లుగాఁ జూపుట స్పష్టము. హల్పరకతలోను నవసానమునను సస్వర మయి యుండఁగా స్వరపరకతలో నట్ల యుండవలదా ? స్వరపరకతలో ద్రుతాక్షరము లోపింపక నిల్చియుండును గదా. భరియించెను + ఉపేంద్రుఁడు, భరియించె నుపేంద్రుఁ డని యె ట్లగును ? భరియించెను అనుచోట ద్రుతమున నున్నస్వరము

నకు లోపము చేసి నకారమును మీఁదియచ్చుతోఁ గలుపఁగా నారూప మేర్పడును ? అప్ప. 'పూర్వపదాంతహల్లుతోడఁ గూడినట్టిస్వరము లోపముగ నొనర్చి యాపొల్లుతో మీఁదియక్షరంబు గూర్ప నయ్యె సంధి (5-37) యని పేర్కొన్న సంధి స్వరూపము ననుసరించి పైవి సంధి యైనరూపములుగాఁ జెప్పవచ్చును. ఒప్పగు, పేరెద యనురీతి (5-54) సంధి యైనస్థలములవంటిదే గదా భరియించె నుపేంద్రుఁ డనునది కూడ. కాన దీవించి రఁట, ఏలితి వఁట మొద లైనవానిని సంధి యయిన రూపాలుగాఁ జూపుచున్న యప్ప. భరియించె నుపేంద్రుఁ డనుదానిని సంధి యయినరూపముగనే చెప్పవలెను గదా.

కాని 'ఉత్తమపురుషైకవచనమునను దక్క....సంధులు ఘటించు (5-81) నని యుత్తమపురుషైకవచనమునకు సంధి లే దని చెప్పెను. (5-82). పద్యము నీవిషయమునే స్పష్టము చేయుచున్నది.) బ్రదికితి ననఁగన్ భరియించె నుపేంద్రుఁ దనునవి సంధి రానిరూపము లన్న మాట. ఇట్లు చెప్పుటను సూరి యనుసరించెను. ద్రు.ప్ర.లవిషయమున సంధి యనఁగా ద్రుతపరకస్వరమున కనియు (ద్రుతప్య వధాసమువల్ల ద్రుతపరక స్వరమునకు సంధి వచ్చుటకు వీలులేదు గాఁబట్టి?) ద్రు.ప్ర. యైన నందు సంధి లే దని యప్ప. మతములో సారాంశముగా గ్రహింపవచ్చును. వికల్పముగా ద్రు.ప్ర. లవును మొద లగురీతిసందర్భములందు నప్ప. యభిప్రాయ మిదియే. అప్ప. వలెనె సూరి ద్రుతమును సస్వరముగ భావించియును ఉండెడి నతఁడు మొద లైనవి సంధి రానిరూపము లనుటయు, ఇఁకొదులకుఁ దప్ప ద్రుతప్రకృతి కములకు సంధి లే దనుచోట ద్రు.ప్ర.లయెడ సంధి యనఁగా నది ద్రుతపరక స్వరమునకె యని స్పష్టము చేయుటయు గమనింపవచ్చును. అనఁగా నప్ప. యభి ప్రాయసారమునే సూరి యించుమించుగా ననుసరించె నని గుర్తింపవచ్చును.

అప్ప. వీనిని విభాగించి చూపలేదు గాని భరియించెను + ఉపేంద్రుఁ డని (హల్పరకతయందువలె) ద్రుతమును సస్వరముగాఁ జూపఁదలఁచిన నది సంధి యైనరూప మని యాతనివివరణమునుబట్టియె చెప్పవలసియుండె. అది సంధి కాని

రూప మని చెప్పుటనుబట్టి ధరియించెన్ + ఉపేంద్రుఁ డని స్వరపరకతలో ద్రుతము పొల్లుగామాత్రమే నిల్చు నని యెంచె నన నవకాశము గలదు. సూరి యిట్లు స్పష్టముగాఁ జూపెను. నన్నున్ (ను) + అడిగి, హరికిన్(ని) + ఇచ్చె ఉండెడిన్(వి) + అతఁ డని ద్రుతమును స్వరరహితముగనె చూపె. పూచెను + కలువ లనురీతి హల్పరకతలో ద్రుతము సస్వరముగనె చూపె. కాఁగా సూరి స్వరపరకతలో ద్రుతస్వరలోపమును స్పష్టముగా బాల. లోఁ జెప్పకున్నను నది తదభిమత మని స్పష్టము. అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబున కేని ననుసూత్రమందలిబహుళపదముచే స్వరపరకతలో ద్రుతస్వరలోపము ప్రాయిక మని (అదియును ని ట్లనియె) గ్రహింపవచ్చును. స్వరపరకతలో ద్రుతము స్వరరహితమై యుండుటను నిర్ణయించుటలోను సూరిమత మప్పం మతానుగుణమ యనఁదగును.

అయినను సూరి సంధి యవుసందర్భమున నవ్వానియందు ద్రు. ప్ర. త్వాభావమును జెప్పక సంధివిధానసామర్థ్యముచేతనె ద్రుతలోపమును సాధించుట యుచితముగ నున్నది. అప్ప.కవియు నదేమార్గము నెన్నిన బాగుండెడిది.

కళలద్రుతప్రకృతికత్వము :

ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికము లను సూరిలక్షణముసుబట్టి ద్రుతాంతము లైనకళలు ద్రు.ప్ర.లే. అయ్యున్ ఎంతయున్ అని సూరి యటఁ జూపిన లక్ష్యము లాయంశమును స్పష్టము చేయుచున్నవి. మఱి చిం.మతము తద్భిన్న మన నాధార మున్నదా ?

అన్యే ద్రుతప్రకృతయో యే ష్వ ర్థానుజీవితద్రుతా నిత్య మ్మను చిం. లక్షణమున అన్యే అనుజీవితద్రుతాః (నిత్యమ్) అన్నవి ద్రు.ప్ర.లను నిర్ణయించు నవి. తిఙ్మధ్యశేషషష్ఠీ ఇత్యాదిగాఁ గళలను నిరూపించి యేషాం ద్రుతో న స్యా త్తా వి చివర ద్రుతము లేకుండుట యన్నది కళాపదలక్షణముగా నిరూపించినట్లుగా నిక్కడ అన్యే ద్రుతప్రకృతయః అని తద్భిన్నము లన్నియు ద్రు.ప్ర. లని

చెప్పుచు యే స్వర్ణానుజీవితద్రుతా నిత్యమ్మని ద్రు. ప్ర. లక్షణమును వర్ణించె. అనఁగాఁ జివర ద్రుతముతో కుంట కళాలక్షణము కాఁగాఁ జివర ద్రుతముండుట ద్రు. ప్ర. లక్షణముగా గుర్తింపనగును. అనఁగాఁ జిన్నయమతము ననుసరించి రాముఁడును అనురీతి ద్రుతాంతములును జిం.లోను ద్రు.ప్ర. లనకతప్పదు.

అన్యే అనుచిం.శబ్దముచే నేవి గ్రహింపవలె? పూర్వసూత్రము ద్రుతము పేనికిఁ జివర లేదో యాతిజ్మధ్యాదులు కళ లనుచున్నది. కాఁగాఁ దద్భిన్నము లన్యములు. అనఁగా ద్రుతము లేని తిజ్యధ్యాదులకంటె నితరములు' అవి తిజ్మధ్యాదిభిన్నములు, ద్రుతాంతాలైనతిజ్మధ్యము లనురెండును. ఇంతకు ముందు కళలుగాఁ బరిగణింపఁబడిన వన్నియుఁ గాకున్నను జాలశబ్దము లర్థవిశేషాదులలో ద్రుతము చేయుటద్వారాన ద్రుతాంతము లగుచున్నవి. తిజ్మధ్య-వినఁడును, శేషషష్ఠి-దుష్మఖునియును, సుస్-రాములును, కర్మప్రవచనీయజవిభక్తిః-హరింగూర్చియును, కించిత్-ఇంచుకయును యదా - ఎప్పుడును, తదా - అప్పుడును' కిమ్-ఏమియును, క్త్వా-అయ్యును, లేకను, మెం. ద్రుతాంతము లవుచున్నవి ప్రశంసోద్భూతసంతాపవ్యేవ కిల తూష్ణీమాద్యర్థకాలు కొన్ని ద్రుతాంతము లవుటగానరాదు. తిజ్మధ్యాదులు ద్రుతాంతములైనఁ (ద్రుతాంతములు) కావి తిజ్మధ్యాదులే కళ లనుటచేతఁ గళలలోఁ జేరవు కాఁబట్టి యిచ్చోటితిజ్మధ్యశబ్దముచేతఁ బరిగ్రహింపఁబడి ద్రు. ప్ర. లే కావలసియున్నవి.

ఇట్లు ద్రుతాంతములైనకళలును నన్యశబ్దముచేఁ బరిగ్రహింపఁబడి అన్యే ద్రుతప్రకృతయ యనుదానిచేతనే ద్రు.ప్ర. లవుచుండఁగా ప్రకృతిసిద్ధ ద్రుతాంతములే ద్రు. ప్ర. లని చెప్పు టెట్లు గుదురును?

దీనిని నిర్ణయింపవలసినది సూత్రమునందలి అనుజీవితద్రుతాః అనునది దీనియర్థ మేమి? ఇట తె. ప్ర. అనుజీవితశబ్దమునకు స్వాభావిక మని యర్థము చేసి అనుజీవితః ద్రుతః యేషాం తే నిత్యం ద్రుతప్రకృతయః అనునన్వయముతో

స్వాభావికద్రుతాంతాలు నిత్యద్రు. ప్ర. లనియు నస్వాభావికద్రుతాంతాలు

(రాముఁడును) అనురీతివి అనిత్య ద్రు. ప్ర. లనియుఁ జెప్పొన్నది.

నిత్యద్రుతప్రకృతికాలవిషయమున నిత్యశబ్దమునకుఁ గల ప్రయోజన మస్వాభావికద్రుతాంతములయెడను గలదు గావున నిత్యానిత్యవిభేదకల్పనము వలనఁ బ్రయోజనము లేమి యింతకు ముందు స్పష్టము. ఇట్టిభేద మేర్పడుటకుఁ గారణ మనుజీవితశబ్దమునకు స్వాభావిక మని యర్థము చేయుటయే యని గ్రహింప వచ్చును. కాని యనుజీవితశబ్దమునకు స్వాభావిక మని యర్థము చేయుటకుఁ దగినయాధారము గానరాలేదు. చిం.వ్యాఖ్యాత లందఱు ననుజీవితశబ్దమునకు ననుసృత మనియే యర్థము చేసిరి. అనుసరించి జీవించి యుండునది, అనుసరించి యుండునది, ఆశ్రితము, ఉన్నది, విద్యమానము అని దీనియర్థమును గుర్తింపఁ దగు. (ఆశ్రిత మని నిఘంటువులు చూపుచున్నవి.) కాఁగా నేశబ్దములు (అనుసరించి) ఉన్నద్రుతము గలవో యవి ద్రు, ప్ర. లని యర్థ మగుచున్నది. ద్రుతోవ యేషాం స్యా త్తని కళలను వర్ణించినస్థలమునవలెనె యిచ్చట యేషాం ద్రుతః స్యా త్తను నర్థమునవే అనుజీవితద్రుతాః అని చెప్పె ననుటనక్రమము నై యుండును.

ద్రుతము కలవి ద్రు. ప్ర. లని యర్థము గల్గగా నాద్రుతము స్వాభావికమా? అస్వాభావికమా యను వివక్ష లేదు. ఎట్టి దైనను ద్రుత మున్నఁ జాలు నయ్యది ద్రు. ప్ర. యే యగును. అనఁగా ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికము లను సూరియభిప్రాయమే యిటఁ జిం.లోను గల దని గుర్తింపవవును.

అట్టియపుడు ద్రుతము లేనివి కళ లన్నట్లుగా ద్రుతము కలవి ద్రు. ప్ర. లనినఁ జాలును గదా. సూత్రములో నిత్యశబ్ద మేల? అని సందేహము. దీనికి విశేష మైనప్రయోజనము గానరాదు. వ్యాఖ్యాతలు తుదిద్రుతము లోపించి నను నయ్యవి ద్రు. ప్ర. లే యవు నని పేర్కొనిరి.

నిత్యపదము లే దనుకొందము. రామునియందు భక్తుఁడ అనుచోట ద్రుతము లోపించినది. దీనఁ జివర ద్రుతము కనిపింపని మాత్రమున నివి కళ లవు నన

వలెనా? (ద్రుతము లేని) తిఙ్మధ్యాదులాగివా కళలు. రామునియందు అనునది తిఙ్మధ్యాదులలోఁ జేరునా? కాఁబట్టి కళ యనరాదు. భక్తుఁడను అన్నది ప్రథమాంతము. చివరిద్రుతము లోపించినది కాన ద్రుతము లేనియీప్రథమాంతము కళ యగునా? చివర ద్రుత మున్నవి ద్రు.ప్ర. లనఁగాఁ (ఉన్న ద్రుతము లోపించుట మూలమున) జివర ద్రుతము లేనివి ద్రు. ప్ర. లవునా? అట్టియనుమానము వారించుటకుఁ జివర నున్నద్రుత మున్నను లోపించి లేకున్నను నది ద్రు.ప్ర.యే యవు నని స్పష్టము చేయుట నిత్యశబ్దమునకుఁ బ్రయోజన మనవచ్చు. అనఁగా దానిఁ బ్రయోజనము స్పష్టతయే యన్నమాట.

అనఁగా ద్రుతము లోపించినను నయ్యవి ద్రు.ప్ర.లు గాకుండు నని గాని లేదా కళ లవు నని గాని భావింపరా దనియుఁ గళేతరము లైనశబ్దము లనఁగాఁ దిఙ్మధ్యాదిభిన్నములును ద్రుతాంతము లైనతిఙ్మధ్యాదులు నెప్పుడును ద్రు.ప్ర.లే యవు నని స్పష్టతకయి నిత్య మ్మని చెప్పఁబడిన దనవలె.

అన్యే ద్రుతప్రకృతయ యనుదాని కనుగుణముగనె చిన్నయ ద్రుతాంతము లైనపదములు ద్రు.ప్ర. లని చెప్పెఁ గాని నిత్యశబ్దమును జేర్పలేదు. అయినను వచ్చె అయ్యె అనురీతివి ద్రుతము లోపించిన పైనను ద్రు.ప్ర.లు గాకపోయినవా? సూరిమతాన నివి కళ లందుమా? ఇదే విధముగాఁ జిం.లోను గుర్తింపవచ్చుఁ గదా. కావునఁ బై ప్రయోజనము నుద్దేశించుట యనగాఁ జిం. నిత్యశబ్దమును బ్రయోగించుట స్పష్టతకుమాత్రమే యని చెప్పక తప్పదు.

కాఁగా నిత్య మనుజీవితద్రుతాః ద్రుతప్రకృతయః అను నన్వయమునను అనుజీవితద్రుతాః నిత్యం ద్రుతప్రకృతయః అన్నను నిత్యశబ్దము స్పష్టతకు మాత్రమె యనవలసి యున్నది. నిత్యం ద్రుతప్రకృతయః అని యన్వయించిన తె.ప్ర. కూడ నిత్యశబ్దమునకు నహోబలాదులవలెనె ప్రయోజనమును వివరించి నది గదా.

పేటిక కళలు గానివాని కెల్ల నిత్యముగా నకారము వచ్చు నిత్య ననుజీవితాః) నన్నది కళలు కాని వనియు నిత్యముగా నకార మగు ననియుఁ జెప్పుటచే రాముఁడును అనురీతినుబద్ధాంతాలు ద్రు.ప్ర.లు కా వనవలె. వీనియెడ ద్రుతము చేరుటవలన నివి ద్రు.ప్ర. లైన వనవలెఁ గాని కళలు గామి ద్రు.ప్ర. లగుటచే నిత్యముగా ద్రుతము చేరి (రామునిన్ అనురీతివానివలె) రాముఁడున్ అను ద్రు.ప్ర. లైన దనవీలు లేదు గదా. అనఁగాఁ బేటిక ననుసరించి కళలు (ద్రుతాంతము లయి) ద్రు.ప్ర. లగుటకు వీలు లేదు. పేటిక ద్రుతాంతము లగుతిజ్మధ్యాదులనుగూర్చి ప్రస్తావింపక పోవుటచే నివి (రాముఁడున్, భక్తుఁడన్) మొ॥ యే మగునో పేటికాభిప్రాయము నిశ్చయముగా గుర్తింప వీలు లేకున్నది. ఇంకను రాముని నిత్యాదులలో నూరి ద్రుతమును నిత్యముగనె విధించినను నవి ద్రుతాంతములే కాని, ద్రు.ప్ర.లు కా వనుచున్న దీపేటిక.

నిత్య మనుజీవితద్రుతాః అనుచోఁ జిం.సూఱ నిట్లు భావించిన దన్న కళలకు (ద్రుతాంతతలో నైనను) ద్రు.ప్ర.త్వము సిద్ధింపదు. అటఁ దిజ్మధ్యాదులపై ద్రుతము చేరుట యున్నను నిత్యముగా (రామునిన్ అనురీతివానియందువలె) నుండదు గదా, రాముఁడున్ అనుచో అర్థవిశేషము(ఉన్నను)లేకున్న రాముడు అని ద్రుతాంతము కాని రూపముండుఁ గాని రామునిన్ ఇత్యాదితిజ్మధ్యాదీతరములకు ద్రుతము లేనిరూప ముండదు గదా.

నిత్య మనుజీవితద్రుతాః అనుసృతాంతనకారాః స్యుర్ద్విభవేయుర్వా (కవిశి.255) యహో. వివరించెను. అయిన నహో. ద్రుతాంతము లైనకళలు ద్రు.ప్ర.లగు ననియే భావించెను.

ప్రథమాంతములు కళ లయ్యును ద్రుతాంతము లగుచోఁ బ్రథమాంతములును ద్రు.ప్ర.లే యగు నని యహో. యెంచుట తాన్, నేన్‌ల ద్రు.ప్ర. త్వ నిరూపణమున స్పష్టము. న చ తత్ర పదుషేషు వికల్పోఽభిమతః తాను సెప్పె నిత్యాది రూపస్య ప్రయోగాభావా (కవిశి. 478) త్తనుచోఁ దాను సెప్పె ననురీతిని లే వనుట నంగీ

కరించెను. అందువలననె తాఁ జెప్పె నిత్యాదా వ్యవస్థితవిభాషా సమాశ్రితా యని మొదలుగాఁ జెప్పుటలో తానునేనుల నుల్లోపము నిత్యముగ సాధించెను. అనఁగా నిత్యముగా నుత్తు లోపించినఁ దాఁజెప్పె నని ద్రుతకార్యముల యగు. ఉల్లోపము లేనిపక్షమునఁ దాను చెప్పె నని సాదేశము (గసడదవాదేశము) రావలె. అనఁగా నుత్తు లోపించిన నది ద్రు.ప్ర. యే యగును. ఉల్లోపము లేకున్న ద్రు.ప్ర. కాదు. (కళ యగు నన్నమాట) ప్రథమాంతతచే మీఁదిపరుషములకు గసడదవలు వచ్చును. దీనింబట్టి కళ లయ్యును ద్రుతాంతము లగుచో ద్రు.ప్ర.లే యవు నని యహో. సిద్ధాంతము స్పష్ట మగుచున్నది.

పరుషపరకతలో నుల్లోపమున వికల్పత యనభిమత మని సరళస్థిరావసాన పరకతలో వికల్పత యభిమత మనవలె. అట్టియప్పు డుల్లోప మైన తాన్ ఘనుఁడు, నుల్లోపమె లేకున్నను తాను ఘనుఁడు నని యవు. ఇంక వాత్మాస్మదోర్ద్రుతస్య స్యా ల్లుక్కాని లోపము వికల్పముగాఁ జెప్పనేల? నిత్యమే యనవచ్చుఁ గదా. ద్రు.ప్ర.త్వపక్షమున తాన్ ఘనుఁ డనుచో ద్రుతము నిత్యముగా లోపించి తా ఘనుఁ డని యగు. ఇట సంశ్లేషము లే దని యహో. కూడ స్పష్టము చేసెఁ గదా. ద్రు.ప్ర.త్వాభావపక్షమున (ఉల్లోపము లేకున్న ద్రు.ప్ర. కాదని పైని గమనించితిమి కదా) తాను ఘనుఁ డని యుండు. కాన వైకల్పికలోపవిధానమును వినా ద్వితీయ సూత్రము వి.వి. లక్షణమును వ్యర్థముల యగు. అహో. చెప్పినట్లు పరుషపరకత్వమునఁ దాను చెప్పె నని కాని (కవిశి. 331) తాను చెప్పె నని కాని (కవిశి. 479) యుండకపోవచ్చు. కాని తాను అనురూపమె యుండదా? అపుడు తాను జెప్పె నని యే నుండ వలదా? ఉల్లోపప్రసంగ మనవసర మని చెప్పఁదగును.

స్థలాంతరమున కించ సువర్ణకేఽప్యుల్లోపే ద్రుతప్రకృతికత్వం సిద్ధ్యతి తేన కళాసంజ్ఞికానాం సర్వేషా ముదంతానాం విశేషార్థే విహితేన సువర్ణకేన ద్రుతప్రకృతికత్వం సిద్ధమ్ అనుతాం యువర్ణాన్తత్వ మేవ తదుపరి సువర్ణక ఇతి వివేకః (కవిశి. 332)అని యుదంతానుదంతము లగుకళాశబ్దము లెల్ల సముచ్చయాద్యర్థవిశేషములం దగుసువర్ణకముచే ద్రు.ప్ర. లగుటను స్పష్టము చేసె.

అయినఁ దాన్,నేన్,అనుకౌనియు సీనువర్ణకాంతములయు ద్రు.ప్ర.త్వము రామునిన్ అనురీతివానివలె సాధారణముగాఁ జెప్పలే దనియు వీనిద్రు.ప్ర.త్వ మాయావిదులచే జ్ఞాపిత మవుట విశేషస్థలము లనియుఁ జెప్పనవునా? అనఁగా వాత్మా స్మదోః వినా ద్వితీయ ష్మనురీతివానిచేఁ దాన్నేన్లయందును నోరన్యస్యాపి యను దానిచే సీనువర్ణకాంతములయు ద్రు.ప్ర.త్వము జ్ఞాపకము చేసెఁ గావున నివి యన్యే యనుసూత్రముచే గుర్తింపఁబడుద్రు.ప్ర.లు గా వనియు నన్యే సూత్రముచేఁ బేటికి చెప్పినట్లుగా నిత్యముగా ద్రుతము చేరుతిజ్మధ్యాదిభిన్నములె గుర్తింపవలె నన్ని యహో.కూడ నెంచె ననియుఁజెప్పవలె ననఁదగునా? అన్న నది కుదురదు. అపిశబ్దార్థ స్యేత యనుసూత్రము వ్యర్థము కాకుండుటకై యటఁ జెప్పినయిల్లోపమునకు ప్రయోజనము రామునే సీతనేఁగొల్తు ననురీతివానిసిద్ధియని యహో.పేర్కొనె అనఁగా నిల్లోపమువలన నట ద్రు.ప్ర.త్వము సిద్ధమైనదన్నమాట. ఇటద్రుతకార్యవిధానము లచేఁ దత్సిద్ధికై (ద్రుతము పొల్లనకార మని యెంచెఁ గాన) స్వరలోపము వచ్చుటయె యుద్దేశించెఁ గాని ద్రు.ప్ర.త్వము కల్గుట గాదు. అట్ల యయిన నిల్లోపమాత్రముచే ఏనిశబ్దమునకు ద్రు.ప్ర.త్వ మెట్లు గల్గును? కాఁగాఁ దిజ్మధ్యాదుల యైనను బొల్లనకార మున్న నది ద్రు.ప్ర.యే. అనఁగా ద్రుతాంతము లైనచోఁ దిజ్మధ్యాదులు(కళలు?) ద్రు.ప్ర.లే యగు నని యహో. తలఁచె ననుట తప్పదు.

మఱి వీనియందు ద్రుతాంతత నిత్యమా? నిత్యముగా నకార మనుసరించి యుండునా?

అహో. నిత్య మనుజీవితద్రుతాః అనుస్పృతాంతనకారాః భవేయుః అనుటనే పేటిక కళలు గాని వాని కెల్ల నకారము నిత్యముగాఁ జేరు నని భావించియుండును. వయియహో. సిద్ధాంతమునుబట్టి యహో.మత మది గా దని తోఁచుచున్నది. ఏశబ్ద ములు నిత్యముగా ననుసరించి యుండునకారముగలవో యట్టికళేతరములు ద్రు.ప్ర. లని యహో.యభిప్రాయ మనఁదగు. దీనివలన రామునిన్ అనురీతివె కాక రాముఁ డున్ అనురీతివి గూడ ద్రు.ప్ర. లగునవకాశ మేర్పడుచున్నది. ద్రుతాంతము లగు తిజ్మధ్యాదులును ద్రు.ప్ర.లే యనుచోఁ గళలకు నిత్యముగా ద్రుతము చేర నక్కఱ లేదు. ఇంకను నహో.యర్థవిశేష మున్నపుడు నువర్ణకము రాకుండుటను వఘ్నలవారి

వలెఁ బ్రస్తావింపకుండుటయు కోడలైతి ననురీతివియు నసాధువులే యని యెంచుటయు గమనార్హము. కళలపై ద్రుతము నిత్యముగాఁ జేరదు కాని చేరునపుడుమాత్ర మది నిత్యముగనె యుండు నని యహో. తలఁచె నన్నమాట. కాఁగా శాస్త్రమహిమ్నా లోపాదేశప్రాప్తావప్యాదౌ ద్రుతాంతత్వేన స్థితిరితి ప్రసిద్ధేతి తాత్పర్య (కవిశి. 250) మని శాస్త్రమహిమచే లోపాదేశములు ప్రాప్తించినను నంతకుముందు ద్రుతము తప్పకుండుటయే నిత్యశబ్దప్రయోజనముగాఁ జెప్పుట కుదురుపడుచు అయ్యున్ ఎంతయున్ అన్నవి ద్రు.ప్ర.లుగాఁ జూపిన సూరిమత మహోబలుఁడు నుద్దేశించె నని తేలును.

మొత్తముమీఁదఁ గళలును ద్రుతాంతము లగుచో ద్రు.ప్ర.లే యగు ననుట యహోబలాదులఁ బేర్కొని రని స్పష్ట మగుచున్నది.

ఏ మైనను ద్రుత మంతమందుఁ గలవి ద్రు.ప్ర.లను టుచితము. కాని నిత్యముగా ద్రుతము గలవి ద్రు.ప్ర. లనుట యవసరమా? అతిమానుష మత్యద్భుతము కోడలైతి ననురీతి వాని నంగీకరించి యట ద్రుతము చేరమి నొప్పికొనవలెను. అయ్యును ద్రుతము చేరనియప్పుడమున నవి కళలే యగుఁ గాని ద్రు.ప్ర.లు గావు గదా. కాన నిత్యముగా ద్రుతము గలవి ద్రు.ప్ర. లనుటలో ననర్థము లేకపోవచ్చుఁ గాని నిత్య మనకున్న నిబ్బంది లేమి స్పష్టము.

పైఁగా నిత్య మనకుంటయె యుచిత మనఁదగు. నిత్య మ్మన్నను శాస్త్రమహిమచే దానికి లోపాదేశములు వచ్చుచునే యున్నవి గదా. వచ్చె గోవులు, పూచెం గలువ లనురీతి ద్రుత మెప్పుడును ద్రుతప్రకృతి ననుసరించియున్నదా? లోపించుటయో బింద్వాదులు నందుటయో మూలమున ద్రుత మట్లు నిలిచియుంట లేదు గదా, అట్టియెడల ద్రుతము నిత్యముగా నుండు ననుటెట్లు? అందులకె లోపాదులు గల్గినను నారంభావస్థలో ద్రుత ముండు నని వ్యాఖ్యాతలు చెప్పుకొనిరి. కాని మొదట నున్నను బిదపఁ నిలువనిదానింగూర్చి నిత్య మనె ననుట విశ్వసనీయము గాకున్నది. ఇంక నిత్యశబ్దము వలన నట్టిలోపాదులు ప్రాప్తించినను గలుగక

ద్రుత మట్లు నిల్చియుండు ననవలె. అప్పుడా ద్రుతకార్యవిధానములె వ్యర్థము లగు.


నిత్యశబ్దమునకు నహో.(బా.స.ననుసరించి) చెప్పిన ప్రయోజనము సాధింపుట లేని నిత్యమనుజీవితద్రుతాః ద్రుతప్రకృతయః అని బా.స.ప్రభృతులు చేసిన యన్వయముకంటె అనుజీవితద్రుతాః నిత్యం ద్రుతప్రకృతయః అని తె.ప్ర. చూపిన సమన్వయమె సముచితముగా నున్న దనవచ్చును. నిత్యం ద్రుతప్రకృతయః అనుటలో (నిత్యద్రు.ప్ర.లు) ననిత్య ద్రు.ప్ర, లనుచు వేఱొకవర్గము వంగీకరింపరాదు. అనుజీవితశబ్దమునకు తె.ప్ర.వలె స్వాభావిక మని కాక విద్యమాన మని యర్థము గ్రహింపవలయును. కావున (నెట్టి దైనను) ద్రుతము తుదిని గల వెల్ల ద్రు.ప్ర.లె. అవి ద్రు.ప్ర. లగుట నిత్యమె. అనఁగా శాస్త్రమహిమచే లోపాదేశముల నందినను నాశబ్దము ద్రు.ప్ర. యగుట నిత్యమె యను మాట. ఏపక్షమం దైనను నిత్యశబ్దము స్పష్టార్థకె యని మొదటనె యనుకొంటిమి. కాఁగా బా.స. ప్రభృతు లుద్దేశించిన ప్రయోజనమును వారియన్వయమునఁ గాక తె.ప్ర. చేసినసమన్వయములోనె బాగుగాఁ గుదురుచున్న దని మాత్రమె యిట గమనింపఁదగును. ద్రుత ముంట గాక ద్రు.ప్ర.లకు ద్రు.ప్ర.సంజ్ఞ యుంట నిత్య మని యీయన్వయమునఁ జెప్పఁబడుటచే లోపాదికార్యము లందినను ద్రుత మట్లు నిలువకున్నను ద్రు.ప్ర, సంజ్ఞయుంట సముచితమె యగుట నీసమన్వయమున నింకొకయిబ్బంది యుఁ దొలఁగుచున్నది గదా.

కశేతరములకు ద్రుతము నిత్యముగాఁ జేరు ననుటకంటె ద్రు.ప్ర.ల ద్రుతము నిత్యముగా నుండు ననుటకంటె లేదా నిత్యముగా ద్రుత ముండునవి ద్రు.ప్ర.లగు ననుటకంటె ద్రుతము గలవి నిత్యద్రు.ప్ర.లగు ననుట కొంత తేని సమంజసము గదా. పిదప లోపాదు లైనను నాద్యవస్థయందు ద్రుత ముండుట యన్నది ద్రు.ప్ర, లక్షణముగా నహో. చేసినవివరణము ద్రుతము గలవి నిత్య ద్రు.ప్ర.లను తె.ప్ర.చేసినసమన్వయమునఁ గుదురుపడినట్లు నిత్యముగా ద్రుతము గలవి ద్రు.ప్ర.లను నహో. యన్వయమునఁ గుదురుపడమి తె.ప్ర.సమన్వయమె

యిప్పక్షమున నంగీకార్య మైయున్న దని సారాంశము. తిజ్మధ్యాదిభిన్నములకు ద్రుతాంతము లగుతిజ్మధ్యాదులకు ద్రు.ప్ర.త్వము నిత్యము గాఁగా నాద్రుతము నిత్యముగా నుండవలసినయవసరము లేమి అనుజీవితద్రుతాః నిత్యం ద్రుత ప్రకృతయః యను తె.ప్ర.సమన్వయములోనివిశేషము.

ఈపక్షమునను గళలు ద్రుతాంతములు గాఁగా వానికి ద్రు.ప్ర.సంజ్ఞ సిద్ధించుటలో నిత్యశబ్ద మెంతమాత్రము నర్థము గాకుండును.

సా.త్రి.శ. కళలతోపాటు సంకీర్ణములను బేర్కొన్నది. సంకీర్ణము లనఁగా ద్రుతాంతత గల్గుటయు లేకుంటయుఁగల్గినవి. అనఁగా ద్రుత మసలు లేనివి కొన్ని (కళలు)ద్రుతము పాక్షికముగా నుండునవి కొన్ని (సంకీర్ణములు)గలవు గావునఁ దద్భిన్నములుగా ద్రు.ప్ర.లను నిరూపించునపుడు ద్రుతినో నిత్య మ్మని నిత్యముగా ద్రుత ముండునవే ద్రు.ప్ర. లని చెప్పుచో నిత్యశబ్ద మవసర మయినది. చిం. లో నేలః కాని అం.కౌ.(సం).సంకీర్ణములను బరిహరించి కళాద్రు.ప్ర.లను రెంటినే పేర్కొనుచుఁ గూడ ద్రుతినో నిత్య మ్మని సా.త్రి.శ.లోవలె నిత్యశబ్దమును బ్రయోగించియున్నది. చిం.లో నట్ల యనవచ్చును.

యే నిత్య మనుజీవితద్రుతాః తే ద్రుతప్రకృతికసంజ్ఞాస్స్యుః అనురీతిగా సా.త్రి.శ. లో నుంట ననుసరించి చూచిన అనుజీవితద్రుతాః నిత్యం ద్రుతప్రకృతయః అనుతె.ప్ర. అన్వయము తత్కర్తచే నుద్దిష్టము కాలే దని తోఁచును. సా.త్రి. శ.లో 'నన్నయభట్టారకచింతామణి' సమాత్రముగఁ బెక్కుచోట్లఁ బ్రస్తావింపఁబడియుంట దానింబట్టి దీనియర్థ మూహింపరాదు. ఇంక నీసూత్రమునభిప్రాయమును సా.త్రి.శ.కర్తయును బా.స. ప్రభృతులవలెనె యెంచె ననవలెను.

కళలు గాని వెల్ల నెప్పుడు ద్రుత మంతమందుఁ గలిగి ద్రు.ప్ర.లే యగుఁ గాని ద్రుత ముండుట లేమి గలిగి సంకీర్ణము లగుట లేనే లే దని సంకీర్ణములను దిరస్కరించునుద్దేశముతో నిత్య మ్మని చిం. పేర్కొన్నదా? సా.త్రి.శలోఁ జిం. ప్రస్తుతి గానవచ్చుటంబట్టి చిం. యాధునిక మన్నను నర్వాణని త్రి.శ.లోఁ

గానవచ్చుసంకీర్ణములప్రస్తావనమె చిం.లోఁ దిరస్కరింపఁబడినదనవలసియుండె. ఏ మైనను నీవిషయమున త్రి.శ.,సా.త్రి.శ. మొదలగువానికిఁ గలసంబంధమును వానికి మూలము లైనకాణ్వాదివ్యాకరణములును దొరకినఁ గాని నిర్ద్వంద్వముగా నిర్ణయ మేర్పఱచుట కుదురదు. ఇంకను గ్రంథాంతరముల సంకీర్ణముల ప్రసక్తి యున్నను చిం.లో లేమి అనుజీవితద్రుతాః నిత్యమ్ ద్రుతప్రకృతయ యనుటయె యుచితము. (అయినఁ దత్కర్తయుద్దేశ మిదియే యని నిశ్చయముగాఁ జెప్ప లే మనుటలో మొగమోటమి యక్కఱ లేదు).

మొత్తముమీఁద ననుజీవితద్రుతాః అనుదశము ద్రుత ముండుటను మాత్రమే చెప్పుటచే నెల్లవిధము లగుద్రుతాంతములును ద్రు.ప్ర.లే. యవును. అనఁగాఁ దిఙ్మధ్యాదిభిన్నములతోపాటు ద్రుతాంతము లగుతిఙ్మధ్యాదులును సామాన్యముగనె ద్రు.ప్ర. లగుట చిం.యుద్దిష్టము. కాన ద్రుతాంతము లైనశబ్దములు(నిత్య)ద్రుతప్రకృతికము లనుచిం.యభిప్రాయము దాదాపుగా సూరిలక్షణమువంటిదె యని గుర్తింపవచ్చును.

రామునిన్ అనురీతిద్రుతాంతములకును రాముఁడున్ అనురీతిద్రుతాంతములకు స్వభావమునఁ గొంతభేద ముండుట గమనింపవచ్చును. తిఙ్మధ్యాదిభిన్నములెప్పుడు ద్రుతాంతము లై ద్రు.ప్ర.లే యగుచుండఁగాఁ (రామునిన్ మొ॥) దిఙ్మధ్యాదు లనఁగాఁ గళ లర్థవిశేషాదిప్రత్యేకావస్థలయందె ద్రుతాంతము లయి ద్రు.ప్ర. లవుచున్నవి.(రాముఁడున్ భక్తుఁడన్ మొ॥) వీనినడిమిభేదమును నహో. గాని యింక నితరలాక్షణికులు గాని ప్రస్తావింపకుండుట స్పష్టమె. లక్ష్యములం జూపిన సూరి యాయంశము నింకను స్పష్టము చేసెను. వీనిని భిన్నములుగాఁ జెప్పవలెనా? స్వాభావికద్రుతాంతములును నస్వాభావికద్రుతాంతములును భిన్నములుగా వేఱుచేసి చెప్పుటవలన నెట్టిప్రయోజనమును లేదు. ద్రుతమునకు ద్రు.ప్ర.లందుఁ జెప్పిన యాయాకార్యములు రెండింట సమానముగనె వర్తించుచున్నవి. ద్రుతము లేకున్న నట్టివాని ప్రసక్తి యెట్లు నుండదు. వానిస్వభావము(చరిత్ర)తోశబ్దశాస్త్రమున కెట్టి

యవసరమును లేదు. ఈసంజ్ఞ నేర్పఱచుటలో శాస్త్ర మేప్రయోజనము నుద్దేశించినదో యది సిద్ధించుట కీభేదకల్పన మవసరము గాదు. స్వాభావిక మగుద్రుతమునకంటె భిన్నముగా నస్వాభావికద్రుతమున కగుకార్య మేమి? కళలు ద్రుతాంతము లైన ద్రు.ప్ర. లగుటయు ద్రుతాంతములు గాకున్నఁ గళలే యగుటయు నస్వాభావిక ద్రుతాంతము లనిత్యద్రు.ప్ర. లన కున్నను సిద్ధించున్నదే గదా. బాల.లో నిట్లు గాదా? కావునఁ ద్రుతాంతము లై యుండుతిజ్మధ్యాదిభిన్నముల కంటె ద్రుతాంతము లగుతిజ్మధ్యాదులను వేఱు చేయ నక్కఱ లేదు. (చూ. ద్రుతోపజీవులు) అందువలననే లాక్షణికులు (నాంతములు) ద్రు.ప్ర.లు మున్నగు రీతిగా నెల్లద్రుతాంతముల నొకేతీరుగా వ్యవహరించిరి.

కాఁగాఁ గళలు సైతము ద్రుతాంతము లగుచో ద్రు.ప్ర. లగుట(అద్రుతము) నకు ద్రు.ప్ర.లద్రుతమున కగుకార్యములు సామాన్యముగా (నగుట) సర్వలాక్షణిక సమ్మతము. సంకీర్ణములను ప్రస్తావించినలక్షణగ్రంథము లేని ద్రుతాంతము లగు కళలను ద్రు.ప్ర.లకంటె వేఱు చేయలేదు గదా.

## ద్రుతాంతపదము - ప్రకృతి

చిన్నయలక్షణమునం దిం కొకభేదము పొడసూపినది. ద్రుతాంతము లైన పదములు ద్రుతప్రకృతికము లనుటలో ద్రుతాంతము లైనట్టివెవి పదములుమాత్రమె ద్రు.ప్ర. లగునా? జ్ఞానమునుబట్టి మొద లగుచోట్లఁ బ్రకృతులు గదా ద్రుతాంతము లయినవి. సూరి పదము లని చెప్పినను సు.ప్ర., పేటిక ప్రభృతివ్యాఖ్యలు 'శబ్దము' లని వివరించినవి. శబ్దము లనఁ బదములును గావచ్చును గాని పద ములుమాత్రమే శబ్దములుగా వ్యవహరింపఁబడవు. పద మనియే యర్థము చేసిన నీప్రకృతులును గ్రహింపఁబడి యవియు ద్రు.ప్ర. లగును.

ఇందలిపద మనుదానికి సుప్తిజంత మైనది యనునర్థమును భావించి రమ, వండఁగలఁడు, వండఁబడును మున్నగువానిలో వండన్ అనునది పదము గామి

ద్రు.ప్ర.గా దనియుఁ గాఁగా ద్రుతకార్యములు ప్రాప్తింపవు గావుననే సూరి యట ద్రుతకార్యంబు అని ప్రత్యేకముగా సూచించె ననియుఁ బేర్కొన్నది. (180). కాని దీనిని అం.వ్యా.వి. అంగీకరింపలేదు. అందుకు "ద్రుతప్రకృతులు గాని శబ్దములు అని తరువాతిసూత్రమున శబ్దము లనుటచే నిటఁ బదములు అనునదియు శబ్దము అనునర్థమునందే వాడఁబడిన" దని మొదటిహేతువు చూపినది. కాని యిది సరియైనయుక్తి కాదు. ఇటఁ బదము లని తరువాత సూత్రములో శబ్దము లనుటలో వైయర్థ్య మే మే మున్నదా? ఇంకను బూర్వసూత్రమునఁ బదము లని చెప్పెను గావునఁ దరువాతసూత్రములో శబ్దము లన్నను బదములను గ్రహింప నవకాశము గల దనవచ్చు.

అం.వ్యా.వి. సూరి 'ఉండి'ని మున్ను పదముగాఁ బేర్కొని పిదప శబ్ద మనుటను బ్రస్తావించినది. కాని యిది విరుద్ధప్రయోజక మవుచున్నది. సూరి మొదట 'ఉండి'ని బద మనియే చెప్పెను. ఇది ఉండుధాతువుక్త్వార్థకరూప మయి పదమే యగును గదా. పిదప దానినే శబ్ద మనెను. శబ్దమునకుఁ బద మని యర్థము చేయుట దోషము కాదు గదా. కాన నట నుండిశబ్ద మన్నను నుండిపద మని యర్థ మగుట సహజమే. ఇంక నట్లే యిటఁ గూడ ద్రుతాంతము లైనపదము లను దాని ననుసరించి ద్రుతప్రకృతులు గానిశబ్దము లనుచో శబ్దము లనుదానికిఁ బదము లని యర్థము చేయఁదగును. పద మనుదానికి నర్థ మేల చెప్పవలె? 'ఉండిపద' మనుస్థలమున నయ్యది పదము కాక పోలేదు గదా.

పదము కానిదానిని బదముగా సూరి యెచ్చట నేని బ్రయోగించియున్న నది ప్రస్తుతాంశమున యుక్తి కాఁగలదు. అందుకే అం.వ్యా.వి. అట్టియాధారము నిట్లు చూపినది. 'అంతే కాదు. ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష నప్రయుక్తం బగు ననుసూత్రమునందు 'అట్టి' కూడఁ బదముగఁ బేర్కొనఁబడియున్నది. కళలుగా నాతఁ డుదాహరించిన వన్నియుఁ బదములే. అట్టిమాత్ర మట్టిది గాదు' (188) ఈ హేతువును సముచితముగాఁ గానరాదు. అట్టియనునది

పదమె కా దనుట యెట్లు ? ఇయ్యది స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడనిమాట యథార్థము. కాని యియ్యది స్త్రీసమముగా నుండున ట్లంగీకరింపఁదగు. కోశములు అట్టి,ఇట్టి,ఎట్టియనువానిని విశేషణములుగాఁ గాని యపదములుగాఁ గాని చెప్పలేదు. తెలుఁగున విశేషణంబులు సామాన్యముగ నవిభక్తికంబు లగుటచే అట్టివాఁడు ఇత్యాదిగాఁ దచ్ఛబ్దముతో సమసించియె ప్రయుక్త మగుచుండును. సూరి నల్లాదులను ప్రథమైకవచనాంతములను స్త్రీసమములుగా నిర్దేశించి చూపెను. పుల్ల తియ్య ఇత్యాదులు విడిగాఁ బ్రయుక్త మగుచున్నట్లు గానరాదు. వీనిని స్త్రీసమములుగా నంగీకరించిననే తియ్యన ఇత్యాదిరూపములు సిద్ధింపఁగలవు. తియ్యనిది మొదలుగా సంబధార్థమునఁ దచ్ఛబ్దముతో సమసించినరూపములే ప్రయుక్తము లవుచున్నవి. కాని యట్టిసమాసము సిద్ధించుటకు వీలుగా వీనిని స్త్రీసమములుగా నంగీకరింపఁదగును. తియ్య ఇత్యాదులను బ్రథమైకవచనాంతముల తద్ధితనవర్ణకవిధానస్థలమునఁ జూపె ననకతప్పదు. ఎల్లయెడలఁ బ్రథమాంతములఁ జూపినవాఁ డాసూత్రమునొద్దమాత్రము బ్రాతిపదికలను జూపె ననుట సక్రమము గాదు. కాఁగా నల్లె యట్టి యనుదానిని బదముగనే సూరి నిర్ణయించె ననియు నందువలననే యట్టిపదమని బేర్కొనె ననియు గుర్తింపఁదగును. కాఁగా నట్టి నపద మని చెప్ప నక్కర లేదు.

సుప్తిఙంత మనునర్థమునఁ బద మనునది శబ్దశాస్త్రమునఁ బేర్కొనఁబడియుండుటచేతఁ దద్భిన్నార్థమున సూత్రకర్త ప్రయోగించె నని చెప్పుట యుచితము గాదు. (ఇంకను సూరి "అపదము" మొదలుగాఁ గూడఁ బ్రయోగించుట స్పష్టము.

ద్రు.ప్ర.లను వివరించుస్థలమున ప్రథమాకయిపట్టియొక్కతరము లయిన విభక్తు లనఁగా విభక్త్యంతములకే గ్రహణ మనుట స్పష్టము కదా. ఇల్లె ఇతరస్థలములను తానునేనుపదంబులును అని వివరణమునను బదములను బేర్కొనె.లక్ష్యములుగాఁ జూపిన వెల్ల పదములే యవుట విస్పష్టమే. ఇల్లే ప్రథమాకయిపట్టియొక్క విభక్తులు ద్రు.ప్ర.భిన్నము లయి కళ లగు ననఁగాఁ దత్తద్విభక్త్యంతములే యనుట

స్పష్టమే కద. ఇట్లు లక్షణములు రెంట సూరి పదములనే విస్పష్టము చేయుట గుర్తింపవచ్చును.

పదము లనుచో సుప్తిజంత మని యర్థము చేయుచో జ్ఞానముఁబట్టి యగు బెట్లు (288)అనుఅం.వ్యా.వి.యాక్షేపము ప్రధానముగా గమనింపఁదగియున్నది. ఇట జ్ఞానమున్(బట్టి)అనునది ప్రాతిపదికయే గాని పదము గాదు. ప్రకృతులు ద్రుతాంతము లయి యట ద్రుతకార్యము లవుట (కూర్చి) పట్టి, కల, పడు అనునవి పరమైనప్పుడుమాత్రమె గానవచ్చు. తదితరస్థలములఁ బ్రకృతులు ద్రుతాంతము లన నవకాశమే లేదు.

ఇట ద్రుతాంతము లగుప్రకృతులనె ద్రు.ప్ర.లుగా గుర్తింపవలెనా? శాబ్దికులు ద్రుతాంతము లగుప్రకృతులను ద్రు.ప్ర.లుగానె యెంచిరా యన్న దాలోచింపవలసియున్నది.

సూరి కలజిపడుజులపరకత్వమున నుగాగమమును జెప్పి ద్రుతకార్యం బని విశేషముగాఁ బేర్కొనుట ననుసరించి ద్రుతకార్యము ప్రత్యేకముగా సూచింపఁబడినది. దీనివలననె యీప్రకృతులకు ద్రు.ప్ర.త్వము జ్ఞాపకము చేయఁబడినదనవచ్చును. లేదా ద్రు.ప్ర.త్వము లేకయె ద్రుతకార్యము నందుట విశేషము గావున నట్లు సూచింపఁబడిన దని యెంచనవును. అనఁగా వందను (కల) వందను (పడు) అనురీతిస్థలములలో నయ్యవి ద్రు.ప్ర.లు గావు. అయ్యును ద్రుతకార్య మనుసూచనము ననుసరించి యానుగాగమమునకు ద్రుతకార్యములగుట విశేషముగా గుర్తింపవచ్చును. రాముని-గూర్చి యనురీతిచోట్లఁ బ్రకృతి ద్రుతప్రకృతిక మగుట యనుప్రసక్తి చిన్నయమతమున లేదు. సూరి కూర్చిని ద్వితీయగాఁ జెప్పకుండఁగా. ప్రౌఢ. ద్వితీయకు కూర్చి (గుజిచి మొ॥)-అనుప్రయుక్త మగు ననెను. జ్ఞానముఁబట్టి యనురీతి పట్టిపరకస్థలములలో ద్రుతము చేరుటకు సూరి బాల.లో లక్షణము చేయలేదు. ఒకవేళ లక్షణమును జేసియున్న వందఁగాంచనురీతిస్థలములందువలె నిటఁ గూడ ద్రుతకార్యమును విశేషముగా సూచించియుండె

డువాఁ డేమో ఇంక జ్ఞానముఁబట్టి యనురీతి లక్ష్యములసామర్థ్యము ననుసరించి నుగాగమమును జ్ఞాపకము చేసికొన్నఁ దదనుసారముగనే ద్రుతకార్యమును జ్ఞాపితము చేసికొనవలెను. సుక్ప్రట్టివిభక్తౌ యని మొదలుగా సూత్రాంధ్రాదులగునితర వ్యాకరణములందు సూరి యిచ్చోటినుగాగమమును బ్రస్తావించెను. పదంబు ద్రుతాంతంబు ద్రుతప్రకృతికకం బనురీతిగా నాగ్రంథములందును జెప్పియున్నను బట్టిపరకనుగంతమునుగూర్చి విశేషముగా నేమియుఁ జెప్పలేదు. ఇట్టిచోట్ల ద్రు.ప్ర.త్వమును జ్ఞాపకము చేసికొనుటకంటె ద్రుతకార్యములను మాత్రమే విశేషముగ సాధించుకొనుట యుచితముగ నుండు నేమో. కల్, పడు, పట్టి, పరక ప్రకృతులను వలె ప్రకృతులలోఁ జేర్చికొని వాని ద్రు.ప్ర.త్వమును గుర్తించినయెడల కలపడుపరకస్థలముల సూరి ద్రుతకార్యం బనుట స్పష్టతకే యనఁదగియుండును. కాని ద్రుతాంతము లైనపదము లనుసూత్రవివరణమున ద్రుతాంతము లైనప్రకృతులను జేర్చుకొనుట యుక్తముగాఁ గానరాదు. సూరి యట్టివాని నటఁ జేర్కొనియు నుండలేదు.

ప్రకృతులకుఁ గళాద్రుతప్రకృతికత్వములను వచించుట సంప్రదాయవిరుద్ధము. కళాద్రుతప్రకృతికత్వములు పదత్వముతో సంభవించున (వ్యా.సం.స.182)వని వజ్ఝలవారు పేర్కొనుట గమనార్హము. అయిన వీరు జ్ఞానముంబట్టి యనురీతివానిం గూర్చి యిటఁ బ్రస్తావింపలేదు.

సూరిలక్షణమునందలిపద మనుదానికి సుప్తిఙంత మనునర్థము చేయరాదను అం.వ్యా.వి. యభిప్రాయము సమంజసము గా లే దని నిర్ణయింపనగును. జ్ఞానమున్ (బట్టి) అనురీతిస్థలములలో ద్రుతకార్యసిద్ధికయి వీనికి ద్రు.ప్ర.త్వము సిద్ధింపవలె నని యెంచో సూత్రమునఁ బదము లని ప్రయోగించుట సరికా దింక ద్రుతాంతము లయినశబ్దము లని చెప్పుటే నుచితము కాని పద మనుదానికి వే ఱర్థము చేయుట యుచితము గాదు. అయ్యును ద్రుతకార్యములకయి వీనికి ద్రు.ప్ర.త్వమే కావలె నని చెప్ప నక్కఱ లేదు. ద్రుతాంతము లగుప్రకృతు లొండు రెండే

యవుటంజేసి విశేషముగా ద్రు.ప్ర.త్వము లేకయే యానువర్ణమునకు ద్రుతకార్య ములు చెప్పుకొనుట యొప్పునే గదా.

'ద్రుతకార్యం' బనుటలో నట కలపడుపరకతలో నువర్ణము రాఁగాఁ దదంతము ద్రు.ప్ర. కాకయు నానువర్ణమునకు ద్రుతకార్యము లగు నని గుర్తించుట దుష్టము గాదు. అట్టిది యపూర్వమును గాదు. వినా ద్వితీయం స్యా దస్మదాత్మనో స్స్వ స్తయో రపి యను వి.వి.వచనమునఁ దానునేనులు ద్రు.ప్ర.లు గాకున్నను నువర్ణమున కాయాద్రుతకార్యములు చెప్పఁబడె ననుట స్వ స్తయో రపి యనుదానిచే గుర్తింపవచ్చును.

ఇంకను ద్రుతకార్యం బనుటలో నానువర్ణము ద్రుతము గాకయె ద్రుతకార్య ములనందు నని చెప్పుటయు విరుద్ధము గానేరదు. అనఁగా ద్రుతకార్యం బను టచే నానువర్ణాంతమునందు ద్రు.ప్ర.త్వమును గాని యానువర్ణమునందు ద్రుతత్వ మును గాని జ్ఞాపకము చేసికొనకయె ద్రుతకార్యములు చేసికొనవచ్చును. అట నాగమ మైననువర్ణము ద్రుతము గాకున్నను ద్రుతకార్యం బని విశేషముగాఁ బేర్కొనుట ననుసరించి యది ద్రుతకార్యముల నందు ననుట యొప్పునే గదా. అన్యంబులకునహిత మిక్కార్యంబులు గానంబడియెడి ననుటవలనఁ ద్రాఁతాదులలో లేనివానికిని ద్రాఁతాదులఁ జెప్పినకార్యము లవుట లేదా? (ఇది ద్రుతమె కా దనట నీనువర్ణాంతములు ద్రుతాంతము లయ్యు ద్రు. ప్ర.లు గా వని చెప్పవలసినయవ సరము నుండదు.)

ఇంకను నిట్లు గా దని యీయాగమనువర్ణమునందు ద్రుతత్వమును దదంత మగుప్రకృతియందు ద్రు.ప్ర.త్వమును జ్ఞాపకము చేసికొన్నప్పటికి ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికము లనుచోఁ బద మనఁగా సుప్తిఙంత మని యర్థము చేయ రా దన నక్కరలేదు. ద్రుతాంతము లైనసుప్తిఙంతములే ద్రు.ప్ర.లగున్న విశేషముగాఁ దత్తత్స్థలమున జ్ఞాపకసిద్ధ మగుటచే నవి ద్రు.ప్ర. లగుట కీసూత్ర మందుఁ బదము లనుటకు వైరుధ్య ముండదు గదా.

కాన నెట్లు చూచినను సూరిసూత్రమందలి పదము లనుదానికి సుప్తిఙంతము లనురీతిగా శాస్త్రప్రసిద్ధ మగునర్థమునే గ్రహింపలయు నని నిశ్చయింపఁదగును.

కొన్ని యివియుఁ బ్రకృతులు గాక పదములే యనఁదగియు నున్నవి. పడయఁగఁగలఁడు, పొందఁగాఁబడు అనురీతివ్యవహారము ననుసరించి పడయఁగలఁడు, పొందఁబడు ఇత్యాదులలో కల,పడు, అనువానికిఁ బూర్వమునఁ గాన్పించుచున్న పడయన్, పొందన్ అనురీతివి నుబ్జ్యంతము లైన యవ్యయపదములే యనఁదగియున్నవి. చదువ నున్నాఁడు, చదువవలయు నిత్యాదిగా నీనుబ్జ్యంతావ్యయప్రయోగము తెలుఁగున విస్తారముగా విభిన్నార్థములఁ గానవచ్చును. కాన కలపడుపరకస్థలము ప్రకృతి కాక నుబ్జ్యంతావ్యయపదమ యనవచ్చు. రామునిగూర్చి యనురీతి కూర్చిపరకస్థలమున నున్నది ద్వితీయాంత మని ప్రౌఢవ్యాకరణమునుబట్టియు స్పష్టము. ద్వితీయకే కూర్చి నను ప్రయుక్తము చేసెం గదా. నిన్నుఁగూర్చి నన్నుఁగూర్చి యనురీతిస్థలము లాయంశమును బ్రమాణీకరించు. (ఇట్టివానిం దృష్టియం దిడుకొనఁగా న్నునన్ను లన్నన్నుల కాదేశము లని కాక ప్రకృతి కాగమము లనుటయె యుచిత మనవలె.)ఇట్లె జ్ఞానము నుబట్టి యనురీతిస్థలములందును బట్టుధాతువుయొక్క క్త్వార్థకరూప మగుపట్టిపదము. దానితోడియన్వయమువలనఁ బూర్వశబ్దము కర్మగా ద్వితీయాంత మయినట్లుగా గుర్తింపవచ్చు. కాఁగాఁగూర్చిపట్టిపరకస్థలములందలి ద్రుతాంత మగుప్రకృతిసయితము ద్వితీయాంత మగుపద మని గ్రహింపవచ్చును. కాఁబట్టి పదము లెల్ల ద్రుతాంతములు ద్రుతాంతములు గానివి యని రెండుగాఁ జెప్పవచ్చును. కాని శాబ్దికులు వీనిని (కల,పడు,పట్టిపరకస్థలములు) బ్రకృతులుగానే నిర్వహించిరి.

వీనియెడలఁ జిం.యభిప్రాయ మేమి? హరింగూర్చి వచ్చుటంబట్టి యనుస్థలములందును నమ్మోచిత యనియె నుప్పు చేయుదమా? హరినిగూర్చి(వచ్చుటనుబట్టి) యని యవ్వెట్లు? ఘటింపఁగలఁ డిత్యాదులలో నుమాగమము పునరాగమః క్రియాణా మ్మని చేయవపును. ఏమైనను ద్రుతాంతము లైన ప్రకృతులను జిం.స్పష్టముగాఁ బ్రస్తావింపలే దనకతప్పదు. అయ్యును జిం. చిన్నయవలె ద్రుతాంతము లైన 'పదములు'

అని పేర్కొనియుండలేదు. అట్టియెడల నన్యే ద్రుతప్రకృతయ యనుచోట ద్రుతాంతము లైనశబ్దములు ద్రుతప్రకృతు లని యర్థము చేసికొనవచ్చును. ప్రయోగానుసారముగా వనము నుగూర్చి యిత్యాదులలో ద్రుతకార్యములు గాననవుటంజేసి కూర్చి పట్టికల పడు పరకప్రకృతులును ద్రు.ప్ర. లయియుండు నని గుర్తించఁదగును. ఇట్లు ద్రుతాంతము లగుప్రకృతులును ద్రు.ప్ర.లే యవుట చిం.సిద్ధ మగుచున్నది.

కాఁగాఁ జివర నున్నద్రుతము స్వాభావికమా యస్వాభావికమా యని కాని (ప్రకృతి సిద్ధమా కాద యని కాని) ద్రుతాంత మగునయ్యది పదమా ప్రకృతియా యని కాని భేదములను వివక్షింపక ద్రుతాంతము లగుశబ్దముల నెల్ల ద్రు.ప్ర.లుగాఁ జిం. లోఁగుర్తింపనవు. (ఇట్లు వి.వి.లోను.)

పట్టిపరకస్థల(సువర్ణమును) ద్రుతకార్యములను సూరి ప్రస్తావింపనట్లే ప్రకృతిదుంయ సువర్ణమును చిం.యెచ్చటను బ్రస్తావింపలేదు. ప్రస్తావించియున్నసూరి తలపడు పరకస్థలమునఁ జెప్పినట్లే ద్రుతము (గాని యట్టిప్రకృతులకు ద్రు.ప్ర.త్వమును లేకయె) ద్రుతకార్యములు చెప్పెడివాఁ డేమో యనుట విశ్వసనీయముగాఁ దలఁచినఁ జిం.లోను ద్రుతాంతము లగుప్రకృతులే యుండవు. కాన నందును ద్రుతాంతము లగుపదములే ద్రు.ప్ర.లని యపుడు నిర్ణయించుకొనవచ్చును.

సూరిలక్షణమున ద్రుత మెట్టి దైనను జివర నున్నపదము ద్రు.ప్ర.యే. ప్రకృతులు ద్రుతాంతము లై ద్రు.ప్ర. లగుట సూరిసమ్మతము గా దనఁదగి యున్నది. వండఁగలఁ డిత్యాదులఁ బ్రకృతులనే ద్రుతకార్యములు గాన నైనను నట్టినుగాగమాంతప్రకృతులు ద్రు.ప్ర.లు గాని యానుగాగమము ద్రుతము గాని కాకయె సువర్ణమునకుఁ బ్రత్యేకముగా బేర్కొనుట ననుసరించి ద్రుతమున కగు కార్యములె యగు నని గుర్తింపఁదగును.

### ద్రుతప్రకృతికసంజ్ఞ యావశ్యకమా :

అసలీద్రుతప్రకృతికసంజ్ఞ నేర్పఱుపవలసినయవసర మున్నదా? యని సందేహము. చిం.సూత్రమందు ద్రు.ప్ర.శబ్దమును బ్రయోగించి వానిలోని

ద్రుతమునకె యాయాకార్యములను విధించియున్నది. కాని వి.వి.మాత్రము ద్రుతస్య హలి బిన్దుస్స్వా త్తని మొదలుగా ద్రుతమున కని చెప్పినదే కాని యెచ్చటను ద్రు.ప్ర.సంజ్ఞ నుపయోగింపలేదు. దీనింబట్టి యస లీసంజ్ఞ లేకపోయి నమాత్రము వ్యాకరణమునఁ గల్గునష్ట మేమి యనిపించుట సహజము. శబ్దము నకుఁ జివర ద్రుత మున్న నయ్యది ద్రు.ప్ర. గాకతప్పదు. అట్టియప్పుడు బింద్వాదు లగుట కానకారమందు ద్రుతత్వము గుర్తింపఁబడినఁజాలు. ద్రు.ప్ర. యగుట యనుదాని కందలిద్రుతమున కాయాకార్యములు జరుగుట తప్ప శాస్త్రమందుఁ బ్రయోజనాంతరము గానరాదు. అయిన కను, చేసు ఇత్యాదులలోనినువర్ణము ద్రుత మగునా? మొదలైనసందేహము లుండును. అట్టివి వారింపఁబడునట్లుగా ద్రుతముయొక్క స్వరూపమును విస్పష్టముగా నిర్ణయింపఁదగును. ద్రు.ప్ర.సంజ్ఞ యవసరము గా దనవచ్చు. అపుడు (ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగువపు డన్నట్లుగనె) ద్రుతంబుమీఁదిపరుషములకు సరళము లగు ననురీతిఁగాఁ జెప్పనవును. వి.వి.లోవలెనె చిం.లోను ద్రు.ప్ర.శబ్దము నుపయోగింపకున్నను నష్టము లేదు. కాని చిం. మొదలుకొని లక్షణగ్రంథములు దాదాపుగా నెల్లవి ద్రుతమును స్పష్టముగా నిర్ణయింపక యది ద్రు.ప్ర.లవలనఁ దెలియఁదగినదిగాఁ జేసిరి. (ప్రౌఢవ్యాకర్త మాత్ర మేతద్భిన్నముగా ద్రుతస్వరూపమును వివరించెను.)

అప్పకవి ద్రుతప్రకృతికశబ్దమును బ్రత్యేకప్రయోజనముతో నుపయోగించుకొనుట గమనింపవచ్చు. నకారమును సామాన్యముగా (పదమున నెక్కడ నున్నను) ద్రుతముగనె యప్ప. తలఁచెను. దానివలన నకారాంతము లన్నియు ద్రు.ప్ర.లే యనవలసియున్నవి. అయిన ద్రు.ప్ర.లను వివరించునప్పుడు 'గూను, నెమ్మెను.......భువి నకారంబుతోఁ గూడఁ బుట్టుశబ్దములు ద్రుతప్రకృతులు గావు (5_25) అన్న....... జడ్డలు నకారములకుఁ దుదిని దనరుపదములు గావు ద్రుతప్రకృతులు (5_28) తన్న....... జడ్డ లుండుఁ బోవుఁ జర్చింప నివి ద్రుతప్రకృతు లెపుడుఁ గావు(5_27) అని యాయాశబ్దములు ద్రు.ప్ర.లు గావనెను. ఇట్లు నిర్ణయించుటకు సూత్రమున నాధారము లేదు. అయినను నప్ప. స్వాభావి

కనుగనె తాఁ జెప్పఁదలచినయంశమును సూత్రమున మూలము లేకున్నను జెప్పెను. ఎల్లచోట్లనున్ననకారమును ద్రుతముగా వ్యవహరించియుండెను గాన గూను ఇత్యాదులలోను చివర నున్ననకారమును ద్రుతము గా ననుటకు వీలు లేక పోయెను. అనఁగాఁ జివర నున్నయానకారము ద్రుతమె యవును గాని యీశబ్దము ద్రు,ప్ర. కా దన్నమాట. ఇట్లివి ద్రు.ప్ర.లు గా ననుటవలన నీనకారము ద్రుతమె యైనను దానికి ద్రుతకార్యము లేవియు రావు. 'పరుషాః ద్రుతప్రకృతికాత్' ఇత్యాదిగా ద్రుతమున కాయాకార్యములు చెప్పునపుడు ద్రు.ప్ర.లద్రుతమున కని చెప్పుచుండుటవలన గూను ఇత్యాదులలో నకారము ద్రుత మైనను నా శబ్దములు ద్రు.ప్ర.లు గాకుండుటంజేసి ద్రు.ప్ర.యందలిద్రుతము కానేరదు గాన నద్దానికి ద్రుతకార్యము లేవియు రావు.

ద్రుతాఖ్యో న యనిచెప్పుటనుబట్టి నకార మెక్కడ నున్నను ద్రుతమె యవుననియు గూను ఇత్యాదులు నునంతము లగుటచేతఁ గళ లవును గావున వానిలోని నకారము ద్రుత మైన నవి (ద్రుతాంతములె యైనను) ద్రు.ప్ర.లు గా ననియుఁ జెప్పుట కేవలము త్రోసివేయఁదగినదిగాఁ గూడ లేదు. ద్రుతకార్యములను విధించు చోట్లనెల్ల ద్రు.ప్ర.శబ్దమును బ్రయోగించుటచేఁ జిం.కర్తకు నిట్టియభిప్రాయమే కల దేమో (తదనుగుణముగఁ జిన్నయకును గల దేమో) యని సందేహించుటకు నవకాశ మున్నది.

గూను ఇత్యాదులు ద్రు.ప్ర.లు గా ననుటలో నప్ప. వానిప్రథమాంతతను బ్రస్తావింపలేదు. శబ్దమున సహజముగా నకారము గలయివి ద్రు.ప్ర.లు గా నని చెప్పెను. తన్ను మొద లగుద్వితీయాంతములును ద్రు.ప్ర.లు గా నని చెప్పుటలోఁ బైనవి ప్రథమాంతము లగుటఁ గళ లవుటచే ద్రు.ప్ర. లనరా దనునభిప్రాయ మప్పకవికి లే దనియే చెప్పవలసియున్నది.

అయినఁ జిం.కర్త కున్నదాః ద్రుత్యాఖ్యో న యని సామాన్యముగఁ జెప్పుట ననుసరించి నకార మెల్లయెడల ద్రుతమె యగు నని యప్ప.వలె భావింపఁగా

గూను ఇత్యాదులలోను నావయవిక మగునకారము ద్రుతము గాకతీరదు గదా. ఇది ద్రుతాంతమె కాని ద్రు.ప్ర. గా దన్నమాట. అట్లు చెప్ప నెట్లు? శాస్త్రమునుబట్టి వీనిని ద్రు.ప్ర. లనియే చెప్పవలె. కళలను వివరించునప్పుడు ద్రుతో న యేషాం స్యాత్తన్నాఁడు గనుక గూను ఇత్యాదులలోనినకారము ద్రుతమే గావునను ద్రుతము లేనితిఙ్మధ్వాదులే కళలను లక్షణము ననుసరించి సునంతము లైన నివి ద్రుతాంతము లవుటచేఁ గళలు గావు. కాఁగా నన్యశబ్దముచేఁ బరిగ్రహింపఁబడి యన్యే ద్రుతప్రకృతయ యనులక్షణము ననుసరించి ద్రు.ప్ర.లే యవును గదా. (బహుశః అందుకు నప్ప. యివి సునంతము లగుటఁ గళ లవును గాన ద్రు.ప్ర.లు గావని శాస్త్రసిద్ధముగాఁ జెప్పినట్లు గాక ద్రుతాంతతవలన ద్రు.ప్ర.లే కావలసియున్నను గాకుండుట యన్నది విశేషముగాఁ జెప్ప ననియు నందువలననే వీనిసునంతతను ప్రస్తావింపలే దనియు నెంచుటకు వీలు గలదు.)

ఇంకను నీయవి ద్రుతాంతములే కాని ద్రు.ప్ర.లు కా వని చెప్పుటయు నక్రమము గాదు. కాన నప్పకవియొక్క పైరీతియభిప్రాయము చిం.కర్తకు లే దని నిశ్చయింపవచ్చు.

కాఁగా గూను ఇత్యాదులు ద్రుతాంతము లన్న చిం. ననుసరించి ద్రు.ప్ర.లు గాకతప్పదు. కా వనుట నిరాధారము. అప్ప.మతము ననుసరించి గూను ఇత్యాదులలో ద్రుత మగుటయే యివి ద్రు.ప్ర. లనవలసినయిబ్బందికిఁ గారణ మని స్పష్టము. ఇది ద్రుతము కా దన్న ద్రుతో న యేషాం స్యాత్తనులక్షణముప్రకారమివి కళలు గాఁగలవు. గూను అనుమొద లగుచోట్ల నకారము ద్రుతము గా దనవలె ననఁగా నకార మెక్కడ నున్నను ద్రుతమె యగు ననరా దన్నమాట. పదాంతమున నకారము ద్రుతము గా దని యెక్కడ నైనను జెప్పుట యేర్పడినఁ దదనుగుణముగనె పదాంతేతరస్థలములలో నకారమునకు ద్రుతత్వము వారించుకొనుట సమంజసము యవును గదా. ద్రుతాఖ్యోన యనునది సామాన్యముగా నకారము ద్రుత మని చెప్పుచున్నను గళలను బేర్కొనునప్పుడు ద్రుతో న యేషాం స్యా

త్తమట నాధారముఁగా జేసికొని పైయర్థము నింతకు ముందు గ్రహించియున్నారము (చూ. ద్రు.) ౫౭.లోను ద్రుతప్రకృతికనిరూపణము ద్రుతత్వమును నియమించు నదిగా గ్రహింపవచ్చు. అటుగా ద్రు.ప్ర.లనుబట్టియో కళలనుబట్టియో ద్రుతస్వరూపము నియమింపఁబడుచున్నట్లు గ్రహింపవలయు నన్నమాట.



అయిన ద్రుతస్వరూపమును స్పష్టముగా నిర్ణయించి చెప్పుచోఁ దన్నియమమునకయి కళాద్రు.ప్ర.లయేర్పా టవసరము గా దనిపించును.

ద్రుతస్వరూపాన్వేషణములోఁ బరామర్శించినదానినిబట్టి నూరి ద్రుతమును నువర్ణ మనియుఁ జిం. నకార మనియుఁ జెప్పవచ్చును. ఇంక నట్టినకారము ప్రత్యయము నాగమము నవ్యయము నైనదియు వలెప్రభృతులందలిదియు ద్రుత మగు నని గ్రహింపవచ్చును. చిం. అవ్యయ మైననువర్ణమును బ్రస్తావింపలేదు. దానిని విధించినవి.వి. యువర్ణకస్యాద్యన్తత్తు నువర్ణక ఉతో భవే త్తని దీనిని బ్రత్యయముగనె విధించినది. చిం.మత మది యగు నన్న నవ్యయమును బ్రత్యేకముగా నిటఁ బ్రస్తావింపనక్కరలేదు. కాని యువర్ణకః అనులక్షణ మహో.కృత మగు నేమో యని సందేహము. అహో.వర్ణ వర్ణకభేదము పాటించినట్లు చాలచోట్లఁగానరాదు. 'ను' ప్రత్యేక మగునవ్యయశబ్ద మనుటయ యుచిత మనిపించు. కానఁ బ్రస్తావింపని చిం.మతమున నట్ల గ్రహింతము,

ద్రుత మేదో స్పష్టముగా నిర్ణయించుటయె ప్రయోజనవంతము నగు నని పించు. ఆయాద్రుతకార్యములు విధించిస్థలమున ద్రుతమున కని చెప్పినఁ జాలు. ద్రు.ప్ర.లందలిద్రుతమున కని చెప్ప నేల? ద్రుత· మున్నది ద్రు.ప్ర. కాకుండుట కవకాశ మేది?

ద్రుతస్వరూపము నిర్ణయింపఁబడఁగా గూను ఇత్యాదులలోనినకారము ద్రుతమే కాదు గావున ద్రుతమునకుఁ జెప్పినయాయయికార్యము లిట్టినకారమునకు వచ్చునవకాశము లేదు.

ఇంక ద్రు.ప్ర.లసందర్భమున నేఁడు గన్పించు(ననవసరమే యైనను) వివాదములకు నవకాశమే యుండదు. అనఁగా ప్రకృతిసిద్ధ మైననకార మంతయందుఁ గలవా? లేక నస్వార్థావికద్రుతాంతములునా? అట్లే ద్రుతాంతము లైనపదములే యగునా? ప్రకృతులునా? మొద లగుప్రశ్నలకుఁ దా వేది? రామునిన్ అనుచో నున్న నకారము ద్రుత మెట్లో యట్లే రాముఁడున్ అనుచోను. అగమనకారము ద్రుత మనుటచేత వండన్-గలఁడు, జ్ఞానమును-బట్టి మొద లగుస్థలములలో నకార మాగమ మగుట ద్రుత మే యవును గావున ద్రుతకార్యములను విశేషముగాఁ బేర్కొ-న నక్కఱయు లేదు.

ఇట్లే చిగురును-గైదువు ఇత్యాదిస్థలములందు సామాసిక మైనయాగమనకారమునకు ద్రుతత్వము స్పష్టము. ద్రు.ప్ర.లనుబట్టి ద్రుతమును గుర్తింపవలసిన సందర్భమున బాల.లో నిట్టిసామాసికనుగంతముల ద్రు.ప్ర.త్వము స్పష్టము గామి నింతకుముందు గమనించియుంటిమి.

ఇంకను ద్రుతత్వమును స్పష్టముగా నిరూపించినయెడల ద్రు.ప్ర.లమూలమున ద్రుత మేదియో యనఁగా నెచ్చట నెచ్చట నున్ననకారము ద్రుత మో తెలియవలసినక్లేశము నుండదు.

అయయిద్రుతకార్యము లగుటకు ద్రుతత్వముప్రధానము గాని యాద్రుతము చేరియున్నశబ్దము కాని యాద్రుతముయెక్క- చరిత్ర కాని కాదు. కావునఁ గళాద్రుప్ర.లనిరూపణమునకంటె ద్రుతనిరూపణముననె ప్రయోజన మధికము గదా.

లాక్షణికులు గొందఱు నాంతమునకారమునకు బిందాద్యాదికార్యములను జెప్పియుఁ గళలను బేర్కొ-నకుంట గమనింపనగును, నాంతములవిషయమునను ప్రధానము తుదినకారమె (ద్రుతమె) కావున నకారము ద్రుత మగుట యెక్కడనో గుర్తించి నఁజాలును. అది చివరఁ గలపదమును ప్రత్యేకముగాఁ బ్రస్తావింపవలసినయవసరము గానరాదు. (ద్రుతస్వరూపమును నిరూపించినప్రౌఢవ్యాకర్త యవసరము గలుగక యే యగు నేమో కాని ద్రు.ప్ర.సంజ్ఞ నుపయోగింపలేదు లక్షణమున.

ఉదాహరణమునకుఁ దానునేనులు ప్రథమాంతములు గావున మీఁదిపరుషములకు గసడదవలు గావలె. అయ్యును ప్రత్యయమైననకారము ద్రుత మని నిర్ణయింపఁగా నీనువర్ణము ప్రథమ యైనను ప్రత్యయ మగుటచే ద్రుతంబుమీఁది పరుషములకు సరళము లగు నని మీఁదిపరుషములు సరళముల యగును. ఇట్లె గసడదవాదేశ సందర్భమున నీకార్యము క్రియాపదములమీఁద సహితము గానంబడి యెడి నని కళ లగుట యనువిశేషమును బ్రస్తావింపకున్నను ద్రుతాంతము లగు క్రియాపదముల పైని బరుషములకును గసడదవలు గాక సరళములే యగును.

ఇట్లు పరిశీలింపఁగాఁ గళా ద్రు.ప్ర.సంజ్ఞలను గల్పింపకున్నను శాస్త్రమున నెట్టిలోపమును గలుగ దనియే నిశ్చయింపఁదగియున్నది. కాని ప్రసిద్ధము లగువ్యాకరణములు పెక్కు రీసంజ్ఞను బేర్కొన్నను బెం. మొద లగునాగ్రంథముల నాసంజ్ఞ నుపయోగించుట గానకున్నది. అట్టియవసరము గలుగక పోవుటయె కారణము గావచ్చు నైనను నంపవలన నాసంజ్ఞ గల్పింపకున్న నష్ట మేమి యనిపించుట సహజమె కదా.

కకారము పరుష మన్నటువంటిదే నకారంబు ద్రుతం బనుటయు నన్న నకార మెక్కడ నున్నను ద్రుత మె యగు ననవలె. త్రి.శ. మొ॥ లక్షణము లిట్లు వ్యవహరించుట గమనించితిమి. అట్టియెడల ద్రుతప్రకృతిసంజ్ఞ యావశ్యక మగును. శబ్దమున నెక్కడ నున్నను నకారము ద్రుత మయ్యును ద్రుతప్రకృతి శబ్దోచ్చారణమునుబట్టి పదాంతమునందలినకారమునకే యాయాసూత్రములచేఁ జెప్పబడిన ద్రుతకార్యము లగు ననవచ్చు. అట్టియెడల శబ్దమున నాదిమధ్యస్థలముల నున్ననకారమునకు (ద్రుతమునకు) ద్రుతకార్యములను వారించుచు ద్రు.ప్ర,సంజ్ఞ ప్రయోజనవంత మగును గావున నది యావశ్యకమె. అనఁగా నకారమెల్లెడల ద్రుతమె యని చెప్పుపక్షమున ద్రు.ప్ర.సంజ్ఞను బేర్కొనుటయు నాయయిద్రుతకార్యవిధానస్థలములందు ద్రు.ప్ర.సంజ్ఞ నుపయోగించుటయు నావశ్యకముల యగును. శబ్దమునందాదీతరస్థలములనున్నకకారాదులకుఁ బరుషసంజ్ఞవలెనె పదాంతేతర స్థలముల

మన్న నకారములకు ద్రుతసంజ్ఞ యుంటవలనఁ బ్రయోజనము గానరాకున్నను నది యవరోధము గానేరదు.



కాని యిప్పక్షమున నిబ్బంది లధికము. అందు నకారమునకు స్థిరసంజ్ఞ సిద్ధింపకపోవుట మొదటియనర్థము. మెచ్చె నలినాక్షిఁ డిత్యాదులు (సులభ? సాధ్యములు గానేరవు చిం.పక్షమున.

తానునేనులపయి గసడదవాదేశనిషేధవిధివలనఁ దదితరస్థలములఁ బ్రథమాంతాదిశబ్దములతుది నున్ననకారమునకు ద్రుతకార్యములు వారింపఁబడుటవలన ననర్థ ముండదు. కాని యెల్లెడల నకారము ద్రుతమె యని యెంచునపుడు ద్రుతో న యేషాం స్యాత్తని శబ్దములకు ద్రుత మనఁగా నకార ముండ దని సామాన్యముగాఁ జెప్పకొనుటలో వైరుధ్యము తప్పదు.

శబ్దమున నెచ్చట నున్నను నకారము ద్రుతమె యనుట యొప్ప దను నంశము 'ఎక్కడిది ద్రుతము' అనుచో గమనింపఁదగును. (చూ.ద్రు.25) కాన నకార మెల్లెడల ద్రుత మని నిర్ణయించి ద్రు.ప్ర.సంజ్ఞ యావశ్యక మనరాదు' నకారమును సామాన్యముగాఁ బలుక మనుటవలన నిబ్బంది లేదు గాని పదాంతేతరస్థలముల నకారమునకు ద్రుతత్వమును జెప్పినఁ బ్రయోజనము లేకుంటయె కాక యిబ్బందులును గలిమి నట్లు చెప్పక ద్రుతమును స్పష్టముగా నిర్వహింపఁ దగును గదా.

ద్రుతస్వరూపమును స్పష్టముగా నిర్ణయించినను దాదాపుగా నెల్లెడలను ద్రుతము పదాంతమునందె యుండున దగుటచేతను దీనివలన భాషయందలిపదము లెల్ల ద్రుతాంతము లైనవి, ద్రుతాంతములు గానివి యని రెండు విధము లై యుంట, నాభేదమును బ్రధానము చేసి ద్రు.ప్ర.,కళ యనుసంజ్ఞలను లాక్షణికు లేర్పఱచియుందురు. భాషాస్వరూపావిష్కరణము కాని శాస్త్రమునందుఁ బ్రత్యేకప్రయోజనము నుద్దేశించి యివి యేర్పఱుపఁబడలే దేమొ యనితోఁచు.

కళాద్రుతప్రకృతికసంజ్ఞల నేర్పఱచుటలో శాస్త్రప్రణాళికలో నెది యేని విశేషప్రయోజన మున్న దేమో యిప్పటికి స్పష్టము గాకున్నది. భావిపరిశోధనములం దేలఁగల దని యాశింతము.

## ద్రుతోపజీవులు :

కళాద్రు. ప్ర. సంజ్ఞల యేర్పాటే యనవసరమా యనిపించుచుండఁగా ద్రుతోపజీవిన శ్శబ్దాః కేచి త్సంకవిసమ్మతాః అని బా.వ్యా. ద్రుతోపజీవు లనునింకొక భేదమును ప్రస్తావించినది.

ద్వి.ఆ. ద్రుతప్రకృతు లనుసంజ్ఞ నుపయోగింపలేదు. ఇతఁడు ద్రుతోపజీవిశబ్దము లని యొక్కస్థలమునందుమాత్రమే వ్రాసెను. (381) అని తె.వ్యా.వి. ద్రుతోపజీవిశబ్దము లనుపదమును క్రొత్తగాఁ బరిచయము చేసినది. ఇది పైకారిక ననుసరించి చెప్పఁబడిన దనుట స్పష్టము. కొన్నిశబ్దములు ద్రుతోపజీవనములే (381) యని యచ్చటనే యింకొకక్రొత్తఁదనము చూపినది. కారికయందలి 'ద్రుతోపజీవినః' అనునది తప్పముగా నిట్లయిన దన్నమాట. ఇది సరి కాదు. ద్రుతోపజీవినః అనుచో ద్రుతోపజీవిన్ అనునది ప్రాతిపదిక మది నకారాంతము. దీనికిఁ దెలుఁగు ద్రుతోపజీవి యని యేకవచనమును ద్రుతోపజీవు లని బహువచనమును దత్సమరూపములు ప్రథమయం దేర్పడును. వరుసలవారు కొన్నిశబ్దములు ద్రుతోపజీవిశబ్దములే (389) యనుటను బేర్కొనుచుండియు తె.వ్యా.వి ద్రుతోపజీవిశబ్దములు, ద్రుతోపజీవనము లని వింతగాఁ బ్రయోగించుట యచ్చుపొరపా టనరాక ప్రామాదికమ యనఁదగియున్నది.

ఈ ద్రుతోపజీవులలక్షణ మేమో బా.వ్యా. స్పష్టము చేయుట లేదు. ద్రుతప్రకృతిక మనుదానికంటె ద్రుతోపజీవి భిన్నమా?

వజ్ఝలవా రివి భిన్నము లని భేదము నిట్లు పేర్కొనిరి. 'సముచ్చయార్థవిశేషబోధక మగుద్రుతరూపమున్ శబ్దము (మున్ అనుటయు నది ద్రుతరూప మను

టయు విశేషము.)తోఁ గలిపి ప్రయుక్తి జరుగుచున్నవే ద్రుతోపజీవులు' (వ్యా. సం.స.౮౮) ఈ యభిప్రాయముతోనే వీరు నే నెప్పుడుఁ గొల్చెద నిత్యాదౌ సదా పర్యాయో ద్రుతప్రకృతిసంజ్ఞికః ఈ ప్రాఁత ప్రామాదిక(వ్యా.సం.స.౮౮)మని యహో.ప్రమాదమును బేర్కొనిరి. కాని యీయహోబలుఁడే ప్రస్తుతకారికా వివరణసందర్భమునందు మిక్కిలిన్ అప్పుడున్ ఎప్పుడున్ ఇత్యాదయశ్శబ్దాః ద్రుతోపజీవినః కవిశి౫౦౭)అని యెప్పుడున్ అనుదానిని ద్రుతోపజీవి యనియుఁ బేర్కొనెను. అహో.యిట నుదాహరించిన-క్రమ్మఱన్ మొద లగువానిని బేర్కొని పజ్జలవాని విసర్జించియున్నారే కాని యింతకుమందు ద్రు.ప్ర. యన్న యెప్పుడున్ అనుదానిని నిట ద్రుతోపజీవి యనుటను ప్రస్తావింపరైరి. యదాతదార్థౌ ఎప్పుడు అప్పుడు ఇత్యేతౌ శబ్దౌ, నే నెప్పుడుఁ గొల్చెద నిత్యాదౌ సదా పర్యాయః (కవిశి.౨౫౪) అనుటలో నహో. ఎప్పుడున్ అనుదానిని యదార్థక మైనయెప్పు డనుదానికంటె భిన్నఁమగు ప్రత్యేకశబ్దముగనె భావించె నేమో. ఎప్పుడు-ఎప్పుడున్ అనువాని కర్థమున గలభేద (యదా—సదా) మందుకుఁ గారణము గానోపును. అహో. దీనితోపాటు మిక్కిలిన్ అనుదానింగూడ నుదాహరించెను. మిక్కిలిన్ అనుచోట ద్రుతము సముచ్చయాద్యర్థకనువర్ణకసంబంధి గాదు. యుఁ ప్రత్యయము రాకుంట గాని వచ్చి లోపించుట గాని యహో.సమ్మతము గాదు గదా. ఇంతను గ్వచిత్ప్రత్యయ యోగేఽపి తథాత్వ మభిధీయతే యనుకారికయొద్ద మిక్కిలియున్ అని యుదాహరించినాఁ డహో. (అహం సద్ధాయనుపూర్వార్థము ననుసరించి) ప్రత్యయయోగమున ద్రుతము లోపించుటకట నిది లక్ష్యము, కావున మిక్కిలిన్ అనునది సహజముగనె ద్రుతాంత మనియు యుఁప్రత్యయయోగమున నా ద్రుతము లోపించిన దనియు (పౌరపాటె యైనను) నహో.యభిప్రాయము. ఎప్పుడున్ అనునదియు నిట్లు సహజ ద్రుతాంతమగు యదార్థకశబ్దభిన్నముగాఁ దలఁచె నన వీలు లేకపోలేదు. కాని యిచటనే యుదాహరించిన-అప్పుడున్ అనుదానిలోని ద్రుతము సముచ్చయాద్యర్థకనువర్ణ సంబంధియె యనకతప్పదు. దీనింబట్టి దానివెంట నుదాహరించిన ఎప్పుడున్ అనుచోను ద్రుతము విశేషార్థకనువర్ణసంబంధి యన నవకాశ మేర్పడియున్నది.

వి.వి.లోఁ దరువాత — 'సంబంధ స్త్రీజ్యబంతాభ్యాం పూర్వత్ర చ పరత్ర చ యనుభాగమున కర్థము చేయుచు నహో. తద్దయు పేడ్కన్, వేడ్కచేఁ దద్దయున్ తద్దయు నూఁడెన్, ఇత్యాదిక మన్వయ ఉదాహరణ (కవిశి-509) మ్మని యన్వయసందర్భమున నన్నియు విశేషార్థక (ము) నువర్ణకాంతములనె యుదాహరించెను. దీనినిబట్టి యాత డివి ద్రుతోపజీవులుగా నెంచుట స్పష్టము. పూర్వము ద్రు.ప్ర. సంజ్ఞ వివరించునపుడు గూడ వీని నుదాహరించుట గమనింపవచ్చును. ఇట్టులె యెప్పుడున్ అనునది సైతము సముచ్చయాద్యర్థకప్రత్యయాంతమె యని యాతఁ డెంచె ననుట కవకాశము లేకపోలేదు. క్వచిదర్థవిశేషే స్యుః అని చెప్పఁబడుటంజేసి యదార్థక మైన యెప్పుడు ఈ నువర్ణకముచేరికచే సదార్థక మగుట యసంభవము గాదు గదా. నిజము నంతియ.

ఏ మైనను మిగులన్(మిక్కిలిన్)మున్నగు ద్రు.ప్ర.లతోపాటు అప్పుడున్ మొ॥ సముచ్చయాద్యర్థకనువర్ణకాంతాలనుగూడ ద్రుతోపజీవులుగా నిట నుదాహరించినయుహో. ద్రు.ప్ర.ద్రుతోపజీవులను భిన్నములుగాఁ దలఁపలే దనిమాత్రము స్పష్ట మగుచున్నది. ఇంక నెప్పు డనుదానిపై నర్థవిశేషమున నీద్రుతము రాఁగా నేర్పడినఎప్పుడున్ అనునది ద్రుతోపజీవి యనియు నహో. ద్రు.ప్ర. యనుట ప్రమాద మనుటంబట్టియు నివి రెండు పేర్వే అనియు ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లు గా నేర వనియు వజ్ఝలవారు తలఁచినట్లు స్పష్టము, ఇంకను స్పష్టముగా ద్రుతోపజీవినశ్శబ్దాః అను నథర్వణవచనము నరయక సూరి ఎంతయున్ అయ్యున్ అనువానిని ద్రుతప్రకృతికములుగా నుదాహరించెను. అవి ద్రుతోపజీవి శబ్దములే కాని ద్రు.ప్ర.లు గా (వ్యా.సం.స. 89) వని సూరిమతమును విమర్శించిరి. అథర్వణవచనములయభిప్రాయము వజ్ఝలవారివలె సూరికి నుం డెవ్వమను జెప్పకుంటయు సూరికిని వఝలవారికివలెఁ దోఁపకుంటయుఁ గారణ మనవచ్చు. అయినను సూరిమతము చిం.సమ్మతము.

వఝలవారికిఁ గల యీభేదాభిప్రాయ మహోబలునకు లేదు. సముచ్చయాద్యర్థకనువర్ణకాంతములను ద్రు.ప్ర. అని స్పష్టముగా నాతఁడిట్లు పేర్కొ

నెను. కించ సువర్ణకే ఉ ప్యల్లోపే ద్రుతప్రకృతికత్వం సిద్ధ్యతి. తేన కళా

సంజ్ఞికానాం సర్వేషా ముదన్తానాం విశేషార్థే విహితేన సువర్ణకేన ద్రుతప్రకృతి
కత్వం సిద్ధమ్ అనుతాం యువర్ణాన్తత్వ మేవ తదుపరి సువర్ణక ఇతి వివేకః
(కవిశి. 178) సువర్ణకమునం దుల్లోపము రాఁ దదంతము లెల్ల ద్రు.ప్ర. లవు నని
స్పష్టముగాఁ జేర్కొనెను. కాఁగా నిట్టిసువర్ణకాంతములే ద్రుతోపజీవు లని
యహో. భావింపలేదు గాని ద్రుతోపజీవు లని వజ్ఝలవారు పేర్కొనుచున్నయివ్వా
నిని ద్రు.ప్ర. లనియుఁ దలఁచుట స్పష్టము.

కాని పరిశీలింపఁగా స్పష్టముగాఁ జెప్పని యహో.మతమందే యీయర్థ
విశేషదసువర్ణకాంతములను ద్రుతోపజీవు లనుట కవకాశము గలదు. కాని
స్పష్టముగాఁ జెప్పిన వజ్ఝలవారి మతమునం దీయవి ద్రుతోపజీవు లయ్యెడునవ
కాశము లేదు.

విశేషార్థకప్రత్యయములు వజ్ఝలవారిమతమున ఉను అనునవి. వీనిపై
వీని మఱల నన్యే ద్రుతప్రకృతయ యనుసూత్రముచే ద్రుతము చేయుదురు.
కావుననే ద్రుతోపజీశబ్దార్థవివరణమున "సముచ్చయాద్యర్థవిశేషబోధక
ద్రుతరూపనున్" తోఁ గలసి ...."అనిరి. నున్ అన్నప్పటి నకార మన్యే ....
సూత్రముచేత నయినదే. అన్యే ద్రుతప్రకృతయ యనునది కళాభిన్నము లగు
ద్రు.ప్ర.లనుగూర్చి గదా చెప్పుచున్నది. అట్లు ద్రు.ప్ర. లైనశబ్దములకే యా
సూత్రము ద్రుతమును జేర్చుచున్నది. వజ్ఝలవా నిది యంగీకరించియే యుండిరి.
అట్టి యెడల ద్రు.ప్ర.లపై నాసూత్రముచే వచ్చెడుద్రుతము గలిగినశబ్దములకు
ద్రు.ప్ర.సంజ్ఞ లేకుండుట యెట్లు ? ద్రు.ప్ర. యయినఁ గాని చివర ద్రుతము
చేరదు గదా!

వఝలవారు ఉః ఉను శబ్దములు చార్థకావ్యయములు. అన్యే ద్రుతప్రకృత
యః అను చొప్పున ద్రుతప్రకృతికములు. ఉ వర్ణకళ్ళాద్యాన్తాః అను చొప్పున

వచ్చిన ఉను వర్ణకములు ద్రుతప్రకృతికములు (వ్యా.సం.స. 300) అనిరి. అనఁగా ద్రుత మంతమందుఁ జేరునది ఉ.ను.లకు. కావున నీయవి ద్రు.ప్ర.లే. ఇట్టి ద్రు.ప్ర. లైన ఉన్-నున్ అనునవి యంతమందుఁగల (అన్నయున్ తమ్ముఁడునున్ మొ॥) యవి ద్రుతోపజీవు లన్నమాట. ఇది కొంతవఱ కేని నయమే. కాని వీ రింతకు మున్ను ద్రుతరూపమున్‌శబ్దముతో గలసి యని పేర్కొనిరి. ద్రుత రూపమున్ శబ్ద మన నేమి? నున్ అనునది మొత్తము ద్రుతమే యగునా? రాముడునున్ కృష్ణుఁడునున్ అనుచో నున్ అను ద్రుతమునకు బిందువు రా రాముఁడుఁ గృష్ణుఁడునున్ అని యవునా? సముచ్చయాద్యర్థక బోధకమగునది నువర్ణకము కాఁగా సముచ్చయాద్యర్థవిశేషబోధక మగుశబ్దము నున్ అనునది ద్రుతరూప మనుట సమంజసముగా లేదు.

అయిన ద్రుతాంతము ద్రు.ప్ర. గాఁగా ద్రుతప్రకృతికాంతము(నున్)ద్రుతోప జీవి యగు నన్నమాట. కానీ వరుసలవారియీభేదకల్పనము సముచితముగా లేదు. యువర్ణక స్యాద్యన్తాత్తు నువర్ణక ఉతో భవే త్తని వి.వి. యునులను వర్ణకములుగాఁ బేర్కొన్నది. ఇవి ప్రత్యయము లవుటచే నపదములు గదా. ప్రత్యయములను ద్రు.ప్ర. లనుట యొప్పునా? అందుకే వాఁబోలును వారు వర్ణశబ్దము నకు శబ్ద మని యర్థము చేసియుందురు. అది సరి గా దని స్థలాంతరమున స్పష్ట మగును. నువర్ణమే ద్రుత మనియు నీయది ద్రుతాంతము గానేర దనియు నట స్పష్టము. కాఁగా నువర్ణమే ద్రుత మవుటంజేసి తదంతమును ద్రుతాంతమే.

పైఁగా వ్యాఖ్యలవారు తమయభిప్రాయమును బాల.లో నయితము సమన్వ యింపఁ జూచుట వింత. సముచ్చయాద్యర్థకనుశబ్దము ద్రుతప్రకృతికము. కాని దానికిఁ బ్రత్యేకప్రయోగము లేమింజేసి ఎంతయు అయ్యనువానితో జోడించి (89) అని వ్రాసిరి. నుశబ్దము ద్రుతప్రకృతిక మనునభిప్రాయము చిన్నయ కును నున్న దని చెప్పఁబూనుట సత్యము గాదు. ను అనునదే ద్రు.ప్ర. యయిన యెడల నూరి దివంబునుబోలె ననుచో ద్రుతముమీఁద నకార మయ్యె ననుట

నేల యుదాహరించెను? సుశబ్దమే ద్రు.ప్ర. యగుటంజేసి దివంబునను అనియే మొదట నుండును గదా. దీనిపై నిం కొకనకారము వచ్చిన దివంబునునుం బోలె నని కావలె. కావున వఝులవారు పేర్కొన్నట్లు సుశబ్దము ప్రత్యేకముగాఁ బ్రయుక్తమవుట లేదు గాన నెంత అయి యనువానిపయిఁ జేర్చిచూపె ననుటయు నొప్పదు. సువర్ణమే ద్రు.ప్ర. యమనభిప్రాయము సూరికి లేదు. ఇంక నీసువర్ణమే ద్రుతము గావునఁ దదంతము లైనపదములు ద్రు.ప్ర. లవుటకు ఎంతయున్ అనురీతిగాఁ జూపఁదగియున్నది. అది ద్రుతమే గాని ద్రుతాంత మగుపదము గాదు గావున ద్రు.ప్ర.లను జూపుస్థలమున దీని నొక్కదానినే చూపుట కెట్లును వీలు లేదు.

కానీ యిదే సమన్వయమార్గమును నహో.పక్షమున నేల గుదుర్పరాదు? వి.వి.పక్షమునను సుశబ్దము ప్రత్యేకముగాఁ బ్రయుక్తము గాదు గదా. (పైఁగా వి.వి. ప్రత్యయ మనియుఁ బేర్కొన్నది.) కావున నెప్పుడు అనుదానిపైఁ జేర్చి యెప్పుడున్ అనునది ద్రు.ప్ర.గాఁ దలఁచిన నేల చెప్పరాదు.

ఇంకఁ బౌరసాదే మైనను వఝులవారిమతమున ఉసులు ద్రు.ప్ర. లవుటంజేసి ద్రుతప్రకృతికాంతము లగునీయవి ద్రుతోపజీవు లగుటలో వైరుధ్యము గలదా యనవచ్చును. వారిమతమం దయినను ద్రు.ప్ర.లగుటకు ద్రుతోపజీవులను బేర్కొన్న వి.వి. యుసులు వర్ణకములుగాఁ జెప్పఁగా నయ్యవి స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడకున్నను బ్రత్యేకపదము లగుట యెట్లు? అర్థవిశేషములందు విధింపఁ బడినయీవర్ణకములు ముందు చేసి పిదప (అన్నయు- తమ్ముఁడును) వానిపయి అన్యే ద్రుతప్రకృతయ యని ద్రుతమును జేయవలయును. అప్పు డీయవి ద్రు.ప్ర. లవుటయే యొప్పును. ఇంక ఉసులు ప్రత్యేకపదములుగాఁ జెప్పి వి.వి. పేర్కొన్న ద్రుతోపజీవులకు విశేషార్థము కల్పింపవలయు నన్న వి.వి. పేర్కొన్న యనువర్ణకవిధానమును మార్పు చేసికొనవలసియుండును. కాఁగా వఝులవారి సమన్వయము సరిగా లేదనకతప్పదు.

ఇంక నహో. స్పష్టముగాఁ జెప్పకున్నను నాతనిమతమున నిట్టినువర్ణకాంతములు ద్రుతోపజీవులు గూడ నయ్యెడునవకాశ మున్నది కొంతవఱకు. అహో. వజ్ఝలవారివలె వీనిపై ద్రుతము చేరు నని భావించియుండలేదు. స్వరతోపానంతరము నువర్ణకమునందలినకారమే ద్రుత మగు నన్నాఁడు. ఈతనిమతమున అన్నయున్' రాముఁడున్ మొద లగుచోట్ల నున్నద్రుత మన్యే యనుసూత్రముచే నైనది కాదు గాఁబట్టి ద్రు.ప్ర.లనియే కాక ద్రుతోపజీవు లన్నను నంతగాఁ దప్పులేదనవచ్చును. అట్టియెడల ద్రుతాంతము లైనతిజ్మధ్యాదులు ద్రు.ప్ర.పంజ్ఞతోపాటు ద్రుతోపజీవిసంజ్ఞ నందు ననవలయు.

కానీ యిట నన్యే సూత్రముచేత నైన ద్రుతము గాదు గావున నీయది ద్రుతోపజీవు లనవచ్చు నన్నచో నొకయిబ్బంది గల్గును. చేయుదును, కొలిచితిని మొద లగుచోట్ల (వరుులవా రన్నట్లు) నన్యే యనుసూత్రముచేత ద్రుత మగుట లేదు గావుననే తదంతములు (ఉత్తమైకవచననువర్ణకాంతములు) గూడ ద్రుతోపజీవులే కావలయు నేమో యనవచ్చును. కానీ యన్యే యని ద్రుతమును జేసినను జేయకున్నను నియ్యవి కళలపట్టికలోఁ బఠించియుండకపోవుటచేత ద్రు.ప్ర.లే యగును. ఇంక శబ్దగత నకారము ద్రుత మని భావించువారిపక్షమున ఏన్, కన్ ఇత్యాదులలోని నకారము శబ్దగత మైయుండుటయు నునంత మగుటచేఁ గళలు గావునను నిట్టివానిని ద్రుతోపజీవు లని చెప్పవలసియుండు. కాని వజ్ఝలవారు వీని నేలకో ద్రుతోపజీవులసందర్భమునఁ బ్రస్తావించియుండలేదు. పైఁగా ద్రు.ప్ర.లే యనిరి. అట్టియెడ వీరు ద్రుతోపజీవులను నిర్ణయించినదాని కాధార ముండదు. అహో. ఏన్ ద్రు.ప్ర. యనె నన్న నాతఁడు అదియున్ అనురీతిగా వజ్ఝలవారు ద్రుతోపజీవు లన్నవానింగూడ ద్రు.ప్ర. లనియే పేర్కొనె.

ప్రస్తుతస్థలమున నహో. యిచ్చినపాఠము ననుసరించి యుసా సున్యేవ యనులక్షణమునుబట్టి నునంతములపై రావలయు. నునంతములు తిజ్మధ్యేత్యాళ్ల

సూత్రముచేఁ గళలు. దానిపై విభక్త్యయములు చేరినమాత్రమున దానిసంతత్వ
మునకును దప్పోలయునఁ గళాత్వమునకును భంగ మగునవకాశము లేదు.
అందువలననే వినా ద్వితీయం.........స్వస్త్రయో రపి నోఽన్యస్యాపి యమచో
నన్యనువర్ణస్థలమునా నిద్దానిని నహో. వివరించి కళ లెల్ల దీనిచే ద్రు.ప్ర. లగుటను
జేర్కొనెను. కాఁగా సాధారణము లైన ద్రు.ప్ర.లకంటె నింపకవిశేషలక్షణము
గలిగిన ద్రుతాంతము లగుతిఙ్మధ్యాదులను (ద్రు.ప్ర. లనుటతోపాటు) ద్రుతోపజీవు
లనియుఁ జెప్ప దొసఁగు లే దనవచ్చును.

చెప్పనియహో.మతమున వజ్ఝలవారిసమన్వయ మతకు నేమో కాని వారి
గ్రంథము ననుసరించి కుదుపట లేదు. వీరే కవిభల్లటసూత్రమునొద్ద 'అదియును-
అదియున్ మన్నగున వెల్ల దీనికె లక్ష్యము లగు నని యెఱుంగునది (వ్యా.సం.
స. 788)యనిరి. ఇది యహో. యనుసరించినప్రక్రియయే. ఇంక వీరిపద్ధతిలో
అదియున్ + ఉన్ అదియును అని కాఁగా సంతత్యద్రుతలోపము సువర్ణోత్వలోప
ములచే నగునా? లేక అదియును అనుచోట సువర్ణమే యన్యే యనుసూత్రముచే
నైన ద్రుతమా? వా రిట్లు గొంత పొరవడిరి.

వజ్ఝలవారు ద్రుతోపజీవులను బ్రస్తావించునెల్లయెడల సముచ్చయార్థక
ములద్రుతాంతము లని మాత్రమె పేర్కొనిరి. కాని యిట్టివే యొనరఁగిన
విం కొకతీరువవి గలవు. అస్మద్యుష్మద్వాచ్యా దేకత్వఇతో నిపీ పరేషాం
తు ధర్మోక్తమమధ్యమవ త్తనుచిం.లక్షణములు ప్రథమాంతము లగు
నస్మద్విశేషణముల కేకత్వమున నినులను జేర్కొనుచున్నవి. కవిని, భక్తు
డను మొ॥ ఇట నినులు రాకయుండటి కవి-భక్తుఁడు అనునవి కళ లనుట స్పష్టమె.
ఈయవి ప్రథమాంతములే కదా. నినులు చేర్చినమాత్రమున వీనిప్రథమాంతతకు
క్షతి లే దనకతప్పదు. సూరి ప్రథమాంతముల కంటాగమములుగా స్పష్టముగాఁ
జెప్పెను. ఆగమములుగాఁ జెప్పకున్నను నీనినువర్ణాంతము లైనపుడు

ద్రు.ప్ర. లవుచున్నవి. ఇవి రాముని౯ పుం॥ లగువానివంటివిగాఁ జెప్పలేము. సముచ్చయాద్యర్థకనుశబ్దాంతములు ద్రుతోపజీవు లని చెప్పునప్పు డీనినువర్ణాంతము లగునస్మద్విశేషణములును ద్రుతోపజీవు లనియే పేర్కొనవలసియున్నది. కాని వజ్ఝలవా రిట్టివాని నేలకో ప్రస్తావింపలేదు.

అనఁగాఁ దిజ్మధ్యాదిభిన్నములు ద్రు.ప్ర.లే యెప్పుడును. దానికి భిన్నావస్థ లేదు. కాని అన్నయును భట్టుఁడును అనురీతిస్థలము లట్టివి గావు. అవి సహజముగాఁ గళలు. అవియే విశేషసందర్భములందు ద్రుతాంతము లవుట ననుసరించి యపుడు ద్రు.ప్ర. లగును. వీనియన్నింటి నొకతీఁగా గుర్తించుటే లని యెల్లపుడు ద్రుతాంతములై యుండునవి ద్రు.ప్ర. లనియు (స్వాభావికద్రుతాంతములు?) కొన్ని విశేషసందర్భములందుమాత్రమె ద్రుతాంతము లగునపు డట్టివి ద్రుతోపజీవు లనియుఁ జెప్పినఁ జెప్పవచ్చును. అనఁగాఁ దిజ్మధ్యాదిభిన్నములు ద్రు.ప్ర.లు కాఁగా ద్రుతాంతము లగుతిజ్మధ్యాదులు ద్రుతోపజీవు లగు నన్నమాట. లేకను అన్నది ద్రుతాంతమె కాని ద్రుతప్రకృతికము గా దనుటలోఁ బ్రౌఢ.యభిప్రాయము నిదియ కావచ్చును. అనఁగా ద్రు.ప్ర. కా దని ప్రౌఢ. పేర్కొన్నద్రుతాంతమె యీద్రుతోపజీవి యన్నమాట.

అయినను ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లు కా వనరాదు. అనఁగా ద్రుతోపజీవులకు ద్రు.ప్ర.త్వము నంగీకరింపకతప్పదు. ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లకంటె భిన్నము లనురీతివజ్ఝలవారియభిప్రాయము ననుసరించిన వానిద్రుతోపజీవిత్వమె వ్యర్థమగును.

చిం. ద్రుతోపజీవులను బేర్కొనలేదు. ఇంక పరుషా ద్రుతప్రకృతికాత్పరశ్శౌ లుగ్వా ద్రుతప్రకృతికాత్పరతః మున్నగురీతి నాయావిధానములయందు ద్రు.ప్ర. శబ్దము నుచ్చరించుటచే నాయాద్రుతకార్యములు ద్రు.ప్ర.లయందలిద్రుతమునకే విధింపఁబడియున్నవి. ద్రుతప్రకృతికేభ్యో లుక్సంశ్లేషౌ నాచి యనురీతివిభాగముతో వజ్ఝలవారు చేసినసమన్వయము ననుసరించి యప్పరకతలో నగుకార్యము గూడ

ద్రు.ప్ర.లకే చెప్పఁబడిన ట్లయినది. ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లు గా నున్నపుడు ద్రు.ప్ర.ద్రుతకార్యములు ద్రుతోపజీవులకు సిద్ధింపనేరవు గదా. మఱియచ్చోఁ జివరి నకారమునకు ద్రుతత్వము నంగీకరించినఁ బ్రయోజన మేమి? వజ్ఝలవా రచ్చో నన్యే ద్రుతప్రకృతయ యని ద్రుతము చేసినను నున్ అనునది ద్రుతప్రకృతికమే యన్నను దదంతము ద్రుతప్రకృతికభిన్న మనుటవలనఁ బ్రయోజనము లే దనియే చెప్పవలసియున్నది. నున్ అనుదాని ద్రు.ప్ర.త్వమునుమాత్రమే యాశ్రయించి ద్రుత కార్యములు చేయుట యొప్పునా? కొన్నియెడల ను అన్నదే చాద్యర్థకముగాఁ జెప్పిరి. ఇంకను నది ద్రుతరూప మనుటయు గమనించితిమి. యునులు లోపించుటయుఁ గల దనిరి. అట్టిచో నన్యే-సూత్రముచే నైన ద్రుతమే మిగిలియుండును. అట నదియే ద్రు.ప్ర. యనవలెనా?

కాఁగా నహో. ఎప్పుడున్ అనుదానిని ద్రుతోపజీవి యని చెప్పినప్పటికిని ద్రు.ప్ర. యనియుఁ జెప్పుట ప్రయోజనవంతమే యవుచున్నది.

ఇంకఁ జిన్నయయు ద్రుతోపజీవు లనుసంజ్ఞనే స్వీకరింపలేదు. చిం.పేర్కొ-న్నసమాసక మనుసంజ్ఞను [బాల.లో]వలె దీనిని బరిహరించెను. సముచ్చయాద్యర్థక మశబ్దాంతములు ద్రుతోపజీవు లని ద్రు.ప్ర.లకంటె భిన్నముగాఁ బేర్కొ-నుటవలనఁ బ్రయోజనము లేదు. ద్రు.ప్ర.ల ద్రుతమున కాయాకార్యములు విధించుపట్టున ద్రుతోపజీవులను గూడఁ బ్రత్యేకముగాఁ బేర్కొ-నవలసినగౌరవమే కలుగును. ఇంక నవియు ద్రు.ప్ర. లని యంగీకరించుటలో లాఘవ మున్నపుడు ద్రుతోపజీవి సంజ్ఞవలన శాస్త్రమునఁ బ్రయోజన మేమి? కాఁగా ద్రుతోపజీవులనుగూడ, [చిం.మతానుసారముగా] ద్రు ప్ర.లని యంగీకరింపకతప్పదు గావుననే వి.వి.లక్షణ మును బరిశీలించియే ద్రుతోపజీవిసంజ్ఞాకల్పనమువలనఁ బ్రయోజనము లేమి దానిని సూరి విడిచిపుచ్చె నని యంగీకరింపఁదగును. కాన వజ్ఝలవా రహోబలసూరి ప్రభృతుల నాక్షేపించుట సమంజసము గా దని స్పష్టము.

చిం. కళలను జేర్కొని యన్యములు ద్రు.ప్ర. లన్నది. ద్రు.ప్ర.లకంటె భిన్నములు లనుచో నీద్రుతోపజీవులు చిం.మతమునఁ గళలు గావలసివచ్చును. చిం. ద్రుతోపజీవులను బేర్కొనలేదు. కావున వి.వి. ద్రుతోపజీవు లని పేర్కొన్నవి నయితము చిం.మతమున ద్రు.ప్ర.లే యనకతప్పదు. అనఁగా ద్రుతాంతము లై పతిమ్మధ్యాదులును [ద్రుతోపజీవులు?] ద్రుతో న యేషాం స్యా త్తనులక్షణముచేఁ గళలు గాక యన్యే యని ద్రు.ప్ర.లే యగు. కళలనుగూర్చి వివరించుచు వజ్ఝల వారు కళ యనఁగాఁ దుదిని సహజ మగుపొల్లునకారము లేనిది. ద్రుతప్రకృతికము గానిది [84] యని పేర్కొనిరి. కాఁగా ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లు గా వనువీరి సిద్ధాంతము ననుసరించి ద్రు.ప్ర. గానియది [ద్రుతోపజీవి యగుట యట్లుంచి] కళ కాక తప్పునా? ద్రుతో న యేషాం స్యా త్తనుదాని ననుసరించి యివి కళలు గా వన నేమి? బహుశః అందుకే వీ రిట కళ యనఁగా సహజ మగుపొల్లు నకారము లేనిది యని చెప్పియుందురు. ద్రుతప్రకృతికము కానిది యనుతదుపాతి వాక్యమునుబట్టి ద్రుతప్రకృతిక మనఁగా సహజ మగుపొల్లునకారము తుదిని గలది యని యర్థ మయినది. ద్రుతోపజీవులతుదినకారము సహజము గాదు కృతకము కావున నయ్యది కళ గాదు, ద్రు.ప్ర.యును గా దన్నమాట. మరి చిం.మతమున మూఁడవవిభాగమే లేదే. అయినఁ గళ గావలె. కళాభిన్న మైన ద్రు.ప్ర.యే కావలె. ద్రుతోపజీవులు కళలలోను ద్రు.ప్ర.లలోను జేర వన్నవారిసిద్ధాంతమును జిం.లో సమన్వయించుట లేదు. అర్ధానింగూర్చి వీ రిట నేమియుఁ బ్రస్తావింపరైరి. ఇట్లే భక్తుఁడన్ అనురీతివానిఁగూర్చియు.

సహజముగా నుండుట యన్నది యెట్లు? ను [కను] ని [ఏని] న [చక్కన] వర్ణములందలిస్వరములు లోపింపఁగా మిగిలిననకారము ద్రుతమే యనియుఁ దదంతములు ద్రు.ప్ర.లే యనియు వీరిసిద్ధాంతము. కమ్మనితేనె కమ్మన్ తేనె అనుచో నివర్ణకస్యాత్తని నివర్ణకము విహితము. అది శబ్దమున సహజమా? చక్కన్ అనుచో మందుటనవర్ణము సహజమా? చేయుదును కొలిచితిని అనుచో ను,ని అనునవి సహజములా? ఇవి కృతకములే యైనపుడు చేయుదును మున్నగునవి

మాత్రము ద్రు.ప్ర.లె ట్లయినవి. సితమున్ అనుమొదలగుచోట్ల ద్రుతము అన్య అనుసూత్రముచే నవునది. అసూత్రముచే నవునది సహజమా? అట్టియెడ కను కన్ అనుచో శబ్దగతనకారము సహజమా? కృతకమా? సహజమగునకారము గలది యను వాక్యము విస్పష్టముగా లేదు. ఏదే మైనను అన్నయున్ అనుచోట నకారము సహజము గాదు గావున నది కళయు ద్రు.ప్ర.యును గాక ద్రుతోపజీవి యగు నందురా? కప్మన్ + తేనె చక్కన్ + కన్, చేయుదున్ మొద. గుశబ్దములును ద్రుతోపజీవులే కావలయునే కాని ద్రు.ప్ర.లు గావు. మఱి వీనిని వజ్ఝలవారు ద్రుతోపజీవులుగాఁ బేర్కొనక ద్రు.ప్ర. లని యెట్లు దలఁచిరి? వీరివివరణము సరి కాదు.

ద్రుతో న యేషాం తాన్యుత్తమాని ననుసరించి కళాశబ్దములె యైనను జివర ద్రుతము గల్గినచో నవి ద్రు.ప్ర. లగు నని చిం.యభిప్రాయము. ఇట్లు [వి.వి.పేర్కొన్న?] ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లే యవుచున్నవి. సారాంశముగా ద్రుతాంతము లైనపదము లెల్ల ద్రు.ప్ర. లని చిం యభిప్రాయముగాఁ దేలినది.

ఈయభిప్రాయము ననుసరించి సూరి ద్రుతాంతము లైనపదములు ద్రుత ప్రకృతికము లని సాధారణముగాఁ జెప్పెను. దీనివలననే నుశబ్దరూపద్రుతాంత ములను సూరి ద్రుతప్రకృతులలో నుదాహరించెను. పైఁగా సూరి ద్రు.ప్ర.లు గానివి కళ లనుపద్ధతి ననుసరించుటచే నర్థవిశేషాదులందు నుశబ్దాంత మయినపుడు ద్రు.ప్ర. యగుటయు నట్లు గానపుడు ద్రుతాంత మగుపదము గామి కళ యగుటయు సుకరముగా సిద్ధించినది. కాఁగా సూరి ద్రుతోపజీవు లనువిభాగము చేయక ఎంత యున్ అయ్యన్ అనువానిని ద్రు.ప్ర లలోఁ జేర్చుట చిం.మతానుసారముగా విస్మృతపరిశీలనామూలకమే యని స్పష్టమగుచున్నది.

వి.వి, ద్రు.ప్ర.సంజ్ఞ నుపయోగింపలేదు. ద్రుతోపజీవులనె యొక్కచో విశే షముగఁ బ్రస్తావించినది. చిం. ద్రు.ప్ర.ప్రమతమున కని యాయావిధులు చేయు

వి.వి. సూత్రము ద్రుతస్య హలి భిన్నసామాత్రమున్నను విధముగా ద్రుతమున కని సామాన్యముగఁ బేర్కొన్నది. ఈ పక్షమున ద్రు.ప్ర.కన్న ద్రుతోపజీవి భిన్నమన్న నిబ్బంది లేదు. కాని యాభేదము గుర్తించుట కాధారమె గానరాకున్నది. వజ్ఝలవారు ద్రుతోపజీవులుగాఁ బేర్కొన్నవి చిం.మతమున ద్రు.ప్ర.లు గాక తప్పదు. వి.వి కర్తయభిప్రాయ మదియ యైనఁ జిం.వానిని ద్రు.ప్ర.లుగాఁ బేర్కొనుట సరిగా దనియు ద్రుతోపజీవు లనియె చెప్పవలె ననియుఁ జిం.మతమును విరోధించినట్లు చెప్పవలసియుండును.

ద్రుతోపజీవినశ్శబ్దాః కేచి త్తనుట వి.వి. ననుసరించి ద్రుతోపజీవు లనువానిని గుర్తింపకతప్పదు. అవి యేవి? అవి ద్రు.ప్ర.(కళ)లకుభిన్నములా? వి.వి. ద్రుతోపజీవిసంజ్ఞ నేర్పఱచుటచే నుద్దేశించిన ప్రయోజన మేదో తెలిసిన దానింబట్టి ద్రుతోపజీవులను గుర్తింపవచ్చును.

ద్రుతోపజీవులను బేర్కొన్న వి.వి. వానిలక్షణములను సంబంధస్తిఙ్సుబన్తాభ్యాం పూర్వత్ర చ పరత్ర చ యని చెప్పుదానియర్థ మిటఁ దెలియవలసియున్నది. దీని కహో.చేసినయర్థమునే తదనంతరవ్యాఖ్యాతలు లించుమించుగా స్వీకరించిరి. ఇట వజ్ఝలవారితీరు నట్టిదే. అదియాతము.

“తిఙ్సుబన్తాభ్యామ్ తిఙన్తసుబన్తపదములతో, పూర్వత్ర చ పరత్ర చ పూర్వమందును బరమందును (సంబంధః) అద్రుతోపజీవిశబ్దముల కన్వయము సమ్మతమగును. పూర్వత్రాన్వయ- ఎంతయున్ దనకు ఇదియు మొదలుగాన్ పరత్రాన్వయ వివాహ మయ్యెదమున్ వినఁడును గానఁడు న్మఱియు” [వ్యా.సం.స.88] పూర్వపరములయం దన్వయ మనఁగా వీ రిచ్చినప్రయోగములతీరుంబట్టి తిఙంతములకు సుబంతములకు రెండింటికిని రెండువిధము లైనయన్వయ మన్నమాట పూర్వమునం దన్వయ మనఁగా నాద్రుతోపజీవిశబ్ద మేశబ్దముతో నన్వయించునో దానికిఁ బూర్వమునందు వాక్యమునసే ప్రయోగింపఁబడవలయునా? లేక యెచ్చటఁ బ్రయోగింపఁబడినను నన్వయసందర్భమునమాత్రము పూర్వమునం దుండి యర్థము పొసఁగునా?

ఎంతయున్ దనరు వివాహా యమ్యేదమున్ అనురీతిగా వజ్ఝలవారు చూపినలక్ష్యము లనుబట్టి పూర్వోత్రాన్వయసందర్భమునఁ బూర్వమునందే ద్రుతోపజీవిశబ్దము ప్రయోగింపఁబడవలె ననియు నట్లే పరతాన్వయసందర్భమునఁ బరమునందే ప్రయోగింపఁబడవలె ననియు భావించినట్లు తోఁచుచున్నది. అహో.వివరణమును నారా.వివరణమును ద్వైయంశమునే సూచించుచున్నవి. కానీ యది సముచితమా? ఎంతయున్ దనరు అనుచోఁ దనరు నెంతయున్ అని ప్రయోగించిన నాయర్థ ముండ దనఁదగునా? వినఁడును గానఁడు న్మఱియు ననురీతిస్థలమున మఱియు నను దానిలోని కన్వయమో మఱియు ననుదానికే తత్పూర్వాతిదానిలోని కన్వయమో యాసంబంధ మెట్టిదో స్పష్ట మగుట లేదు.

ఇదియు మొదలుగాన్ అనులక్ష్యస్థలమున మొదలుగా నిదియు అని పరత్ర ప్రయోగము (అన్వయము పూర్వమునందుండియే) గల దనలేము. కాని యిట్టిచోట లన్నిద్రుతోపజీవిశబ్దమే కాదు నుశబ్దాంతముగాని యిదిశబ్దముమాత్రమే ప్రయోగింపఁబడినచో మొదలుగా నిది యని యుండవచ్చునా? అట్టిచోట నుశబ్దాంతమగుద్రుతోపజీవిశబ్దమైలక్షణ్య మేమి? (మొదలుగా నిది యని యుండవచ్చునన్న మొదలుగా నిదియు నని యున్నను నిబ్బంది లే దనుట స్పష్టమే.)

దీనింబట్టి చూడఁగా ద్రుతోపజీవిశబ్దము ప్రయోగమువిషయమున నీనియమము లే దనవలె. అనఁగా బూర్వమునం దుండి తిజ్ఞాబంతములతో నన్వయించు ద్రుతోపజీవిశబ్దమవ్వానికిఁ బరమునందునైతేను ప్రయోగింపఁబడవచ్చు. ఇట్లె యియ్యేదము న్వివాహా మన్ననూ నిబ్బంది లేదు. వాక్యమునందు శబ్దప్రయోగమునందలిక్రమమునుగూర్చి చెప్పుట యిం దనవసరము నగును. అన్వయవిధానసందర్భమున శబ్దక్రమమునుగూర్చి విమర్శింపఁ బని లే దనియు నిర్ణయించికొని యిది యన్వయమాత్రవర్ణన మని యెంచుదము.

కాని శబ్దప్రయోగక్రమమును నియమించునది గానిచో నిట్టియన్వయమును నయితము చెప్పవలసినయవసర మున్నదా?

వాక్యమునం దాయాపదములు క్రమనిరపేక్షముగాఁ బ్రయుక్తము లవు వని యన్వయమును నట్లే యుండునా? వీచెను గాలి చల్లగా ననుచో శబ్దములెట్లు ప్రయుక్తము లైనను నన్వయము గాలి చల్లగా వీచె ననియే. అన్వయానుగుణ మైనక్రమములో శబ్దములు ప్రయోగింపవలసినయక్కఱ పెక్కుచోట్ల లే దన్నమాట. భవజ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్కుఁ డసహ్యవిషోగ్రధూమకేతనహతిఁ జేసి చేసె నతిదాంతు కృతాంతనికేతనాతిథిన్ అనుచో శబ్దక్రమమునుబట్టియే యన్వయింపము గదా. అట్టియెడల ద్రుతోపజీవిశబ్దములకుమాత్ర మిట్టిదాని నేల చెప్పవలసివచ్చినది?

అయిన నిట్టియన్వయమువిధానము ద్రుతోపజీవు లగుశబ్దములకుమాత్ర మెయగునా? రాముఁడు చంపినరావణుఁడు అనురీతిస్థలములలో రాముఁ డనుకర్తృపదము పూర్వమునందే యుండి ధాతుజవిశేషణముతోనే యన్వయము గలిగియున్నది. ఏని యున్నగునవి పరముగామాత్రమె ప్రయుక్తము లవుచు నిటఁ జెప్పినపరత్రాన్వయ మనుదానివంటివే యనుదగియున్నవే. రామునేని సీతనేని గంపె, డేసి మొ॥

ఇంక ద్రుతోపజీవులయెడ నిట్టియన్వయము విశేష మైనపుడు వాద్యర్థక సువర్ణకాంతముల కెల్ల నిట్టియన్వయవిశేషము గలదా? అయిన వ్యాఖ్యాత లెల్లరును ఎంతయును మున్నగువానిని జూపరేలో? వజ్ఝలవారు తాము చూపినలక్ష్యములం దన్వయమునుగూర్చి వివరించిన బాగుండెడిది.

అస్తిట్టియన్వయవిధానములో విశేష మేమి? సుంబంతములు తిజంతములు రెండును జెప్పఁబడినవి (ముందుండి) తరువాతిసుప్తిజంతములతో నన్వయించు ముం దున్నసుప్తిజంతములతో నన్వయించుభాషలో నేయొక్కపదమున కేని యిట్టి లక్షణము లేకుండునా? అయిన నిట నొక యనుమానము. దేనితో నన్వయము గల్గియున్నదో దానికిఁ బూర్వముననో పరముననో యీద్రుతోపజీవి యవ్యవధానముతో

ముండవలయు నని యభిప్రాయమా? అట్టిది పైని పేర్కొన్న ధా.వి. ప్రభృతులకుఁ గలదు. ధా.వి.లతో నన్వయము గల్గునవి పూర్వమునందే యవ్యవహితముగాఁ బ్రయోగింపఁబడుట సమాసములందునయితము గానవచ్చు. ద్రుతోపజీవుల వైశిష్ట్య మేమి? అన లివి యవ్యవహితముగనే యుండునా? సుబంతములు తిజంతములు రెండును పేర్కొనఁబడుటం జేసి యవ్యవహితము లగుట గుదురు నని తలంపరాదు. వచ్చెను రాముఁడున్ అనుచో వచ్చె నంతట రాముఁడున్ అని ప్రయుక్త మైన దనుకొందము. అంతట రాముఁడును వచ్చెను అనియే గదా యన్వయము. రాముఁడున్ అను ద్రుతోపజీవిశబ్దమునకు వచ్చెను అను తిజంతముతో నన్వయము. కాని నడిమి యంతట యనుదానితో వ్యవధానము లేదా?

వి.వి.కర్త యిదే యర్థము నుద్దేశించెనా? అయిన నది వ్యర్థము. అసలు ద్రుతోపజీవిశబ్దమునకు సముచ్చయార్థకనువర్ణకాంత మనియే తత్కర్త భావించె ననుట విశ్వసించుటకుఁ దగిన ప్రమాణము లభ్యము గాకున్నది. ద్రుతోపజీవిశబ్దార్థము సంబంధః అను నీకారికచేత గుర్తింపవలసియున్నది. ద్రుతోపజీవు లనుదానికి నుశబ్దాంతము లనురీతిగా వజ్ఝలవారు చేసినయర్థము ననుసరించి ద్రుతోపజీవులకే సంబంధః అను నీకారిక యన్వయమును విధించుటలో వానియందలి వైలక్షణ్య మేని నీయన్వయమునందలి వైశిష్ట్య మేని స్పష్టము గాదు. కారికార్థము నింకను విస్తరించి వివరింపక యహోబలాదులవలె లక్ష్యప్రదర్శనముతో నాగిపోవుటచే వీరు దీనిం గూర్చి విశేషముగాఁ బరిశీలింపలే దనిపించుచున్నది.

ఒకవేళ తిఙ్సుబంతాభ్యాం పూర్వత్ర చ పరత్ర చ అనుచో యథాక్రమ మైన యన్వయము నుద్దేశించి తిజంతములకుఁ బూర్వమునను సుబంతములకుఁ బరముగను నుండుట యనుసంబంధమును జెప్పఁదలఁచెనా? పూర్వత్ర పరత్ర యనురెంటిని తిఙ్సుబంతములను ప్రత్యేకముగా నన్వయించుటలో విశేషము గానరాకున్నది గావున నిట్లర్థము చేయఁదగు నేమో యని యనుమానము. (చశబ్దములు పాదపూరణార్థకము లగుట నింద్యము గాదు గదా.) అట్టియెడల దీనిలక్ష్యముల నిట్లు గుర్తింపవచ్చును వలయ్యాదిక్రియలకుం గర్తయగుభావంబునందు నుజిత్తై యేర్పడినచూడ

లేదు మున్నగునవి తిఙంతములకుఁ బూర్వ మున్నవానికి సరిపడును. ఇట లేదు చూడ ననుతీసగా నుండదు గదా. వలయును జూడ ననుచో నర్థమునఁ జూడ వలయు ననుదానికంటె నించుక భిన్నక్రమమును గమనింపవచ్చును.

ఇంక సుబంతములకుఁ బరముగా నుండి మాత్రమే యన్వయించున వేవి? ఇవార్థకము లైనవవె, పోలె, బలె లెప్పుడును సుబంతములకుఁ బరముగనె ప్రయుక్త ములగుచు నన్వయించుచున్నవి. రామునివలెన్ చంద్రుండుబలె మొ॥ ఏని ద్రు.ప్ర. యని నిర్ణయింప నగుపక్షమున నిట్టివానిలోఁ జేర్పఁదగినది. ఏని వలెప్రభృతులలో. దగు నన్నమాట. కాని యీపక్షమునను వంటి,ఏసి మున్నగునవి కొన్నియితర ములు గానవచ్చు. అయిన నీపక్షమున లక్షణము చాలవఱకు సార్థకము గాఁగలి దని తోఁచుచున్నది.

కాఁగా ద్రుతోపజీవు లనఁగా వలె, సుఙ్యంతములు మొ॥ ఇవి ద్రు.ప్ర.లే యగును. ద్రు.ప్ర.లలోనె కొన్నింటిని ద్రుతోపజీవు లని వి.వి. పేర్కొని వాని ప్రయోగమందలివిశేషమును వివరించిన దనవలయును.

వరులవా రిట ద్రుత (ఉపజీవినః) సముచ్చయాద్యర్థవిశేషబోధక మగుద్రుత రూపనున్‌శబ్దముతోఁ గలిసియే ప్రయుక్తము లగుచున్న- కేచిత్ శబ్దాః కొన్నిశబ్ద ములు సుకవిసమ్మతాః (88) అని యర్థము చేసిరి. ద్రుతోపజీవి యనుట దన్వ యించుటకుఁ గాఁబోలు వీరు నున్‌శబ్దము ద్రుతరూప మని యిట ననిరి. కాని వీరే సముచ్చయాద్యర్థకనుశబ్దము ద్రుతప్రకృతిక మనుట మఱచిరెట్లు? నున్-ద్రుత ప్రకృతిక మన్నఁ దదంతములు ద్రుతోపజీవులు గాక ద్రుతప్రకృతికోపజీవు లగును గాన నిట నున్‌శబ్దము ద్రుతరూప మని రనవచ్చు. నుశబ్దవిషయమున వజ్ఝల వారు విభిన్నములుగాఁ బేర్కొనుట స్థలాంతరమున స్పష్టము. (చూ.ద్రు.)

ద్రు.ప్ర. ద్రుతానుజీవి. ఇది ద్రుతోపజీవి. కావున నెప్పుడు ద్రుతాంతము లై యుండునని ద్రుతానుజీవులు, ద్రు.ప్ర.లు కాఁగా నర్థవిశేషాదిప్రత్యేకావస్థలందు మాత్రమే ద్రుతము గల్గియుండునవి ద్రుతోపజీవు లనియు ననఁగా ద్రుతాంతము

లగుతిఙ్మధ్యాదులు ద్రుతోపజీవులును తిఙ్మధ్యాదిభిన్నములు ద్రుతానుజీవులు ద్రు-ప్ర. లనియు భేదము నూహింప వచ్చుఁ గుదురకున్నది. సంబంధ స్తిఙ్సుబన్తాభ్యా మ్మనుదానిచే సంబంధవిశేషలక్షణము గుదిరినపుడె యవి యేవి ద్రుతోపజీవు లనవల సియుండె. ద్రుతాంతము లగుతిఙ్మధ్యాదులయెడ నీసంబంధవిశేషము సమన్వయించునా? (ఇవి ద్రు.ప్ర.లకంటె భిన్నము లనుట యనర్థక మగుట తప్ప దిష్పక్షమున)

చూడరాదు సన్నువలె మున్నగురీతిని సంబంధః మున్నగుకారికచే నుద్దిష్టని. లని యంగీకరింపఁదగు నేమో. తగ దన్నను సంబంధః అనుకారికచే నిర్దిష్టమగు నర్థము నెయ్యది తత్కర్త యుద్దేశించెనో నిర్ణయింపరాకున్నది. ఇంకను నిశితముగాఁ బరిశీలింపఁదగును. అట్లయ్యు నుశబ్దాంతము లనురీతి నర్థము సముచితముగా నరిపడకుండుటంజేసి సంబంధః మున్నగునికారిక ననుసరించియును నట్లు నిర్ణయింపకుండుటయే యుచితము. కాఁగా సహోబలాదుల సమన్వయమార్గము చింత్యము.

అనుజీవిశబ్దమునకువలె నుపజీవిశబ్దమునకు నాశ్రిత మని యర్థము. కాఁగా ద్రుత మున్నవి ద్రు.ప్ర. లన్నట్లే ద్రుతోపజీవు లనఁదగు. ఇది సంజ్ఞ గాఁగా దీని యర్థము చెప్పవలసినపని లేదు గాని చిం. అనుజీవితద్రుతాః అని వివరింపఁగా వి.వి. ద్రుతోపజీవు లనుట ననుసరించి యర్థము నెన్నుటయె. ఇంక సారాంశముగాఁ గొన్నిశబ్దములకు ద్రుతోపజీవి యనుసంజ్ఞ గలదు. సమాసములలో నాచ్ఛికసమాసములకు సమాసక మనువిశేషసంజ్ఞవలె హల్లులలోఁ బరుషాదులవలె ద్రు.ప్ర.లలోఁ గొన్నింటికి ద్రుతోపజీవి యన్నది విశేషసంజ్ఞ. ఎట్టిద్రు.ప్ర.లు ద్రుతోపజీవు లగునో లక్షణమున స్పష్టముగా నిర్ణయించి చెప్పఁబడలేదు గావున సంబంధ స్తిఙ్సుబన్తాభ్యా మ్మని చెప్పినద్రుతోపజీవులలక్షణమునుబట్టి ద్రు.ప్ర.లలో నేకొన్ని ద్రుతోపజీవు లవునో గుర్తింపవలెను. అట్టియెడల వలెప్రభృతు లని గుర్తించుట యొప్పు. (చూడన్ ఇత్యాదిమధ్యంతములద్రుతము విశేష మైనను వలె నిత్యాదుల ద్రుతము శబ్దమున సహజ మైయుండు విశేషము.) ఇది యంగీకార్యము గా దన్నను సంబంధః ఇత్యాదికారికార్థము నిర్ణయించి దానింబట్టి ద్రు.ప్ర.లలో నేవి ద్రుతోపజీవులో గ్రహింపవలసియున్న దనుట తప్పదు.

ఏ యర్థముతో నైనను ద్రుతోపజీవు లనురీతి ప్రత్యేకవిభాగమువలన నీశాస్త్ర మునం దెట్టిప్రయోజనమును లేదు. చిం. ప్రస్తావింపలేదు. ప్రయోజనహైన్యము ననుసరించియే సూరిప్రభృతులు ద్రుతోపజీవు లనువిభాగమును బరిహరించి ద్రు.ప్ర. లనుమాత్రమే పేర్కొనుట జరిగినది. అదియే యుక్తము గూడ.

ద్రుతోపజీవు లనురీతివిభాగమె యిట్లనవసర మనఁదగియుండఁగా తె.వ్యా.వి. ఈ భాషలోనిపదములను నాలుగువిధములుగా విభజించుచు నిట్లు పేర్కొన్నది. 1. ద్రుతప్రకృతికములు (శబ్దావయవద్రుతము కలవి.) 2. ద్రుతాంతములు (లేకను కాఁబోలును) 3. ద్రుతోపజీవిశబ్దములు (అర్థవిశేషబోధకనుశబ్దముతోఁ గూడినవి.) 4. కళలు (370) ఈవిభాగములోఁ గొంతయసామంజస్య మున్నది.

పై వానిలో మొదటిమూఁడింటి నొకేవర్గముగా సూరిప్రభృతులు పేర్కొని రని గుర్తించుచువాఁడు (ii (iii) యొ (ఈయభాగ మువచ్చుపొరపాటు గావచ్చును) కే అర్థసూచకముగా నేర్పడినవి. (371) యనితి. అవ లిరెంటిని వేఱు చేసినవా రెవరో స్పష్టము కాలేదు. ద్రుతోపజీవు లన నర్థవిశేషబోధకనుశబ్దముతోఁ గూడిన వని, తె.వ్యా.వి.యే పేర్కొన్నదాని ననుసరించి ప్రౌఢ. పేర్కొన్న ద్రుతాంతములు వి.వి. పేర్కొన్న ద్రుతోపజీవులు నొక్కటే గాని వేఱు గావు. ప్రౌఢ. లేకను అనునది ద్రుతాంత మనియు ద్రుతప్రకృతిక మని భ్రమింపరా దనియుఁ బేర్కొన్నది. అయ్యది ప్రౌఢ. శబ్ద. 118 చే నైననుశబ్దమే కాని వేఱు కాదు. (తె.వ్యా.వి. 368) ఇచ్చటిను సముచ్చయార్థ.ఇది ద్రుతము (364) కాఁగా సముచ్చయాద్యర్థకనుశబ్ద మంతయుందుఁ గలదానినే ప్రౌఢ. ద్రుతాంత మనెను. (ఉద్ద్యోతినివ్యాఖ్యాభిప్రాయము నిదియ) అనఁగా లేకను అన్నది యిట్లు ద్రుతోపజీవియే యవునుండఁగా నద్దానిని ద్రుతోపజీవులనుండి వేఱు చేసి ద్రుతాంత మనుట యెట్లు గుదురును? నద్దానికి ద్రుతవిరహితముగాఁ బ్రయోగ ముండదో యది ద్రుతప్రకృతిక మనియు నెయ్యది ద్రుతవిరహిత మైయుండి యర్థవిశేషబోధక మగు నుశబ్దముతోఁ జేయుటచే ద్రుతాంత మగుచు నుండునో యది ద్రుతప్రకృతిక మని పించుకొనక ద్రుతాంత మనిపించుకొను ననియు గ్రహింపవలెను (వ్యా.సం.స.92)

తె.వ్యా.వి. ద్రుతాంతముగా నిం కొకయుదాహృతి చూపియున్నది. అది కాఁబోలును అనునది. కాఁబోలును అనుదానిలోని నువర్ణము సముచ్చయాద్యర్థకము గాదు. కావున ద్రుతోపజీవి కాదు. కాని ప్ర.ప్ర.యే. పోలును అనునది తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనరూపము. (కాన్-నుజ్యంత మగునగుధాతువురూపము) లాట్టుడుజ్ఞనకు నాదేశ మైనయీనువర్ణకముచే నీయది ద్రు.ప్ర.యే గదా యనునది.

ద్రు.ప్ర. లనఁగా శబ్దావయవద్రుతము గలవి యని పేర్కొనుటచే తె.వ్యా.వి. ప్రత్యయాగమాత్మక మైననువర్ణాంతము ద్రు.ప్ర. కాక ద్రుతాంత మవు ననియు, నవ్యయాత్మకనుశబ్దము మంతమందుఁ గలవి ద్రుతోపజీవు లనియు భేదము పాటించినదా? అట్లు స్పష్టముగనే చెప్పవచ్చును గదా. పేటిక పోలె నిత్యాదులు (శబ్దావయవద్రుతము కలవి) ద్రుతప్రకృతులు దత్సాంగ గలయవి ద్రుతాంతములు నయ్యెడి (19, 20) నరె. కాని తె.వ్యా.వి. ఈ యభిప్రాయమును దిరస్కరించినది(388, 389)అయినను నిట్టియభిప్రాయము శబ్దశాస్త్రకర్తల కున్నదా? అట్లయ్యెను నుశబ్దాంత మగులేకను అనుదానిం గూడ నిటుఁ జూపుటచే నట్టియభిప్రాయ మిట గ్రంథకర్తకు లే దనవలె. లేకను అనున దొక్కటి ద్రుతాంతములలోను ద్రుతోపజీవులలోను రెండువర్గములలో నెట్లుచేరు? కాఁగా ద్రుతాంతములు ద్రుతోపజీవు లను వానిని వేఱు చేయరాదు, (ద్రుతోపజీవు లనుదానికి తె.వ్యా.వి. అంగీకరించిన యర్థము ననుసరించియు.)

అసలు ద్రుతాంతము లనునది తత్స్వరూపకథనమే కాని ప్రత్యేక మగునొక సంజ్ఞగా నంగీకరింపవలెనా? వలెను అనుచో నున్న ద్రుతము శబ్దావయవమే. అయిన నందు ద్రుత మంతమందే యున్నది. ద్రుతాంత మనరాదా? తాను తనచేతను అనుచోఁ జివరనే ద్రుత మున్నది. లేకను అనునది ద్రుతాంత మనియే తె.వ్యా.వి. పేర్కొన్నదే గద. కాఁగా నివి యెల్ల ద్రుతాంతములె. ద్రుతాంతము లైనపదము లనుచో సూరిలక్షణమునఁ బ్రత్యయాగమావ్యయాత్మక మైననువర్ణకాంతములు సహజద్రుతాంతములు నెల్ల గ్రహింపఁబడినవే కదా. ఇంక లేకను అనునది

ద్రుతాంత మనియు ద్రు.ప్ర. యని భ్రమింపరాదనియుఁ జెప్పుటలోఁ ప్రౌఢ.యభిప్రాయములోను నయ్యది సంజ్ఞగా గ్రహింపఁ బని లేదు. లేకను అనుచోఁజివర ద్రుతము గలిగి యది ద్రుతాంత మైనపద మయినది గదా యని ద్రు.ప్ర.యే యను కొందు రేమో, ద్రుత మంతమం దున్నమాత్రమున నది యనఁగా కళ్యంతము సహజముగా ద్రు.ప్ర. యనుకొనరా దనియు లేక యనుకళయె యట ద్రుతాంత మైన దనియుఁ జెప్పుటయే ప్రౌఢ.యభిప్రాయముగా గుర్తింపఁదగును.

నిజమునకు ద్రుతాంతము లైనపదములు ద్రు.ప్ర. లనులక్షణము ననుసరించి ద్రుతాంతము వేఱను ద్రు.ప్ర. వేఱు నని చెప్ప వీలు లేదు. అయినను తె.వ్యా.వి.వ్యతిరేకక్త్వార్థకరూపమును వైకల్పికద్రు.ప్ర.యనుటను దిరస్కరించుటకై ప్రౌఢ. యిట్లు చెప్పియుండవచ్చు. (చూ.త్రి.శే.)వై.చం.అందుకిపుచుకా వా (సంధి 8)అనికవర్గాంతము వికల్పముగా సద్రుత మగును. అందుః జహాదేశౌ కిఙాచ వర్తమానే చువర్ణకశ్చ క్త్వాగేశః కశ్చ సద్రుతసంజ్ఞా వా స్యుః అని వృత్తి. అందుకిపుచులను వైకల్పికసద్రుత మనుట సంధి(స్వరలోపము)ప్రయోజనము నుద్దేశించి యని గుర్తింపఁదగును. అనఁగా నాయం దాశ్తనాయందు నాశ యనురీతిగా లేకుండె, లేక నుండె నని యవుటనే యుద్దేశింప ననవలె. ఇందలిఅందు,కి,కు,చువర్ణకాంతములు ద్రు.ప్ర.లే యగుట యితరలక్షణగ్రంథములనుబట్టి స్పష్టము. తదనుగుణముగాఁ గవర్ణకాంతము ద్రు.ప్ర. కావలె. అది సరి గా దనుటె ప్రౌఢ.యభిప్రాయము. లేక కళయె లే కుండె, లేక యుండె నని యవు. లేక నుండె నన్నది విశేషార్థమున ద్రుతము చేరుట నేర్పడినది. అది విశేషస్థలము. అట్లు ద్రుతము చేరు పక్షమున లేక నుండె ననియె కాని లేకన్+ఉండె లే కుండె నని కాదు.

తె.వ్యా.వి.వివరణమునుబట్టి ద్రుతాంతము ద్రుతోపజీవి యొక్కటియ యవుచున్నవి. (కాఁబోలును అను ద్రు.ప్ర.ను దద్భిన్నముగాఁ జూపు టెట్లును ప్రమాదమె.)ప్రౌఢ. లేకను అన్నది ద్రుతాంత మగు. సముచ్చయాద్యర్థకనుశబ్దాంతములె ద్రుతోపజీవు లని వజ్ఝలవారు నితరులవలెఁ బ్రౌఢవ్యాకర్త యెంచినచో నట లేకను

ద్రుతాంత మనక వి.వి.నుండి ప్రసిద్ధ మైన ద్రుతోపజీవి యనియే చెప్పనగును గదా. అనఁగా ద్రుతోపజీవు లన సముచ్చయాద్యర్థకనుశబ్దాంతములె యని ప్రౌఢ.కూడ భావింపలే దన్నమాట. సంబంధ స్త్రీప్రబస్త్రా భ్యా మ్మనుననది యీనుశబ్దాంతముల యెడ సముచితముగా నన్వయింపకుంటంబట్టియుఁ ప్రౌఢ. యట్లు తలంపకుంట కాధారము గావచ్చును. ఇంతమాత్రమున తె.వ్యా.వి.పేర్కొన్నట్లు ద్రుతాంత ద్రుతోపజీవులను భిన్నము లనరాదు. అట్టి ప్రత్యేకత యున్న ద్రుతాంతములను పేర్కొన్న ప్రౌఢవ్యాకర్త ద్రుతోపజీవులను ప్రస్తావింపఁడా? అది చిం.లో(బాల.లో) ననుక్తాంశమె కదా. వి.వి.నుండి పెక్కంశములు సంగ్రహించిన ప్రౌఢ. ద్రుతోపజీవులను పేర్కొనమి దానిని సంగ్రహింపవలసినయవసరము లే దనియు ననఁగా ద్రుతోపజీవిసంజ్ఞవలనఁ బ్రయోజనము లే దనియు బాల.వలెనె తలఁచె నన్నమాట.

ఏ మైనను ద్రుతప్రకృతికము ద్రుతోపజీవి కళ యని మూఁడే భేదము లుండె ననుట యొకమార్గము. అందును ద్రుతోపజీవులస్వరూపమును వానిపై లక్షణ్యమును ప్రత్యేకముగా నిప్పటి కింకను గుర్తింపరాకున్నది. అనఁగాఁ బ్రయోజనము గానరాదు. ఈఅవాంతరసంజ్ఞాకల్పనము గౌరవమే (తె.వ్యా.వి.371)కానఁ బ్రయోజనవంతము కాకుండుటచేతనే సూరికి ముందు చిం.యును ద్రుతోపజీవులను పేర్కొనక ద్రు.ప్ర.లు కళలు ననురీతిగా రెండుగానే తెలుఁగుపదములను విభజించుట జరిగినది. అయ్యది యుక్తమే.

లేకను ద్రుతాంతమె కాని ద్రు.ప్ర. యని భ్రమయరా దనుప్రౌఢ.వచనము సముచ్చయాద్యర్థకనుశబ్దాంతములు ద్రుతోపజీవు లనువజ్జులవారినిర్ణయమునకుఁ గొంతవఱ కాధార మయ్యెడునవకాశ మున్నది. అంతకుముం దుద్యోతినీవివరణము నను నీప్రౌఢవ్యాకర్తృవచనములప్రభావము పొడఁగట్టుట స్పష్టమే.

అయ్యది వ్యా.సం.స.లో స్పష్ట మైనస్వరూపము నందియుండవచ్చును. ప్రౌఢ.కుముం దెవ్వరును ద్రుతోపజీవుల కిట్టియర్థమును నిర్ణయించినట్లు గానరాదు.

ప్రౌఢ. యేని నర్థవిశేషమునం దైననుశబ్దము నంతమందుఁ గలయవియే ద్రుతోపజీవు లని యభిప్రాయపడియున్నట్లు నిర్ణయింప నాదపవు లేదు. వి.వి.వచనమున కాతఁ డట్టియర్థము గల దని యెఱింగినఁ బ్రస్తుతస్థలమున లేకను ఇత్యాదులు ద్రుతాంతము లని సామాన్యముగా నిర్దేశింపక ద్రుతోపజీవు లనియే చెప్పెడివాఁ డనవచ్చు. (దాని నెఱుంగమి యనుసూరిలోపమును స్పష్టము చేసినప్రయోజనము సిద్ధించుట కే నట్లు చేసెడివాఁ డనవచ్చు.)అట్లు పేర్కొనమింజేసి ప్రౌఢవ్యాకర్తకు నట్టియభిప్రాయము ద్రుతోపజీవిశబ్దమునెడల లే దని నిర్ణయింపవచ్చు. కాఁగా దీనిని ప్రౌఢ.ఆధారముగా వజ్ఝలవారే యూహించి యుందు రననగు. అది సరిగా లే దని స్పష్టమే.

ఇంక ని ట్లవ్యయాత్మకనుశబ్ద మంతమందుఁగలవి ద్రుతాంతములో ద్రుతోపజీవులో యని వేఱు చేయఁబడఁగా మిగిలినద్రుతాంతనులను గూడఁబేటికశబ్దావయవద్రుతము కలవి. ప్రత్యయాగమములుగ నైన వని విభజించినది. అయ్యది లాక్షణికులమతమే కా దనుట స్పష్టము.

ఇంకఁ జివర నున్నద్రుతము శబ్దగతమా? ప్రత్యయమా? ఆగమమా? అవ్యయమా? అనురీతివివక్షవలనఁ జరిత్రకే మేని ప్రయోజన ముండు నేమో. శబ్దశాస్త్రమున కేమియు లేదు. ద్రుతప్రకృతికముసంజ్ఞ వ్యుత్పత్తితోఁబని లేదు. అందుకే ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికము లని చిం.సారమును సూరి సూత్రించు టెంతయు నుచితముగా నున్నది.

# ద్రుతప్రకృతికములు-ద్రుత్వము

అవాంతరభేద మెది యేని నంగీకరించినను నంగీకరింపకున్నను ద్రుత మంత మందుఁ గలశబ్దము లన్నియు ద్రు.ప్ర. లగు నని గుర్తింపకతప్పదు. ఇట్లు ద్రు.ప్ర.త్వమునకు మూల మైన (ద్రుతాంత)తుదిద్రుత మెట్లు గలుగునో పరిశీలింపఁ దగియున్నది.

కళేతరము లగునాయయిపదములు ద్రు.ప్ర.లనుచో నవ్వానిద్రుతమును ప్రత్యేకముగా నెల్లయెడలఁ జిం. విధించియుండలేదు. సూరి ప్రత్యయాదులుగా నుద్రుతమును ప్రత్యేకముగా నెల్లయెడలఁ జెప్పెను. చింతామణిని వ్యాఖ్యానించుచో బా.స రాముని రాము రామునికి ఇత్యాదిగాఁ గొన్నియెడలఁ జివర ద్రుతము లేకుండఁగనే చూపెను. కాని కంఠేకాన్యారాడా దేః అనుసూత్రమునొద్ద కంటె ప్రత్యయమును ద్రుతాంతముగా నుదాహరించెను. అనాదిషు సూత్రమునొద్ద ద్రుతప్రకృతికము గనుక నకారము నిల్చినది యనెను. మఱి యాద్రుత మెట్లు చేరినదో చెప్పలేదు.

ఒకానొకచో నాయావిభక్త్యంతములు నుదాహరించు చప్పకవి అతివతోడను మున్నగురీతిగ ద్రుతమును న(ని)స్వరూపముతోఁ జూపియున్నాఁడు. కాని విభక్త్యంతములప్రక్రియను నిరూపించుప్రకరణ మప్పకవీయమునందు లేకుండుటచే (ఇట నా ద్రుత మెట్లు చేరినదో నిరూపింపవలసినయవసరము లేకుండుటచేతను) నాచివరిద్రుత మేశాస్త్రమువలన వచ్చి చేరినదో స్పష్టము చేయఁబడలేదు. అహో. అమ్మనకు నివర్ణము వచ్చు నన్నస్థలమున రామునిన్ అనురీతిగా నివర్ణకముపై ద్రుతమును గూడఁ జూపెను. ఇట్లె యితరస్థలములందును. అయిన నహో.యును చివర ద్రుతమును జూపెనే కాని యెట్లు వచ్చినదో పేర్కొనలేదు.

ద్రు.ప్ర.లకుఁ జివర ద్రుత ముండు నని యే స్వార్థ్యానుజీవితద్రుతాః అను దానిచే స్పష్టము. కాని యది యె ట్లగు నన్నది మాత్రము చిం.వి.వి.లలో నస్పష్టము.

వజ్ఝలవారు సీతను అనుద్వితీయాంతము కాకున్నను గావున అన్యే ద్రుతప్రకృతయ యనుదానిచొప్పున ద్రుతప్రకృతికము కావలయుటంబట్టి యీసూత్రముచేతనే దానితుదిని బొల్లునకారముచేఁ (వ్యా.సం.స 85) ననిరి. ఇట్లే ద్రు.ప్ర.లన్నింటికి ద్రుతమన్యే ద్రుతప్రకృతయ యనులక్షణముచేతనే యావు నని వివరించియున్నారు. నిజమునకు ద్రుతమును ప్రత్యేకముగా విధింపనిస్థలములందుఁ జిం.లో నీసూత్రముకంటె నింకొకయాధారము లే దా ద్రుతమును సాధించుటకు. ద్రు.ప్ర. లన్నింటికి సాధారణముగ నన్యే యని ద్రుతము చేరు నన్నఁ బై రీతిని గొన్నియెడల బ్రయోజనమును గొన్నియెడల నిబ్బందియును గలదు.

సుబంతములయెడ నాయావిభక్తులమాత్రమె చిం. పేర్కొన్నది. రామునిచేత రామునికొఱకు అనురీతిగామాత్రమె సాధింపఁబడుటచే నన్యే యని ద్రుతము చేయక తీఱదు. లేనిచో రామునిచేతన్ ఇత్యాదులు చిం. చే నసాధ్యములు గానవలె. ఇట్లె క్రియాపదములలో భూతతద్ధర్మాద్యర్థకప్రథమపురుషైకవచనాంతరూపములయెడను జిం. తద్వచనలోపమునుమాత్రమె విధించినది. ఘటించె, ఘటించు అనురీతిగ మాత్రమె యట రూపము లగును.వానిచివరి ద్రుతమును సాధించుట యీమార్గమునకుఁ బ్రయోజనము. (లేక ఘటింపఁగలఁ డిత్యాదివలెనె పునరాగమప్రయోగాభావమని యిటఁ గూడ ద్రుతము చేసినఁ దప్పు గాకపోవచ్చును.) కాఁగా ద్రు.ప్ర.లచివర ద్రుతము సాధింపఁబడుట యొకటి ప్రయోజనము.

కాని దీనివలన ననర్థము నేర్పడియున్నది. చిం. ఉత్తమపురుషైకవచనముగా నువర్ణమును బేర్కొన్నది, 'ఉత్వ్యయుతౌ వసకారౌ స్యాతా మధ్యమోత్తమైకవచనానామ్-ఘటింతును భూతాద్యుతాం పరేషా మిత్- ఘటించితిని. తిఙ్మధ్యాదీతరము లగునీయుత్తమపురుషైకవచనాంతములు ద్రు.ప్ర.లే కావున 'నన్యే' యని చివర నింకొకద్రుతము చేరకతప్పదు. అట్టియెడల ఓడుదునన్, కొలిచితినిన్ అనురీతిఁ గావలసియున్నది. వజ్ఝలవారు లక్ష్యప్రణాళిక కనుగుణముగ నిట్టిరూపములే చిం. సాధించుచున్నట్లు స్పష్టము చేసిరికూడ. కాని యిట్లు సాధార

ణముగ సాధింపఁబడినయీరూపములు భాషయందు మిక్కిలియసాధారణముగ మాత్రమె యున్నవి. అంటిని నింటిని కనురీతిని (అడియునుం గాకేత్యాదులకంటె గూడ) విరళములు. ఇట్టివి విరళముగ మాత్రమె యుండు నని వజ్ఝలవారును స్పష్టము చేసిరి. (వ్యా.సం.స. 23) మఱి యంటినిన్ అనురీతిరూపములు సాధారణము లను టెట్లు?.

ఇది యిట్లుండ స్వరపరకతలో నింకొకయిబ్బంది గలదు. నిత్య ముత్తమపురుషక్రియాస్విత యన్నసూత్రమున వేఱుచేయఁబడినయుత్తమపురుషక్రియల సహో.వలె వజ్ఝలవారును గిమాదులలోఁ జతించిరి. (వ్యా.సం.స. 233) అపుడు సంధి ప్రాయికముగనె యవును గాఁబట్టి అంటిని నిదఱ కనురీతిసంధిరానిరూపములు విరళములుగా నుండుట సరిపడుచునే యున్నది. కాని వజ్ఝలవారివివరణమున వైరుధ్యము గలదు. నిత్యముచేతనే తదాదులసంధియు సిద్ధింప నీ లుండఁగా తద్వ్యర్థమనుసూత్రము స్పష్టతకే యన్నయహో.యభిప్రాయమును దిరస్కరించుచు వజ్ఝలవారు తదాదులకు వైకల్పికమును గిమాదులకుఁ బ్రాయికము నని భేదమును స్పష్టము చేసిరి అయ్యును వీ రిచట "ఉత్తమపురుషక్రియలు కిమాదులలోనివి గావున వానికి సంధి వైకల్పిక(28)మనిరి. దీనివలనఁ దదాదులసంధితోఁ గిమాదులసంధి కింతకుముందు చెప్పినభేదము తొలఁగి యహో.యభిప్రాయము సమంజస మని స్పష్టము కాఁగా నహోయభిప్రాయమును వజ్ఝలవారు విమర్శించినతీరు సముచితము గాదని వారిపల్కులవలననే విదిత మగుచున్నది. ఉత్తమపురుషక్రియేకారమునకు సంధి వైకల్పిక మన్నవీరు మఱల నిట నట్టియెడల సంధి రానిరూపములు విరళము లనుట విరుద్ధము. ఉత్తమపురుషబహువచనస్థలములయందు సంధి వైకల్పిక మనకతప్పదు. కొలిచితినిన్ అనురీతిగనె యుత్తమపురుషైక వచనరూపములను స్వీకరించుచో నట సంధి ప్రాయిక మనకతప్పదు. నిజమున కహోబలుని విమర్శించుటకయి తదాదిసంధికిని గిమాదిసంధికిని వజ్ఝలవారుచూపిన భేదము చివరివఱకు నిర్వహించియున్నయెడల నవఁగాఁదద్విరుద్ధముగాఁ జెప్పకున్న వారు చూపినభేదము ననుసరించి యుత్తమపురుషబహువచనాంతములు

దాదులలోను నేకవచనాంతములు కిమాదులలోను జేయు నని చెప్పకొనియుండెడివారే యనవచ్చును. అట్లే చెప్పవలసియున్నది కూడ. అయిన వి.వి. ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవేచ్ఛ్యుతిః అని సామాన్యముగనె వాళబ్దముతోనె విధించుట వజ్ఝలవారు వికల్ప మని వివరించుట కొకకారణ మయియుండవచ్చును.

అయిన నిట కొలిచితిన్ అనురూప ముండును. కొలిచితినిన్ అనునదే సంధి సందర్భమున గ్రహింపవలె ననియు కొలిచితిన్ అనురూపము గ్రహింపరా దనియు వజ్ఝలవారు నిరాధారముగా నియమింపవలసినయవసర మేర్పడుటయును గొలిచి నిన్ అనురూపము నేర్పఱచుటచేలనె గల్గిన దని గుర్తింపవచ్చును. ప్రాయికమైకల్పి కము లనుచో స్వవచోవ్యాఘాత మేర్పడుటయు నిందువలననే. (చూ. ద్రు.కా. ద్రుత పూర్వస్వరసంధి)

ఇట్లే చేయుదునున్ + అని చేయుదు నని యనురీతిస్థలములును సహజములు గావు. వజ్ఝలవారు చెప్పినట్లుగాఁ ప్రత్యయోకార మైన దని న స్యాత్తమసూత్ర ముచే సంధినిషేధము లేక యనుత యని సంధి నిత్యముగనె యవు ననవలె. అ య్యును న స్యాత్తమచో చేయుదున్ అనునదిమాత్రము గ్రహింపకతప్ప దనియు ద్రుతివర్ణకొ క్రమాత్ స్తః అని చెప్పఁబడినదు ప్రత్యయోకారమునకుమాత్రము సంధి నిషేధము తప్ప దనియుఁ జెప్పుట సక్రమ మనఁగలమా?

వి.వి. ప్రథమశ్చోత్తమశ్చైవ యనుకారికచే నుత్తమపురుషైకవచనమునం దును సంధినిషేధము చెప్పినది. వి.వి.కర్తృమతమునను జేయుదునున్ అనునదే సాధారణముగ ననురూప మయిన నందలియుకారమునకే సంధి నిషిద్ధము గావలె. చేయుదు ననియె ననురూప మెట్లు? చేయుదున్ + అనియె ననుచోఁ జేయుదు న నియె నని యవు. అయిన నట్టిరూప మె ట్లేని సాధువె యగుచుండ సంధినిషేధ మేల? చేయు దనియె నని కాకుండుటకన్న చేయుదునున్-చేయుదున్ అని చూపినట్లే చే యుదున్ చేయుదు + అనియె నన్నఁ జేయు దనియె ననురూపము వజ్ఝలవారిప్ర క్రియామార్గముతోఁ దప్పదు గదా.

ఇట్టినువర్ణమునందలియుత్వమునకే ధాతాదుత్వాం పరేషామి త్తని యిత్వము రాఁగా కొలిచితిని(న్) అనురీతిరూపము లవును. అట్టియెడ (న స్యాత్తమచో) ప్రథమశ్చోత్తమశ్చైవ యనుచో కొలుచుదున్ అన్నదిమాత్రమె గ్రహింపవలె ననియు (గ్రిమాదులలో) ప్రథమేచోత్తమే చైవ యనుచో కొలిచితినిన్ అన్నదిమాత్రమె గ్రహింపవలె ననియుఁ జెప్పుట సక్రమము గా దనకతప్పదు.

ప్రథమపురుషైకవచనస్థలమున కొలుచున్ కొలిచెన్ అని యుండు ననియు నుత్తమపురుషైకవచనమందుఁ గొలుచుదున్ గొలిచితినిన్ అనురీతిగా నుండు నని యుఁ గల్పించినభేదమునకుఁ బ్రయోజన మేమి? ఇదేపద్ధతిలో చేయుచున్నానున్, చేయఁగలనున్ అనురీతివర్తమానభవిష్యదర్థములందు రూపము లేర్పడుఁ గదా. అట్టి వున్నవా? ఉత్తమపురుషైకవచనస్థలమున ధాతద్ధర్మార్థములందుమాత్రమె నువర్ణకముపై ద్రుతము చేరు ననియు భవిష్యదర్థాదిస్థలముల నట్లు ద్రుతము చేర దనియుఁ జెప్పవీ లున్నదా? ఉత్తమపురుషైకవచనము లెల్లయర్థములందును ద్రు.ప్ర.లే గదా. కాఁగా నుత్తమపురుషైకవచనము (ను)పై నెం కొక ద్రుతము చేరు ననుట యనర్థమే యనకతప్పదు.

ఇట్టిసందర్భమున నప్ప.యభిప్రాయ ముచితముగాఁ గన్పట్టుచున్నది. 'శార్చి విడచి ద్వితీయఁ బల్కునవి మూఁడు (ని,ను,ల)నవతలివిభక్తి దెలుపువాక్యములు నాల్గు (చే,చేత,పొంత,తో) వలనఁ గంటె లోపల ననువచనములును బది విభక్తులలో ద్రుతప్రకృతు లయ్యె (అప్ప.5-50)అనుటంబట్టి ని,ను,ల,చేత,చే మొ॥ ద్రు.ప్ర.లని తెలినది. ఇట్లనుటచేత ల,చేత మొ॥వానిపై ద్రుతము చేరినట్లుగనే (అన్వయనుసూత్రముచేతనే యనుకొందము. వీనిపై నెట్లే ద్రుతము చేరనిదే ద్రు.ప్ర.లగుట యసంభవము గదా. రాములను మొ॥)ద్వితీయ లైన-ని,ను అనువానిపైఁ గూడ ద్రుతము చేరునా? అహో., వజ్ఝలవారు నట్లు భావించిరి. కాని యప్ప.యపకారగతే ఒస్మి న్నను సూత్రమును వివరించి 'సముదవిరాధుని జావ మొత్తి, నగరమునకు మహీజాతను గొనివచ్చె (అప్ప.5-142)నని ద్వితీయతో నినులనే ద్రుతములుగాఁ జూపెను. పైవమషములు సరళములే యగు.బిందువు రానియెడల ద్రుత

మన్లే యుండు ననుట కివి లక్ష్యములు. అనఁగా నిందలి ద్రుతము బిందువికార మం
దక స్వత్వముతో నున్నది. విరాధుని జావ మొత్తె మహీజాతను గొనివచ్చె ననులక్ష్య
ములనుబట్టి నినునే ద్రుతము లన్నమాటయె. ఇట బింద్వాదివికారములు లేమి చె
ప్పఁబడుటంజేసి యీనినులపై ఖండబిందువుండు నని యూహించుటకును వీలు లేదు.
అందు మహీజాతను గొనివచ్చె ననునది ప్రాసఘటితము నై యుండుటచే వజ్ఝుల
వారు నిద్దానిని ప్రబలముగా స్వీకరించిరి. కాఁగా నీలక్ష్యము లప్ప.మతమున ద్రుతము
స్వరసహితమె యని నిరూపించుటతోపాటు ద్వితీయయందుఁ బ్రత్యయము లైన
నినువర్ణములే ద్రుతము లని స్పష్టము చేయుచున్నవి. పంపునను, అతివతోడను
మొదలగునితరస్థలముల ననుసరించి యిచటినినులు ద్వితీయావిభక్తులే యని (లుక్ప
స్యాత్తనుటచే ద్వితీయాప్రత్యయము లోపింపఁగా దానిపై నుండి మిగిలినద్రుతము
గా దనియు) స్పష్టముగా గుర్తింపవచ్చును. దీనింబట్టి ద్వితీయ లైననినులే ద్రుత
ము లనిమాత్రమె కాక వానిపై నిం కొకద్రుతము వచ్చి చేర దని యప్ప. భావించె
ననవలయునే కద. అహోబలాదులవలె నప్పకవియు నినులపై ని ద్రుతము చేయు
నని యెంచినఁ బై లక్ష్యస్థలములందు నినులపై ద్రుతమునకు వచ్చెడుఖండాను
స్వార మే నుండవలె. అట్లనుస్వార మున్న దన్న నవి యవికారగతే యను
ప్రస్తుతలక్షణమునకు లక్ష్యములే కాకుండఁబోవును. మిగిలినయచ్చోటిలక్ష్యముల
ననుసరించియు నిట నినులు విభక్తులే కాని నినులు లోపింపఁగా మిగిలినయాగమ
ద్రుతములు గా వనుట స్పష్టమే. అన లప్పకవీయచిం.లో నన్లోపము చెప్పఁబడి
యున్న దని యాగ్రంథభాగము లభ్యము గామి నిర్ణయింపరాకున్నది.

అయిన విభక్తులలో నీపదియు ద్రు.ప్ర. లగు నన్నయప్ప. ల,చేత ప్రకృ
తులపై ద్రుతమును బ్రత్యేకముగాఁ జేసియు నినులపై న ట్లేల చేయలేదు?

ఇట్టిస్థితి స్థలాంతరమునను నప్ప.లోఁ గలదు. "గరుడధ్వజ ప్రథమోత్త
మపురుషైకవచనము లెల్ల భూతార్థమునన్, ధర నగును ద్రుతప్రకృతులు భరియించె
నుపేంద్రుఁ డేను బ్రదికితి ననఁగన్.(౬-౬[illegible]) వజ్ఝలవారిమతము ననుసరించి యిచ్చ
టను ను (ని) వర్ణకముపై నన్యే– యని ద్రుతము చేరవలె. కొలిచితినిన్,

అంటినిన్ అనురీతిగా నిట బ్రదికీతినిన్ అని కావలె. బ్రదికీతినిన్ + అనఁగన్ అనునది బ్రదికీతి ననఁగన్ అని యవు టెట్లు? వజ్ఝలవారు కొలిచితినిన్ + అబ్ధిజను కొలిచితి నబ్ధిజ ననునదే సంధి యైనరూప మని చెప్పిరి. ఆపద్ధతినిబట్టి చూడ నిట బ్రదికీతి ననఁగన్ అనునప్ప.లక్ష్యమున సంధి జరిగిన స్థలమే యవును.కాని యప్ప. యివి ద్రు.ప్ర.లు గాన సంధి లే దనునభిప్రాయముతో నీవాని నుదాహరించెను. భరియించె నుపేంద్రుఁ డన్నది యెట్లు సంధి రానిరూపమో బ్రదికీతి ననఁగ నను నదియు నట్లే సంధి రానిరూప మని యప్ప.యభిప్రాయము స్పష్టమే. సంధి రానిపక్షమున వజ్ఝలవారిసమన్వయము ననుసరించి అంటిని నిందఱ కనురీతిగా బ్రదికీతిని ననఁగన్ అనియే కావలసియుండును. అయిన వజ్ఝలవా రసహజము గనె యైనను కొలిచితిన్ + అబ్ధిజ అనురీతిస్థలమును గూడ సాధించిరి. తదను గుణముగ నిట బ్రదికీతిన్ + అనఁగన్ అని యుంచిన బ్రదికీతి ననఁగ అనునది సంధి రానిరూపమే యగును. అయిన వజ్ఝలవారిమతమునఁ గొలిచితి వబ్ధిజ నను నది యొకపక్షమున (ప్రాయిక) సంధిజరిగినస్థలము కాఁగా నిం కొకపక్షమున సంధియే లేని స్థలము. ఒకేరూపము సంధి యైనందులకుఁ గానందులకు లక్ష్య మగు చుండఁగాఁదదనుసారముగా నిర్ణయము చేయు టెట్లు గుదురును? ఏ మైనను సంధి లే దన్నయప్ప.మతమునుబట్టి బ్రదికీతినిన్ అని యుండ ననుట నిశ్చయము. అ ట్లుండు ననుకొన్న నప్పకవియు వజ్ఝలవారివలెఁ బ్రాయికసంధిని జెప్పవలెఁ గాని సంధి లే దనుట కుదురదు. ఇంక నీయవి ద్రు.ప్ర.లు గావున సంధి లే దని సామాన్యముగా నిర్ణయించుటయు నప్ప.లో గమనార్హము. అప్ప.స్వరసంధిసిద్ధాంతము ననుస రించియు ద్రుతపరకస్వరసంధి యప్ప.మతము గాదని స్పష్టము. (చూ.ద్రు.కా. ద్రుతపూర్వస్వరసంధి) అప్ప. సిద్ధాంతముననుసరించి యిట నాతఁడు సంధిని జెప్పఁదలఁచిన నుత్తమైకవచనము (భూతార్థమున?) వికల్పముగా ద్రు.ప్ర. యగు ననియుండెడివాఁడు. కాఁగా నప్ప.మతమున నుత్తమైకవచనము లగునిములపై ద్రుతము చేరదు.

అప్ప. స్థలాంతరమున "పదలక తద్ధర్మములను బొదలెడుప్రథమోత్తమాఖ్య పుంసైకవచఃపదములు ద్రుతప్రకృతు లగుఁ బదరుసు నశఁ దోర్తు నేను బలుమఱు ననఁగన్ (1-75) ఓర్తు నేను అనుచో ఓర్తుసు + ఏను అనియె భావించె. అనఁగా ఓర్తునున్ అని యుత్తమపురుషసువర్ణకముపై ద్రుతము చేరమినే నిరూపించె. కాని ప్రథమైకవచనము ద్రుతాంత మవుటంజేసి సంధి రాకుంటను నిరూపించుటకయి పదరుసు నశఁ డని చూపె. ఇయ్యది యంటిని నిందలు కనుదానివలెఁ గన్పించి నను విశేషస్థలమె కాని వజ్ఝలవారియభిప్రాయమునకు సాధకము గాదు. ఇది తద్ధర్మార్థకప్రథమపురుషైకవచనము. ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్తని చిం. ప్రథమైకవచనమునకు లోపము చెప్పినదే కాని సువర్ణమును విధింపలేదు. కావున విహిత మగుసువర్ణముపై ద్రుతము చేయుట యను ప్రసక్తి లేదు. ఇంక నప్ప.చిం.లోఁ బ్రథమైకవచనలోపము గాక సువర్ణమే విధింపఁబడిన దేమో యని యనుమానింపవచ్చు నాచిం.బాగ నప్ప.లో లభ్యము గాలేదు గనుక, కాని యట్టియెడలఁ దద్ధర్మార్థముతోపాటు భూతార్థమునందును బ్రథమైకవచనలోపము గాక సువర్ణకము యి దానిపయి ద్రుతము చేయవలయును గదా. ఇంతకుమున్ను ధరియించె సుపేంద్రుఁ డనుస్థలమున ధరియించెను సుపేంద్రుం డని యూవలదా? తద్ధర్మప్రథమైకవచనస్థలమందే ప్రథమైకవచనలోపము గాక సువర్ణము చెప్పఁబడె ననియు భూతార్థమునం బ్రథమైకవచనలోపమె చెప్పఁబడె ననియుఁ నూహించుట సక్రమము గాదు గదా. ఇంతకును బా.స.చిం. ననుసరించి న.పర్ణకము చెప్పఁబడిన దని నిర్ణయింపఁదగినచోట నాము(ని)వర్ణముపై నప్ప.ద్రుత మీలేదు. అప్ప.చిం.లో నుత్తమైకవచనలోప మెల్లెడలఁజెప్పఁబడె ననవలెనా?పి మైనను నిర్మూలక మగుచర్ప యెట్టిసిద్ధాంతమును గాని నిశ్చయపఱుపఁజాలదు. కాఁగాఁ బై విషయము ననుసరించి పదరుననశఁ డను ప్రస్తుతస్థలముననే యప్ప.కవి యొకపేళ బదరు నశం డనియె ప్రయోగించియుండె నేమో యని పైన ననుమానింపఁదగుఁగాని బ్రదికితి ననఁగన్ అనుచో బ్రదికితిని ననన్ అని ప్రయోగించె నేమో యని యనుమానించుటకు నవకాశము లే దని గుర్తింపఁదగును. ఇచ్చట-ఓర్తునేను అనుస్థలమున ఓర్తును నే నని యుండు నని యూహించుట కుదురగు గదా. గణభంగ మగు. కాఁగాఁ బ్రథ

కాఁగాఁ జిం.యనిషాస్త్రీయ మిది యని దౌరగనియప్పు.చిం.చే నిర్ణయింపరాకున్నది. కాని చిం. వ ట్లుంచి యప్పు.యభిప్రాయమునుమాత్రము గుర్తించుచో వజ్ఝలవారు సాధించు చేసితినిన్, చేయుచునున్ రామునిన్ అనురీతిరూపము లాతనికి సమ్మతములు గా వని నిశ్చయింపవచ్చు. (రామునిని అనునొండుస్వాముఁ దప్పు) సూరిమతమె యప్పు.మతము వని స్పష్టము. అయప్పు.మతమ ను బా.వ.చిం కనుగుణముగా సమన్వయించి చూచినఁ దైని బేర్కొన్నసిద్ధాంత మేర్పడు.

పైయప్పు.యభిప్రాయము కొంత వఱకు నహో. కాద ననుసరించె నని తోఁచుచున్నది. భూతతద్ధర్మార్థకప్రథమపురుషైకవచనస్థలమున ఘటించె నితఁ డని ద్రుత మాగమము చేసిచూపినయాతఁడు ఉత్వాయుతౌవనకారా స్యాశా స్మను సూత్రమునొద్ద చేయఁగలము చేయుదుము అని మాత్రమె యుదాహరించుటలో నీ(ని)మలపై ద్రుతము చేయకుంటమె గమనింపవచ్చు. కొలిచి తద్ధిజ, తింటి నతిమధురఫలము అనురీతిష్ఠాంతరలక్ష్యములనుబట్టియుఁ దైయప్పు.యభిప్రాయ మహో. యనుసరించినట్లు స్పష్టమగు. కాని యహో. ద్వితీయాదులకినుల పైని ద్రుతస్థితి స్పష్టము చేసియున్నాఁడు. అం దొక వైలక్షణ్యము గమనింపవచ్చు.

చిం.కర్త ద్రు.ప్ర.లద్రుతము ప్రత్యేకముగాఁ జెప్పఁదలఁపనియప్పు డెల్లెడల మానక కొన్నియెడలఁ జెప్పుటయుఁ గొన్నియెడల మానుటయు నేల? దీనివలనఁ గ్రమత పోవును గదా యనిపించు. చివరిద్రుతమును విధించుచోట సుబంతములయెడ ద్వితీయైకవచనాంతము లొక్కఁడె గానవచ్చు. ఇది మఱొక విలక్షణము నైయుంట గమనార్హము.

నిరమోఘహతాం లుక్ప స్యాత్ తనుసూత్రము నివర్తకముతోపాటు ద్వితీయైకవచనలోపమును గూడఁ జెప్పుచున్నది. దీనిని బా.వ. రాము అని ద్రుతము లేకయె యుదాహరించెను. అవసానమున లోపించినదా? అమ్లోపపక్షమునను రాము అని ద్రుతాంతము గాకయె యుండు ననరాదు. కావున నమ్ము లోపించిన స్థితియందు (అన్యే యని) ద్రుతము చేర్పకతప్పదు. అట్టియెడల లోపాభావస్థి

తిలో ననఁగా నివర్ణక మయినపుడు గానిఁ బైని ద్రుతము న్యే యని చేర్చుటప్పు డెట్లు? అమ్మ లోపించినపుడే ద్రుతము చేరు నన్న సామాన్యమున రామున్ (ని) అని యగు. నివర్ణక మగుచో ద్రుతము చేర దన్న రాముని(న్) అని యగు. అనఁగా నివర్ణ మయినను ద్వితీయైకవచనము లోపించినను రూప మొకరీతిగనె యగును. అపుడు నివర్ణమును విధించు దాని యప్రాప్తమును జెప్పు దాని వ్యర్థము కాకతప్పదు. మూడి రామునిని అనురీతిగా రూపాంతరముల ద్వితీయైకవచనరూపమును సాధించుట గమనార్హము. దీనినిబట్టి ద్వితీయైకవచనస్థలమున నది లోపించినను నివర్ణ మున్నను ద్రుతము చేర నవలె. కాని ద్వితీయయందును గొందొకచో నిబ్బంది గలదు. అది గమనింతము.

౭౦. హార్భిలమనయోఠవేద్ద్వితీయా మ అని నిమువర్ణములను రెంటిని ప్రత్యేకముగా ద్వితీయావిభక్తులుగఁ బరిగణించినది. నిరమో మహాతా ప్మని నివర్ణమును విధించినది. కాని మువర్ణమును మాత్రము చెప్పలేదు. ఈసందర్భమున నహో. మహాత్ములకు నివర్ణకవిధానము ననుసరించి అమహాన్ఛ్యః పరస్యామః స్థానే ను రిత్యాది రస్థ స్విధః (కవిశ. 3సీ) అని సింహమును వనమును ఇత్యాది యని యుదాహరించె. ఇట సింహమును ఇత్యాదులందలి చివరి మువర్ణము ద్వితీయావిభక్తియె. అయిన దీనిపైని (నన్యే యని) ద్రుతము చేయవలెఁ గదా. అహో. యింతకు ముం న్నిటనే నివర్ణక మయిన సందర్భమున రామునిన్ కృష్ణునిన్ అనురీతిగా నివర్ణముపైని ద్రుతమును జూపియున్నాఁడు మరి యట్టిదే యైన మువర్ణముపైని ద్రుత మేల చేరలేదో యాతఁడు పేర్కొనలేదు. మువర్ణమును ద్వితీయగాఁ బేర్కొనియున్నచో ననుసరించి చెప్పుట నే ద్వితీయలో మప్రత్యయస్థితిని జూపవలసియే యున్నది. అట్టిచోట సింహమునున్ ఇత్యాదిగాఁ జూపవలసియున్నది. ఆపిదప నహో. ప్రయోగాస్తు సర్వత్ర మువర్ణకస్య లుక్యేవ బహవః ప్రయుంక్తే యన్నాఁడు గనుక సింహమునున్ అని చూపె ననుటకు వీలున్నను నట్టిపాఠ మెందును గానరా దయ్యె. అట్లని ద్వితీయావిభక్తి లోపించిన రూప మందుమా? సింహమునున్ అని పోల్లును జూపక మువర్ణ మెట్లు చూపె?

చేసిరి గాని నిత్యడుమంతము లని గాని యుదంతేతరము లగుడుమంతము లని గాని చెప్పలేదు. చెప్ప రాదు గూడ. ప్రాతిపదిక మే దైన నేమి? డుమంత మయినపుడు డుమంతత్వముబట్టి పూర్వమె యాకారికాదేశమై విభక్తికలోపములు సిద్ధించుచున్నవి. ఉద న్తాత్తు స హా భవే త్తని ఋలంc జెప్పుట వజ్ఝలవారియర్థవివరణమును బట్టి వ్యర్థమే యనందగియున్నది.

డుమంతత్వాభావపక్షమున అన్యత్ స్త్వత్ర యనువానిచేతనే నువర్ణకి మగు నని వారే చెప్పిరి. అదియు నంతకు మును పె చెప్పఁబడినది. వారే యన్యత్ స్త్వత్ర యనువాని నుదాహరించియుంట గనునార్హము. ఇంక నిట లక్ష్యములలో వధువునన్ వధువున్ అనునది యేల చేర్చిరో యర్థము గాదు. దీనిప్రకార మువంతములకు నిప ర్ణకము వికల్పముగా నగు నని వీ రింతకు ముం దీకారికాభాగమునకుఁ జేసినయర్థ మిట సమన్వితము గాదు. (డుమంతము గాదు) వధువునిన్ అనురీతిని రూప ముండదు గదా. నివర్ణకము పాక్షికము నగుట నువర్ణకలక్ష్య మిచ్చు టేల? పైఁగా నుదన్తా త్తనువానికి మహాత్మ్యంలింగోదంతముల కనక సామాన్యముగా నుకారాంతశబ్దముల కంటె ననుటచే వీరివివరణము ననుసరించి ధేనుని ధేనువుని గోవుని రాజుని మొద లైనయనిష్టరూపములు ప్రసక్తియుఁ గల్గుచున్న వని గుర్తింపవలసియున్నది.

అన లిప్పటిసః అనుదానిని నివర్ణకి యని యర్థము చేయుట యొప్పునా? ఉచ్చ ద్ధము నివర్ణకమునే పరామర్శించుచో ఇదాదిభ్యస్తు నిత్యమ్ అనువజ్ఝలవారిపాఠము ననుసరించి పూర్వవాక్యమునందలియాదిశబ్దముచేతనె యీయుకారము నైతము గ్ర హింపఁబడునే కదా. అప్పటియాదిశబ్దముచే (ఇ) ఈఐలు గ్రహింపఁబడినపుడు ఉకా రమునకు నైతము నిత్యమె యగునపుడు నడుమ నున్నయుత్వ మాదిశబ్దముచే నేల గ్రహింపఁబడదు.? అట్టియెడ మత్తునుమాత్రము వేఱు చేసి విశేషముగా నిత్య మేల చెప్పవలె? శంభునున్, శంభునిన్ అనురెండు రూపములకొఱకా? ఈరెండువిధము లైనరూపములు కారికామందలిపూర్వార్థముచేతనె సంగ్రహింపఁబడుచున్న వని స్పష్ట మె. ఇఈఐదంతములు డుమంతము లైనఁ గాకున్న నిదాదిభ్యః అని నివర్ణమైన ట్లుగా నిటఁ గూడ ఉదంతములు డుమంతము లైనను గాకున్నను నిత్యము వికల్ప

ముగా నగు నన్నఁ గొంతసార్థకము కాఁగల దేమో. కాని డుమంతేతరములు కుదం

తముల కేని నివర్ణక మగుట గలదా? ఉదంతాత్తు అనుదానిచే నివర్ణకమునె చెప్పఁద
లఁచినపుడు ప్రయోగానుగుణముగా డుమంతము లైనయుదంతములకే యని చెప్ప
వలసియుండును. అడుమంతములకు నివర్ణము మహతో ఒుస్తు అన్నది చెప్పుచునే
యున్నది. కాఁగా ఉదన్తాత్తు స వా భవే త్తన్నది వ్యర్థమే యని నిర్ణయింపకతప్పదు.

ఇదాదిభ్యః అనుపూర్వస్థలమున హరినిన్ గిరినిన్ అనురీతిగా మహదమహ
త్తులు రెండును గ్రహింపఁబడుచున్నవి. కావునఁ బదసంగ్రహము చెప్పినఉదన్తాత్తు
అనుచోఁ గూడఁ దదనుగుణముగా మహదమహత్తులు రెండును గ్రహింపఁబడుట
యుక్తము. అందుకే వజ్ఝలవారు డుమంతము లగునుకారాంతముల కని కాక సామా
న్యముగా నుకారాంతముల కని యర్థము చేసి రేమో. కాని యట్లైనచో నమహదు
దంతములకును నివర్ణము దీనిచే సిద్ధమయి వడుపునిన్ ధేనువునిన్ అనురీతిగా నవ
రూపముల కవకాశము తప్పదు.

కాఁగా వజ్ఝలవారు చేసినవివరణము సామంజసము గా దని యేని చెప్ప
వలెను. లేదా వారిలో నీ భాగము వ్యర్థ మనవలసియుండును. వీ రహో.
సమన్వయమును గూర్చి ప్రస్తావింపరేమ. కాని వీరే చెప్పినట్లుగా ఏ.వి.కారికల
కహో.గ్రంథమె మూలము. తద్భిన్న మగు పాఠమును జూపుట కాధార మేమియు
వీరు చెప్పనేలేదు. ఇదాదిభ్యస్తు నిత్యం ఉక్ అనియే కవిశి.లందుఁ గానవచ్చు.
అహో. దీనిని వివరింపలేదు. క.సం.కర్త నిత్యం ఉక్ అనుపాఠమునే వివరించి
యుండుట ననుసరించి (క.సం.55)యుహో.పాఠ మిదియే యని గుర్తింపవచ్చు ను
క.సం.లోఁ గొన్నిపాఠభేదము లున్నను దీని నహో.వివరింపకున్నను కవిశి.లలో
నిత్య మ్మనుపాఠ మనుటచే నది యొట్ల గ్రహింపఁదగును గదా. కవిశి.లో
నేతద్వివరణమున శ్రీరాజేశ్వరశర్మగారు "ఇదంతాదులకు నివర్ణము నిత్యము.
దానికి లోపము వచ్చు"(కవిశి.387) నని పేర్కొనిరి. కాని నివర్ణము లోపించునప్ప
డది నిత్య మగుట యెట్లు? వికల్ప మనఁదగుఁ గదా. మహాప్రాణలింగముల

త్తునుచో సువర్ణము చేసి రామునిన్ అనుచోటవలె నీనువర్ణముపై ద్రుతము చేయక వనమును శశకమును అని మాత్రమె యుదాహరించెను.(క.మం.55) ఇది యహో.ముద్రితప్రతుల కనుగుణమై యున్నది. కారికాకర్త యిట్లే తలఁచెనా? ఇదంతములపై నివర్ణకము లోపింపఁగా హరిన్, అనురీతిగా నవుచుండఁగా నివర్ణక మగుస్థలములలో రామునిన్ అనురీతిగా ద్రుతము చేయుచున్నపుడు నువర్ణ కము వచ్చిన వనమును, శశ(సింహ)మును అనుచో ద్రుతము చేరకుండుట కాధార మేది ?



మహతోఽమస్తు నిట్లుక్, అన్యత్ర స్వాత్ర నుః అనుక్రమమునుబట్టి చూడఁగా ఇదాదిభ్యస్తు నిత్యం లుక్ అనుచో ఇదాదులకుఁ బైనున్న ద్వితీయైకవ చనమునకు ననఁగా నమ్విభక్తికే నిత్యముగా లోపము వచ్చు నని చెప్పుటయే యుచిత మనిపించుచున్నది. అహో. నిరమా మహారాం లుక్చ యనుచో నివర్ణ మునకే లోపము చేసెను. అటుఁ గూడ నమ్మనకే చేయఁదగు ననిపించు. సాధని అనురీతిగా మాత్రమె మారి సాధించినరూపములనుబట్టి చూడఁగా రామునిని అనురీతిగా హరినిని శ్రీనిని పైనిని అనురీతి నుండదు. కావున మహతోఽమస్తు నిట్లు క్కానుచానిమెఁ గాక ఇదాదిభ్యస్తు నిత్యం లు క్కాని నిత్యముగా లోపము చెప్పుట సూరిసమ్మతమును ప్రయోగానుగుణము నై యున్నది. నిజమునకు రమను క్మ్మను ఇత్యాదిగా నకారముపై నిగూఢ నిట్టికార్యము నియమముగనె కలదు. రమ నును అనురీతిరూపము లుండవు గదా. మొత్తముపై నువర్ణకము పొందమాత్రము ద్రుతము చేయుట కే దని నిశ్చయింపఁదగును.

ఇంక వజ్ఝలవారివలె హరినిన్ అనురీతిరూపము లవు నని చెప్పుచో హరి నిన్ అడిగె ననుచో హరిని నడిగె ననియె కదా కావలయును. హరి నడిగె నని యవు టెట్లు? బాల. ననుసరించి కిమాదులలోఁ గిష్టిని బరించినవీట నిద్వితీయను బరించిరా? (చూ.ప్రు.కా.)

ఇంక సుదస్తాత్తు స వా భవే త్తనుదాని యర్థ మేది? పూర్వవాక్యమున (ఇదాదిభ్యస్తు నిత్యం లుక్) నన్నుక్తమయినది లోపము. కావునఁ దదనుగుణముగా నిటఁ దచ్ఛబ్దముచే లోపమె పరామర్శింపఁబడును. కావున సుదంతము లైనశబ్దములపైని ద్వితీయైకవచనమునకు వికల్పముగా లోప మగు నని యర్థము. ఇదాములపై లోపము నిత్యము గాఁగా సుదంతములపై వికల్ప మన్నమాట. ఇట సుదంతములు మహత్తులు నమహత్తులు నయినశబ్దము లెల్ల గ్రహింపఁబడుట సక్రమమే. అహో. ఎల్ల యెడల సువర్ణమునకు లోపమే తెలుపుగఁ గల దనియు నన్నయప్రయోగములందు నట్లే కన్పించుచున్న దనియుఁ జెప్పుచు "తేనాత్ర వ్యవస్థితా విభాషేతి జ్ఞేయమ్. అత ఏవ రాజన్శబ్దాదిభ్యో న నివర్ణకశ్రుతిశ్చ. (కవిశి. 388) యనెను. నివర్ణకశ్రుతి గూడ వాశబ్దముచేతనె తే నని వివరించెను. కావున సుదస్తాత్తు అనునది ని, సువర్ణములు రెంటికి లోపము చెప్పుచున్న దని యహో. యెంచె ననఁదగు. నిరమో మహతా ప్యమహానినుంటి యాతఁడు నినుల లోపమునే వ్యాఖ్యానించుచు వచ్చెను. కాఁగా నద్లోపమును గ్రహింపఁదగును. నిరమో మహతాం లుక్చ స్యా త్తమహో అమః ని స్యాత్ అమః లుక్చ స్యాత్ అనుచోప్పున నద్లోపము వివరింపఁదగును. మహతో౽మస్తు నిట్లుక్ అనుచోఁ గూడ నిట్లే. కాఁగా హరి శౌరి యనుమహత్పుంలింగములపై మహతో౽మస్తు అని నివర్ణమును, గిరిమ్, ధీమ్ను నను న్నగుచోట్ల నన్యత స్త్వత్ర యని సువర్ణమును, కాఁగా నానిసువర్ణములకే యిచట లోపము విధింపఁబడిన దని చెప్పవలసిన యవసరము లేదు.

కాఁగా సుదంతములపై నద్లోపము వికల్పము. ఇటఁ గూడ సుదంతములు మహత్పుంలింగములే యగుచో మహతో౽మస్తు అనుదానిచేతనె ద్వైరూప్యము సిద్ధించును గాన శంభునిన్ శంభున్ అనురీతి నవు. హరినిన్ శౌరినిన్ అనురీతిరూపములును లేవు గావున ఇదాదిభ్యస్తు అన్నది మహత్పుంలింగేతరవిషయమె యనరాదనవచ్చు. అనఁగా మహత్పుంలింగముల కెల్ల మహతో౽మస్తు అని నివర్ణకము నద్లోపము నగు ననియుఁ దదితరములకు అన్యత స్త్వత్ర యని సువర్ణము చెప్పి

యాయన్యములవిషయమున విశేషవిధులుగా నిదాదిభ్యస్తు ఉదంతాత్తు అని చెప్పి న
నుకొనుచో హరినిన్,(హరిన్)అనురూపము గూడ నగును గదా. హరినిన్ అనురీతి
రూపము లంగీకరించుచో ఇదాదిభ్యస్తు ఉదన్తాత్తు అన్నవి మహత్పుంలింగేతరవిష
యము లగును. కావున శంభునిన్ శంభున్ అనుచోటిద్వైవిధ్య మిటుఁ బునరుక్తము
గాలే దనవచ్చు. కాని రామునిన్ అనురీతిగా హరినిన్ అనురీతిరూపములు లేమి
నట్లు చెప్పకుంటయె యుచిత మనిపించు. హరినిన్ సాధు వని గిరినిన్ అసాధువుగా
నిర్ణయించుటమాత్రము సక్రమమా? అయిన శంభునిన్ శంభున్ అనుచోటిద్వైవి
ధ్యము పునరుక్త మగుచున్నది గదా యనవచ్చు. మహత్పుంలింగములకు సామా
న్యముగనె నిత్యద్రుతవికల్పస్థితి సిద్ధమైయుండఁగా మఱల నుదంతాత్తు అని మహత్పుం
లింగములకును నల్లోపము వికల్పముగాఁ జెప్పుట ననుసరించి యొకయర్థము జ్ఞాప
కము చేసికొనవచ్చును. దీనివలన మహత్పులింగముల కుదంతములకుఁ ద్రుతమాత్ర
మె యున్కు లోపించు ననియు ననుదంతము లైనచో నల్లోపము లే దనియుఁ గావున
ననుదంతము లగుమహత్పుంలింగములపై (ఇదంతములవల్ల) నన్మునకు నిత్య
ము నిత్యముగా నగు నని గ్రహింపఁదగు. శబ్దరత్నాకరానుశాసనమువలన ఋదంత
ము లై యుండు, పితృ, సవితృ, మాతృశబ్దములు మొదటిపైఁగూడ నన్మునకు
మహతోఽసస్తు అని నిత్యము నల్లోపమును గల్గి ద్వైరూప్య మందుట యవిరుద్ధ
మగుచున్నవి. (దీనివలన నాచ్ఛికములయందుమాత్రమె యాజ్ఞాపకసిద్ధాంతమువలనఁ
ప్రయోజనమును గుర్తింపవచ్చును.) అనుమంత మగుతెనుఁగుడుమంతమునకు సూరి
విగాగమము నిత్యముగాఁ జెప్పుట స్మరింపఁదగును. దీనివలన రాముఁ జూచె నన్న
ట్లుగా మగఁ జూచె మగ నడిగె నిత్యాదిగ నుండను. హరినిన్ అనురీతిరూపము తె
చ్పుట నేఁ గానవచ్చిన నట్టివి అదియునున్ అనురీతివానివరె సాధించుకొనుట
యుక్తము గాని సాధారణముగనె హరినిన్ అనురీతిరూపములు సాధించిన నొప్పవు.
హరి నడిగె హరిం జూచె హరి ఘనునిన్ ఇత్యాదిరూపములు గావు. అట్టినిర్ణయము
కవిప్రయోగానుగుణము కాదు గదా. కావున ఇదాదిభ్యస్తు మొదలుకొని లక్షణము
మహదమహత్సాధారణముగా గుర్తింపఁదగును.

కాఁగా నమహాదుదంతములయెడను నిట ద్వైరూప్యము వనమునన్ వనమున్ అనురీతిగా సిద్ధించు. వనమున్ అనురీతి అమ్లోపరూపము అన్యతస్తు అనుదానిచే సిద్ధించునా? అన్యతస్తు అనుదానిచే నువర్ణకసాక్షికత గల్గు నని వజ్ఝలవారు వివరించిరి. కాని యన్యత స్త్వత్ర సుర్భవే త్తనుచో నిట్టుక్ స్యా త్తన్నట్లుగా లోపము చెప్పకుంట గమనింపఁదగియున్నది. కాఁగా నువర్ణము వచ్చుస్థలముల నమ్మునకు (నువర్ణమునకు) లోపము విహితము గాలేదు గాన నిట నమ్లోపవికల్పత చెప్పుట సార్థకమ యగుచున్నది. అమ్లోపాభావపక్షమున నన్యతస్తు అని నువర్ణక మగు నన్నమాట.

ఉదంతములపైని నులోపము వికల్ప మను చొప్పునా? ఇదంతాదులపైనే లోపము నిత్య మని యుదంతములయెడ వా యనుటచేతనె యహో. ప్రయోగాస్తు సర్వత్ర నువర్ణకస్య లుక్యేవ బహవః ప్రాపుస్తే (కవిశి.౩౯౮) యనెను. సర్వత్ర యనుటచే నిదాదులపైనే గాక యుదంతములపైని(నింకను రమను క్మ్రను అనురీతిగా నకారాంతములపైఁ గూడ) వా యన్నను నువర్ణకలోపము (అమ్లోపము) తఱుచుగ నగు ననియె యహో.యభిప్రాయమును గుర్తింపవచ్చును. అట్టియెడల ఇదాదిభ్య స్తు నిత్యం లుక్ అనునదియు భంగ్యంతరముగ వివరించినట్లె యగును. ఇట్లె ఆచార్యప్రయోగేష్వపి బహుశో లుగేవ ప్రాపుతే యని యుదంతములపైని గూడ నువర్ణము తఱుచుగా లోపించు ననియే చెప్పెను, క.పం.కారు తఱు చనియే వివరించుట గమనార్హము. బహవః, బహుశః అనుటలో సింహాసనమున్ అనురీతిరూపములు నుండవచ్చు నని యభిప్రాయము. బాల.లో నువర్ణకముపై నెప్పుడును ద్రుతము చెప్పఁబడలేదు. దీనివలననే రమను ఇత్యాదులందును నువర్ణకముపై ద్రుతము గానరాదు. రమ నగెగను సీతఁ గొల్చెను ఇత్యాదులు సిద్ధింపవలె నన్న నటఁ గూడ నమ్లోపము నిత్య మని యేని లేదా తఱు చని యేని జెప్పవలె. ఇదాదిభ్యస్తు అనుచోటియాదిశబ్దముచే నమహాత్స్థలము లెల్ల గ్రహించిన మేలె. ఉదన్తాత్తు అన్నది కేవలము మహత్పుంలింగముల విషయమె చెప్పిన దగు. లేక వా శబ్దముచే నమహాదుదంతములపై లోపము నిత్య మనవచ్చు. అప్పుడు ఇదాదిభ్యస్తు అనుచో

నమహత్తు లకారాంతములను గ్రహింపవలెఁ బ్రయోగానుగుణముగ లక్షణమును గుర్తింపవలె నన్న. సింహమునున్ అనురీతిని అదియునున్ అనురీతివానివలె సాధించుకొనవచ్చు.

ఇట్టిచోటల నువర్ణము దానిపగా నెల్లచోటల లేకుండఁగా నువర్ణమును ద్వితీయావిభక్తిగాఁ బరిగణింప నేల? కాక లోపము లేదు అని చెప్పి సింహమునున్ అనురీతి వరుదుగా నుండఁదగు నని యిటనే గ్రహించినను బ్రయోజనము స్వల్పమె యనఁదగియున్నది. అనఁగా చెప్పట నేని సింహమునున్ అనురీతి ప్రయోగ మున్న నది నువర్ణము ద్వితీయగాఁ జెప్పుటలోని ప్రయోజనముగా నెన్నవలె. చిం. ననుసరించి గ్రహించు మన్న నయ్యది యీనువర్ణమును స్పష్టముగాఁ జెప్పియే యుండలేదు. నిరమో మహతాం లక్ష్య న్యా త్తనుచో మహత్తులకు నివర్ణకము విధింపఁబడినది గావున పరిశేషన్యాయమునచే నమహత్తులకు నివర్ణకము లోపము నగు నని యతఁడో, వివరించెను. ఇది యెంతవరకు యథార్థమో చెప్పఁజాలను. (క్రిందు వర్ణములమొదను నిరఁ దిప్పి సమమానించెను. కాని కు విహిత మయియే యున్నది చిం.లో) మహాప్రాంతలింగము లగునికారాంతములకు నివర్ణమె యవు నని తదితరము లికారాంతము లైనను నువర్ణకమె యగు నని యూహించెనా? లోపాభావపక్షమున గిరినిన్ అని యుండునా? [illegible] అనురీతిరూపములును సాధారణములు గావు. అట్లే వనిము నన్నయాదులు ప్రయోగింపలే దనియు నహో[illegible] చెప్పినట్లు గుర్తింపవచ్చును. అట్టివానిని చిం. సాధించె ననుటలో వజ్జలవారు కవిప్రయోగము లెందును చూపిరను చేసికొనలేదో స్పష్టము గాదు.

కొలిచితినిన్ అద్దిఁ అనుచో సంధి రానిరూపములు విరళము లని చెప్పు కొన్నట్లుగనె వనమునున్ ఏఁగె వనమును నేఁగె ననురీతి సంధి రానిరూపములు విరళములే యనవలె. అనాదిసూత్ర ముందలిహాళ్ళముచే నె ట్లే సీయర్థము సాధింపవచ్చుఁగాక. హరినిన్ అడిగె గిరినిన్ ఎక్కె ననుచో నిబ్బంది లేదా? అప్పరత్వమున నెట్లు చెప్పుకొన్నను హల్పరత్వమున నిబ్బందులు తప్పవు. వనమునున్ చూచె ననుచో వనమునుం జూచె నిత్యాదిగ నవునె కాని వనముం

జూచె నని యెట్లు? అట సంధి విరళ మని చెప్పినట్లుగా నిట నేమి చెప్పుదుము? నులోపము తఱు చందురా? దానింగూర్చి వారు ప్రస్తావింపలేదు. వనమునుజూచె నన్నది వనముం జూచె ననుదానివలె సాధారణ మనఁగలమా? ఇట నెట్లొ సమర్థించి నను షష్ఠికి ద్వితీయవచ్చుసందర్భమునఁదప్పక నువర్ణకలోపముతోడిరూపమే నిలువ వలె. సీతయొక్క + శక్తి సీతనున్ + శక్తి సీతనుశక్తి యని యపరూపము లగు. దానింబట్టి చూచిన సీతనున్ అనురీతిగా నువర్ణముపై ద్రుత ముండుటయె యుచితము గా దని నిశ్చయింపఁదగియున్నది. అహో. ఇట్టియేకారణముచేఁ గాని నువర్ణలోపము తఱు చని స్పష్టము చేసెను.

ఇట్టియెడలఁ గవిప్రయోగములను సూరిసమ్మతి ననుసరించి వనమును అను రీతిరూపములె యంగీకార్యములు. అహో.చెప్పినట్లు నువర్ణకలోపము చేసిన వనమున్ అనుచో నున్ననకారము ద్వితీయావిభక్తి గాక దాని కైనయాగమమె. ఎల్లయెడల విభక్తి లోపింప దాని కైనయాగమమె నిల్చి యున్న దనుటకంటె నచ్చోఁ జివర నున్నద్రుతము ద్వితీయావిభక్తియే యనియు దీనిపై ద్రుతము చేర దనియుఁ జెప్పుట యుచితము గదా. సూరి యట్లే యెంచి నుగాగమము తృతీ యాదులకుఁ జెప్పె. చిం.లోఁ గూడ నట్లే నువర్ణముపై ద్రుతము చేర దని చెప్ప నగునా? అందు నొండు రెం డవరోధము లున్నవి. నిరమో మహాత్మునుచో నివర్ణముపై ద్రుతము చేయుచున్నాము. నువర్ణముపైఁ జేయకుంటకుఁ గారణము లేదు. అట్లని నివర్ణముపైఁ గూడ ద్రుతము చేర దందుమా? ద్వితీయైకవచనము లోపించుసందర్భమున నిష్టరూప మేర్పడదు. రాము హరి అనియె యుండవలసివచ్చు. గిరి నెక్కెను రాముఁ జూచె నిత్యాదు లెట్లు? అమ్ము లోపించు నపుడు ద్రుతము చేయకతప్పనిచో లోపింపక నినువర్ణములు వచ్చినపు డేల చేయ రాదు? నినులు ద్రుతములే యని యవి వచ్చునపుడు ద్రుతాంతము లగుఁ గాన ద్రుతము చేయనక్కఱ లే దనియు అమ్ము లోపించునపుడే చివర ద్రుత ముండదు గాన ద్రు.ప్ర.త్వమునకై ద్రుతము చేయవలయు ననియుఁ జెప్పుదుమా? అపుడు అమ్ము లోపించినను(రామునిన్,హరిన్) నినువర్ణములు వచ్చినను నేర్పడురూపము

లొక్క-తీరుగ నుంట లోప మొక్కచో యెల్లెడలఁ జెప్పఁజాలియుండ నినులు విధిం చుట యనవసర మగును. కాఁగా నివర్త్తకమువయినవలెనె నువర్త్తకమునయిం గూడ ద్రుతమును జేర్పకతప్పనిస్థితి, వి.వి. స్పష్టముగాఁ జెప్పినయీలోపవిధానమువలనే నిశ్చిత మగుచున్నది.

ఉదన్తాత్తు స వా యనుటచే నకారాంతము లగుమహత్పులింగములపై నల్లోప మసలు లే దని గ్రహించితిమి. అట్లే నకారాంతము లగుమహత్పుంలింగేతర శబ్దములపై నమ్మును లోపింపకుండవలెఁ గదా. అయిన రమునన్ జ్మనున్ ఇత్యాదిగనె తప్పక యేర్పడవలసివచ్చుచున్నది. ఏ ప్లేని నిదాదిభ్యస్తు అనుచో నాది శబ్దముచే నదంతములు గ్రహించిన నెల్లశబ్దములపైని ద్వితీయైకవచనము లోపించును. ఉదంతాత్తు స వా అని యుదంతములపై నైన వికల్ప మనవలె. అట్లఁ గూడ నిత్యముగా లోపించు నని వాశబ్దమునకు వ్యవస్థచేసి గ్రహింతుమా? ఇఁక నన్యతస్త్వత్ర యని నువర్ణకము చెప్పుటయే ప్రయోజనహీనము. అట వికల్ప మనక తప్పకుండఁగా, సింహమునున్ (శంఖమునున్) అనురీతివి మాత్రము ప్రయోగములనుబట్టి సాధారణములుగా నంగీకరింపఁగలమా?

ఇందలివాశబ్దమునకు వ్యవస్థ చేయవలయు నని యహో.భావించెను. వ్యవస్థ యవసరమ యనఁదగు. రాజు అన్నది మహత్పులింగమ యైనను దీనిపై నమ్మునకు నివర్తక మగుట లేదు. (నువర్ణకము లే దనఁదగు) కావున నుదంత మగునాస్థలమున నల్లోపము నిత్య మని నియమింపఁదగును. అమహదుదంతముల కెల్ల నల్లోపము తఱు చని నియమింపవచ్చును. మహత్తులకును వువర్ణక మగుస్థలము లరుదే యగును. సింహమునున్ అనురీతిరూపములను సాధారణముగాఁ బాక్షికముగాఁ గాక యరుదుగ నుండు ననుట యొప్పునే కద. అన్యతః అన్నది ప్రయోజనవంతము నగును.

ఇట్టినిర్ణయమువలన బాల.చే ద్రుతముమీఁద నకారముగా సమన్వయింపఁబడుస్థలములుగా ద్వితీయానువర్ణకముపై నెట నేని నకారము గన్పించుతావు లిట

నమ్మ లోపింపక  నువర్ణక మయినవిగా గ్రహింపవలసియుండును. అట్టిమిక్కిలియల్పము లగుస్థలములుమాత్రమె నువర్ణమును ద్వితీయగా నంగీకరింపవలసినతావులుగా గుర్తింపవలెను.

కాని హరిని నడిగె ననురీతిగా నిదాదులపైని నివర్ణకముపై నకారము గన్పించుస్థలము లెట్లు? ఇవాదులపై నప్లోపము నిత్యముగాఁ జెప్పఁబడుటంజేసి హరిని నడిగె నని కా వీలు లేదు. అట్టియెడల ద్రుతాద్ధ్రిత యనువానిచే ద్రుతము పైని ద్రుత మయిన దనియే చెప్పక తప్పదు. అట్టియెడలఁదదనుగుణముగా ననుము నేఁగె ననురీతిగా నువర్ణముపై నకార మెట నేని గన్పించుస్థలములందును ద్రుతముపై ద్రుత మైనట్లు గుర్తింపఁదగును గదా. అట్టియెడల నువర్ణకము వచ్చుటకు వీ లయినయుదంతములపయి నమ్మునకు లోపము నిత్యముగా నగు నని వాశర్థమునకు వ్యవస్థ చేయవచ్చు. కాని యది యస్యయః అన్నది వ్యర్థ మగుఁ గావున నిట్లు చెప్పరా కున్నది. లోపము లేని చనిదో లక్ష్యలక్షణములనుబట్టి చెప్పి సింహమునున్ అనురీతి వరుదుగ నిటనే యేర్పడు నని చెప్పకతప్పదు.

ఈనువర్ణమును జిం. చెప్పలేదు. అయినను నివర్ణకమును విధించినచోట లోపము చెప్పుటనుబట్టి నువర్ణకముపైఁ గూడ ద్రుతము చేర్పవలసియున్నది. చెప్పినపక్షమున నానువర్ణకసందర్భమున లోప మేరీతిగాఁ జెప్పెడిదో, యనుక్తాంశమునుబట్టి సిద్ధాంతము గుదురదు గదా. ఏ మైనను జిం. నివర్ణము నప్లోపమును జెప్పినచోట రామునిన్ రామున్ అని ద్వైరూప్యము సాధారణము కాని నువర్ణకస్థలమున నువర్ణక మైనరూప మసాధారణ మని స్పష్టమె. అంత నువర్ణమును జిం ద్వితీయగాఁ జెప్పుటయు వి.వి. నువర్ణకమును విధించుటయుఁ (గొంతయేని) సార్థకపడవలె నన సింహమునున్ అనురీతిరూపములు క్వాచిత్కముగనే నంగీకరింపకతప్పదు.

కాఁగాఁ జిం.,వి.వి.ల ననుసరించి ద్వితీయలో నిమలపైని గూడ(లవర్ణము తోపాటు)ద్రుతము చేరు నని నిర్ణయింపవలసియున్నది.

మేల చెప్పఁదురు? అమ్లోపమువలన సాధింపంబడునది రామున్ సీతన్ అనురీతివి. కొలిచితిన్-కొలిచితినిన్, చేసెదనున్-చేసెదన్ అయినట్లుగా రామునిన్-రామున్ సీతనున్-సీతన్ అని కావా? అమ్లోపవిధానమె వజ్ఝలవారిపై ప్రక్రియ సరి కా దని నిరూపించుచున్నది. నిసులు ద్రుతములు గానపుడు స్వరలోప మైయందు నకారపుఁ బొల్లయె మిగిలిన నది ద్రుతము గా దని కూడ నిట గమనింపందగియున్నది.



చిం.ప్రణాళిక ననుసరించిన ప్రౌఢవ్యాకర్తృమతి మిటఁ బరిశీలింపందగి యున్నది. త్రికములద్వితీయాంతరూపములు సాధించుచోఁ ప్రౌఢ. ద్వితీయైకబహు వచనంబులు రెంటను నివర్ణకంబగు(శబ్ద-80)నని చెప్పి దానిన్ వానిన్ ఇత్యాదిగాఁ జూపినది. ఇందు నివర్ణము ద్వితీయావిభక్తి కాఁగా దానిపై నకార మె ట్లయినది? సూరి తృతీయాదులకుఁ గదా నుగాగమము చెప్పినది. కాన ద్వితీయపై ద్రుతము చేసె నన్న నది చిం.ప్రణాళిక ననుసరించుటచేతనే యనవచ్చును. కాఁగా ద్వితీయా నివర్ణకముపై ద్రుతము చేయుట చిం.మతముగా ప్రౌఢ.యు నెంచినది. నకారం బసాధారణంబు ద్రుతం బనుచో నాగమాత్మక మయినదానికి నన్నును అని చూపె. ఇట నహో.మతము ననుసరించి న్నువర్ణమును అమ్మున కాదేశము చేసి ద్వితీయకు ద్రుతము చేర్చె నన్నమాట. కాఁగా ద్వితీయాంతములపై నన్యోయని ద్రుతము చేరు నని ప్రౌఢ చిం.మతముగా నెంచుట స్పష్టమె. కాని ప్రౌఢ. నకారం బసాధారణంబు ద్రుతం బనుచో ప్రత్యయాత్మక మయిననకారమునకు ధనమును వనమును అను నవియుఁ జూపెను. ఇట నువర్ణము ద్వితీయాప్రత్యయ మన్నమాట. దానిన్ నన్నును ఇత్యాదులవలె నీద్వితీయానువర్ణకముపై ద్రుత మేల చేరలేదు? ద్వితీయాంతమునకు ద్రుతము చేరునన్న వనమునును అని చూపి దీనినిగూడ నాగమాత్మక మైననకారమున కుదాహరింపవలెఁ గదా.

అనఁగాఁ ప్రత్యయాగమావ్యయాత్మక మైయుత్వవిశిష్ట మైననకారమె ద్రుత మని చిం.అభిప్రాయముగా నెంచెను గావున ద్వితీయానువర్ణము ద్రుతమె కాని ద్వితీయానివర్ణము ద్రుతము గా దన్నమాట. నివర్ణముపై ద్రుతము చేర్చుటయు నువర్ణము (ద్రుతము) పై ద్రుతమును జేర్పకుండుటనుబట్టి ప్రౌఢ.కూడఁ జిం.ద్రు.ప్ర.ల ద్రుతము విధింపఁబడినచోట్ల దానిపై మఱల ద్రుతము చేర దని యెంచె

నని స్పష్ట మగుచున్నది. ఇది యుచితము కదా. నన్నును అనుచో న్ను ప్రత్యయమును
దానిన్ అనుచో ని ప్రత్యయమును ద్రుతములు గావి ద్రు.ప్ర.తక్తై యగాశబ్దములపై
ద్రుతము చేరఁగా ద్వితీయానువర్ణకము మాత్రము ద్రుత మగుటచే దానిపై
ద్రుతము చేరలే దని ప్రౌఢ. సమన్వయము.



అయినఁ జిం. నువర్ణముమాత్రమె ద్రుతముగా నెంచె నను ప్రౌఢ. యభిప్రాయ మెంతవఱ కుచితము. నన్నును అనుచో ద్వితీయ మైనద్రుతమును నువర్ణముగాఁ జూపినప్రౌఢ. దానిన్ అనుచో నకారపుఁబొల్లనే యేల చూపినది? పిదప దానిచేతన్ అని యిచ్చె. నాచేతను అనురీతిగా దానిచేతన్ అని యుండును గదా. అనఁగా దానిచేతన్ అనుచోవలెనె దానిన్ అనుచోఁ గూడ ద్రుతస్వరలోపముతో నుదాహరించె నన్నమాట. అయిన లోపము చేయకయుండ నేస్వర మున్నది యనుట? సుద్రుతమె చేరు నన్న దానిను అని యుండు. కాని దానిని అని యుండవలెఁ గదా. నకారం బసాధారణంబు ద్రుతం బనుచోఁ గూడ నాచేతను అనురీతి నువర్ణముండఁదగిన చోట్లే చూపెను. దానికిని రామునిని అనురీతి స్థలముల నివర్ణమె యుండును గదా. అయిన దానిను రామునిను అని యిచ్చుటను సుద్రుతమె చేరఁగా ఇకారంబుమీఁది యనుసూత్రముచే నిత్వ మయి(బాల.చిం.వ్యాఖ్యానప్రాయము గాన నని తలఁచెనా?) దానిని,రామునిని అని నువర్ణమె నివర్ణ మగు నని చిం.మతమునను ప్రౌఢ. యభిప్రాయపడె ననవచ్చును. అయిన నువర్ణవికృతము గానినివర్ణము ద్రుతము గాదా? అస్మద్యుష్మద్భ్యాం ద్వ్యాదేశత్వ ఇతో నిపీ యని యేర్పడిన-కవిని ఇత్యాదుల నివర్ణము ద్రుతము గాదా? ఇకారంబు మీఁది క్రియావిభక్తులయెడ నుత్వమున కిత్వము వచ్చు నని సూరివలెఁ జిం. కూడ నెంచినను గుసువుల విషయమున నట్లు దలంపలే దని ని,నులు ద్వితీయగాను, కితుల షష్ఠిగాను ఇతో నిపీ యనియుఁ జెప్పుటను బట్టి స్పష్ట మగుచున్నది. కాఁగా నువర్ణవికృతము గాని నివర్ణమును ద్రుత మైయుండుట చిం.లోఁ గలదు.

కావుననే చిం.లో బాల.లోవలె నుత్వవిశిష్ట మైననకారమె ద్రుతమని నిశ్చయింప వీలులేదు. చిం.కూడ బాల.పద్ధతిలోఁ గుసువులయుత్వమున కిత్వ మగు నని భావించె

నన వీలు లేదు. కావున నివర్ణ మెప్పుడును ద్రుతము గాదు గావున ద్వితీయాని వర్ణముపై ద్రుతము చేరు ననియు నువర్ణ ద్రుతము గావున ద్వితీయాను వర్ణముపై ద్రుతము చేర దనియుఁ బ్రౌఢ. తలంచుట చిం. కనుగుణము గాదు. చిం.లో నుత్వవిశిష్టమైననకారమె ద్రుత మనుటయుఁ గుదురదు. కావున రామునిని హరికిని ఇత్యాదులందుఁ జిం.ననుసరించి నుద్రుతమున నిత్యమైన దన వీలు లేదు. ఇంకనన్నును నాచేతను అనుచో నువర్ణ మెట్లు ద్రుతముగాఁ జేరినదో దానిని రామునిని ఇత్యాదుల నివర్ణమె యట్లు ద్రుతముగాఁ జేరిన దనియు నువర్ణమువలెనె యాద్యై యెడలఁ బ్రత్యేక మగునివర్ణమును ద్రుతమె యనియుఁ జిం.మతము నెన్నవలె, దానికిఁ బ్రబలాధారము అస్మద్యుష్మద్వ్యాఖ్యాతేకత్వ ఇతో నిపీ యనువిధానమె యనవచ్చును.

కాఁగాఁ జిం.లో ద్వితీయానువర్ణ ముత్వవిశిష్ట మగుటంజేసి ద్రుతము గావలె గావ దానిపై ద్రుతము చేర దని నిశ్చయింపరాదు. కాఁగాఁ జిం.లో నివర్ణమును నువర్ణమును బ్రత్యేకముగా ద్రుతములె కాని ద్వితీయానినులు మాత్రము ద్రుతములుగా వనవలె. కావున ధనమును వనమును అనుచోట ద్రుతము నన్నును నాచేతను అనువానియందువలె నాగమాత్మక మయినదే కాని ప్రత్యయాత్మక మయినది గా దని గుర్తింపవలె.

ఇకారముపైఁది కునువులకును జిం. ఇట్లేను చెప్పియున్నను లేదా కని అనువానిం బ్రత్యేకముగఁ బ్రస్తావింపకున్నను జాలవఱకుఁ బ్రౌఢవ్యాకర్త యనుసరించినమార్గము చిం.లో నతికెడిదె యనవచ్చును. ప్రౌఢవ్యాకర్త బాల. సాధించిన దని హరికిని ఇత్యాదుల నిషయము నుపేక్షించినను కవిని అన్న విశేషణ రూపము చిం.లో ద్రు.ప్ర. యగుట కాని లేదా తనగ్రంథమునఁ బ్రస్తావింపఁబడిన దానిని అనుమానవిషయమునఁ గాని కొంచె తేని వివరించిన బాగుండెడి దేమో. మరి ద్వితీయకు ద్రుతాగమమును జెప్పనలేదు గదా.

కాఁగా ద్వితీయానినులు చిం.,వి.వి.లమతమున ద్రుతములు గావు. ఇతరము లగునుబంతములయెడను ద్రు.ప్ర.లకుఁ ద్రుతమును జిం.చెప్పుటను చెప్పనలేదు

ఘటించితిని అనుచోటనివర్ణమును సాధించుటకై యి ట్లుత్తమైకవచనముగా సాధా

రణముగ నువర్ణమును జెప్పి యీరెంటిని సాధించె నని సమర్థింప నవకాశము లేదు అది యట్లయైన నివర్ణముగా నుండుస్థలము లెల్లను బ్రత్యేకముగాఁ జెప్పవలసి యుండుఁ గదా. [చెప్పినద్వితీయైకస్థలమున (నది ద్రుతము గామి) నివర్ణముపై ద్రుతము చేరుచున్నది.]ఇతాం మసః కి స్వార్థ త్తని కివర్ణమును జెప్పెనే కాని కివర్ణకముపై నివర్ణమును సాధించెనా? ద్రుతము నకారపుఁబొల్లయై హరికిన్ ఇత్యాదిగ నుండుమాత్రమె చిం.మతె మనియు హరికిని అనురీతి నుండుట తన్మతమున నసాధువనియుఁ జెప్పవలెనా? అయిన హరికిన్ అనియె సాధించినను హరికిని అనురీతిరూపము లున్నట్లె కొలిచితిన్ అనియె సాధించినను గొలిచితిని అనియు రూప ముంటలో విశేషము గాని విరోధము గాని యూహింప నక్కఱ లేదు గదా. కొలిచితిని కొలుతును అన్నవి సాధువు లనియు(అవసానేతరస్థలములను)రాముని హరికిని అన్నవి యసాధువు లనియుఁ జెప్పుట సక్రమమా?

అయినఁ జిం. యీనువర్ణము నేల చెప్పెనో యూహింతము. చిం. యింతకు మున్ను అస్మద్యుష్మద్విశేషణములనుగూర్చి ప్రస్తావించునపుడు పరేషాం చ ధర్మోత్తమమధ్యమవత్తనియెను. ఉత్తమవత్తనుటచే నేకత్వమునం దున్నయుస్మద్విశేషణమునకు నువర్ణము వచ్చుట ఉత్వయుతో వనకారో యనులక్షణము ననుసరించి గుర్తింపఁబడుచున్నది. అనఁగా నచ్చోట నువర్ణము గ్రహింపఁబడుటకు వీలుగా నిచట నుత్తమైకవచనముగా నువర్ణమును జిం. విధించియుండవచ్చును. ఇట్టిసమన్వయము కుదురునా?

అంద్వింందునాస్తు నస్తమి యని చిం. ఇందును సప్తమిగాఁ జేర్కొనెను. దానికిఁ బ్రయోజన మే మన జేరలి చ యని వచ్చెడు అలి అందుతోపాటు ఇందుకుఁ గూడ వచ్చుట యని యహో. స్పష్టము చేసెను. అలికొఱకై యిందును సప్తమిగాఁ బరిగణించినట్లుగనె పరేషాం చ అనుచో నువర్ణము గ్రహింపఁబడుటకుఁగాను నుత్తమైకవచనముగా నువర్ణము నిటఁ బ్రత్యేకముగా విధించె ననుట చిం.విధానమున

కనుగుణమె కదా. జే రలి చ యని అలి యనుచుగనె సంధిప్రకరణముననె చెప్పఁబడఁగా అంద్విందునాస్తు అనులక్షణము తరువాత నజంతప్రకరణమునఁ జెప్పఁబడినది. అష్లే పరేషాం తు అనులక్షణమె పూర్వమునం దుంచఁగా ఉత్వయుతా యను లక్షణము పిదప సప్రకరణముగాఁ జెప్పఁబడుట వింత గాదు. కావునఁ బరేషాం తు అని ప్రసక్త మగుపూర్వస్థలముననె సువర్ణకమును జెప్పి యుట మానవచ్చును గదా యనుసందేహము నక్కఱ లే దని గుర్తింపఁదగును. జే రలి చ యనుచోఁ గూడ అంద్వింద్వుల కలి యవు నని స్పష్టము చేసి యున్న (నట నావిషయము స్పష్టమగుటయు) ఇందును సప్తమిగాఁ బరిగణింపవలసినయావసరము లేకుండుటయు దీన (ననౌచిత్యమును దొలఁగుట విశేషము) సిద్ధించెడిని. ఇందును సప్తమిగాఁ జెప్పుటకంటెఁ గూడ సువర్ణము సత్తమైకవచనముగాఁ జెప్పుట యుచితము గదా.

ఇంకను జే రలిచ యనుచో జనిర్దేశము సప్తమి సుపలక్షిత మనుకొనవలె. లేకున్న భత్తులయందలి కరుణ మొ॥వట్లు? సప్తమ్యేకవచనమాత్ర మగునవర్ణకమున న కలి లేనేలేదు. ఇందును సప్తమిగాఁ జెప్పుటలో నలీతర మగుప్రయోజనము లేదు అనాదిమసూత్రముచేఁ జెప్పఁబడినపై కల్పితసంధి యుప్పట యుం కొకప్రయోజన మున వచ్చు. కాని యట్టియెడ నెంమును సప్తమిగాఁ బరిగణింపముంజేసి వానికి అలి చే దన్నయహో. మార్గమునే యనుసరించి యెందులోను సంధి లే దని చెప్పవలసియుండును. అవు డెం దున్నాఁ డిత్యాదు లసాధువులె యనవలె. అందుకే బహూశః అహో. ఇందు గ్రహణప్రయోజనమును వివరించుచో అలినిమాత్రమె పేర్కొనెను గాని సంధినిగూర్చి ప్రస్తావింపలేదు. కాఁగా ఇందును సప్తమిగాఁ బరిగణించుటలో అలియవు నొక్కటె ప్రయోజనము. ఇందు సమ మైయుండఁ బ్రత్యయముగాఁ జెప్పుట యొక్కఁ డనర్థమె కాని ప్రస్తుతము సువర్ణము సత్తమైకవచనముగాఁ జెప్పుటలో ననర్థము లేకుండఁగాఁ దద్ధర్మమునందే గాక యితరార్థములందు సైతము సువర్ణము సంగ్రహింపఁబడుట విశేషముగాఁ బ్రయోజన మగుచున్నది.

సువర్ణముపై గసడదవాదేశమున్నదా? నిసువర్ణాంతాలు ప్రథమాంతములు గానఁ గళ లని నిశ్చయించి యూరకొనక దానికిఁ గళాత్వమును నిశ్చయించునవిగాఁ బైపరుషములకు గసడదవ లైయున్న ప్రయోగములు చూపినఁ జక్కఁగా నుండెడిది. భారతకవులు గసడదవాదేశమును నిత్యముగనే ప్రయోగించి రనిరి గదా. ఇంకఁ బరుషపరకత్వమున నకారపుఁ బొల్లయే (కాని) నిసుస్వరూపము భారతమున లేనే లేదా.

సూరిమతమున సువర్ణము ద్రుతమే. కాఁగా కవిని, పండితుఁడను ద్రు.ప్ర.లు. సూరిమతమున నివి ద్రు.ప్ర.లు కాఁగా వజ్ఝలవారి వివరణము ననుసరించి చిం, మతమున నివి కళలు. నేనుదాసులు గళ అనుటకు ఏదు విదప నస్ప్రయోగ మొండు చూపిరి. కాని యీనిసువర్ణాంతములు గళ అనుటకు దీనిపై గసడదవాదేశమున కొక ప్రయోగము నీ లేదే. కవిని, పండితుఁడను అన్నవి కళ లనియు కవిన్ పండితుఁడన్ అని యైన నవే ద్రుతాంతము లనియు వీరు చెప్పుటలో ద్రుతము పొల్లునకారమే యనువీరిసిద్ధాంతమే కారణము గాని యన్యము కానరాదు. ఇంకవీరే బా.ఉ.లో సువర్ణము ద్రుత మనిరి. అపుడు కవిని పండితుఁడను అనుచో స్వరలోపము చేయకున్నను నివి ద్రు.ప్ర.లే యగుచున్నవే. అపుడు వీనిపైఁ బరుషములకు గసడదవలు గాక సరళము గావలె. వజ్ఝలవారిసిద్ధాంతము మారినఁ గవిప్రయోగము లెట్లు మారును?

స్వరలోపముచేఁ బొల్లనకారముతో ద్రుతాంతత సిద్ధించు నని యెంచినవీరు చేసెదను చేసితిని అనువానిపై నేల ద్రుతము చేసిరో? వీనియందు స్వరలోపము చేసిన నివి ద్రు.ప్ర.లే యవుఁ గదా, చేసెదను చేసితిని అని యున్న వానిని గళ లన వచ్చు. తిఙ్మధ్యాదులలో లేకున్నను ఘటించుచున్నాఁ డనురీతి ప్రథమైకవచనాంతములు కళలే గదా. చేసెదను కళ. చేసెదన్ ద్రు.ప్ర. ఇది యెప్పుడును ద్రు.ప్ర.యే యనుటకు ద్రుతము చేసిరా? అయిన నా ద్రుతము లోపించిన నివి ద్రు.ప్ర.యగునా? ద్రు.ప్ర.యే యన్న వీనిపైఁ బరుషములు సరళములు గావలె. కళ లన్న గసడదవలు వచ్చు.

ఉత్తమైకవచన మగుటనుబట్టి గసడదవలు చూపఁగలరా? చేసెదఁ దనను అనుచో దంత్యద్రుతలోపమును నువర్ణమున స్వరలోపమును జేయక వీరి కారూప మైనదా (అవసానేతరస్థలముల నిట్టివి కుదురవు కాని వీని చేయుదురు.) అట్టియెడ దంత్య ద్రుతలోపము మాత్రము చేసినఁ జేసెదను అనిరూప యుండును. దీనిపైఁ బరుషములు గసడదవలు గాకున్నను నట్లయే నుండవలదా? అట్టిప్రయోగము లే మున్నవా? లేక దంత్యద్రుతలోపము చేసినచో ఘంటానినువర్ణములందును నుత్వలోపము తప్పక చేయవలయునా? ఏ మైనను గవిని బండితుఁడను అన్నవి ద్రుతాంతములు గా వన్నట్లు చేసెదను చేసితిని అన్నవి ద్రుతాంతములు గా వలెఁజాలవు గదా నిజమునకు వ్యజ్ఞలవా రేని నిసులు ద్రుతములుగాఁ దలచిన గవిని పండితుఁడను అను నవియే ద్రు.ప్ర లనియుండును. నిసులు ద్రుతములే యని స్పష్టము(చూ.ద్రు.)

భక్తుఁడను అనుచో నుత్తమైకవచనమువంటిదిగాఁ జెప్పఁబడిననువర్ణము ద్రుత మైనపు డుత్తమైకవచన నుగుసువర్ణము ద్రుతమె కదా. క్లీబసమా అమహద్వత్తని క్లీబ నకారములకుఁ జెప్పిన మమహాత్కార్యము క్లీబములకు రాదా? మిత్రము దైవ మని యవునే కదా. దీనియుత్వమున కిత్వము చెప్పుట ద్వారాన సాధింపఁబడినకొలిచితిని అనుకీత్థలములందలి నివర్ణము నైక మిక్లే ద్రుత మని గుర్తింపవచ్చును.

ఇట్టినిసులే ద్రుతము లని గుర్తింపఁబడఁగా వీనిపై మఱల ద్రుతము చేయ నక్కఱ లేదు. రాముల, ఘటించె ఇత్యాదులయందు నవి ద్రు.ప్ర.లు కాఁగా నాద్రుతము చెప్పఁబడియుండమిం జేసి ద్రు.ప్ర. లన్నలక్షణముననట్టి ద్రుతము చేసికొనవలసి వచ్చినది. ఇట నుత్తమైకవచనముచే ననుజీవితద్రుతత్వము కల్గఁగా ద్రు.ప్ర.త సిద్ధించుచుండ మఱల ద్రుత మెట్లు చేయుదుము? అన్య ద్రుతప్రకృతియ యనునది ద్రుతాంతము లైనశబ్దములను ద్రు.ప్ర. లనుచున్నది గాని ద్రుతమును విధించుట లేదు గదా. రాముల, ఘటించె ఇత్యాదులు ద్రు.ప్ర. లైనను ద్రుతము విధింపఁబడ లేదు గావున ద్రు.ప్ర.త్వసిద్ధికయి నగతికగతిగా నన్య యను ద్రు.ప్ర.త్వనిరూపకలక్షణము చేతనె ద్రుతము చేయుచుంటిమి. కాని సూరివలెఁ జిం.కర్తయు ద్రు.ప్ర.ల ద్రుతము ప్రత్యేకముగా సాధించియున్నయెడల దానిపయి నన్య యని ద్రుతము వచ్చునా?

తివి అనుచో నివివర్ణకములు నిల్చునట్లుగా నిటఁ గూడఁ గవిని గవివి యని యవును గదా. స్పష్టతకయి యట్లనె నేమో. ఏమైనను భిక్షుఁడను అనుచో నువర్ణము ద్రుతమయినట్లె కవిని అనుచో నివర్ణము ద్రుతమగును. ఈ నివర్ణము నువర్ణవికృతముగాఁ గాక ప్రత్యేకముగా విధించుట గమనింపఁదగియున్నది. ఇంక నీవిధివలన నువర్ణమువలె నివర్ణమును ప్రత్యేకమయినది ద్రుతమగుట యనువిశేషాంశమును జిం.అభిప్రాయముగా గుర్తింపవచ్చును.

కాఁగాఁ జిం.ద్రు.ప్ర.లలో నస్మద్విశేషణముల కేకవచనాంతములకును నుత్తమైకవచనాంతములకును మాత్రము ద్రుతమును విధించెను. దానిపై నన్యే యని ద్రుతము చేరదు. చింతామణి పదముతుదిని నినులను విధించినచోట్ల ద్వితీయానినులపై మాత్రమె ద్రుతము చేయుచున్నది? ఉత్తమైకవచనముపై ద్రుతము చేరకుండుట కాయది ద్రుత మగుట హేతువు. ద్వితీయానినులపై ద్రుతము చేయుట కానినులు ద్రుతములు గాకుండుట కారణము. చిం. నినులను విధించినచోట్ల నెచట నవి ద్రుతములో నెచట ద్రుతములు గావో నిర్ణయించుటకుఁ ప్రమాణ మేది? ప్రయోగములే యనకతప్పదు. ద్రుతోఖ్యో నః అన్నచిం. యెట్టినకారము ద్రుతమో స్పష్టము చేయమింజేసి ద్వితీయానినులపైనను ద్రుతములే యను నవసరము లేదు.అయిన నప్పు.మాత్ర మివి ద్రుతములే యని యెంచెను. అదియే యుచిత మగుటయు స్పష్టమే. కాని యవి ద్రుతము లని యెంచుపక్షమున నవ్వానిపై ద్రుతము చేయుట కవకాశ మేది? చేర దన్న నల్లోప మేల చెప్పెను? ద్వితీయానువర్ణముపై ద్రుతము చేర దన్న నిబ్బంది లేదు. అట్లనుట యుచితము గూడ. నివర్ణమువిషయమునన యిబ్బంది. అల్లోపపక్షమున బా.స. యుదాహరించినట్లు రాము అనురీతిగనె యుండు నన్న రాము కొలిచె నిత్యాద్యవయావము లవును. శబ్దముచే నవసానమందు యల్లోపస్థితియన్న, వాక్యస్థగతపదానాఞ్చ యన్నాఁడు గనుక లోపవిధానము ప్రయోజనవంతము గాదు. దీనిసాహచర్యమున నివర్ణమును ననఁగా ద్వితీయానినులు ద్రుతములు గా వనుటయె చిం. ననుసరించి చెప్పవలసియున్నది.

ఎక్కడియెట్టినకారము ద్రుతమో ప్రయోగములు మొ॥వానింబట్టి నిర్ణయించు కొనవలసినదే. కాఁగాఁ జిం. ద్రుతము విధింపనిచోట్ల నన్వే యని ద్రుతము చేర కుండుటయు ద్రు.ప్ర.ల ద్రుతము విధింపనిచోట్లమాత్ర మన్వే యని ద్రుతము చేయ టయుఁ జిం.మతముగా నెన్నవలెను.



షష్ఠికి ద్వితీయ యనుగ్రంథాంతమునందలియనుబంధమున ద్వితీయాదులు ద్రుతము లగుటకుఁగలయవకాశము గుర్తింపఁదగును.

కళలనుగూర్చి చెప్పుచోఁ జిం. ద్రుతో న యేషాం స్యాత్తన్నది. కాఁగా ద్రుతము లేనితిఙ్మర్థ్యములు కళలు అన్యే ద్రుతప్రకృతయః అనుచో ద్రుతము గలతిఙ్మర్థ్యములతోపాటు తిఙ్మర్థ్యాదిభిన్నములును ద్రు.ప్ర.లే యవును. అయిన నింతకు ముందు ద్రుతో న యేషాం స్యాత్తనుటంజేసి యిట నన్యే ద్రుతప్రకృ తయః అన్నమాత్రమునసె ద్రు.ప్ర.లకు ద్రుత ముండుట యనునంశము స్పష్టమె. మఱల యే స్వర్థ్యసుజీవితద్రుతానిత్య మ్మను చేల? స్పష్టతక యనవచ్చు. ఇట్లు చెప్పుటంబట్టి దీనిచే ద్రు.ప్ర.లకు ద్రుతము చేసికొనఁదగు నని తత్కర్తయు నెంచెనా? అనుమానమె. ద్రుకాంతము లైన తిఙ్మర్థ్యములు ద్రు.ప్ర. లని స్పష్టము గావునఁ గవిని బంధింపఁడను అని మవి ప్రథమాంతము లైనను ద్రుతాంతము లవుట ద్రు.ప్ర.లే యగును. ఇట్లే నేను, తాము, అన్నయును.

ఏ మైనను మహో.ప్రభృతులు ద్రుత మెట్లు చేరినదో స్పష్టము చేయకయె రాములచేతన్ ఇత్యాదిగాఁ జివర ద్రుతమును జూపినచోట్ల నన్యే యనుసూత్రము చేతనె ద్రుత మవు నని వజ్ఝలవారు చేసిన సమన్వయము సముచితముగ నున్నది. ఇట్టిచోట్ల వి.వి. నైతము ద్రు.ప్ర.ల ద్రుతమును ప్రత్యేకముగా విధింపకుంట (డుడివర్ణాచ చ నాస్తికా తప్ప) గమనింపఁదగును.

బా.స. ద్రుతప్రకృతులు గనుక నకారము నిల్చు నని వివరించెను. కాని యానకార మెట్లు వచ్చినదో చెప్పలేదు. ద్రు.ప్ర. యవుటచే నకారము సహజము గనె యుండు ననియు దానిఁ ప్రత్యేకశాస్త్ర మక్కఱ లే దనియుఁ దలంచిరా?

ద్రుతమును వివరించుసందర్భమున వజ్ఝలవారును రామునిన్ ఇత్యాదులందలినకారము సహజ మనిరి. స్వరలోపముచే నేర్పడినది గా దని యభిప్రాయము గావచ్చును. నకారము సహజ మన్న శబ్దమున సహజ మై శాస్త్రముచే సాధింప నక్కఱ లేనిదని వారియభిప్రాయము గా దనవచ్చును. ఏ దే మైనను రాముల రాములచేత అనుము న్నగురీతిగాఁ బ్రాతిపదికము నాయావిభక్తులతో వికారములను శాస్త్రము వర్ణించుసందర్భమున ద్రుత మొక్కటిమాత్రమె ప్రత్యేకవిధానము లేకయె సహజముగా నిల్చు ననుట యుచితము గా దనకతప్పదు. సూరి యట్లు విధించుట యెంతయు నుచిత మై యున్నది. (దానిని బేటీక విమర్శించుట సరి గా దని స్పష్టము.) కాన బా.స.ప్రభృతులయభిప్రాయ మెట్టి దైనను రామునిన్ మొదలగుచోట్ల నున్నద్రుతము నే దేని శాస్త్రముచే సాధింపఁదగును. అయ్యది ద్రు.ప్ర. లక్షణముగా ననుజీవితద్రుతత్వమును బేర్కొనుచున్న-అన్యే ద్రుతప్రకృతయః అనున దొక్కటె కానవు. కావున దానిచేతనె ద్రు.ప్ర.లద్రుతమును విధింపని చోట్ల శబ్దముల ననుజీవితద్రుతములుగాఁ జేయుట యుచితమే.

ఇట్లు ప్రత్యేకముగా ద్రుతము విధింపఁబడిన-యుత్తమైకవచనస్థలములు కవిని మొ॥ తప్పఁ జిం. లోను దద్ధర్మ్యప్రథమైకవచనస్థలమున నాంతము లై నడుచులను విధించినచోటఁ దప్ప వి.వి.లోను ద్రు.ప్ర. లైనవానికి నన్యే ద్రుతప్రకృతయ యనుదానిచేతనె ద్రుతము చేరు నని గమనింపఁదగు.

ఇట్లు ద్రు.ప్ర.లకుఁ దుది నన్యే యనుసూత్రముచేఁ జేరుద్రుత మెట్టిది యని యనుమానము. చిం.,వి.వి.లయందును ద్రుతము నకారపుఁబొల్లయె యని భావించిన బా.స.ప్రభృతులును వజ్ఝలవారును నీసూత్రముచేఁ బొల్లనకారమునే చేసియున్నారు. కాని యింతకుముందు గమనించినదాని ననుసరించి ను,ని,న్ అనునకారములు గలవి యవుట స్పష్టము. (చూ.ద్రు.) కావున నన్యే యనుదానిచే నునిద్రుతములె యవు నని గ్రహింపఁదగును.

నకారపుఁబొల్లె ద్రుత మని యెంచినయహో. ద్రుతస్వత్వమును నుస్వరూపముగాఁ జూపెను. రామునిచేతన్ అనుచో ద్రుతమునకు స్వత్వము గలుగఁగా

రామునిచేతను అని యగు. ద్రుతమునకు ద్రుతస్వత్వమునకును భేదము చూపుటకం
బె నిట ద్రుతమును సుస్వరూపముగనె చెప్పుట యుచితము గదా. అనఁగా
వన్యే యని యగు ద్రుతము పొల్లు కాక సువర్ణ మన్న రామునిచేతను అనియె
మొదల నుండును. ద్రుత మెట్టివికారము నందక స్వస్వరూపముతో నుండునపుడు
రామునిచేతను అని యుండుట సహజముగా నొప్పును. చిం.మతమునను సువర్ణము
ద్రుతమని యెంచిన ప్రౌఢ. ఈ శ్లోని వన్నును నాచేతను చదువుచును మొ॥వో
ద్రుతముగా సువర్ణమునే చేసియుంట స్పష్టము.

రామునిచేతన్ అనుచో రామునిచేతను అన్నది స్వత్వ మైన సన్నపాద్యునిన్
అనుచో స్వత్వస్థితిలో రూపము సన్నపాద్యునిని అని యుండవలె. కాని యహో.
యిది యసాధు వనెను. జగద్దేయుల సన్నపాద్యునిని తిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్
ఇతి సూరకవిపద్యే సన్నపండితుని నిత్యేవ పాఠః సాధుః (కవిశి.8 పు) త్రింశచ్చ
త్రీసమాప్తేత యని యిట విశ్రుతి రాదను టుచితమె కాని సన్నపాద్యునిని
అసాధు వన నేల? ఇతఁడే యుదాహరించిన-సన్నపండితునిన్, రామునిన్ అను
రూపములవలెనె యిట సన్నపాద్యునిన్ అని యగు. సన్నపాద్యునిన్ + తిక్కసు
ధీమణి అనుచో ద్రుతమునకు స్వత్వము వచ్చిన నే మగును? సంహితాపరకత్వమున
ద్రుతమునకు స్వత్వము సహో. కూడ నంగీకరించెనే కద. సన్నపాద్యునిన్
దిక్క- అని యుండునా? ఇట నకారమునకు బొల్లట్లే యున్న సమ్యగాది వర్ణాంతర
ముగాఁ బరిగణింపఁబడుట యెట్లు? వర్ణాంతరత్వేన సంవర్ణ్యవేళాయాం పృథక్పరి
గణనం తస్య ఫల మ్మని గదా స్వత్వప్రయోజనము సహో. వివరించినది. అట్టి
స్వత్వస్థితి సరళస్థిరపరకతయందే గాని పరుషపరకతయం దుండదా? అటుకే చ
సంశ్లేష యనుమాత్రస్థలమున సహో. యట్లు వివరింపఁబండేసి పరుషపరకతయందు
స్వత్వ ముండ దని యున్న నట్లుండ దని యెంచె ననఁదగునా? అయిన సవికార
గతే యనుదానికి లక్ష్య మేది? రామున్ దలఁచెద ననియా? అట్లయిన వాత్మాస్థ
దోర్దృత స్యా లు క్కనుచో సంశ్లేషము నివారించెను. వినా ద్వితీయ మన్నది
వి.వి. కూడ. పరుషపరకతలో రామున్ దలఁచెద ననుదానివలెఁ దాన్ జెప్పె నని

యుండునపుడు తాన్విసె ననుసంశ్లేషము నివారించుటలోఁ బ్రయోజన మేమి? ఆదేశ
సరళపరకతలో నహో. యె ల్లైని సంశ్లేష మంగీకరించె. అటఁ దాన్జదివె నన్నది
యుండ దని తాన్ జదివె నన్న దుండు నని చెప్పుటలోఁ బ్రయోజనమేమి? తాను
ఘనుఁ డనురీతి సరళపరకస్వత్వస్థితివలెనె తాను జదివె నన్నదె యాదేశసరళపరక
స్వత్వస్థితి యనవలె. ఇటనే యేల? అవికారగతే యనుసూత్రమునొద్దనే స్వత్వ
మధర్వణసమ్మతమె కాని సంశ్లేషము గా దనుచు సంశ్లేషము సమ్మతింప నాధార
ములు చూపుచో విజయుం బోలితి నను బింబరూపముతో సామ్యము చెప్పుటకంటె
విజయున్ బోలితి ననుస్వత్వముతో సామ్యము నెంచు టింకను బలీయము గదా.
అది యేల యుపేక్షించెను? అధర్వణుఁడే పైనను రామున్ దలఁచెద ననురీతి
స్వత్వము నంగీకరించి రాము న్దలఁచెద ననుసంశ్లేషస్థితి నంగీకరింపకుండుటలో
యుక్తి యేమి? అసలు వీనిని వేఱు చేయుటయే యనవసరము గదా.

అవికారగతే యనుసూత్రమునొద్ద నహో.వివరణము "సీతను గొల్చెదన్
సీత న్గొల్చెదన్ రాము న్దలఁచెదన్ ఇత్యాద్యుదాహరణమ్మని (వ్యా.సం.స.285)
యున్నట్లు వజ్ఝలవా రుద్ధరించిరి. (నేఁడు దొరకుచున్నముద్రితప్రతులం దిట్లు గానరా
కున్నది.) దాని ననుసరించి పరుష(ఆదేశసరళ) పరకతయందును స్వత్వస్థితిలో
ద్రుతము నుస్వరూపములో నుంటయే తదభిప్రేతముగాఁ దెలియవచ్చును. అది
సక్రమము. అవసరము రామింజేసియే కావచ్చుఁ గాని స్థలాంతరమున నాదేశసర
ళపరకతయం దందు ద్రుతము నుస్వరూపములో నుంటయు నహో. యుదాహరింప
కున్నను నిట నట్లు గ్రహించుట యొప్పును. అహో.తాను చెప్పె నని కాని తాను
చెప్పె ననీ కాని యుండ దనెనే తప్పఁ దాను జెప్పె నని యుండ దన కుండుట
గమనార్హము. తానునేనుల ద్రుతకార్యమునకై స్వరలోపము నిత్యము. అయ్యు
స్వత్వస్థితిలోఁ దాను నేను అని యుంట యవిరుద్ధమే. తాను ఘనుఁ డన్నచోవలె.
(చూ.తానునేనులు కళలా?)

కాని పైని రాము న్దలఁచెద ననుచో వజ్ఝలవారును సంశ్లిష్టరూపమునే
చూపిరి గాని స్వత్వము నీ లేదు. అది వారు చూచినప్రతియం దున్నదో లేదో.ఉన్న

రాముని దలఁచెద నని యుండును. కాని యిట నన్వయపావ్యయిని అన్నది యసాధు వనుటంబట్టి ద్రుతస్వత్వస్థితి సుస్వరూప మొక్కటె యని తలఁచెనా? రాముసు దలఁచెద నని యుండదు గాన నట స్వత్వమే లే దనవలెనా? సందర్భమేర్పడకుండుటం బట్టియే గావచ్చును గాని యహో. యాదేశసరళములకే కాక సరళస్థిరములకు ముందు గూడ (అవసానమున సీతఁ డెట్లు సంగీకరింపలేదు,) ద్రుతముస్వత్వమును నిర్ణముగాఁ జూపియుండలేదు. మఱి యహో. ద్రుతస్వత్వమును నిస్స్వరూపము గలది యెంచలేదా? అప్పకవి నిస్స్వరూపమును జూపియుండఁగా నహో. యేల యంగీకరింపఁడు? అంగీకరింపఁదగనప్పుడు దాన్ని సాధారణముగాఁ దిరస్కరింపవచ్చునే. అట్లనిష్టము లైనయంశము లెల్ల విమర్శించుట యసాధ్య మనియో లేక యనవసర మనియో యుపేక్షించునెడల ద్రుతస్వత్వము సుస్వరూప మొక్కటె యని తలఁచినప్పుడాయంశమునే స్పష్టము చేయఁదగునే. వర్ణాంతరత్వేన అని మున్నుగా సామాన్యముగాఁ జెప్ప నేల? స్వత్వము సుస్వరూపమె యన్నప్పుడు రామున్ + తలఁచెద, రాముసు దలఁచెద నని కావలసివచ్చు నన్న నెట నెట సువర్ణముండునో చెప్పఁదగు. సీతను గొల్చెద నని స్వత్వముండఁగా రామున్దలఁచెద ననుచో స్వత్వము లేకుండుటకుఁ గారణ మేమి? ద్రుతస్వత్వము నిస్స్వరూపమున నుండవలసినచోట్లనెల్ల హల్పరకత్వమునకైనను స్వత్వ ముండ దనుట యొప్పునా? ఎన్నను సర్వ- అనురీతిగా రామునిని సర్వగుణాభిరాముని ననరాదా? భక్తుడను దొల్పుగ నన్న సుసంగతమును గవిని జూడఁగ నన్న నసంగతమునా? అహో. యంతకుముందు సమషా ద్రుతప్రకృతికా త్తనుసూత్రమునొద్ద రాముఁ గొలిచెద, రాముఁ బంక్తిగ భావింతు, అతనిం బరమపావను భజింతు నని యుదాహరించె, ఇందు వికృతి లేనపుడు ద్రుత మెట్లుండు? రాము న్దలఁచెద ననునొక్కదానినె గ్రహించినఁ(వఝులవారును రాముని దలఁచెద నని చూపలేదు. గాని ద్రుతము నాదేశసరళమును సంయుక్తములుగఁ జూపిరి.) నట సంశ్లేషమాత్రము వచ్చిన దనవలె. అది యహో. మతమున సంశ్లేషమే కద. ద్రుతస్వత్వము సుస్వరూపముతో నుండవలసినచోట్ల సంశ్లేషము, స్వత్వము నుండు ననియు ద్రుతస్వత్వము నిస్స్వరూపముతో నుండవలసివచ్చినపుడు సంశ్లేషమమాత్రమె కాని స్వత్వ మన లుండ దన్నమాట. దీని కాధారము లేకపోఁగా నిట్టివ

తిపాదనమునందు యుక్తిగాని ప్రయోగానుగుణ్యము గాని లేదు. అప్ప. ద్రుతస్వత్వ మును నివర్ణముగాఁ గూడఁ జూపియుండ వద్దానిని నహో. తిరస్కరించె ననుటయు సమ్మతింపఁదగినదిగా లేమ. (కాఁగా వజ్ఝలవా రుద్ధరించినస్థలమున) సీతను గొల్చెదఁ సీత న్గొల్చెద ననురీతిగనె యహో. రాముని దలఁచెద రాము న్దలఁచెద నని స్వత్వ సంశ్లేషములు రెంటిని జూపియే యాపిదప నవి యవుటంగాప్పి వివరించె ననుట యుచితముగాఁ దోఁచుచున్నది. సీతను గొల్చెద నన్నగి నుస్థితిని రాముని దలఁచెద నన్నది నిస్థితికిని రెండుదాహృతు లిచ్చుట ప్రత్యేకముగా నుండి యర్థవంత మగును. ఇట్లు నిసులు రెండు ద్రుతస్వత్వరూపము లగుచున్నవి. రామున్ + దలఁచెద ననుచో రాముని దలఁచెద నన్నది స్వత్వము కాఁగా నతనిం బరమపావను ననుచో నతనిని బరమపావను నన్నది స్వత్వస్థితి యగుచున్నది. తదనుగుణముగాఁ బరిశీలింపఁగా నన్నపార్యునిని దిక్కసుధీమణి నన్నదియు నహో. మతానుసారముగనె నిర్బాధ మగుచున్నది.

త్రియశ్చ త్రీనవాప్పేతః అనుదానిచే దీని (బులింగ మగుట)పై ద్రుతమునకు నిత్రుతి రాదు. గావున నక్కారికచే నన్నపార్యునిని అని మైన దనరాదు. కానియంత మాత్రమున నది యసాదు మరియు నన్నపండితుని ననియె యుండవలె ననుటయు సరి గాదు, మొదట నన్నపార్యునిన్ (రామునిన్) అనియే యున్నను బిదప నాదేశ సరళపరకతలో ద్రుతమునకు స్వత్వము రాఁగా నన్నపార్యునిని దిక్కసుధీమణి నని ప్రయోగించుట సుసంగతమె. వ్యాజమునన్ అనుచో స్వత్వమువలనఁ బొల్లనకార రూప మైనద్రుతము వ్యాజమునను అని సుస్వరూప మందినట్లే నన్నపార్యునిన్ + దిక్కసుధీమణి ననుచో స్వత్వమువలన నాద్రుతము నిస్వరూప మందినది. కాఁగా త్రియశ్చ యనుకారికచే నిత్రుతి రాలేదు గాని స్వత్వము వచ్చుట వలననిస్వరూపముతో నన్నపార్యునిని అనుప్రయోగము సాదువె.

రాముని దలఁచెద నని స్వత్వము నంగీకరించినచో నహో. నన్నపార్యునిని అసాదు వని నన్నపండితుని నని యుండవలె నని చెప్పఁనా? అని యనుమానము. అహో. యిటఁ బ్రమాదపడియుండును. ప్రమాదో ధీమతా మపి. చనియెన్ అనుచో

(ఇయయే లెక్కుండఁగా) నామమాత్ర విషయక మగుటచే నేదన్తతా వనాప్త మగుటచే నెదంతత కలుగ దని సంజ్ఞాపరిచ్ఛేదమునఁ జెప్పినారహో. (కవిశి. 228) యజంతపరిచ్ఛేదమున నేదన్తతా చ యనుసూత్రవివరణమున ప్రయాస్యపి కదిలియుండెడి కదిలించెడి (కవిశి. 191) అని పేర్కొనుట ఎట్లు స్మరింపఁదగును.

అహో. మత మ ట్లుండఁగా హారిం జూచెను హారిని జూచె నిత్యాదిగా ద్రుత స్వత్వము నిస్వరూపముతో గల్గియుంట ప్రయోగప్రసిద్ధము. అప్పకవిప్రభృతు లంగీకరించినదియు. కాఁగా ద్రుతము స్వత్వస్థితిలో సుస్వరూప ముండు నని సూత్రమె యహో. యొంచె నన్నను నిస్వరూప ముండుట గూడఁ గల దనియు నంగీకరింపవలసియే యున్నది. స్వత్వముచేఁ బొల్లనకారము సువర్ణ మె ట్లగును? (అట్లే నివర్ణము నగును) నివర్ణ మె ట్లగును? పై స్వర మెట్లు చేరును? ద్రుతము పొల్లు గాఁగా స్వత్వము నునివర్ణము లగు టెట్లు?

ద్రుతము (నకారము) ను, నిస్వరూపముతో నుంట ద్రుతస్వత్వ మని యంగీకరించునపు (ప్రయోగానుగుణముగా న ట్లంగీకరింపకతప్పదు.) దట ద్రుతమె పొల్లుగాఁ గాక ను, నిస్వరూపము గలదిగాఁ జెప్పఁదగును గదా. చెప్పవలయును. ఆ ద్రుతమును జిం. చెప్పినచోట్లఁ గవిని ఘటింపను అనురీతిగా నిసులుగనె చెప్పినది. ఇంక నట్లు ద్రుతము విధింపనిచోట్ల నన్యే యనుసూత్రముచే నాద్రుతమును సాధించుకొనునపు డా న్యే యనుసూత్రముచే నగు ద్రుతమె ను, నిస్వరూపము గలదిగా గ్రహించుట యొప్పును గదా. ఎట్లైని ద్రు. ప్ర. చివర ద్రుతము చేర్చునపు డా ద్రుతము ని, నుస్వరూపము గలది చేయుట యుచితము.

అయిన సువర్ణ మగునది యెక్కడ? నివర్ణ మగునది యెక్కడ? ఇయ్యది ప్రయోగానుసారముగనె గుర్తింపవలసియున్న దనఁతప్పదు. అహో. పొల్లనకారమును ద్రుతముగాఁ జూచి దానిస్వరూపావస్థితిని సుస్వరూపముతో నిచ్చునపుడు పొల్లనకారముపై సుత్వ మిచ్చు టెచ్చట నగు నన్నది ప్రయోగానుసారముగా గుర్తింపవలసినదే కద. అట్టియెడ ద్రుతము పొల్లునకార మయ్యు స్వరూపావస్థితిలో నద్దానిపైఁ

ప్రయోగానుగుణముగ సత్త్వము చేయ ననుటకంటె ద్రు.ప్ర. యగుటఁ దుదిఁ జేయు ద్రుతమె ప్రయోగానుసారముగా సుస్వరూపము గలది యనుట యుచితమె. బింద్వాదులు సువర్ణమునకే యవును. అట్టివికారములు లేక ద్రుత మట్లే యుండునపుడు సువర్ణ మట్లె యుండుట సహజమై ద్రుతస్వరూపమునకు స్వత్వమునకు(స్వరూపావస్థితికి) భేద ముండుట యనునసంగతియుఁ దప్పును. ఇట్లే నివర్ణమునెడలను. రాముని జూచెను, అతనిని బొగడెను అనుచోట్లనివర్ణమె ద్రుతస్వత్వ మని గుర్తించి యున్నారము. సీతను గొల్చెద ననుచో సత్వమును రాముని దలఁచెద ననుచో నిత్వమును నెట్లయిన వన్న సహో. మతమునను ప్రయోగములె యాధారములు. అట్టియెడల స్వరూపావస్థితిలో ద్రుత మేరూపమున నుండు నని ప్రయోగములనుబట్టి గ్రహింతుమో యట నన్యే యనుసూత్రముచే నట్టి(ని),సుద్రుతమె చేయును. రాముని+ వేడెను రామువేడెను రాము న్వేఁడెను లోపసంశ్లేషములు రానపుడు రాముని వేఁడెనని యట్లే యుండు నదియె ద్రుతస్వరూపావస్థితి, స్వత్వము నని గ్రహించు టుచితమె కదా.

కాఁగాఁ బొల్లునకారమె ద్రుత మయ్యుఁ బ్రయోగానుగుణముగా స్వరూపస్థితిలో సత్వేత్వములు క్రొత్తగాఁ జేయ ననుటకంటె ద్రు.ప్ర.ల కార్యమైయెడల సువర్ణమును నాయైయెడల నివర్ణమును ద్రుతముగాఁ జేయ నని ప్రయోగములనుబట్టియె) గ్రహింపఁదగు నని సహో. ప్రభృతులసమ్మతమార్గము ననుసరించి యుచితముగా గ్రహింపఁదగును. వైజయంతీనామంబుచేవ్యాజమునన్ అనుచో వాక్యాన్తగతపదానాఞ్చ యని ద్రుతము లోపింపనిపక్షమున స్వత్వ మయి వ్యాజమునను అని యవునను సహో.అప్రామాణికంబె వ్యాజమునను అనియె మొదలనుండ లోపాభావపక్షమున నట్లె యుండు ననుట సక్రమము గదా. ఇట్లే ఖ్యాతానమసమరవిధికిఁ గరుణాంబుధీన్ అనియె మొదల నుండ నట ద్రుతము లోపింప దన్నఁ జాలు. పద్యభేదావసానేష్వశ్లిష్టతా నన్య కథ్యతే యని శ్లిష్టత యేల చెప్పెఁ? కరుణాంబుధికిని అని మొదల నుండ శ్లిష్టతవలనఁ గరుణాంబుధికిన్ అని సాధింపఁబడిన దను టొప్పును గదా.(చూ.ద్రు.కా.)

భక్తుఁడను అనుచో నువర్ణము ద్రుతము కాఁగా కవిని అనుచో నివర్ణమె ద్రుత మని పైని స్పష్టము. సూరి దీని నాగమనువర్ణముగాఁ జెప్పి యికారముమీఁద నువర్ణమునుత్వమున కిత్వముఁజేసి నిస్వరూపమును సాధించెను. కాని చిం.లో నట్లు గాక నువర్ణమువలె నివర్ణమును బ్రత్యేకముగాఁ జెప్పఁబడినది. కావున నువర్ణవికృతమె కాక ప్రత్యేకముగాఁ జెప్పఁబడిన-నివర్ణమును ద్రుత మయినట్లే యిట నునివర్ణము లు ప్రత్యేకములుగా ద్రుతములుగా నామె శబ్దములకుఁ దుదిని జేసె ననుట యువిరుద్ధ మగుచున్నది. అహో. నివర్ణమువిషయమె త్తినట్లు గానరాలేదు గాని నువర్ణ మెక్కడో ద్రుత మనుట స్పష్టమె.(చూ.ద్రు.)అట్లె నివర్ణమును అన్నను నఖండ-అనుచో నుద్రుతముపై నకార మైన దన్నయహో. అంటిని నిందఱ కనుచో నిద్రుతముపై ద్రుతము చేరిన దనవలెను కదా.

ద్రుతము ని.ను(న్)వర్ణములుగా భావించినఁ జిం. కూడ సూరివలె నవసానమున ద్రుతస్వరలోపము చెప్పవలెనా యని సందేహింపనక్కరలేదు. (చూ.ద్రు.54)

చిం. ఘటింతును ఘటించితిని అనురీతిగా సాధించుట ననుసరించి ఘటింతున్ ఇత్యాదులు స్వరలోపముచే సాధింపఁబడిన వనుట తన్మతముగా గుర్తింపవలసి యున్నది. కావున ను, లెన్ ని అనుద్రుతములు చేరుస్థలముల నెల్లఁ బ్రయోగానుగుణముగాఁ బొల్లనకారము నన్యే యనుసూత్రముచే నొకపక్షమునఁ జేసె నని భావింపరాదు. హల్సంధిలో సంశ్లేషవిధానము నీయంశమును స్పష్టము చేయుచున్నది. కావున నినులలో స్వరలోపముచేతనె రాముని-రామున్, రాములను-రాములన్ అను రీతిరూపములను సాధించుకొనవలె.(చూ.ద్రు.ఉల్లోపము)

ద్రుతాద్యోనః అనుటలో నకారంబు ద్రుతం బనుటలోను లాక్షణికులు ద్రుతమును వర్ణించుటలో నకారముపైని స్వరమునకుఁ బ్రాధాన్య మిచ్చినట్లు గానరాదు. ద్రుతము నకార మని వ్యవహరించుచు సస్వరములను జూపునప్పు.వ్యవహారము నీయంశమును స్పష్టము చేయుచున్నది. దీనివలననే ద్రుతము నకార మని వ్యవహరించినచోట్ల చిం.,వి.వి.లలో (ప్రయోగానుసారముగ) సస్వరము గ్రహించుట

యొప్పును. తద్ధర్మప్రథమే స్యాతాం డుడివర్ణౌచ నాస్తికౌ యనుచోఁగూడ ఘటించె
డును ఘటించెడిని అని ప్రయోగానుగుణముగనే గ్రహింపఁదగును. తుమున్నర్థకనా
న్తైన మిసమాసః క్వచిత్స్మృతే త్తనుచో వి.వి తుమున్నర్థకనాంత మున్నది. దాని సహో·
ప్యత్వస్థలమున ఎన్నను పొందను అని నువర్ణాంతముగఁ జూపె. డువర్ణకంబు
ద్రుతాంతంబు, డువర్ణకంబు ద్రుతాంతంబు అన్నసూరిలక్షణములందును నకారంబు
ద్రుతం బని నకార మెట్టిది కావలె? చదువుచును, చదువుడును అని నువర్ణమె గదా·

ద్రు.ప్ర.లకుఁ దుదిని నినుశే చేవ నని నిర్ణయించుటకు వజ్ఝలవా రవ్వాని
పైఁ బరుషములకు సరళము లగుట భారతమున లే దని పేర్కొందురు. కాని బాల.
ప్రభావమునకు లోఁబడి రని విమర్శించినవారే (బాల.ప్రభావమునకు లో నైరి?) ని
నులపైఁ బరుషములకు సరళములు చేయుట వారిగ్రంథముననే గమనింపవచ్చును. ఇం
తకు బా.ఉ.లో వాడను నువర్ణమె ద్రుత మనిరి. భారతమునఁ బ్రాసేతరస్థలముల
నైనను నినులపై నానేకసరళములస్థితి వజ్ఝలవా రుద్ధరించినతావులలోనె వ్యా.సం.
స.లో గమనింపవచ్చును.

ఇత్తఱిని బరిగ్రహింతము (అది.7.215-1401) బ్రుంగుడుపాటును బొం
దఁ జూచి(విరా.2.192.1435) బ్రహ్మచర్యములను బడయఁబడిన (అది.1.71-1495)
మూకంజెను గడు హితుఁడవు (అది.8.40-1792)ఎట్టిసాధ్వులకును బుట్టినయిండ్లను
(అది.4.81-1205)ఎవ్వరికిని జన్నె (అది.7.207-1415)సర్వాంగంబులందును గలు
గుక్రొన్నెత్తురు (స్త్రీ.2.55-1452) ఎందును గలయది (సభా.2.170-1658) ఎల్లను
ద్రెస్సె (అది.5.172.1784)ఉయ్యెలయును బోలె (అర.2.79-1755)శకటంబు త్రోవు
ను బరణనిహతి(సభా.2.41-1730)ఏమిని జేయఁగ (ఉద్యో.2.13-310)చేయును గాక
కర్షకుండు (అర.1.23-1330)దప్పిఁ జెందును గృశునింగా (శాం.1.59.1777)
బ్రహ్మ కైనను బోలునె (సభా.2.238-1607)నేను బుత్రులును (విరా.5.348-1091)
నేను జూచి(శాం.1.12-1165)నేను జుమ్ము(శాం.6.419-1095, 2 సార్లు చూపిరి)తా
ను బ్రబోధించెఁ అది.6-పుట.885)

ఉదాహరణమునకుఁ గొన్ని యివి. ఇట్టి వనేకములు వ్యా.సం.స.లో గమనిం

పవచ్చును. ఇట నాదేశసరళములకు ముందు ఖండబిందు వేని వ్రాసి చేర్చియుండలేదు. కావున మీఁదియాదేశసరళములకు మూల మంతకుముందఁజనినవర్ణములే యనుట నిశ్చయము గదా. ద్రు.ప్ర.లతుది నున్నయయ్యవి యన్యే యనుసూత్రముచే నైనవి.

కాఁగా మొత్తముమీఁదఁ జిం. ద్రు.ప్ర.లద్రుతమును జెప్పనిచోట నన్యే యనుసూత్రముచే నాయాశబ్దములకుఁ జివర నిర్ద్రుతములు చేరును. ఇ,ఈ,ఐకారములకుఁ బరముగ ని అనుద్రుతమును నితరములకుఁ బై ని నుద్రుతమును ద్రు.ప్రలచివరఁ బ్రయోగానుగుణముగ నన్యే ద్రుతప్రకృతయ యనుసూత్రముచేతఁ జేరునని గ్రహింపఁదగును.

# ద్రుత ప్రకృతికములు

భాషయందలిపదములను గళలు ద్రు.ప్ర.లు నని విభాగించుచుఁ జిం. తిఙ్మధళి శేషషష్ఠీ వను న్నగుసూత్రముచేఁ గళలను జేర్కొని యున్యే ద్రుతప్రకృతయ యని కళలు గానివి ద్రు.ప్ర.లుగాఁ జెప్పనది. ఈశబ్దములు కళలు, ఇవి ద్రు.ప్ర.లు నని నిశ్చయించి చెప్పుటకు లఘు వైన మార్గము లభింపమింజేసి కాఁబోలును లాక్ష ణికు లాద్యప్రభృతిశబ్దముల నాశ్రయించిరి. చిం. ఆద్యా నభిదధతి కళా యని యాద్యశబ్దమును బ్రయోగించి యవి మొద లగునవి కళ లన్నది. (సూరి ద్రు.ప్ర.ల విషయమున వలెప్రభృతు లనెను.) ఆయాద్యశబ్దముచే నేది గ్రహింపవలయు ననువిషయమున నహో. నిబంధనేషు ప్రాచాం చేచ్ఛబ్దోఽన్యః పరిదృశ్యతే సూత్ర స్థితాదిశబ్దేన గ్రాహ్యస్సంఖ్యావదుత్తమైః అని పేర్కొనెను. దీనివివరణమున దద్వ్యాఖ్యాత చేచ్ఛబ్ద మనఁగా నేనిశబ్ద మని పేర్కొని దాని నాద్యశబ్దముచేఁ గళగా గుర్తింపఁ బేర్కొనిరి. (కవిశి. 235) ఒక్కయేనిశబ్దమునకయియే యింతగా విస్తరించి చెప్ప ననుట యుక్తముగాఁ దోఁచుట లేదు. ఇంకను సూత్రమందలి యాద్యశబ్ద మొక్కయేని ననుదానినిమాత్రము సంగ్రహించు ననుటయు సందేహా స్పద మయియున్నది. కావునఁ బ్రాచాం నిబన్ధనేషు అన్యః శబ్దః (కళగా) పరిదృ శ్యతే చేత్ అనురీతియన్వయముతో సూత్రమునఁ బఠింపఁబడక కావ్యములం దే దేనిశబ్దము కళగాఁ గనఁబడినదో నద్దాని నీసూత్రమందలియాద్యశబ్దముచే గ్రహిం పఁదగు నని చెప్పుటయే యుక్త మనఁదగును. వనఁడు ఇత్యాదీనాం తిఙ్మధ్యత్వా భావేఽపి ప్రథమాసమత్వేన సంగ్రహణమితి జ్ఞేయ మ్మని చెప్పినవెంట నేనిశబ్ద ముంగూర్చి ప్రస్తావింపకుంటయుంబట్టి యహో. వైరీతిగనె (పరిదృశ్యతే చేత్) యర్థము చేసియున్నట్లు గ్రహింపఁదగు. అందులకేయాదిశబ్దేన పట్టి కై ఇతివిభక్తి సుమ్ము కదా ఏల ఇప్పుడు మఱి ఇత్యాద్యాః గృహ్యన్తే (కవిశి. 211) యనియుఁ బేర్కొనెను.

ఇందుఁ జుమ్ము (సుమ్మి యిట్లు ప్రామాదిక మనఁదగు) అనుశబ్దమును గూర్చి వజ్ఝలవారు 'ఇవి చూడుము చూడుఁడు అనువానిసంక్షేపరూపములు గావున చుమ్ము చూ చుఁడు మొద లగునవి మధ్యమపురుషక్రియ లగుటచేఁ గళలే యగు ననియు నాదిపదముచే సహాయింపఁబడుఁడు గ్రహించుట ప్రామాదిక మనియు (వ్యా.సం.స.84) వ్రాసిరి. చుర్దేశ్యాం మధ్యమార్థే అనుసూత్రగుకారిక పైరూపము లను ప్రస్తావించుచున్నది. చుమ్ముడుజ్ఞు లు గలిగినశబ్దము (చుము చుమ్ము చుండు చుండు) మధ్యమార్థమునందుఁజెప్పెను. వీనిని మధ్యమపురుషక్రియాపదము లనుట కవకాశము వాలదు. ఇందు ముమ్ముడుజ్ఞులు ప్రత్యయము లనుటకే యవకాశము లెక్కువ. (చూ. ద్రు.కా. విక్రుతివివేకోక్తద్రుతకార్యాలు) చుర్దేశ్యః అనుదాహరింపబడ్డి యిది చూచుధాతుసంబంధి యని యూహించుట కాధారమె లేదు. భాషాచారిత్రక సంప్రదాయ మెట్టి దైనను(అనఁగా వజ్ఝలవారివివరణము చరిత్రకనుగుణ మైనను) శబ్దశాస్త్రమునుబట్టి చుమ్ము చుఁడు అనునవి చూడుము చూడుఁడు అనువానిసంక్షేప రూపములుగాఁ బేర్కొనుటకుమాత్ర మవకాశము లే దనియే చెప్పవలసియున్నది. ఇంకఁ జు అనుదేశ్యశబ్దమె ప్రత్యేకముగా నొకధాతువె గాదు. ఇతరార్థములందును నితరవచనమురూపములు గానరావు గదా. ఏవి. చుము చుమ్ము అనువానివలె ఊదంతతాదులను (చూ) ప్రత్యేకముగాఁ జెప్పెనది. కాఁగా నీవానిని సూత్రమందలి యాదిశబ్దముచే గ్రహింపఁదగు ననునహో.యభిప్రాయ ముచిత మే కాని ప్రామాదికము గానేర దని గ్రహింపఁదగు.

ఈయాదిశబ్దముచేతనె యహో. వింపన్నాఁడా, ఘటింపఁగలఁడు అనురీతివి తిజ్మధ్యములు గావు గావునఁ బ్రథమానములుగా గ్రహింపఁదగు నని (యప్ప. 5-30 అనుసరించి) స్పష్టము చేసెను. వజ్ఝలవారు నట్లు పేర్కొనుచునే 'ఇవి యిట్లు (వాఁడు వారు అదిఅవి అదు అవు అనువానినుండి సంగ్రహరూపములుగా నేర్పడుట యనుభాషాశాస్త్రదృష్టి ననుసరించి) ప్రథమానములు గావునఁ గళలు, అన్నచో నట్లే ఘటించితివి ఘటించితిరి మొ॥ తిజ్మధ్యములు సైతము ప్రథమానదృశమ్ము

యగును గదా యని యనుమానించుట యుచితముగా నున్నది. కాని యివి కొంత విదూరస్థితిలో నుండుటచేఁ బ్రత్యేకించి చెప్పె నని సమర్థించుట మాత్రము సమంజసముగాఁ గానరాదు. పల్కుఁడు ఇత్యాదులకంటె నివి విదూరస్థితిలో నున్న వనుట విచార్యమె. ఇం కొకచోట తాను నేసులు స్వంతము లగుటచేఁ గళలు. పైచోటవలె నిచ్చటను భాషాచారిత్రికదృష్టి నవలంబించినచోఁ బై చోట్లఁ జివరనువర్ణమే యుత్తరపదపూర్వస్థక్రియాపదములచివరనువర్ణము. పైచోట్లవలె నిచ్చట నుత్తమపురుషైకవచనములు గూడఁ గళలే కావలసివచ్చు ననిరి. ఈయూహ సత్యమే. కాని యిచ్చటఁ గూడ నట్టిస్థితి విదూరవృత్తిక మగుటచే నవి కళలు గాక ద్రు.ప్ర. లయ్యె ననుట విచార్యము.

పై ననుకొన్నట్లు భాషాచారిత్రికదృష్టి ప్రసరింపఁజేయుట వలననే యీయతివ్యాప్తియు నవ్యాప్తియు నేర్పడుచున్నవి. మూలగ్రంథకర్త కట్టిదృష్టి లేదనుట దోషము గాదు. అట్టిచోటఁ దప్పకపైనసమన్వయమార్గము నాశ్రయింపవలసిన యవసరము తద్వివరణమునం దేల? సూత్రమునం దెట్లును నాద్యశబ్ద మున్నది గనుక సూత్రమునందు స్పష్టముగాఁ జెప్పఁబడక ప్రయోగములలోఁ గళ కైకను పట్టుశబ్దము లీయాద్యశబ్దముచేఁ గళలుగాఁ జేర్చఁబడుట సుకరము నిర్దుష్టము నగుమార్గము కావున నమార్గమున నివ్వానిని గళలుగా గ్రహించుట యుచిత మని నిర్ణయింపఁదగు.

కొన్నిటఁ బ్రయోగములబట్టియే యిటఁ బట్టికలోఁ జేరనిశబ్దము లాద్యశబ్దముచే గ్రాహ్యము లగుచున్నవి. ఏశబ్ద మైనఁ గళయో కాదో గుర్తించుట యెట్లు? ద్రుతో న యేషాం స్యా త్తనుటచేఁ గళ యైనపదములచివర ద్రుత ముండదు. అన్యే ద్రుతప్రకృతయో యే స్యుస్త్వసజీవితద్రుతా నిత్య మ్మనుసూత్రము ద్రుతాంతములు ద్రు.ప్ర. లగు నని పేర్కొన్నది.

తిఙ్మధ్య......... ఆద్యానభిదధతి కళా యని యన్యే ద్రుతప్రకృతయ యన్నచింతలో నిదంతములు ద్రు.ప్ర. లనఁగా నవి దాదాపు చాలవఱకుఁ బ్రయోగముల నాశ్రయించియే తెలిసికొనవలసియున్నది. సూరి ద్రు.ప్ర.లనే స్పష్టము చేసి

యితరములు కళ లగు. కళలకంటె ద్రు.ప్ర. లెవో తెల్పుటయే ప్రయోజనమంత

మనవచ్చును. కళలను బేర్కొన్నచిం.లోను ద్రు.ప్ర.సంజ్ఞయే లక్షణగ్రంథమున
నన్నియెడల నుపయుక్తము.-ఈ ద్రు.ప్ర.లయందలివిశేషస్థలములను బరిశీలింతము.

ప్రథమాకయిపట్టియొక్కంతరము అయినవిభక్తులు ద్రు.ప్ర.లు.కాని యప్ప.
తన్ను నన్ను వన్ను విన్ను ము న్నామున్ను మన్ను కన్ను వెన్నుశబ్దములకు జడ్డ
లుండుఁ బోవుఁ జప్పింప నని ప్రముప్రకృతు లెవ్వడు గా (5-24) వచెను. వీనిలో
విన్ను ము న్నగునవి ప్రథమాంతము లవుట (ద్రుతాంతములు గావు) కళలె. కాని
మొదటఁ బేర్కొన్న తన్ను నిన్ను నన్ను అన్నవి మూఁడును ద్వితీయాంతములు.
వీనికిఁ దను నిను నను అనియు రూపములు గలవు. ఇవి యెప్పుడును ద్రు.ప్ర.లు
గా నుండ నెట్లు? అప్ప.యే వీనిని వైకల్పిక ద్రు.ప్ర.లుగా స్థలాంతరమున
స్పష్టము చేసె. అకారాదిపుంస్త్రీసమములు వివరించుచు ప్రథమ దక్కంగ నితరవిభక్తు
లందుఁ దుదలఁ గొమ్ములు గలవిభక్తులకు షష్ఠిఁ దక్కఁ గలుగుడిని వికల్పంబువలన
ద్రుతప్రకృతికత్వంబు గలుగుచుండు (5-38) ననెను. (వీనినె వైకల్పికద్రు.ప్ర.
లనె. ఈవికల్పిత సంధి నుద్దేశించి కల్పింపఁబడిన దని స్పష్టము.) ఇట్లు ప్రథమేత
రవిభక్తుల నుదాహరించుచో మొట్టమొదట ద్వితీయకు 'నిన్ను నెఱుంగఁగ నే నెంత
వాఁడను న న్నేలుకొను (57) ననెను. అవంగా నిన్ను నన్ను అన్నవి వైకల్పిక
ద్రు.ప్ర. లని స్పష్టము. ఇ ట్లేర్పడినదే నిన్ను అన్నదియు. ద్రు.ప్ర.వ్యపేక్ష
మున నిన్ను నెఱుంగఁగ నని ద్రుతము నిల్చియుండుటయుఁ గళ యైనప్పుడు న
న్నేలుకొను మని సంధి యప్పుటయుఁ గ్రమముగ నుదాహరించెను. నీకొఱకు
నంజలి నాకొఱ కైహికమ్ము, నీకు నాశ్రితులు నా కేడుగడయు, నీయందు నతిభక్తి
స్వజనులం దర్మిలి, ద్రౌపదికి నక్షయ/ సవ్యసాచి కాయోధనజయము నని మొదట
ద్రు.ప్ర.పక్షమును బిదప మ.ప్ర.వ్యాఖ్యానపక్షమును జూపెను. కాఁగాఁ దద్వాతి
లక్ష్యముల ననుసరించి మొదటిది (ప్రథమేతర ముగు) ద్వితీయాంతము వికల్పము
వలన ద్రు.ప్ర. మయినందులకె యుదాహరింపఁబడిన దని స్పష్టము. నిన్ను నే
నెఱుఁగంగ నే నెంతవాఁడ ననుపాఠ (పావిళ్ల-31.) మసంగత మగుటయు స్పష్టమె.

నిజమునకు నిన్ను నే నెఱుఁగంగ ననుచో నిన్ను నే ననువిభాగమువలన నిన్ను అన్నది ద్రుతాంతము గామి సిద్ధించును. నన్నేలుకొమ్మనన్న దెట్లును ద్రు.ప్ర-త్వాభావపక్షమె. కాఁగా నిన్ను నన్ను తన్ను అన్న వెప్పుడును ద్రు.ప్ర.లు గా వనుపూర్వోక్తాభిప్రాయమున కివి యనుగుణ మైయుండు నని చెప్పవచ్చును. ఇది సక్రమమె కావచ్చుఁ గాని నిన్ను నే నెఱుఁగంగ నే నెంతవాఁడ ననుచో నస్మదర్థకము రెండుసార్లు ప్రయుక్త మైనది. ఎక్కడి దేని నన్యర్థకము (ఏని) గా సమర్థింపఁ జూచిన నర్థము సమన్వితము కాదు. తాఁ జెప్పినలక్షణమునకు లక్ష్యముగాఁ జెప్పుచున్నయపద్యమున నారంభముననె లక్ష్యవిరహితముగఁ బద్యపూరణమున కన్న న్లేల వ్రాయును? లక్ష్యము లిచ్చుట నడుమనె సమాప్త మైనఁ దుదిపాదములు లక్ష్యవిరహితములుగఁ జెప్పుట యొప్పును గాని యారంభమె నిర్లక్ష్యముగఁ జెప్పు నది యెట్లు? ఇంకను ప్రథమేతరవిభక్తుల ద్వితీయయం దుత్తునకు సంధి వచ్చుట యున్నది భాష మొత్తములోనె నన్ను నిన్ను తన్ను మమ్ము మిమ్ము తమ్ము అను నాలింట మాత్రమె. నన్ను నిన్ను తన్ను అన్నవి ద్రు.ప్ర.లు గా నన్నపుడు మమ్ము తమ్ము అన్నవి యేలఁ గావు. (కాని యప్ప. యిప్పద్యమునె మమ్ము నెప్పు డని మమ్ము ద్రు.ప్ర యనుటను జెప్పె అయిన నన్ను నిన్ను దన్ను లేల గావు?) కాఁగా నప్ప.మతము నిట్లని చెప్పుచో ద్వితీయయందు వికల్పముగా ద్రు.ప్ర. లవుట యొప్పుటయు లే దనవలె. అట్టియెడఁ బ్రథమ దక్కంగ నితరవిభక్తు లన నేల? చతుర్థ్యాదు లనవచ్చునె. కాఁగా మిగిలినపద్యభాగము ననుసరించి ద్వితీయ వికల్పముగా ద్రు.ప్ర. మైనందులకు లక్ష్యము చూపుటతోఁ బద్యము సముచితముగ నారంభ మైన దని గ్రహింపఁదగును. కాఁగా ద్వితీయలో నన్ను ఇత్యాదు లాఱు వికల్పమువలన ద్రు.ప్ర.లని యప్ప.మతము.

ఇట్టివైకల్పికద్రు.ప్ర.త్వకల్పన మున్నచోట్లను (సంధికై) ద్రు.ప్ర.త్వము నిత్యమె యని యింతకు మున్నె గమనించియున్నారము. కావున నప్ప. వైకల్పిక ద్రు.ప్ర లన్నవి కేవలము ద్రు.ప్ర.లుమాత్రమె. పోనీ వికల్పముగ నేని ద్రు.ప్ర. లని చెప్పఁబోవునప్పకవి యివి (నిన్ను మొ॥) ద్రు.ప్ర. లెప్పుడును గా వని చెప్పు టెట్లు గుదురును?

ద్రుతాంత మగుటచే నిది ద్రు.ప్ర. యగును గదా. అందులకే నాంతపదమునుబట్టి (నకారమును ద్రుతముగా వ్యవహరించుటలో దాని పైనిస్వరమునకుఁ బ్రాధాన్య మీకుండుట గమనార్హము.) ద్రు.ప్ర.లే కావలసియున్నను తన్ను తను అనురీతి నెట్లున్నను నివి యొంతమాత్రమును ద్రు.ప్ర.లు గా వని యప్ప.యభిప్రాయము. తన్నన్ అనుచో నాంత మగుట ద్రు.ప్ర.యే కాని ద్రు.ప్ర.త్వాభావపక్షమునఁ దన్ను అని యుండఁగా నిప్పుడును నాంత మగుఁగా ద్రుతాంత మవుచుండ ద్రు.ప్ర.త్వాభావ మెట్లు? తన్ను తను అని యున్న ద్రు.ప్ర కా దని పైని వివరించెను. తన్ను అన్నదియు ద్రు ప్ర.యన్న ద్రు.ప్ర.మైన సంధి రాదు గావున (నిది యప్పకవీయప్రకాశిక) తన్నడిగె న న్నేలుకొను మనురీతిరూపములు గానేరవు. కాఁగాఁ దన్ను నన్నునిన్నులు ద్రు.ప్ర. లెప్పుడును గావు. తనడిగె నని కావలసివచ్చు నేమో యని యప్ప.యూహించినట్లు లేదు. అందుచే జడ్డ వోయినను నది ద్రు.ప్ర. కా దౌను? జడ్డ యోపించుపక్షమున నది ద్రు.ప్ర. యన్నను నిష్టరూపసిద్ధి కా దప్ప ప్రకాశిక ననుసరించి. కాఁగా నెల్ల నకారమును ద్రుత మని భావించుటచే నప్ప. తన్ను ఇత్యాదులు ద్రు.ప్ర.లు గా వని. తదనుగుణముగ నట సంధి యవుటను బిదపఁ బ్రదర్శించె న న్నేలుకొను మని. అప్ప.మత వివరణములో బా.క. గారు నిట్లు తలంచిన దది సమంజసమె.

ఏ మైనను వైకల్పికద్రు.ప్ర.వ్యవకల్పనము సరి కా దని గ్రహించియుంటిమి. కావున ద్వితీయాంతము లగునస్మద్యుష్మదాత్మార్థకములును మిగిలినద్వితీయాంతములవలెనె యెప్పుడును ద్రు.ప్ర.లె. కొఱవ్యాదులును. సూరి నన్నున్ నాచేతన్ ఇత్యాదిగ నస్మదర్థకరూపములను ద్రు.ప్ర.లుగాఁ జూపి (యప్ప.యభిప్రాయము సరి గా దని చెప్పఁదలఁచె నేమో) పైయంశమును స్పష్టము చేసెను.

సూరి యావమునలో షష్ఠ్యంతము మాలోపలన్ అను బహువచనాంతమును జూపెను. దీనిం గూర్చి రసు. లోపల వ్యక్తిబోధకనామవాచకములకు బహువచనముగానే వచ్చును గావున మాలోపలన్ అని యిచ్చినట్లు పేర్కొన్నది. అయినను సముదాయవాచి కాదైనయెడల నేకవచనముగా వచ్చుటయుఁ బ్రసిద్ధమె. ఆ యంశ

మను రమ.కాండ నింటకుముందు ప్రస్తావించియేయున్నది (224) మనుష్యులలోపల ననుచో బహువచనము కాఁగా మనుష్యసమూహములోపల ననుచో సర్వాది యేకవచనమైయుండుట స్పష్టము. ఇట సుబంతముల కస్మదర్థకరూపములు చూపనారంభించెను గావున సప్తమ్యంతమువలన నవియె యిచ్చట నొకక్రమముండును లోపలను షష్ఠి కుదాహరింపవలసినవాఁ డగుటచే మాలోపలన్ అని బహువచనముగాఁ జూపకతప్పలే దనియే చెప్పవచ్చును. అయినను బిదప మాయందున్ అని యందును నైతము బహువచనముగనె చూపెను. దీనినిబట్టి యేకబహువచనములు రెండును ద్రు.ప్ర. లనుట ప్రదర్శింపఁబడిన దని యూహింపవచ్చును.

తానునేను పదంబులు ద్రుతప్రకృతికంబు లని సూరి యిట స్పష్టము చేసెను (చూ.తానునేనులు కళలా?)

వల్లెప్రభృతులను సూరి వలెన్ ఎంతయున్ పోలెన్ అయ్యున్ అనురీతిగా నుదాహరించెను. వలెన్ పోలెన్ అనువానినడుమ నెంతయున్ అన్నది చేర్చుటలో విశేషాభిప్రాయము గానరాదు. వలెన్ పోలెన్ ఎంతయున్ అయ్యున్ అనుక్రమమున నుదాహరించియుండఁదగు ననునభిప్రాయము సముచితముగ నున్నది.

ద్రు.ప్ర.లలో సూరి యిటఁ జూపిన-ఎంతయున్ అయ్యున్ అన్నవి ద్రు.ప్ర.లు గా వనియు ద్రుతోపజీవు లని యథర్వణుఁడు చెప్పినమాటను సూరి యెరయలే దనియు వజ్ఝలవారు పేర్కొనిరి. ఎంతయు నెరసియు సూరి ద్రుతోపజీవివిభాగము దొలఁగించి వానిని ద్రు.ప్ర.లుగనె గుర్తించె (చూ.బా సూ.) అథర్వణవచన మరయలే దనుటలో వానిని సూరి చూడలే దనియో లేక చూచినను నది సరిగా నర్థము గాలేదనియో చెప్పుట యొప్పునా? అసలాథర్వణవచనమునకు వజ్ఝలవారు చేసినయర్థము యథార్థమా? ఇంతకుముందు గమనించితిమి.

ఇట వజ్ఝలవారు పేర్కొన్నయింకొకవిశేషము, సముచ్చయార్థకము శబ్దము ద్రుతప్రకృతిక (వ్యా.సం.స.88) మన్నది. ఇది ద్రు.ప్ర. యనుటలో దీనిస్వరూపము మున్ అనురీతిగా నుండు నని యర్థము. ఇదియు సమంజసము

గాదు. చిం. కాని సూరి కాని యీశబ్దమునుగూర్చి స్పష్టముగాఁ జెప్పిన లేదు. ప్రౌఢ. అన్నయును, తమ్ముఁడును అన్నవి యవ్యయాత్మక మైనశబ్దము ద్రుత మయినందులకు లక్ష్యములుగాఁ జూపెను. ఇది విభక్త్యాగమచార్థో సుర్ధ్రితః అనుసారిసూత్రాంధ్రలక్షణము ననుసరించినది. కావున నవ్యయ మైన యీశబ్దమే ద్రుతము. ఈశబ్దమె యనుదంతములనయి యువర్ణపూర్వకముగఁ జేరఁగా ఎంతయున్ అనురూపములు సిద్ధము లైన వనియు గ్రహింపఁదగియున్నది కాఁగా నీశబ్దము ద్రు.ప్ర. యనుట సరి గాదు. వీరే బా.ఉ.లో సముచ్చయార్థక శబ్దము ద్రుతరూప మని చెన్ననగు (16) ననుట గమనింపఁదగు. ఇట్లు వీరి యభిప్రాయము మాఱుటతోఁ గవిప్రయోగ మెట్లు మాఱునో యర్థము గాదు. నన్నయాథర్వణులమతము ననుసరించి శబ్దము ద్రు.ప్ర. యైనపుడు నువర్ణకము పై ద్రుతముండవలయును గదా. నన్నయప్రయోగములం దే వట్లున్నదా? ఉన్న దనుకొందము. బా.ఉ. ననుసరించి శబ్దమె ద్రుతము గదా. దీనిపయి ద్రుత మెందు కెట్లు? చిం. ననుసరించి యట యున్నద్రుతము బా.ఉ. ననుసరించి పో వుటెట్లు? లేదా ద్రుతము పై ద్రుత మనుకొనవలెనా? దార్ఢ్యమునకై రెండుసార్లు దియేవచ్చుననుకొండవలె. శబ్దము ద్రు.ప్ర. యనునభిప్రాయమును వజ్ఝలవారె మార్చుకొనిరి. వ్యా.సం.స.లోఁ గూడ నుశబ్దము ద్రుతరూప మనుట గానవచ్చు నదియే యుచితమని గ్రహింపఁదగును. ఆయంశమును నిరూపించునన్నయాదికవిప్రయోగములను వజ్ఝలవా రుద్ధరించినచోట్లనుండియె గ్రహింపవచ్చును. ఎద్దియును జేయఁగా (ఆది.5.88-1495) చంద్రుండును జన్నవాఁడ (శాం.1.242-1483)ఎవ్వఁడును జాలఁడు (భీష్మ.7 59-1416 ఎవ్వరికిని జన్నె (ఆది.7.207-1415) నీవునుబుట్టినాఁడవు (విరా.?.50-1354)బాంధవుండును జెలికాఁడున్ (ఉద్యో.2.-24-1289) ధారాపాతం బును బోలె (అర.2. 5-165) ఇందు సముచ్చయాద్యర్థకశబ్దముపైఁ బరుషములు సరళములు లైనవి. నడుమ ఖండబిందు వేని లేదు. కాఁగాఁ జాద్యర్థకశబ్దమే ద్రుతము. అది ద్రు.ప్ర. గా దని వా రుద్ధరించినభారతప్రయోగములనుబట్టియె స్పష్ట మగుచున్నది.

బా.గు.ప్ర.,బా.సా.పే. వ్యాఖ్యలు మిగులన్ మఱలన్ అనువానిని వలెప్రభృతులలోఁ జేర్చుట సరి కా దని వజ్ఝలవారు స్పష్టము చేసిరి. మిగులు మఱలు ధాతువులు నుఙ్యంతము లై మిగులన్ మఱలన్ అని యేర్పడుట నిజమే. కాని యిటఁ గొంతయర్థవిశేషము గోచరించు నని తద్వ్యాఖ్యలు వీనిని ప్రత్యేకముగా గ్రహించియుండు. నుఙ్యంతస్థలములం దిట్టివైశిష్ట్యములు పెక్కు తెలుఁగు లై కానవచ్చుచున్నవి. కావున వీనిని నుఙ్యంతము లనుటయే లెస్స. శ.ర.కర్తయు వీనిని ప్రత్యేకముగాఁ జూపకుంట ఇవి ప్రత్యేకము లైన యవ్యయములుగాఁ బ్రత్యేకపదములుగాఁ గాక మిగులు మఱలు ధాతువుల నుఙ్యంతతచే నేర్పడినవిగాఁ దలఁచుటచేత నే యని గుర్తింపవచ్చును.

వలెప్రభృతు లనుచో సూరి ప్రభృతిశబ్దమును జేర్చెను. దానివలన సముచ్చయార్థకనుశబ్దాంతములు పోలెన్ మొ॥ గ్రహింపఁదగు నని యాతఁడు చూపినలక్ష్యములనుబట్టి గ్రహింపవచ్చు. బలెన్ మొదలుగా వలెప్రభృతులు సామాన్యముగ నవ్యయములును "ను"అవ్యయాంతశబ్దములు నని గ్రహింపవచ్చును.

కందోయి యనురీతిస్థలముల నావయవికసకారము ద్రుతముగా నంగీకరింపవలసిన నపు డవియు నీప్రభృతిశబ్దముచే సంగ్రహించుకొనవలసియుండును.

సామాసికనుగాగమాంతములు ద్రు.ప్ర. లగుటకు వాని నిట సూరి ప్రత్యేకముగాఁ బ్రస్తావింపలేదు. ఈప్రభృతిశబ్దముచేతనె సంగ్రహింపకొనఁదగు నని యెంచె నేమో.

కాఁగా నిట్టిస్థలములు కొన్ని దప్ప ద్రు.ప్ర.లను సూరి దాదాపుగా సమగ్రముగనె నిరూపించె నని నిశ్చయింపవచ్చును.

# తాను - నేనులు కళలా?

చింతామణిపక్షమున నేను-తాను మున్నగునవి కళలు (వ్యా.సం.స.96) అని వజ్ఝలవారిసిద్ధాంతము. తానునేను ద్రుతప్రకృతికతుల్యంబులు (ఆం.శ.శా. సంధి.10) అన్నచిన్నయ బాల.లో స్పష్టముగా నీరెంటిని ద్రుతప్రకృతికములలోఁ బఠించెను. చిం.పక్షమున నీయవి కళలే యనుటకు వజ్ఝలవారు కొన్నికారణములు చూపి రవి చూతము.

1. వ్యంజనమునకుఁ బ్రాణము నన్నఁగా జీవకళను స్వర మొసంగును.కావున నట్టిస్వరము తుదిని గలశబ్దము కళ యనిపించుకొనును. బాలవ్యాకరణపక్షమున నిట్టిసార్థక్యము పొసఁగదు-(95) అని యభిప్రాయము చమత్కారయుక్తముగ నున్నది. నేనుతాను అనువానిలో జీవకళ నిచ్చుస్వర మున్నది గనుక ఇవి కళ లని యభిప్రాయము. (ఇట్లైన స్వరయుతము లెల్ల) వ్యంజనమునకుఁ బ్రాణము చేరిన జీవకళ కల్గు ననునభిప్రాయ మింకను స్పష్ట మగు నట్లుగా ద్రుతప్రకృతులు గానివానికి లాక్షణికులు జీవకళాసంజ్ఞ నుంచిన బాగుండెడి దేమో. అట్లుఁ గాక. మొదలుగఁ బలువుర్- అనుచో వ్యంజనమాత్రము ప్రయుక్తము. జీవకళ నిచ్చుస్వరము లేదు గావున రేఫము తుదిని గలయీశబ్దము కళ యనిపించుకొనదా? (ను)లును మొదలగువానిలోఁ దుదిని స్వరలోపము లగునవి ద్రు.ప్ర.లే యగునా? వ్యంజనము నకుఁ బ్రాణముచేరికచే జీవకళ గలుగును గావునఁ గళ యగునన నేది యావ్యంజనమా? లేక అది గలపదమా? నేను అనుచో నే- అన్న దొక్కటియు ను అన్న దొక్కటియుఁ గళలు రెండగు నేమో? ఒల్లనిచోట నట నట స్వరాదులు మఱిగిపోవును. అలుక అల్క, అక్కట- అకట. అవి ద్రుతములు గావు గదా. అట్లే లకారాదు లెల్ల ద్రుతములును దదంతములు ద్రు.ప్ర.లును గానక్కఱ లేదని సమాధానింపవచ్చును కానీ యట్టియెడల నిది యొట్లును సంజ్ఞయే గావున నీరీతిగా నర్థము చెప్పకుంటయే యుక్తము.

యది యాత్మాన్మదోర్యనె పైతే- అని నిషేధింపఁబడినది. మఱి దానిపైఁ బరుషము లేమి కావలయునో, (అట్లే యుండునో?) చిం. స్పష్టముగాఁ జెప్పియుండలేదు వి.వి.మాత్రము వినా ద్వితీయం సర్వం స్యాదస్మదాత్మనోస్త్వ స్త్వయో రపి యని పేర్కొన్నది. స్వ స్త్వయో రపి యనుట గమనార్హము. స్వాంతము లవుటచే నీయని కళలే యైనను నింతలి ద్రుతమునకు సంశ్లేషము దప్ప బింద్వాదులు వచ్చు నని చెప్పఁబడినది. ఆతామనేనులకు సరళస్థిరపరకత్వమున వాత్మాన్మదోద్భూతస్య ర్యాళ్లు క్కాని ద్రుతలోపవికల్పత చెప్పిన పరుషపరకత్వమున నేమియుఁ జెప్పక పోవుట కొంత విచారింపఁదగిన దైనది.

వజ్ఝలవారు పైగసడదవాదేశవిధానసూత్రమునందలి అస్మాత్స్వచ్ఛబ్దములచేఁ గవిభల్లటసూత్రముచే పుత్త్వలోప మైనపిదపటి తాన్-నేన్ అనురూపములను గ్రహించి వానికి గసడదవాదేశము నిషేధింపఁబడిన దని వల్కిరి. కళాసదము లగుచున్న యుష్మ లోపించునప్పుడు పరిశిష్ట మగునకారమునైతము ద్రుతమె (99) యని చిం.యాశయముగాఁ దలఁచినవా రగుటచేత వజ్ఝలవారిమతమున. (గసడదవాదేశనిషేధముతో) ద్రుతాంతతవలన సరళాదేశాదిక మగుట సంభవించి నది. దీనిని వారే స్పష్టముగా నేనుతానుశబ్దములకుదిస్వరము కవిభల్లటసూత్ర ముచే నేర్పడిన నేన్ తాన్ అనునవి ద్రుతప్రకృతికము లగుటంజేసి యవి ప్రథ మాంతము లైనను వానికిఁదిపరుషములకు గసడదవాదేశము రా దని యర్థము. ఇంక వానిపై గజడదబాదేశాదిద్రుతసంధికార్యములె వచ్చు నని తాత్పర్యము(?80) అని వివరించిరి. కాని యిట నొకసనుమానము. వారిమతము ననుసరించి చిం.లో స్వరలోపానంతరము (శబ్దగత)నకారము ద్రుతమె. కాఁగాఁ దదంతము ద్రు.ప్ర.గదా. అట్టియపుడు తాన్ నేన్-ల ద్రుతమునకుమాత్రము ద్రుతకార్యము లగు నని చెప్పవలసినయక్కఱ యేమి? గసడదవాదేశనిషేధ మంతకుముందే యున లేల? స్వరలోపానంతర మెల్లనకారము ద్రుత మనునదే వజ్ఝలవారి పేర్కొన్న ట్లుగాఁ జిం.యాశయ మయియున్నయెడల నీగసడదవాదేశనిషేధమును (వాత్మాన్మ చ్ఛాస్త్రమును) వ్యర్థమే యనవలసియున్నది. పోనీ నాంతములే యైనను ప్రథమాంత

త్వ మున్నది గావున గసడదవాదేశమును ద్రుతాంతమునందు నిషేధము చేయవలసి వచ్చిన దన్నచో నిం కొక్కచిక్కు వచ్చును. స్వరలోపానంతరము నాంతము లైన కళాశబ్దము లన్నియు ద్రు.ప్ర.లే కాఁగా వానిలోఁ దాన్ నేన్ అనురెండు ప్రథమాంతనాంతశబ్దములకుమాత్రమే గసడదవాదేశనిషేధము చేయుటవలన (చేసి సరళాదేశము సూచించుటవలనను) తాన్నేన్లకు దక్కినను లయిననాంతప్రథమాంతములు (ఇవి ద్రు.ప్ర.లని చిం.యాశయముగా వజ్ఝలవా రనిరి కావున) ద్రు.ప్ర. లైనప్పటికిని పైనున్నపరుషములకు గసడదవాదేశనిషేధము లేకపోఁగా నిత్యముగా నగుటతోపాటు (గసడదవాదేశ విధిసూత్రముచే నిత్య మనిరి గావున) సూచనామాత్రముగ నైన సరళాదేశాదిప్రయుక్తకార్యసిద్ధి లేకుండఁబోయిన దన్నమాట. ఇంక నట్టివానికి ద్రు.ప్ర.త్వము చెప్పుకొననేల? తాన్నేన్లకుమాత్రమే సరళాదేశాదిప్రయుక్తకార్యములు స్వరలోపానంతరము సిద్ధించునవి ఇతరము లగుశబ్దములందు స్వరలోపానంతరము నకారము ద్రుత మగు ననుటవలనఁ బ్రయోజనము లేనట్లు (తాన్నేన్ల కెట్లును ప్రత్యేకముగాఁ జెప్పఁబడియే యున్నది గావున) స్వరలోపానంతరము నకారముశబ్దగత మయ్యు ద్రుత మగు ననుట నిరర్థక మగుచున్నది. వీ రింకొకచో వినిన్ కావన్ మొద లగువానిఁ బదత్వసిద్ధికయి సువిభక్తి చేయుటయు లోపింపఁ జేయుటయుఁ జేసిన నాప్రథమాంతత్వము కళాత్వసంపాదకము గానేరదు గాన ద్రుతాంతత్వసంపాదకమే యగు (వ్యా.సం.స.88, చిం.వి.వ.7) ననిరి. నిజ మట్లు కళాత్వము లేక ద్రుతాంతత్వమే సంపాదింపఁబడినను పై వివరణము ననుసరించి మొదటిపదములకు గసడదవాదేశమే గదా రావలసినది. ప్రయుక్తకార్యములు రా వీలు లేదు గదా. వినినఁ బఠించిన (1467) మొద లైనప్రయోగములు వారిసమన్వయమునకు విరుద్ధము లగుట లేదా? ఇట నెట్లు సమన్వయింప వీలు లేదు.

వజ్ఝలవా రిట స్వరలోపము చేసినతాన్నేన్లను గ్రహించుట రెండుద్దేశములు గల దనవచ్చు 1.(స్వరలోపానంతరమె) నకారముపొల్లై ద్రుత మగుట 2. తానునేనులు కళ లగుట. ఈప్రయోజనములు సిద్ధింపమాట యె ట్లున్నను నిచ్చోటవీరిసమన్వ

యనుసూత్రమునవారే చేసికొన్నశబ్దగతనకారము ద్రుత మనునిం కొకసిద్ధాంతమును వ్యర్థపరచికొన్నారు. కాఁగా స్వరలోపానంతరము శబ్దగతనకారము ద్రుత మగు ననుసిద్ధాంతము నైన విడిచిపుచ్చవలె. లేదా యిటఁ దానునేనుల నత్వసహితములు నైన గ్రహింపవలె. అట్లు గ్రహించుచోఁ బైని వేర్కొన్నవజ్ఝలవారియుద్దేశములు రెండును నెఱవేరవు. స్వరలోపానంతర మెల్లెడల నకారము ద్రుతమే యగు నన్నచోఁ దాన్నేన్లకుఁ జెప్పినయీకార్యములు చిం.లోనే వ్యర్థములవు. శబ్దగతనకారము ద్రుతము గాకుంట యింతకు మున్నె స్పష్టమే.

శబ్దగతనకార మెల్లయెడల ద్రుతము గానేర దని యంగీకరించిన గసడదవాదేశనిషేధసామర్థ్యమునుబట్టి తాన్నేన్లయందే ద్రుత మగు ననుకొందము. అట్లయ్యు 'నాత్మాన్మదోర్ద్రుతస్య స్యాల్లు' క్కనుసూత్ర మెంతవఱకు సార్థకమగు నన్నది సందిగ్ధమైయున్నది.

వజ్ఝలవారీసూత్రమునొద్దఁ గూడ నాత్మాన్మచ్ఛబ్దములచే స్వరలోపము చేసిన పిదపటితాన్ నేన్ అనువానినే గ్రహించి వానికే సరళస్థిరపరకత్వమున లోపవికల్పతను సాధించిరి. ఇట వి.వి.లో నైత మిట్లే యర్థము చేయుట వింతయే. వినా ద్వితీయం స్యాదస్మదాత్మనో స్స్వ స్త్రయో రపినో రస్యస్యాపి ఇత్యాదికారికయందలి మొదటినోఃఅనుపదమునకు మత్ప్రత్యయసంబంధ మైనద్రుతమున కనఁగా నత్వలోపవిధ్యనంతర మున్న నేన్,తాన్ అనువానికి—సంశ్లేషభిన్నకార్యము లగు ననిరి. నోః అనుదాని కీయర్థము విశేషమే యనక తప్పదు. పైఁగా నిట్టియర్థ మధర్వణకంఠోక్త మనుట(324)మఱియు విశేష మగువింత.

పరుషపరత్వమున స్వాంతతనుబట్టి గసడదవాదేశప్రసక్తి గల్గ నయ్యది నిషేధించుటకుఁగాదు "ఆత్మాన్మదోర్వైనైతే" యనవచ్చుఁ గాక, సరళస్థిరపరకతలో లోపవికల్పవిధాన మేల?

ఇట నహోబలుఁడు నయుతము (వజ్ఝలవారివలెఁ) తానునేనులయందు లోప
మునకయి యెంతయుఁ జర్చించెను. కాఁగా నిట నాతనిమతమునను తాన్ నేన్
అనునవే గ్రహింపఁబడ్డవి. అట నహోబలుఁ డీవిధాన మేల యని విచారించి
లుగ్వాసూత్రముచే లోపాభావపక్షమున నలుకి వ ర్ణానుసూత్రముచే రావలసిన
సంశ్లేషము రాకుండుట కని స్పష్టము చేసెను. కాఁగా తానునేనులద్రుతంబునకు
సంశ్లేషంబు లేదనుటకయియే వాక్యాన్తత్వాత్ప్రసక్తి కలిగె ననఁదగియున్నది.
అహో. మతమున ద్రుతము నకారముఁబోల్లు ప్రైనను (మకార) దానిస్వత్వము
మాత్రము ను అనురీతిగా నస్వర ప్రైయుండె. కావున తాన్వై అనురీతిసంశ్లేషము
ను వారించినందువలన తాను విసె అనురీతిస్వత్వముతోడిరూపమువలన నానమన్వ
యము ప్రయోజనవంతమె యైనను. కాని వజ్ఝలవారిమతమునలో తాన్ విసె అను
నది సంశ్లేషము తాన్విసె– అనునది స్వత్వము నగును. ఇం దొకటి సాధించి
యిం కొకటి వారించుకొనుటవలన నెట్టిప్రయోజనమును లేదు. అందుకే వీరు
వినా ద్వితీయ మ్మనెడిసంశ్లేషనిషేధము గల్పింప నక్కర లే(247)దనిరి. కాఁగా
దీని ననుసరించి చిం.లోను వాక్యాన్తత్వాత్రము వలన సంశ్లేషనిషేధ ముద్దేశింప
బడలే దనియే చెప్పవలసియున్నది. వీరిమతమున నట్టిచో నీ వాక్యాన్తత్వాత్ప్రా
రంభము ప్రయోజనహీనమే కదా. వారిమతమున్వయమున నిం కొకలోపము.
అహోబలసూరిప్రభృతులు నిషేధించినతాన్వై అనురీతిరూపములు సాధువులు
చేయుట.

ఇంక నొకవిశేష మిట్లు చెప్పిరి. నకారవుపొల్లునుండిపరుషమునకు (సరళా
దేశము రాఁదగినచోటులందుమాత్రమె) సంశ్లేషనిషేధ మావశ్యకము. తాన్ చదివె
ననురీతిరూపము గల్గనేరదు. తాఞ్జదివె నని మాత్రమె యగును (284). వినా
ద్వితీయ మ్మనునానిచే సంధినిషేధ మెల్లెడలఁ గాక పరుషపరకత్వమునందుమాత్రమె
యని యర్థ మన్నమాట. (సంశ్లేషము వచ్చిన తాన్చదివె అని యగు. అవికార
గతేఽపి యనుసూత్రము ననుసరించి తాన్ జదివె నని చూపుటయే యుచిత మని

పించు. చెప్పకున్నను సంశ్లేషరూప మైనవికార మెట్లును గలదే గదా. వికారము లేనప్పుడును వచ్చు నన్న సరళాదేశము వికారముగల్గినప్పుడు రాకుండు టెట్లు? కాని దీనితో వజ్ఝలవారియొక సిద్ధాంతము ముందిపడియున్నది. తాన్-చదివె అని సంశ్లేష మున్న సరళాదేశమునకుఁ బ్రసక్తి లే దని వారిసిద్ధాంతము. అది సరి గా దని యింతకు మున్నే స్పష్టము.)

అసలు పరుషపరకత్వమునందు సంశ్లేషమే లేకపోఁగా (281) నట సంశ్లేష నిషేధమావశ్యక మగుట యెట్లు? ఇంక సరళాదేశము రాఁదగిన చోట్లనే సంశ్లేషనిషేధ మావశ్యక మన సరళాదేశము రాఁదగనిచోట్ల (దుశ్శకము పై నిట్టిస్థితియుం వజ్ఝలవారి ప్రక్రియలో నేర్పడియున్నది) సంశ్లేషనిషేధ మావశ్యకమే యన్నమాట ఱడి గొన్ కోఁక్కలు ఇత్యాదులకుఁ గావచ్చును. ఐన నచ్చోటిసంశ్లేషమున కే దేని శాస్త్రప్రమాణ మున్నదా? శ్లిష్టత్వం చ క్వచి త్తనుదానిని వీరు చూపిరి. కాని దాని కేమాత్రము ప్రసక్తిలేదు. ద్వే త్రైకే యే చ క్వపాః అను వి.వి. విశేషలక్షణము ననుసరించి ద్వితీయ మైనశ్లిష్టత పరుషపరకత్వమున సంభవింప నవకాశమే లేదు.

అవుఁ గాక. వినా ద్వితీయ మ్మనుదానిచేఁ దానునేసెలఁదొడనే యిట్టినియమము చేయవలెనా? లేక భాషలో ద్రు.ప్ర. లన్నింటియెడలనా? ద్రు.ప్ర. లన్నింటియెడ నైన నిచటఁ బ్రస్తావింప నేల? పరుషపరకత్వమున ద్రుతమునకు సంశ్లేష మింత కును డే చెప్పఁబడియుండకుంజేసియు నట్టియెడల నిట నిషేధించుటనుబట్టియుఁ జూడ తాన్నేనకు భిన్నమైనద్రు.ప్ర.ల ద్రుతమునకుఁ బరుషపరకత్వమున సంశ్లేష ము వచ్చు ననియే యర్థమగుచున్నది. దీనివలన వజ్ఝలవారు చేసికొన్నదాని ననుసరించి తాన్ చదివె ననురీతిని వారింపఁబడినను వచ్చెన్ కొడు కనురీతిని సాధింపఁబడుచున్న దనవలసియున్నది. (ఇటుఁ గూడ సరళాదేశము తప్పదు గాన వచ్చెన్ గొడు కనురీతివాని నిట్లు స్మరింపఁదగు ననియుఁ దోచుచున్నది. కాని వజ్ఝలవారిమతము భిన్న మవుటంజేసి వారు సంశ్లేషమును నివారించుకొనకతప్పదు.

అది యిట సాధింపఁబడుచున్న దనకయుఁ దప్పదు) కాఁగా వినా ద్వితీయ మ్మను దానిచేఁ జేయఁబడినసంశ్లేషనిషేధము పరుషపరకత్వమునఁ (బ్రాప్తియే లేదు గావున) గా దనియు సరళస్థిరపరకతయందే అలుక్ చ - యని సంశ్లేషము విధింపఁబడియున్న ది గావున నటనే నిషేధింపఁబడిన దనియుఁ జెప్పుట యహో. అభిప్రాయమున కను గుణమును సముచితము నై యుండును. ఇట్టియెడల వినా ద్వితీయ మ్మని సంశ్లే షనిషేధము గల్పింప నక్కర లే దనువరులవారిపతాన నీసూత్రము వ్యర్థ మగు టయు సూరిసమ్మతములు గానితాన్జదివె తాన్,విన్ అనురీతిరూపము లంగీకరింప వలసివచ్చుటయు ననునని ష్టము లేర్పడుచున్నవి.

వజ్ఝలవారే యిం కొకచో నిట్లు పేర్కొనిరి "తా న్జదివె-నేన్జూచితిని అను రీతిని గాని తాన్ చదివె, నేన్ చూచితి అనురీతిని గాని ప్రామాణికప్రబలప్రయోగ ములు లభింపలేదు. (ప్రామాణికము లైనను ప్రబలములు గానివియుఁ బ్రబలము లైనను బ్రామాణికములు గానివియు నైనప్రయోగములు లభించియుండవచ్చును.) కాన నీవిషయమున మహాకవులు లాక్షణికులు నగునన్నయాథర్వణులసూత్రము నిర్ణాయకము లని ప్రమాణీకరింపఁదగును(32) ప్రయోగములం దిట్టివి లేమిని గుర్తించియును వీరు అహోబలపండితుఁడును దదనుయాయి సూరియును నన్న యాథర్వణులస్వత్వసంశ్లేషములరూపములను (వీరునిర్ణయించినట్లుగా) దెలిసికొనని వా రగుటంజేసి నన్నయాథర్వణసమ్మతము లగుద్రుతము పరస్వరాంగముగాఁ గలస్వత్వరూపము లగు తాన్జదివె-తాన్విని అనురీతివానిని నిషేధించినవా రైరి(327) అనిరి. వ్యాకరణము ప్రయోగశరణ మైయుండగాఁ బ్రయోగములందు లేనివానిని సూరు లంగీకరింపకుండుట నిందింప నేల? ప్రయోగములు లేమిని వారే స్పష్టము చేసిరి గదా. ఇంక మహాకవులు లాక్షణికులు నై నన్నయాథర్వణులు చెప్పిరి గాన స్వీకరింపవలె నన్నది యున్నది. నన్నయాథర్వణానంతరకవులు నైత మిట్టిప్ర యోగములు చేయలే దనుట స్పష్టమే. నన్నయాథర్వణులు సాధించినరూపము లనంతరకవులకును సమ్మతము గాలే దన్నమాట. సూరి సాధించినహనుమానుఁ డిత్యాదులను వీరు ప్రయోగములు లే వనియే తిరస్కరించిరి. సూరి లాక్షణికుఁ

దైనను మహాకవి గాఁ డని యేమో. తరువాతికవులు నెవ్వరుఁ బ్రయోగింపని

రూపములు సాధించుటచే చిం. వి.వి.లమత మనువజ్ఝులవారిమత మంగీకార్యమా?
నన్నయాదులప్రయోగముల కనుగుణ మైన అహోబిలాదులసమన్వయము తిరస్క-
రింపవలెనా?

వినా ద్వితీయ మిత్యాదిచే సంశ్లేషనిషేధ మనావశ్యక మన్నవజ్ఝులవారే
వాత్మానస్మత్సూత్రమునొద్ద నేన్,తాన్ అనువానికి సరళస్థిరపరకత్వమున లోపము
మాత్రము వచ్చు నని నియమించుట కీసూత్ర మారంభింపఁబడె నని వ్యాఖ్య
చేయనగును. కాన అలుకి చ సంశ్లిష స్స్యా త్తని సంశ్లేషము రా దని తెలుచు
న్నది. ఆదేశసరళపరకత్వమున నెందును సంశ్లేషము నన్నయాధర్వణసమ్మతము
గా దని యీవఱకె సవిస్తరముగా వ్రాయఁబడెను. ఈవిషయములనె యధర్వణా
చార్యుఁడు వినా ద్వితీయ మిత్యాదికారికచే వివరించె (325)ననుట విశేషము. పైవి
బేర్కొన్నవారిసిద్ధాంతము లన్నిటికి నిది విరుద్ధ మగుట స్పష్టమే. విస్తరింపఁ బని
లేదు. దీనిచే నహోబిలాదులవ్యాఖ్య యుచిత మని స్పష్టము. నన్నయాధర్వ
ణులయాశయ మిదియే (325) కావచ్చు నేమో గాని తా న్గదిపె ననురీతిరూపములు
సమ్మతము లనుట యథార్థము గానేర దని మాత్రము స్పష్టము.

అవుఁ గాక. ఇట సంశ్లేషము రా దనిరి. స్వత్వము గలదు గదా. సరళస్థిర
పరకత్వమున లోపముమాత్రము వచ్చు నని వివరించినను బిదప లోపస్వత్వము
లనియే పేర్కొనిరి. కాఁగా సరళస్థిరపరకత్వమునను సంశ్లేషము లేదు గాని
స్వత్వ మున్నది. అనఁగా వజ్ఝులవారిమతము ననుసరించి తాన్ వినె ననురూపము
నిషిద్ధము. కాని తాన్వినె ననురూపము సాధువె. ఈయభిప్రాయమునె యహో
బిలాదులు తెలియలే దని వజ్ఝులవారు చెప్పఁబూనినచో వా రట్లు తెలియకుంటయె
యెంతయు యుక్తము. తాన్‌వినె తాన్వినె అనువానికి లేఖనమునఁ దప్ప భేదము
లేదు. ఇం దొకటి సాధింపఁబడి వే రొకటి నిషేధింపఁబడుట యక్రమము. అందు
లకును నహో. ద్రుతము పొల్లనకార మని యెంచియు స్వత్వము మాత్రము నుస్వ
రూపముతోఁ జూపియున్నాఁ డనవచ్చు.

మొత్తముపై సహో.ప్రభృతులు చేసినసమన్వయము నంగీకరించినను దిరస్కరించినను వజ్ఝలవారివివరణమున ఫలము సమానమ యైనది. ఇట్లగుటకుఁ గారణము వజ్ఝలవారు తానునేనులను స్వరలోప మయినవానినే గ్రహించుట యని నిర్ణయింపవచ్చును. అస్వరలోపవిషయమునను వారిమతమునఁ గొంత వైరుధ్యము గోచరించుచున్నది.

వినా ద్వితీయ మిత్యాదికారికావివరణమున కళ లగునేనుతానుశబ్దములతుది యుకారము లోపింపనిచో దానికి ద్రుతత్వమే లేదు గాన నిందు ద్రుతకార్యవిధానసామర్థ్యముచేతనే కవిభల్లటసూత్రమున నుత్వము లోపించినవే యీకారికకు విషయము (298) అన్నవీరు కవిభల్లటసూత్రముచే నుత్వలోపము రాఁగా మిగిలిన నకారము ద్రుత మగుచున్న దని వినా ద్వితీయం స్యా దిత్యాద్యథర్వణకారికచే ద్రుతత్వము కంఠోక్త మగుచునేయున్న (324) దనుట వింతగ నున్నది. ద్రుతకార్యవిధానసామర్థ్యమునుబట్టి యుల్లోపము చేయుచుండఁగా నుత్వలోపానంతరము నకారము ద్రుత మగు నని యాకారిక కంఠోక్తముగాఁ జెప్పుచున్న దను టెట్లు? వినా ద్వితీయ మనుచో నుత్వలోపము చేయ నేల? తానునేను అనునుత్వసహితములనె గ్రహించి నువర్ణమునకె ద్రుతకార్యములు చేయఁబూనిన నది యవరోధించునా? అనఁగా నకారపుఁబొల్లె ద్రుత మనుస్వసిద్ధాంతము ననుసరించి నువర్ణము ద్రుతముగా వీలు లేదు గావున ద్రుతకార్యములు విధించుటనుబట్టి యుత్వలోపము చేయవలె నని తాత్పర్య మనవచ్చు. కాఁగా నిట నుల్లోపము చేయుటకు నీకారిక ద్రుతకార్యములను జెప్పుటకంటెఁ గూడఁ బొల్లనకారమే ద్రుత మనుసిద్ధాంతమె మూల మనక తప్పదు. పోనీ నకారపుఁబొల్లే ద్రుత మందము. ద్రుతకార్యవిధానసామర్థ్యమునుబట్టి ద్రుతత్వమును సాధింప నేల? అన్నియెడల పొల్లునకారమే ద్రుత మైనను తానునేనులలో నువర్ణమునకే ద్రుతకార్యము లుండుటంజేసి విశేషముగాఁ జెప్పఁబడె ననియు నింకను స్వరలోపప్రసక్తి లేమి ద్రుతకార్యవిధానసామర్థ్యమును బట్టియే యిట నువర్ణమునకే యాద్రుతకార్యము లవు నని చెప్పఁదగును గదా.

అన లక్షే చెప్పవలసియున్న దనియుఁ దోఁచుచున్నది. వి.వి. స్వ స్త్రయో రపి యనుటచే నుస్థానమున వచ్చిననువర్ణ మంతమం దున్నప్పటికి ననునర్థము సహజమే కదా. కానీ యిచట నుత్వము లోపించినను స్వంతత యక్షతము గదా యనవచ్చును. (అట్టియెడల నుత్వలోప మయిననే గ్రహింపఁబడుట చెప్పఁదగుఁ గాని స్వ స్తృతావిశేషవర్ణన మేల యన్నియు ననుమానము గల్గుటయు సహజమె.) కాని అన్యస్యాపి నోః అని యుత్తరార్థమున నోః అనుటయుఁ బూర్వార్థమునఁ దాను నేనులనే గ్రహింపవలసినట్లు స్పష్టము చేయుచున్నది. ఇతర మైననువర్ణమునకు నీకార్యములు బహుళముగా నగు ననియు నాత్మాస్మదర్థకము లై నతానునేనులయంద లినువర్ణములకు నిత్యము లనియుఁ గదా యర్థ మగుచున్నది. మఱి కవిభల్లట సూత్రముచే నుత్వలోపము చేసినపిదపనే గ్రహింపవలయు ననుట కీలక్షణమునం దాధార మేది? ఉత్వలోపానంతర మున్ననకారమున కీకారిక ద్రుతత్వమును జెప్పుచున్న దనుట (ఇంకను గంఠోక్తముగాఁ జెప్పుచున్న దని వారియభిప్రాయము) సమంజసము కాదు.

ఇట్లు వి.వి.బట్టియుఁ దానునేనులే యనఁగా నంత్యస్వరము లోపింపనివే చిం.పక్షమునను గ్రహింపవలె నని తెలియవచ్చు. తాన్నేన్లను గ్రహించి వాత్మాస్మత్సూత్రమును వినా ద్వితీయ మ్మనుకారికను వ్యర్థపరచుట గూడ నుచితము కాదు.

అయినఁ బొల్లనకారమునే గ్రహించినయహో. సంశ్లేషనిషేధముతో వీనిని సార్థకము చేయలేదా యనవచ్చును. కాని యహో.పక్షమున ద్రుతము పొల్లు కాఁగా స్వత్వము స్వరసహితముగాఁ జూపుట సక్రమము గామి స్పష్టము. (చూ. ద్రు.కా.) తాను + ఘనుఁ డని యుండ నుల్లోపము చేసి తాన్ + ఘనుఁ డని యుంచఁగా లోపము వికల్పము. కాఁగా లోపాభావపక్షమున స్వత్వముతో తాను ఘనుఁ డని యగును. కాని యిట స్వరలోపానంతరమె ద్రుతత్వ మున్నఁ దల్లోపము వికల్పముగాఁ గాక నిత్యముగనె చెప్పఁదగు. స్వరలోపమె యనిత్య మగుట తాను ఘనుఁ డని యుంటకు బాధ యేది? కావున నహో.మార్గమును గేవల మనుసరింపఁదగని దయ్యెను.

ఇట వజ్ఝలవా రనవసరముగా విమర్శించిరి గాని నారా.వాక్యములు కొన్ని యుచితము లయియున్నవి. నకారపుఁబొల్లే ద్రుత మైనచో వికల్పవిధానము వ్యర్థము. స్వతస్సిద్ధసరళస్థిరములు పర మైనచో నర్ధబిందు వుండదు గదా. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు గావున నెఱసున్నయు నుండదు. సంశ్లేషము సకలలాక్షణికసమ్మతము కాదు గదా. ఒక్కలోపరూపమునకు వికల్పవిధానము చేయఁబడ (నారా.87) దను టెంతయు నుచితము గదా. కాని వజ్ఝలవారు పై గ్రంథమును దత్కర్తను నన్నయాథర్వణులమతమందలిద్రుతస్వత్వసంశ్లేషల స్వరూపము తెలియకపోవుటయే కారణ మని తిరస్కరించిరి. అది తెలిసినవీరు లక్షణసార్థక్యమునుగూర్చి నన్నయాథర్వణులమతమందలిసంశ్లేషము రాకుండుట కును వారిమతమందలివ్యంజననకారరూపద్రుతము పరస్వరాంగముగఁ బల్కఁ బడుటలక్షణముగాఁ గలస్వత్వమున కిందు వైకల్పికత్వ ముపదేశింపఁబడె నని యెఱుం గనగు (వ్యా.సం.స.325) ననిరి. అనఁగా వ్యాఖ్యాత లెల్లరవలెనె వీరును వాత్మా స్మదిత్యాదిలక్షణముచే సంశ్లేషము రాకుండుట ప్రయోజనముగా స్వీకరించి రన్న మాటయే (వినా ద్వితీయ మ్మను వి.పి.లక్షణ మిందులకుఁ గారణ మైనఁ గావ చ్చును.) కాఁగా నింక భేద మెల్ల స్వత్వమువద్దనే. మిగిలినవారు తాను ఘనుఁ డని స్వత్వము నుస్వరూపముతో నుండు నన వీరు తా ఘ్ఘనుఁ డని యిం కొకరీతిగా నుండు నందురు. అవుఁ గాక. వీరు సాధించినస్వత్వమునకును బ్రత్యేకవిధాన మెల్లఁ జేసి నిషేధించిన సంశ్లేషమునకు భేద మేమి ? తా ఘ్ఘనుఁ డనునది సాధువే కాని తాన్ ఘనుఁ డన్నది యసాధు వనియు దాని ససాధువును జేయుటకుఁగాను నన్న యాథర్వణులు ప్రత్యేకముగా లక్షణము చేయవలసివచ్చిన దని చెప్పుటయు సమం జసములుగాఁ గానరాకున్నవి. (ఇంత శ్రమతో వీరు సాధించినస్వత్వరూపములకుఁ బ్రయోగములు దొరకలే దని వారే చెప్పుకొనిరి.) ఇట్టిసామ్యమువలననే గావచ్చు నింతకుఁ బూర్వము వీరు తాన్విని నేన్ వింటిని మున్నగుచోటులందలిసంశ్లేషము విరుద్ధము కానేరదు(వ్యా.సం.స.297)అనిరి. కాఁగా సంశ్లేష నిషేధము ప్రయోజన ముగా నిట నీ సూత్రముల సార్థక మఱచినను (పరుషపరకత్వమున సంశ్లేష

మెట్లును లేదు గాన) నింతకు ముందు పుట.297లో వివరించినదానింబట్టి సరళ స్థిరపరకతలో సంశ్లేష మవిరుద్ధమ యైనది. వాత్మాస్మత్సూత్రత మన లిచ్చుటనే కదా లోపము వికల్ప మనుచున్నది. పరుషపరకత్వమున ద్రుత మనలే లోపింపదు గదా. కాఁగా నీవివరణమునుబట్టి వజ్ఝలవారే సంశ్లేషనిషేధము ప్రయోజనవంతము గా ఉని స్పష్టము చేసిన ట్లయినది. కాఁగా గాణపతవివరణకర్త పేర్కొ-న్నట్లు వాత్మాస్మత్సూత్రమున లోపవికల్పత వ్యర్థమే యైన దన్నమాట. నన్నయాధర్వణులమతమున స్వత్వసంశ్లేషము లన నేమో తెలిసినవజ్ఝలవారిమతమునను వారివివరణము ననుసరించియే యావిధానము వ్యర్థ మగుట విశేషమె. కావున నింక నీయంశమున గాణపతవివరణ కర్త్రభిప్రాయము నింద్య మిటఁ గా దని తెలియవచ్చును.

ఇంక నావివరణకర్త "స్వత్వమును గూడ ద్రుతముగా నంగీకరించిననే గాని వికల్పవిధానమునకు సార్థక్యము కలుగ (88పుట) దనుట విచార్యము. స్వత్వము గూడ ద్రుత మన నేమి? ద్రుతము వేఱును ద్రుత(స్వ)త్వము గలిగినది వేఱును నగునా? రామత్వము గలవాఁడు-రాముఁడును వే ఱగు టెట్లు? నువర్ణము వేఱుగను నకారము వేఱుగను నీవివరణకర్త ద్రుతముగా భావించి నట్లు(48)తోఁచుచున్నది. అది యుక్తము గాదు.

ఏది యే మైనను ప్రస్తుతస్థలములందు స్వరలోపము చేసినపిదపటితాన్-నేన్ లనే గ్రహింపవలయు ననుట కెట్టియాధారమును లేకపోఁగా నట్లు గ్రహించుట వలన నావిధానముతే వ్యర్థము లవుచున్న వనుట స్పష్టము. ద్రుతము స్వ(త్వ)రూపము నెదిగాఁ జూపుచున్నారో యదియే ద్రుతముగా గ్రహించు టుచితము. కావున నహో.మతము ననుసరించి తాను ఘనుఁ డనురీతిని స్వత్వ రూపము లని గ్రహింపవలె. కాఁగా లక్షణములందును దానునేనుల నుత్వసహితములనే గ్రహింపవలె. అన్యస్యాపి నోః అను-వి.వి.లక్షణము నువర్ణమునే (తాను నేను) గ్రహింపవలె నని సూచించుచు నదియే చిం.యభిప్రాయము నవు నని సూచించుచున్న దని గ్రహింపఁదగును.

కాఁగా నాత్మాస్మదోర్ద్విణా యనుగసడదవాదేశస్థలమునను 'తానునేను' అను నువర్ణాంతములనే గ్రహింపవలె. కాఁగా గసడదవాదేశనిషేధము న్వంతముల పైనే జరిగినది.

వాత్మాస్మదోర్ద్రుతస్య స్యా ల్లు క్క్వచిన్నప్పుడు నిమిత్తములు సరళస్థిరములే గావలయు ననుట స్పష్టమె. ఆత్మాస్మదోర్ద్రుతస్య అనుటంబట్టి తానునేనులందలి ద్రుత మనఁగా నువర్ణమునందు ద్రుతత్వ మంగీకృత మని గ్రహింపఁదగును. ఇట్లు నువర్ణమునందు ద్రుతత్వ మంగీకృత మవుటచేతనే ఉగ్వేత్యాదిసూత్రము చేతనే యిట ద్రుతలోపవికల్పత సిద్ధించుచుండ విధానము సంశ్లేషనిషేధార్థ మనియు స్వత్వ మయి తాను ఘనుఁ డిత్యాదిగ నుండు ననియుఁ జెప్పుట సూరిజన సమ్మతమే కదా. ఇందలి ద్రుతశబ్దముచేతనే తానునేనుపదములచివరినువర్ణంబు నందు ద్రుతత్వము చెప్పఁబడిన దనియే నంగీకరించుచో స్వస్థతనుబట్టి పైపరుషము లకు రావలసిన గసడదవాదేశనిషేధముద్వారాన సరళాదేశాదులు సిద్ధ మయ్యె ననుటలో నిబ్బంది యేమియును లేదు. అయిన నిట నొకయనుమానము. ద్రుతస్య యనుటచే తానునేనులలోనినువర్ణము ద్రుత మని స్పష్టము. అప్పు డివి ద్రు.ప్ర.లు కదా. ద్రు.ప్ర. లయినపుడు మీఁదిపరుషములకు సరళాదేశము రావల యును. అట్టియెడ గసడదవలను నిషేధింప నేల? అయిన నీయవి ద్రు.ప్ర. లగుటతోపాటు స్వంతము లైనవి. స్వంతములు కళలు గావలె. అందుకే వి.వి.కర్త స్వస్తయో రపి యని ప్రత్యేకముగాఁ జేర్కొనియుండె ననవచ్చును. కానీ యిందలిచివరినువర్ణమునకు ద్రుతత్వము చెప్పుటవలన ద్రుతో న యేషాం స్యాత్తని చెప్పినదానింబట్టియు నీయవి కళలు గావు గదా యనవచ్చును. కానీ యిట గసడదవాదేశము చెప్పె నది ప్రథమాంతములపైఁ గాని కళలపై నని కాదు గదా. కావున తానునేనులు కళలు గాకున్నను ప్రథమాంతము లగుటచే గసడదవలు రావలె. ప్రథమాంతములె యైనను జివరినువర్ణము ద్రుత మగుటం జేసి ద్రు.ప్ర. లైనవి. అప్పుడు వానిపైని బరుషములు సరళములు గావలె. మఱి యట్టి స్వంతములై ద్రు.ప్ర. లైన తాను నేనులపైని బరుషములు గసడదవ

లగునా లేక సరళము లగునా? యని సందేహము. 'ఆత్మాన్మదోర్వినా' అని నిషేధించినదానింబట్టి ప్రాప్తించుచున్నగసడదవాదేశసరళాదేశములలో నొకటి గసడదవలు నివారితము కాఁగా రెండవది యనఁగా సరళాదేశము సాధింపఁబడిన దన్నమాట. ఇట్లు తానునేనులు ద్రు.ప్ర.లె యన్నను గసడదవాదేశము నిషేధము సముచితముగా సార్థక మైనది.

కాఁగా స్వంతము లైన శబ్దములలోఁ దానునేనులకుఁ జేసిన యీప్రత్యేక విధానములవలన నింకొకవిషయము స్పష్ట మగుచున్నది. అట్టిది స్వంతము లయ్యున్నశబ్దము లింకే వేని నాంతములే యైనను వానికి ద్రు.ప్ర.త్వము లేదు. అనఁగాఁ దానునేనులకు భిన్న మైన స్వంతశబ్దమునకు నీరీతిగా ద్రుత కార్యములు సిద్ధింప వన్నమాట. అట్టివానికిఁ బ్రథమాంతతనుబట్టి గసడదవాదేశమే యగు నని గుర్తింపఁదగు. తానునేనులకే చెప్పినయీవిధాన మాయంశమునే స్పష్టము చేయుచున్నది. అందుకే వి.వి. నో రన్యస్యాపి సర్వం స్యాద్బహుళం సత్ప్రయోగత అని ప్రత్యేకముగఁ జెప్పి యుండు. (ద్రు.)

ఇచ్చట నొకయనుమానము నున్నది. వినా ద్వితీయం.... స్వస్త్రయోరపి -అన్న వి.వి. తానునేనులకు ద్రు.ప్ర.త్వము నంగీకరించినదా. అవి ద్రు.ప్ర.లు గాకయున్నను నువర్ణమునకు ద్రుతకార్యములు (విశేషము కావునను)చెప్పినదా? ద్రుతకార్యములు విధించునాయాసందర్భముల ద్రు.ప్ర. శబ్దము నుచ్చరించినచిం. తానునేనులయెడ ద్రు.ప్ర. వ్యవహారము చేయలేదు. అనవసర మని మానినదా? ద్రుతస్య అనుటచే తానునేనులలో నువర్ణము ద్రుతమే కాని యవి ద్రు.ప్ర.లు కా వనుకొన్నదా? లేక ద్రు.ప్ర.లే యని తలఁచినదా? ద్రు.ప్ర. లని తలఁచి యుండవచ్చు. వి.వి. అట్లెంచియుండలే దేమో. స్పష్టముగా నిర్ణయింప నవకాశము చాలకున్నది. సూరి సైత మారంభమున తానునేనులు ద్రుతప్రకృతిక తుల్యంబు లనుటలోఁ (శ.ల.సం.)పై రీతియభిప్రాయమునే గల్గియుండె నేమో. ఐనను బాల.లో స్పష్టముగా నివి ద్రు.ప్ర. లని నిర్ణయించెను.

వజ్ఝలవారిసిద్ధాంతమునే యనుసరించుచు ఘం. ప్రౌఢ. అనుబంధములో నిట్లు పేర్కొనెను. చింతామణిలోను దుదకు సూత్రాంధ్రవ్యాకరణములోను నేను తానులనువర్ణము సుప్రత్యయస్థానమున విధింపఁబడియున్నది. అనఁగా నివి ప్రథమావిభక్తి యన్నమాట. ప్రథమావిభక్తి కళయే కాని ద్రుతప్రకృతికము కాదు గదా. బాలవ్యాకరణమునందును నివి ప్రథమాంతములుగానే నిపతింపఁబడి యున్నవి. త్రిసమము లన్నపక్షమునం దైనను నివి ప్రథమాంతములు కాక తీరదు.(297) కాఁగాఁ బ్రథమాంతము లవుటచే నీయవి ద్రు.ప్ర. లవుట లక్షణానుగుణము గా దని యభిప్రాయ మన్నమాట. అందులకే సూరి తానునేను పదంబులును అని వీనిని ద్రు.ప్ర.లుగాఁ బ్రత్యేకముగాఁ బేర్కొనెను. కావున నీయవి ద్రు.ప్ర. లవుటలోఁ బ్రథమాంతత్వము బాధకము గానేర దని స్పష్టము. అయినను ప్రథమాంతము లైన ద్రు.ప్ర.లు గానేగా వనవలెనా? ప్రత్యేకముగాఁ జెప్పినను. అట్లయిన ఘం. వ్యాఖ్యాత తానునేనులోనున్నగుళ్ళక్షరములం దుత్వలోప మైనచో నయ్యవి ద్రు.ప్ర. లవు రనిరి గదా. (ము.ల.కౌ. సంజ్ఞా.18) అట స్వరము లోపించినంతమాత్రాన నాశబ్దములు ప్రథమాంతములు గాకుండఁబోవుఁ గదా. స్వరలోపము చేసినను తాన్ నేన్ ఇత్యాదులు ప్రథమాంతములై యుండఁగా మఱి ద్రు.ప. లెట్లైనవి. కళలే గదా కావలసియున్నది. స్వరలోపానంతర మీనకారాంతములు ద్రు.ప్ర.లే యవు నని సూత్రించెను గావున నివి ప్రథమాంతము లయ్యును గళలు గాక ద్రు.ప్ర.లే యవు నని చెప్పవలె. అదే విధముగా ప్రథమాకయిపట్టియొక్కొతరములు ద్రు.ప్ర. లనఁ బ్రథమాంతము ద్రు.ప్ర. కాదు. ఐనను తానునేనుపదంబులును అని వీనిని బ్రత్యేకముగాఁ బరిగణించియుండుటంజేసి ప్రథమాంతము లయ్యును ద్రు.ప్ర.లే యవుటలో నవరోధ మేమి? ఉన్న స్వరలోపానంతరమె యైనను నయ్యవి ద్రు.ప్ర. లవుట యసంభవమే యగును.

కాఁగా నివి ప్రథమాంతము లవుటంజేసి ద్రు.ప్ర. లవుట లక్షణవిరుద్ధ మను నీహేతువు సరి యైనది గా దని స్పష్టము.

పిదప 'నేనుతానులపై గసడదవాదేశమె మహాకవిసమ్మతము.  పూర్వ లాక్షణికసమ్మతము నైయున్నది'(297) అత్మాస్మదోర్వినైవైతే వినా ద్వితీయ మ్మనుచిం.,వి.వి.లలక్షణము వ్యర్థము కాకుండవలయు నన్న నేనుదానులు ద్రు.ప్ర. లని గ్రహింపవలసియుంట స్పష్టము. కాఁగా నేనుదానులపై గసడదవాదేశము "నన్నయాథర్వణ" సమ్మత మని నిశ్చయించుటకు మాత్రము వీలు లేదనకతప్పదు.

మహాకవిప్రయోగసమ్మత మనుట యొక్కఁడు మిగిలినది. ఏను విదప అనుతిక్కనప్రయోగముంగూర్చి పైని జూతము. అట్లయ్యు "తాను ప్రబోధించె" నని ప్రౌఢవ్యాకర్త నన్నయప్రయోగమునే చూపియుండఁగా నది లాక్షణికుఁడైన నన్నయ సమ్మతింపలే దనియు నింకను వజ్ఝలవారివ్యాఖ్య ననుసరించిన (అనుసరించుటచేతనే యివి కళలైన వనఁ చ్చును.) గసడదవాదేశమును నిత్యముగాఁ బ్రయోగింపవలసియున్నది కావున తాను ప్రబోధించె నని ప్రౌఢ. చూపుట నన్నయలక్ష్యలక్షణపద్ధతికి విరుద్ధ మనియుఁ దాను ప్రవబోధించె ననియే యుండవలయు ననియు నీవ్యాఖ్య యటఁ బేర్కొనవలసియున్నది. కాని యట్లు చెప్పలేదేలకో.

తాను నేనులలోనినువర్ణము సుప్రత్యయమున్థానమున విధింపఁబడియుండుటం జేసియే చిం.కర్తయు వీని ద్రు.ప్ర.త్వముపైఁ బ్రత్యేకదృష్టిని జూపె నని గుర్తింపఁదగును.

చిం. వీనిని స్పష్టముగా ద్రు.ప్ర. లని పేర్కొనలే దని యట్లు వ్యవహరించుటకు మొగమోటమిఁ జెందినను అత్మాస్మదోర్ధ్రితస్య అన్నది గనుక నువర్ణము ద్రుతమే. తదంతము ద్రుతాంతమే యగును. ఇట్లు ద్రుతప్రకృతికము నవువీనిపైఁ బరుషములకు గసడదవాదేశము రాదు. తానునేనులు ద్రు.ప్ర. లనుటకేని గొంతేని వెనుకాడవచ్చు నేమో కాని అన్యస్యాపి నోః అనురీతి వి.వి. లక్షణము ననుసరించి తానునేనులలోని నువర్ణముపై సరళాదేశమే యుండ

వలె ననుట కెంతమాత్రము సంశయింప నక్కఱ లేదు. అనఁగా వీనిపై గసడదవా దేశ ముండరా దన్నమాట.



వజ్ఝలవా రిట్టియెడల నుత్వలోప మైనతాన్నేన్లనె గ్రహించిరి గావున నాత్మాస్మదోర్వినా యనునిషేధ మవ్వానిపైనె. కాఁగా నుత్వసహితము లగు తానునేను లీసూత్రసందలియాత్మాస్మచ్ఛబ్దములచే గ్రహింపఁబడవు గాన వానిపై గసడదవాదేశనిషేధము లేదు. 'నేనుతానుశబ్దములు కళలు గావున వానిమీద నీయాదేశము (గసడదవ) నిత్యముగానే వచ్చును. (వ్యాసంస.287,చిం.వి.వ.2) అని యాఖ్యైచోట్లఁ జేర్కొనిరి. ఆత్మాస్మదోః అనుచోఁ దాన్నేన్లే యేల గ్రహింపఁ బడునో తానునేను లేల గ్రహింపఁబడవో యర్థము కాదు. ఇంతటి సూక్ష్మ మైనభేద మున్నపుడు దానిని స్పష్టము చేయక సూత్రకర్త గూఢముగాఁ గొంద ఱకే యర్థ మగున ట్లేల యుంచెనో? ఉత్వలోప మయినతాన్నేన్లే కాని తానునేను లాత్మాస్మదర్థకములు గావా? అయినవు డట నేల గ్రహింపఁబడవు?

ఇంక నివి కళలు గావున గసడదవాదేశము వచ్చు ననుట విశేషము. గసడదవాస్స్యుః ప్రథమామాత్రా త్తునులక్షణము ప్రథమాంతములపయి గసడ దవలను జెప్పుచున్నది. ప్రథమాంతములు కళ లయ్యును ప్రథమాంతములే కళలు గావు గదా ఇటఁ గళ లనుటలో గసడదవాదేశముకంటెఁ దానునేనుల నువర్ణములు ద్రుతములు గా వనుటలోనె వజ్ఝలవారితాత్పర్యము గోచరించును. ఇంకఁ దాన్నేన్లే యేల గ్రహింపఁబడునో యీకళ లనుటనుబట్టి యూహింపవచ్చును. ఉత్వలోప మైనపుడు తాన్ నేన్లు ద్రు.ప్ర.లగుఁ గాన వానిపై సరళాదేశమె యగును గసడదవలు రావు. కావున గసడదవలు రా వని చెప్పుచోట నాగసడ దవలు వచ్చుటకు నవకాశము లేని ద్రు.ప్ర. లైనతాన్నేన్లే గ్రహింపవలె. తాను నేను అని యున్న నవి ద్రు.ప్ర.లు గావు. వ్యంజనసకారము గదా నన్నయా థర్వణులమతమున ద్రుతము. అందుచేఁ దానునేను లుదంతములు ద్రు.ప్ర.లు గావు. కావున వానిపై పరళాదేశము రాదు. గసడదవలు రావలె. అందుకయి గసడదవాదేశము నిషేధింపుస్థలమున గసడదవలు రావలసియుండుట ననుసరించి

తానునేసులు గ్రహింపఁబడవు. అనఁగా నాత్మాస్మదోః అన్నది కేవలము ద్రు.ప్ర. యగుటయుఁ గళ యగుటయు నాధారముగా గ్రహింపవలెనె కాని ఆత్మార్థకమె కదా యని తాను నస్మదర్థకమె కదా యని నేను ను గ్రహింపరా దని చెప్పఁబూని రన్నమాట.

అట్లయైన ఆత్మాస్మదోః అని తాన్నేన్లే యేల గ్రహింపఁబడు? ప్రథమాంతములైనను నివి ద్రు.ప్ర.లు గాన వీనిపై గసడదవలు రారాదు గావున నవి గ్రహింపఁబడు. ఆత్మాస్మదోః అని చెప్పకున్న తాన్నేన్లపైఁ బరుషములు గసడదవలు గా వనకున్న గసడదవలు కావలయునా? కళ లగుటచే గసడదవ లగుననుచున్నవీరిమతమునుబట్టి ద్రు.ప్ర. లయినపుడు గసడదవ లెట్లును రావు గదా. ఆత్మాస్మదో ర్వినా యన నేల? అన్నాఁడు గనుక కళాపదములచివరినిను వర్ణములందు స్వరము లోపించి పొల్లనకారము ముతమైనఁ దదంతము ద్రు.ప్ర. యైనను నా శబ్దము ప్రథమాంత మగుచోఁ దాన్నేన్లపైనే గసడదవలు రావు. ఇతరములపై రావచ్చు నన్నమాట, ఇంక వానికి ద్రు.ప్ర.త్వ మేల? వజ్ఝలవారే స్థలాంతరమున నేను, రవిని అనునవి ప్రథమాంతములు గాన కళలు నేను, పండితుఁడను అనునవి ప్రథమాంతములు గాన కళలు వీనితుదిస్వరముకవిభల్లట సూత్రముచొప్పున వికల్పముగ లోపించును. నేన్, రవిన్ మొ. ఇవి ద్రుతాంతములు. నేన్ బండితుఁడన్ ఇవు డివి ద్రుతాంతము (వ్యా.సం.న.1088)లనిరి. నేను + పండితుఁడను రెండును ప్రథమాంతములె. స్వరము లోపింపఁగా నేన్ + పండితుఁడన్ అని యైనది. ఆత్మాస్మదోర్వినా యనుటచే నేన్ అనుదానిపై గసడదవలు రావు గాన సరళమై నేన్ బండితుఁడన్ అని యైనది. ఇది సంశ్లేష మని చెప్పకమున సరళాదేశము రా దని సిద్ధాంతము చేసియును వజ్ఝలవా రది పాటింపలే దనుట కిది యొకయుదాహృతి. స్వరలోపమై ద్రుతాంత మయ్యును బండితుఁడన్ అన్నది ప్రథమాంతము గదా. నేన్ అను దానిపైవలె పండితుఁడన్ అనుదానిపై గసడదవాదేశనిషేధము చేయఁబడలేదు గదా. మఱి కవిన్ పండితుఁడన్ అనుప్రథమాంతములపైఁ బరుషములకు

సగడదవలు రావలదా? కవిన్ + చుమ్ము పండితుఁడన్ + చుమ్ము అనుచోఁ గవిన్ సుమ్ము పండితుఁడన్ సుమ్మని యగునా? అట్టిప్రయోగ మెందు చూపఁగలమా? అసలు గసడదవాదేశమె యగుచో స్వరలోపానంతర మివి ద్రుతాంతము లననేల? ద్రుతత్వమువలనఁ బ్రయోజన మేమి? ద్రుతాంతతవలననే సరళాదేశమె వచ్చు ననియు కవిఁ జుమ్ము పండితుఁడఁ జుమ్ము అనియె యగు నందురా? నేన్ పండితుఁడన్ అను రెండుప్రథమాంతములలో పండితుఁడన్ అనుచో ద్రుతాంతత చేతనె పైపదములకు (గసడదవలు రాక) సరళము లగుచుండఁగా నేన్ అను ప్రథమాంతమునెడల విశేషముగా గసడదవాదేశనిషేధ మేల చెప్పవలె.



కాఁగాఁ గళలు గావునఁ దానునేనులపై గసడదవలగు నింక ద్రు.ప్ర. గావునఁ దాన్నేన్లపైనె దసడదవాదేశము నిషిద్ధ మనియు నందుకై యాత్మాస్మదోః వినా యని పర్యుదాసము చేయఁబడె నయుఁ జెప్పువజ్ఝలవారియభిప్రాయము సమంజసము గానేర దని నిశ్చయింపఁదగియున్నది.

అహో. కూడఁ దానునేనులలో నుత్వలోపము చేసియే ద్రుతకార్యములను బ్రవర్తింపఁజేసెను. దానింగూర్చి వజ్ఝలవారు అహోబలపండితుఁడునైతము తానునేనుశబ్దములు కళ లనియె యభిప్రాయపడె (బా.సం.స.95)ననిరి. అనఁగా నహో. కూడఁ దమసిద్ధాంతమె కల్గియుండె నని వీరి యభిప్రాయము.

అహో. చేసినయుత్వలోపప్రసంగమునుగూర్చి పరిశీలింతము. తాను నేనులలో సల్లోపశ్చ యనుసూత్రముచే నుత్వలోప మగుటను జెప్పినయహో. పక్షాంతరము నిట్లు చెప్పెను. లుగ్విధి-పర్యుదాసయో స్సామర్థ్యాద్వా భవ త్యుల్లోప ఇతి సువచమ్. న చపర్యుదాసస్య తాను చెప్పె, నేను చదివితి, నితి రూపద్వయసంపాదన ఏవోపక్షీణశక్తికత్వ మితి వాచ్యమ్. తాదృశప్రయోగస్య కుత్రచిదప్యభావాత్ (కవిశి.341) నాత్మాస్మదోర్ద్విత్వస్య యనునది లుగ్విధి. దానికిఁ బ్రయోజనాంతరము కల్పింపఁబడినది. (బిందుసంశ్లేషహారణము) పర్యుదాస మన గసడదవాదేశవిధానస్థలమున ఆత్మాస్మదోర్వినా యనుట. దానిచే నైనను నుత్వ

లోప మగు నని చెప్పందగు నన్నాఁడు. గసడదవాదేశనిషేధ మేమి? ఉత్వలోప మగు టేమి?

అనఁగా గసడదవాదేశమును వారించుటమాత్రమె యటఁ బ్రయోజన మైనయెడల తాను చెప్పె నేను చనివితి అనురీతిగాఁ బరుషము లట్లే యుండవలయును. అట్టిప్రయోగము లెచ్చటను లేనేలే వని యహో. స్పష్టము చేయుచున్నాఁడు.

కాన నాత్మాస్మదో ర్న్వా యనుదానికిఁ దాను చెప్పె నని సాధించుట ప్రయోజనము కాదు. మఱి తాఁ జెప్పె నని సాధించుట. అనఁగా ద్రుతకార్యము లగుట. ద్రుతకార్యములగుటకై పర్యుదాసము చేయఁబడెఁ గానఁ బర్యుదాసము చేతనే ద్రుతత్వము గల్గును. అహో. కూడఁ బొల్లనకారమె ద్రుత మని భావించెను. గావున ద్రుతాకార్యజ్ఞాపనముచే ద్రుతత్వము అనఁగాఁ బొల్లనకారమె యుండుట యనఁగాఁ దానునేనులలో నుత్తులోపించి పొల్లయె యుండుట పర్యుదాసమువలననె కలుగు నని సిద్ధాంత మన్నమాట. కావుననె పర్యుదాసముచేతనె యుల్లోప మగు ననె.

కాని పిదప నలోలోశ్చ యనుదానిచేతనె యుల్లోప మగు నని వివరించుచు నట లోపము వికల్ప మగుటను బ్రస్తావించుచు న చ తత్ర పరుషేషు వికల్పోఽభిమతః తాను చెప్పె నిత్యాదిరూపస్య ప్రయోగాభావా (శ్రవిశి.479) త్తని తాను చెప్పె ననురీతిని లేమి సంగీకరించెను. అనఁగా నలోలోశ్చ యని లోపము వికల్ప మగుటచే నుత్తు లోపింపనిపక్షమునందుఁ దానునేనులు ద్రు.ప్ర. లుగామి స్వాంతతచే మీఁదిపరుషములకు గసడదవలు గావలసివచ్చు. అప్పుడు తాను చెప్పె నని కావలయును. అనఁగా నుల్లోపాభావపక్షమున ద్రు.ప్ర. గామి దాను నేనులపై గసడదవాదేశము రావలయు నని వజ్ఝలవారివలెనె యహో. కూడఁ దలంచె నన్నమాట. కాని ఖేద మే మన దానునేనులపైఁ బరుషములు గసడదవ లగుట కవిప్రయోగములందు లేదు. తాను చెప్పె నిత్యాదు లసాధువులే యనెను.

అందువలననే తాఁ జెప్పె నిత్యదౌ వ్యవస్థితవిభాషా సమాశ్రితా (కవిశి.478)యని వ్యవస్థితవిభాషచేఁ బరుషపరకత్వమున నుల్లోపము నిత్య మని నియమించెను. అనఁగాఁ బరుషపరకతలో నివి తప్పక ద్రు.ప్ర.యే యగు నని యహో. నిర్ణయించె నన్నమాటయే. పరుషపరకతయం దనెనే కాని సరళస్థిరపరకతయందు మాత్ర మక్కఱ లేదా? సరళస్థిరపరకతయం దుల్లోపము జేకున్నఁ దాను ఘనుఁ డిత్యాదిగనె యుండు. అయ్యది లక్ష్యవిరుద్ధము గామింజేసి సరళస్థిరపరకతలో నుల్లోపవికల్పత యనిష్టము గా దని తలఁచె నన్నమాట. అట్టియెడల నుల్లోప మై ద్రు.ప్ర. యగుపక్షమున తాన్ + ఘనుఁ డనియుండ అత్మాన్మదోర్ధ్రి తస్య స్యా ల్లు క్కని లోపము నిత్యముగనె చెప్పవచ్చును గదా. ఇందు సంశ్లేషము లిష్టములు గావు. స్వత్వమునే నగుతానుఘనుఁ డనురీతిరూపము లుల్లోపాభావపక్షమువలన ననఁగా ద్రు.ప్ర.త్వాభావపక్షమున నేర్పడును. కాఁగా ద్రు.ప్ర.త్వపక్షమునఁ నగునది. తా ఘనుఁ డనురీతి లోపరూప మొక్కటి. అట్టియెడ వా యన నేల? వాత్మాన్మదోః అనుసూత్రవివరణమున వా లుక్ స్యాత్సరశే స్థిరే చ పరే. తాను ఘనుఁడు తా ఘనుఁ డిత్యాదిగఁజూపెను.(కవిశి.381) అనఁగాఁ దాను ఘనుఁ డన్నది వైకల్పిక మగుద్రుతలోపము రానిపక్షమందలి రూపము. అనఁగా స్వత్వస్థితి. పిదపఁ బునర్విధానముచే బిందుసంశ్లేషములు రెండే రా వనుటయు స్వత్వము రా దనకుండుటయుఁనట్టి యది స్వత్వస్థితి యనక తప్పదు. లోపవికల్పతవలన ద్రు.ప్ర.త్వాభావపక్షమునను దాను ఘనుఁ డని సిద్ధించుచుండఁగా నట్టిస్వత్వస్థితికయి లోపము వికల్ప మన నేల? నిత్య మన్న నిది పునర్విధి యగు నవకాశమును లేక బిందు సంశ్లేష స్వత్వముల కవకాశము స్పష్టముగా వారింపఁబడు గదా. కాఁగాఁ బరుషపరకతయందే గాక సరళస్థిరపరకతయందు నివి ద్రు.ప్ర. లనుటయె యుచితము ద్రు.ప్ర.త్వమునకుఁ బ్రబల మైననిరూపకస్థల మగు పరుషపరకస్థితిలో నివి యెప్పుడును ద్రు.ప్ర.లే యనఁగా నీయవి కేవలము ద్రు.ప్ర.లే యని స్పష్టము గదా.

అహో. (వజ్ఝలవారివలె) పొల్లునకారమె ద్రుతమని భావించినవాఁడు కాని ద్రుతస్వత్వము విషయమున నహో.సిద్ధాంతము వజ్ఝలవారివంటిది కాదు. ద్రుతము నకారపుఁ బొల్లె యైనను స్వత్వమాత్రము న(ని)అనురీతిగా స్వర సహితముగా నుండు నని భావించినవాఁడు కావున తాన్ నేన్ అనువాని పైనే గసడదవాదేశము నాతఁడు నిషేధించును గాక 'అవికారగతేఽపి' యను సూత్రముచే స్వత్వము వచ్చిన దన్నపుడు తాను జదివె నని యుదాహరించుట యహో. సిద్ధాంతమున కనుగుణమే. అందుకే వఝలవారు పేర్కొన్న ట్లెంతయు శ్రమించి యుత్వలోపము సాధించినయహో. లోపాభావపక్షమున (సంశ్లేషమును వాటించికొని) స్వత్వమును జూపునపుడు తాను ఘనుఁ డనురీతిగా నువర్ణమునే చూపియుండెను. కాఁగా ద్రుతత్వమునకై యుత్వలోపము చేయ వచ్చును గాక కాని తానునేనులపై గసడదవాదేశమె యుండు నని వజ్ఝల వారివలె నహో. భావింపలేదు. స్వత్వమున తాను జదివె ననురీతి నవును గావున నహో.మతానఁ దానునేనుల నుదంతములపైఁ బరుషములు సరళములె యై యానువర్ణము ద్రుతస్వత్వము కాఁగలదు.

అహో. అత్మాస్మదోర్వ్యా యనుచోట 'తాఁజెప్పె నేఁజదివితి నిత్యేవ (కవిశి.303)యనుటలోఁ దాను జెప్పె నని స్వత్వము నుంటఁ దని యెంచెనా? తానుసెప్పె, తాను చెప్పె, తాను జెప్పె, ననువానింట నేయొక్కరూపము నుండ దను టెట్లు? అప్పకవీయమునుబట్టి ఖండబిందుఘటితరూప మొండు యుండు నని తలఁచెనా? (అప్ప.మతము పైని గమనింతము.) అయినఁ బరుషపరకత్వ మున తాను నేను అని యుత్వ మున లుండదా? తాను ఘనుఁడు నేను వింటిని అని సరళస్థిరపరకతయం దున్నస్థితి పరుషపరకతయం దుండ దనుట సక్ర మమా? ఉల్లోపము పరుషపరకతలో నిత్య మన్నను దాను జెప్పె నని యుండ దని యహో. తలంచె ననరాదు. ఉల్లోపముచే ద్రుత మైనయానకా రమునకు నవికారగతే యనుసూత్రముచే స్వత్వము రాఁగాఁ దాను జెప్పె నని యుండనవు. ద్రుతమునకైనబిందువుపై నెట్లు సరళమున్నదో యట్లే ద్రుతమున

కైన స్వత్వముపైనిగూడ సరళ ముండును. ఉత్వలోపము లే దన్నపక్షమున
గసడదవాదేశప్రసక్తి కల్గును గాని ఉత్వలోపముచే ద్రుత మైనపిదప దానికి
(బిందువువలెఁ జెప్పఁబడిన) స్వత్వమువలన సుస్వరూపము గల్గుచో నది కళ
గాదు గాన దానిపై గసడదవాదేశప్రసక్తి లేదు. ఇంకను సరళా ఏవ సన్తి తే
పరత యని సరళములే యగును. తాను చెప్పె తాను సెప్పె ననురీతిరూప
ములు లే వన్న యహో. యెచ్చటను దాను జెప్పె ననురూప ముండ దనలేదు
గదా. తాఁ జెప్పె నేఁ జదివితి నిత్యేవ యనుచో నేవకారము తానునేనులపై
గసడదవాదేశము గాని యాపక్షము లట్లు యుండుట గాని లేక సరళాదేశాదులు
మాత్రమె యగు నని చెప్పుటనే యుద్దేశించిన దని గ్రహింపవచ్చును.

కాఁగా నహో. తానునేనులు కళ లనియె భావించినను పరుషపరకతలో
నిత్యముగా నుల్లోపము సాధించుకొని ద్రు.ప్ర.లుగా నిరూపింపఁగాఁ దాను సెప్పె
ననురీతిరూపములు లే వని నిర్ణయించియుండఁగా నీయహో.సిద్ధాంతము వజ్ఝల
వారి సిద్ధాంతముల కెంతవఱకు సబలకము గాఁగలదు?

మొత్తముపై నీలాక్షణికులవిధానముల ననుసరించి తానునేనులపై గసడ
దవాదేశ ముండుట కవకాశమె లేదు. ఎట నే నున్న నది యీలాక్షణికు లంగీ
కరింపనిదే యని నిశ్చయింపకతప్పదు. అట్టియెడల వజ్ఝలవారు తానునేనులపై
గసడదవాదేశమె నిత్యముగ నగు ననుట లక్షణానుగుణ మగుట లేదు. ఇంక
నయ్యది లక్ష్యానుగుణ మేమో పరిశీలింపఁదగియున్నది. తానునేనులు కళలే
యనియు వానిపై గసడదవాదేశమె యగు ననియుఁ బ్రస్తావించునెల్లయెడల
వజ్ఝలవా రొక్కప్రయోగమును దప్పక చూపుచుందురు. అది ఇది.

ఏను విదప

తిక్కనప్రాసఘటితప్రయోగ మిది. ఏను పఠించిన అని యిం కొకటి
ప్రాసఘటితమె యైయున్నది. ఇందుఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషమున
కీవాదేశ మవుట యింకను విశేషము.

తానునేనులు గళ లనియు వాని పై గసడదవాదేశము నిత్య మనియు నన్నయకర్తృక మయినచిం. చెప్పుచున్నది గదా. అట్టియెడల నానన్నయ ప్రయోగములనుండియే తానునేనులపై గసడదవాదేశమును జూపిన బాగుండెడిది. నన్నయ తనభారతమునందుఁ దానునేనులపై 'సవ'లను బ్రయోగింపలేదా? అట్లన్న నీయవి కళలును గా వవ వలసివచ్చును. కావున నన్నయప్రయోగమును గాక యెల్లయెడలఁ దిక్కనప్రయోగము చూపు టేమి యని వింతపడక నన్నయ యిట్లు తానునేనులపై నీయాదేశమును బ్రయోగించినను బ్రాసఘటితముగాఁ బ్రజల మయినస్థలములో (ఇతరము లట్లు ప్రయుక్తము లైనను నయ్యది 'కవి ప్రయుక్తము' గా దనునవకాశ ముండును గావున) బ్రయోగించియుండమింజేసి యట్టి దైనతిక్కనప్రయోగమునే స్వీకరించుచు వచ్చి రని గుర్తింతము. ప్రాసేతరస్థలములం దయినను నన్నయప్రయోగములనుండి యొండు రెం డిచ్చి యుండిన కొంత యేని బాగుండెడి దనిమాత్రము చెప్పవచ్చును.

తాను దొలఁగి (నిర్వ 1-30) ఏను గరంబు(నిర్వ-4) మొద లగుచోట్ల గసడదవాదేశమువలెనె సరళాదేశ మనియు వ్యాఖ్యానించుట కవకాశము కలదు. కావున నట్టివి నిర్ణాయకములు గా వనఁదగు. చవలయెడనే భేదము. తాను నేనులపైని జవలు సవ లైన గసడదవాదేశ మనియుఁ జబ లైన సరళము లనియు (నితరస్థలములందును) సమన్వయింపవలెను. అందుకే వాదేశము గల యీప్రయోగము మిక్కిలి బల మైన దని యభిప్రాయము.

సంధిగతప్రాసమున కప్పకవి యీపద్యము నుదాహరించుటవలన దీని కింకను బ్రాధాన్యము గల్గిన దనవచ్చును. అప్రాసలక్ష్య మగుటంబట్టి యట వాదేశమె యున్న దనక తప్పదు.

కాని యీప్రయోగము నిట్లు చూపిన యప్పకవియును వజ్ఝలవారివలెఁ దానునేనులు గళ లని భావింపలేదు. వాత్మాస్మత్సూత్రవివరణమున "నేనుదా ననునీమాటలకొన ద్రుతంబు లేఁగు నిలుచు హల్లు మీఁద నుండునపుడు నే మను దును నేను మనుదు నీకృప ననఁగన్ (అప్ప.5.184,185) అని యుత్వవిశిష్ట

ముగనే చూపియుండుటంబట్టి తానునేను లుత్వవిశిష్టములే ద్రు.ప్ర. లని యప్పు.మతము నెన్నవచ్చు. నగరమునకు మహిజాతను గొని వచ్చె ననురీతిగా నీతఁడు ద్రుతమును స్వరసహితముగఁ జూపుట గమనింపవచ్చు. నేను బచరింతు నీవలె (57-8-కా.చు.) అని పెద్దిరాజు నేను దానులపై సరళాదేశమును స్పష్టము చేసియు నుండెను.



తిక్కన తానునేనులపై నిట్టియాదేశము చేయుట విశేషమే యనక తప్పదు. అసలు యథార్థము పరిశీలించిన వజ్ఝలవా రిట స్వరసహితముల నేల గ్రహింప లేదు. చి.కర్తృమతమునఁ బొల్లనకారమే ద్రుత మని తలంచుటచేతను, నువర్ణముపై సరళము లుండుటకు వీలు లే దనియు నసలు ద్రుతము నుస్వ రూపముతో నుండ దనియు విశ్వసించుటచేతను. ఇచటఁ దానునేనులను గ్రహిం చుచో నువర్ణము ద్రుతము గావలసివచ్చుం గావునఁ బొల్లనకారమే ద్రుత మనుచిం.మతము ననుసరించి పొల్లనకారమే యుండవలయుం గావున నుత్వ లోపము చేసి రనఁదగును. అట్లుగాక ఆత్మాస్మదోః అని చెప్పినతావుల నెల్ల నుత్వలోపము ప్రసక్తి యెచ్చటనుండి వచ్చును? కాఁగాఁ దానునేనులు ద్రు.ప్ర.లు గాక కళలే యగుటకుఁ గారణము చిం.మతమున ద్రుతము పొల్లునకార మగుటయే యని స్పష్ట మవుచున్నది.

చిం. కనుగుణముగా నన్నయమాత్రము ద్రుతమును బొల్లనకారముగనే ప్రయోగించె ననుకొన్నను వజ్ఝలవారే తిక్కనభారతమున ద్రుతము నుస్వ రూపముతో నుండుటను గుర్తించి స్పష్టము చేసి యున్నారు గదా. కాఁగాఁ దిక్కన ద్రుతమునకు 'ను'స్వరూపము నంగీకరించి ప్రయోగించినవాఁడే. పొల్లనకారము మాత్రమె ద్రుత మనుకొన్ననన్నయ తానునేనులపై గసడదవా దేశము చేయుఁ గాక. (ఇట్టి దొక్కటియు వజ్ఝలవారు చూపలేదు.)నుస్వరూపము నంగీకరించినతిక్కనమతములోఁ దానునేనులు ద్రు.ప్ర. లగుటలో సందియ మున్నదా? ప్రథమాంతమే కావచ్చును గాని (విశేషముగా) ద్రు.ప్ర. యవుట (తాన్నేన్లు ద్రు.ప్ర.లే యనిరి గాన)కుదురుచునే యున్నది గదా. అయిన

'కను' అనుచో నువర్ణము ద్రుతము కాదు గాని కన్ అనుచో నకారము ద్రుతము. అట్లే తాన్ ద్రు.ప్ర. గాని 'తాను' కళయే యనఁదగునా? కాని శబ్దగత నకారము ద్రుత మనుటకే యవకాశము లే దనుట స్పష్టము. కాఁగాఁ దానునేనులు కళ లనుట యెట్లు?

తిక్కన ప్రయోగములందే కొన్నింట నితరస్థలములఁ దానునేనులపై సరళాదేశము గానవచ్చుచున్నది. వజ్ఝలవారే యిచ్చినప్రయోగ మొక్కటి చూతము. ఎక్కు డారయ నేను ప్రజాపతులందు (అశ్వ-2-182-1040వ్యా. సం.స.) పై తిక్కనప్రయోగములో నేనుశబ్దముపై సరళాదేశమె యున్నది గదా. ఇంక నిట వజ్ఝలవారిమామూలుపద్ధతిలో (నేన్+ఉన్?)నేను అనుదానిపై నున్ చేసి నువర్ణలోపము చేసి నేనున్ అని నిల్పవలె. ఇట్లు సమన్వయించినఁ బై పరుషములు సరళము లగుట సిద్ధించును గానీ యట్టి సరళాదేశమునకుఁ గారణ మైనయాద్రుత మే మగును? నేను ప్రజా-అనుచో నాదేశసరళమువకును నువర్ణమునకును మధ్యభాగమున ఖండానుస్వార మేని వజ్ఝలవారు చూపలేదే. సరళాదేశమునకు నిమిత్త మైనద్రుతము లోపింపరాదు గదా. విశేషపరకత్వ మున(361) ఇట్టిస్థితి యశ్రుతచర మని నారా.ను విమర్శించినవీ రిట్లు తిక్కన ప్రయోగములలో (నన్నయప్రయోగములందును) జూపుట వింతయే.

ఇంక నీయది యచ్చుపొరపా టనియు నేనుఁ బ్రజాపతులం దనురీతిగా ఖండానుస్వార ముండవలయు ననియుఁ జెప్పవలెనా? వివాదాస్పద మగునిట్టి తావులందే యచ్చుతప్పు లుండుట విశేషమే. చిం.వి.వ.లో నన్నయప్రయోగములందలిద్రుతనుస్వరూపమును సమన్వయించుసందర్భములం దిటుపరకత్వ మున నిట్టియచ్చుతప్పు లున్నవి. అ దేమో గాని యిట్లు సమన్వయించుసందర్భ ములం దెల్ల దాదాపు నియతముగనే యచ్చుత ప్పగుచున్నదే.

ఇయ్యది ప్రాసేతరస్థలమగుటచే నె ట్లున్నను నిబ్బంది లే దనియు నేమఁ బ్రజాపతుల నని యుండు ననియు నూహింపవలె. కానీ ప్రాసస్థలమునందు

నొకవేళఁ దానునేనులపై సరళాదేశ మున్నను దానిని వజ్ఝలవా రంగీకరింపరు.

ఏ లన నపుడు తానునేనులవిషయము పోయి ద్రుతము నస్వరూపము గా దనునిం కొకసిద్ధాంతముతో వైరుధ్య మేర్పడును గదా. కావున నట్టియెడలను 'మన్'తో సమన్వయము తప్పదు. (అర్థవిశేష మేదో యొకటి తప్పదు.) ఇందలిద్రుతమునకు బిందువు (అచ్చు పొరపాటువలనఁ గానీ) ఒకవేళ లేకుండ నితరస్థలములవలెఁ జూపఁగలము. ఒకవేళ మఱవక ఖండానుస్వారమును జూపినను నిబ్బంది లేదు. ఏల యనఁ దిక్కన ఖండాఖండప్రాసప్రయోగమును జేసినవాఁడే, కావున ఇవి యట్టివానిలో నొక టగు. కాఁగాఁ దిక్కనప్రయోగములందే యైనఁ బ్రాసఘటితస్థలము లున్నను (తానునేనులపై సరళాదేశము) నయ్యవి ద్రు.ప్ర. లని వజ్ఝలవా రంగీకరింపలేరు. అవ లింతకుఁ గానరాలేదు గాన నిబ్బందియే లేదు. ఇంక ఖండాఖండప్రాసమును బ్రయోగింపనిది నన్నయ యొక్కఁడే. (నన్నయయుఁ బ్రయోగించె నని యుప్పుకవి.) అతఁడు ప్రాసఘటితముగా సరళాదేశమునువలె గసడదవాదేశమును బ్రయోగించినవాఁడు కాదు. త్రిలోకపరాభవం బేను జేయ (ఆది.7-141) మొదలగుచోట్ల మన్‌శబ్దము చేరక తప్పదు. (లేకున్న ఏను సేయ ననునదే కవిప్రయుక్తపాఠ మయ్యెడునవకాశము నుండును.) ఇంతటి వైషమ్యములును సముచితములు గానిసమర్థనములును దెచ్చిపెట్టుకొనుటకంటె దానునేనులు ద్రు.ప్ర. లనియు (ద్రుతము 'ను'అనియు) నంగీకరింపఁదగుఁ గదా. ఇంతకును దానునేనులపై గసడదవాదేశము (చి.మతము నట్లుంచి) వజ్ఝలవారి కభిమతము (లేకున్న ఏను వినవ ననుపాఠము కవిప్రయుక్తముగా దనవలసివచ్చెడిది.) గావుననే తానునేనులు కళ లని సిద్ధాంతము చేసి రనుట సాహసము కాదు.

(హలంతప్రకరణమున) తిక్కన చేసినసత్యజి త్తనుతకారాంతములయగుణ వద్గుణరూపము ననుసరించి యది యంగీకరించిరా? మతముల అనునన్నయ ప్రయోగము ననుసరించి (సాంతేతరములకు)గణద్వయపాఠము నన్నయసమ్మ

తము గా దని వ్యాఖ్యానించిరే కద. అపిడప బా.ఉ.లో సొంతములకు నట్టిపా ఠము నంగీకరింపక ప్రత్యేకసమన్వయము నాశ్రయించిరి. (చూ.బా.సూ.)

తానునేనులపై సరళాదేశము బాల.ప్రభావమునఁ దరువాత నేర్పడిన దన్నఁ బోవునది కాదు గదా. తాను ప్రబోధించె నిత్యాదిస్థలములందు తాను ప్రబోధించె (తెనుఁగులపైని సాంస్కృతికపరుషములకును గసడదవాదేశము గలదు. అదియు భారతమున నిత్యముగా నని గదా వీరిసిద్ధాంతము.) ననురీతిగాఁ దాళపత్త్రప్రతులందు (గసడదవ)వాదేశమే యున్నదా? ఆదేశము నిత్య మనుటం జేసి (సరళములు లే వన్నను) తాను ప్రబోధించె నని యుండుటకును వీలు లేదే. బాల.ప్రభావ మంటిన నుండవచ్చును గాని యయ్యది యంతకుఁ బూర్వమునుండి యుండుట యెట్లు సంభవము? (మఱి యేను విడవ?) ఇంక నేఁడు ముద్రితప్రతులందు నన్నయభారతమునఁ దానునేనులపై సరళములు గన్పించుచోట్ల నెల్ల (జబ) గసడదవలుగా దిద్ది యదియే నన్నయప్రయుక్త మనుకొనవలసి యుండునేమో.

ఇతరస్థలములందు సరళాదేశ ముండుటంబట్టి తానునేనులు ద్రు.ప్ర.లని నిర్ణయించుపక్షమున ఏను విడవ నన్నుప్రయోగము సంగతి యేమి అన్నది పరిశీలింపవలె. ఇట నారా. ఇట్లు పేర్కొన్నది. అది సరి యగుపాఠము గాదు. 'ఏను వెనుక' నని పాఠాంతరము గల దందురు. కొన్నివ్రాఁతప్రతులలో ఏఁ దివియెదను విడవ అనుపాఠమును గలదు. భారతము లక్ష్మీపతిగారు తమ భారతములో నీపాఠమునే యంగీకరించిరి. అప్పకవి సంధిగతప్రాసమున కుదాహరణముగ నిచ్చుట ప్రామాదిక మనఁదగు. (48) వజ్ఝలవారు 'ఏన విడవ డిగి యెద' అనుముద్రణసంస్కర్తృసవరణము ప్రామాదికము. 'ఏను వెనుక డిగి యెద అనురీతిపాఠములు లేఖకపాఠకాదిసాహసప్రక్షిప్తము (వ్యా.సం.స.88) లనిరి. వజ్ఝలవారును నట నట కవిప్రయుక్తపాఠము లనుచు ముద్రితప్రతులకు నట నట తాళపత్త్రప్రతులకును భిన్నముగా నూహింతురు. కానీ యట్టి

చోట్ల నన్నయాధర్వణులహృదయమున కనుగుణముగా సూహించి నిర్ణయిం తురు గావున నట్టివానిని సాహసకృతములుగా మనము పేర్కొనరాదు.



తాళపత్త్రప్రతులలోనే ఏఁ దివియెద ననుపాఠమును నారా. చూపుచున్నది. ఇది కొందఱచే నాదరింపఁబడుటయు స్పష్టమే. కానీ నారా. "ఏను విదప" అని యప్పకవి చూపుట ప్రామాదిక మనుట యుచితమా? తాళపత్త్రములం దనే కము లైనపొరపాట్లు దొర్లవచ్చును. అందుచే నప్పకవికి దొరికినగ్రంథమున నాపాఠ మున్నప్పు డది గ్రహించుట ప్రామాదిక మని యెట్లు చెప్పఁగలము?

మఱి యప్పకవి తానునేనులపై గసడదవాదేశ మగు నని తలఁచెనా? అని యనుమానము. అత్మాన్మదోర్ద్వినా అనుచో ద్రుతప్రకృత లౌనేనుదా నను రెండు దక్కంగ –(5–6–189) అని నేనుదానులు ద్రు.ప్ర. లని చెప్పెను. అట్టి యెడల నేను శబ్దరూపాంతర మగు 'ఏను' కూడ ద్రు.ప్ర.యే గదా. దానిపైఁ బరుషములు సరళములు గాక గసడదవ లె ట్లగును?

వాత్మాన్మదోర్ద్విత్రిశస్య స్యాళ్లు క్కనుసూత్రమునొద్ద తాను నే ననుపలుకుల లోని ద్రుతము లడఁగుచో మీఁదఁ బరుషంబు లసురదమున సరళలిపు లగుఁ దద్ద్విత్వాక్షరము లర్ధబిందు లగుఁ దాఁ జనంగ నేఁ బిలిచితి నన. (5–185)అనుచో తాను జన ననురీతిగా నుదాహరింపకుంటయే కాక ఖండబిందు వగుటమాత్రమే చెప్పెను గావున (ఏను విదప నని చూపుటఁబట్టియు) వజ్ఝలవారివలె తానునేను లపై సరళములు గాక గసడదవ లగు నని యప్పకవియు భావించియుండెనా యని సందేహము కల్గవచ్చును. కాని నేనుదానులు ద్వి.ప్ర. లనుటయు నానువర్ణమును ద్రుత మని చెప్పుటంబట్టియు (మనుషా ద్రుతాప్రకృతికా త్తనుచో ద్రుతమునకు ఖండబిందువును జెప్పినతీరుంబట్టియు (5–140)అవికారగతే మున్నగుసూత్ర వివరణమున కనుగుణముగా తాను జనంగ నేను బిలిచితి నని యవుట యప్ప కవికి సమ్మతమే యని యూహింపవచ్చును.

ఇంక గసడదవాస్స్వీః అనుసూత్రవివరణమున 'మునిస్తుత ద్రుతప్రకృతులో నేనుదా ననురెండు దక్కంగ నవని( గలుగు ప్రథమావిభక్తులపైని వచ్చు గసడదవలు (5-170) అనుటంబట్టి నేనుదా ననురెండు తప్ప నితరములైన ప్రథమాంతములు తత్తుల్యశబ్దములమీఁదను గసడదవాదేశ మగును. ఇట( బొల్లనకారాంతములే గ్రహింపవలె నని యప్ప.చెప్పలేదు గదా. కాఁగా నేను తాను అనునువర్ణాంతములపై గసడదవాదేశము నప్ప. చిం. కనుగుణముగనే నిషేధించె నని గ్రహింపవచ్చును. కాఁగా దుష్ట్ర.ప్ర. లైనతానునేనులపైని ద్రుతనువర్ణముపై గసడదవాదేశము లే దని (సరళములే యగు నని) యప్ప. సిద్ధాంతము స్పష్టము. అట్టియెడల 'ఏను విదప' ననునెడల నేనుపై వాదేశము నెట్లు చూపెను? ఇట ఏన విదప అని యుండెనా? ముద్రితగ్రంథము లం దన్నింట నేను విదప ననియే యున్నది. తానునేనులపై గసడదవాదేశము చిం. కనుగుణమైనయప్ప.సిద్ధాంతమునకు విరుద్ధము. ఇంక నాపద్యమును తానునేనులపై నీయాదేశము నేల యప్ప. సూచించియుండలేదు. తిక్కనపద్య ముదాహరించినస్థల మిటకు దూరముగా నుండుటవలన నవధానత తొలఁగినదా? ఎట్లును నిర్ణయింపరాకున్నది. ఏను విదప అనునదే స్వీకరించుట యప్ప.సిద్ధాంతములకు విరుద్ధము. ఏన విదప అన గ్రహించుట ముద్రితప్రతులకు విరుద్ధము.

'ఏన విదప' అనుచో నవధారణార్థకముపై గసడదవాదేశమునుగూర్చి యంతగాఁ బట్టించుకొనవలసినయవసరము గానరాదు గాని యర్థమునందు నవధారణమునకుఁ బ్రయోజన మంతగాఁ గానరాకున్నది. భారతసంశోధిత ముద్రణ మీపాఠమునె ప్రధానముగఁ గైకొన్నది. ఏను వెనుక అన్నది కొన్నిప్రతులందును ఏఁదివిమొద నన్న దొకచోను పాఠాంతరముగ నున్నట్లు భారతసంశోధితముద్రణము పేర్కొనుచున్నది. ఇట్టియెడల నేను వెనుక అన్నది ప్రధానముగా గ్రహింపక యేన విదప ననుపాఠమునకుఁ బ్రాముఖ్య మిచ్చుటలో నదియె యధికప్రతులందున్న దేమో. ఇంకను ఏను వినుము,

ఏను విడవ ననియుఁ బాఠాంతరములు చూపినది. అప్పకవి చూచిన భారతప్రతిలో ఏను విడవ నని యుండవచ్చును. లేదా యేను విడవ నన్నద యైనను నట సంధిగతప్రాసలక్షణమునకుఁ దగిన లక్ష్యమే యగును. అయిన పెద్దలవారు చూచిన తాళపత్రప్రతులం దెల్ల ఏను విడవ ననియే యున్న దఁట. అయినను ఏను వెనుక అనునది లేఖకుల సాహసప్రక్షిప్తమని వారే యనిరి. కాఁగా నిటఁ దేలునంశ మొక్కటియు. తాను నేనులపై గసడదవలే యుండు ననుట కిది ప్రబల మైనయాధారము గా దనియే. పాఠాంతరములు పెక్కు లుండ నట్టివి వాదాస్పదస్థలములనుబట్టి సామాన్యలక్షణమునకు భిన్న మైనసిద్ధాంతము చేయు టెట్లు కుదురును ?

సూరి ఏను విడవ ననుదానింగూర్చి ప్రస్తావింపనే లేదు. అప్ప.లో నైన నది చూచియుండఁడా? ఆతఁడు చూచినయప్ప. ప్రతిలో ఏను అని లేదా? ఉన్న నుపేక్షించెనా! అంతట నవలు బహుళం బని కొంద ఱార్యులు (ఆం. శ. శా.) ము న్నగునీతిగా నితరలక్షణగ్రంథములలోఁ జెప్పినటులో నిట్టివి సాధింపఁబడుట యుద్దేశించెనా? బా.లో నైతే మీయాదేశము బహుళ మనెను. బహుళపదముచే నన్యకార్యముగా నేను అను ప్ర. ప్ర. పైఁ గూడ వాదేశ ముద్దేశించెనా? నిశ్చయింప నాధారము లేదు. ప్ర. ప్ర. లపై సరళాదేశము లేమి క్వాచిత్కముగఁ గానవు. (ఇట వాదేశ మింకను విశేష మన్నమాట.)

ఆహా. తాను నేనులపై గసడదవాదేశముమాత్రమే కాక పరుషము లక్లే యుంటయు లే దని ప్రయోగములనుండి నిశ్చయించెను. అయిన నిట నప్ప. చూపిన - ఏను విడవ ననుటిక్కన ప్రయోగమును భారతమందే గాక యప్ప. లోను జూడలే దనవలెనా?

చూచినను దిక్కనప్రయోగము చాలదు ప్రమాణీకరింపఁ డనవచ్చు. కాని సలోలోశ్చ యని యుత్వలోపము పాక్షికము గాన లోపము లేనిపక్షమున తాను చెప్పె నని యుండవలెఁ గాని యట్టిప్రయోగములు లేవు గదా. కాఁబట్టి సలోలోశ్చ యని యుల్లోపము చేయు నెట్లనుపూర్వపక్షమునకు సమాధానముగా నిత్యలోపమును వ్యవస్థ చేసెను. గసడదవాదేశము లేదనుపూర్వపక్షమును దిరస్కరించుట కీయప్పు. చూపినప్రయోగ ముపకరించి సలోలోశ్చ యని యుల్లోపము చేయుట యుచితమే యని తన సిద్ధాంతమును బలపఱచుకొనవచ్చును గదా. అహో. చూచినయప్పు.లో ఏన విదప నని యున్నదా? 'సంబోధనే చాపిహ్యవ్యయే' యని యవధారణార్థకావ్యయముపై గసడదవాదేశము నహో. సమ్మతించెను.

వజ్ఝలవారు పేర్కొన్నట్లుగా నన్నయ గసడదవాదేశమును నిత్యముగాఁ జేయువాఁ డైనపుడు నేనుదానులు కళ లై మీఁదిపరుషములకు గసడదవలె యగు నని తలఁచినపుడు ఏను కాంచాలపురంబున, తాను ప్రబోధించె నిత్యాదిస్థలములలో గసడదవ లేల చేయలేదు? చేసియున్నపక్షమున నట్టిగసడదవాదేశము లేదను నభిప్రాయము నహో. యేల యంగీకరించెను? అహో. నన్నయ భారతము నేని బరిశీలింపలేదా! నన్నయప్రయోగ మెల్లయెడలఁ బ్రబలమే యని గదా, అహో. యభిప్రాయము. కావునఁ బ్రాసాది ఘటితము గా దని వజ్ఝలవారివలె నుపేక్షించు ననుటకు వీలు లేదు.

తుదికి నన్నయాదుల ప. కో.లను బరిశీలించినను దాను నేనులపై సరళాదేశమే కానగును. తాను ప్రబోధించె ననురీతిని గొన్నియెడల మీఁదిపరుషము లక్లే యుండుట యేని గలదు గాని గసడదవ లగుట యెచ్చటను గానరాదు. వజ్ఝలవారిమతమున నన్న

సీయువి కళ లగుటచేత (ఈయువి ప్రథమాంతము లగుటచేత) గసడ

దవలు కావలసియుండుటచేతను నయ్యది భారతమున నిత్య మగుట చేతను గసడదవ లైయుండవలెఁ గాని పైని బరువము లట్లే యుండుట కవకాశము లేదు. అయ్యు వజ్ఝలవారు ఏను కినిసితి (శాం. 4-398-1091) నని యుద్ధరించుట వారిసిద్ధాంతమునకు విరుద్ధము. అచ్చుపొరపా టనుకొందమన్న నయ్యది. ముద్రితప్రతులందు తాను నేనుల పైని సరళములే కానవచ్చుచున్నవి. కాఁగాఁ బదప్రయోగకోశముల ననుసరించి చూచినను తాను నేనులపై గసడదవలే యగు ననువజ్ఝల వారిసిద్ధాంతము నంగీకరింపరాకున్నది. (మా. ద్రుత. 160)

'ఆత్మాస్మదోర్ద్వినా' యనుదానికి గసడదవాదేశనిషేధము మాత్రమే ప్రయోజనము గా దని గుర్తించినయూహ. ఆవస్యదానము చేతను ఇంకను నలోలోర్చ్వ యనుదానిచేతను నుత్వలోపము సాధించె ననఁగా వానికి ద్రు. ప్ర.త్వమును సాధించెను. పొల్లనకారము గాక ను(ని) వర్ణమును ద్రుతమే యని యూహ. యెట్లైనల భావించినపక్షమున నల్లోపప్రసంగము చేయకయే గసడదవాదేశనిషేధముచే ద్రు. ప్ర. త్వమును జ్ఞాపకము చేసి తాను నేనులపై సరళాదేశమును శేరొ్కనెకివాఁడే. ద్రుతము ను (ని,న్) స్వరూప మగుటను గుర్తించితిమి గానఁ దాను నేనులే ద్రు. ప్ర. లని యూహ. సమన్వయమార్గమును బట్టియు నిశ్చయింపవచ్చును.

కాని యూహ. ఆత్మాస్మదోర్ద్వినా యనుదానిచేత నుల్లోపమగు నన నేల? ద్రు. ప్ర.తకు. అది యేల? సరళాదేశమునకు. సరళాదేశము గల్గు నని యెట్లు చెప్పఁగలము? గసడదవలు రా వన్న సరళము లగు నని యర్థము చేయఁ దగునా! తాను చెప్పె నని యుండుట లేదు. తాఁ జెప్పె నని సరళమే యగుచున్నది. అట్టియెడల నాత్మాస్మదర్థకములు

ద్రు. ప్ర. లనియో (అట్లన్నను నహో. యుల్లోపము చేయక

మానఁడు గదా.) లేక యాత్మాస్మద్దర్శకములపై పరుషములు సరళము
లగు ననియో చెప్పుట సూటియైనమార్గము గదా. గసడదవాదేశ
నిషేధమునకును (సరళాదేశము మగుటకు) ద్రు. ప్ర. లగుటకును సంబం
ధము గానరాదు. తాను చెప్పె నని లేమిని గుర్తించువాఁడు గసడ
దవలు నిషేధించి యట్టివి సాధింప నేల? అహో. అన్నట్లు తాఁ
జెప్పె ననియే యుండఁగా నాత్మాస్మద్దర్శకములపై సరళాదేశము
నున్న దానిం గదా చెప్పవలె.

పైఁగా నహో. యుల్లోపము 'నాత్మాస్మదోర్వినా' యను
దానిచే మాత్రమే చేయలేదు. ఇక్కడ నలోలోశ్చ యనుదానిచేతఁ
గూడ నగు ననె. పిదప నలోలోశ్చ యనుదానిచేతనే వ్యవస్థితవిభా
షతో నుల్లోపము నిత్యముగనే చేసెను. అనఁగా గసడదవాదేశనిషే
ధమునకును నీయుల్లోపమునకును సంబంధము లేదు. (గసడదవాదేశ
నిషేధమువలన సరళాదేశప్రమితకార్యములు జ్ఞాపితము లయి తత్సిద్ధికై
ద్రుతత్వమునకై నకారముపొల్లకై యుల్లోప మగు నని చెప్పరా
దన్నమాట.) అహో. కూడ (వఝ్ఝలవారివలె?) స్వరలోప మైనఁ
బొల్లనకారాంతము లగుపదము లెల్ల ద్రు. ప్ర. లే యని తలఁచె.
కావుననే 'అపిశబ్ధార్థస్యైతః' అనుచో నిల్లోపమువలన రామునే
సీతనేఁ గొల్తు నగు ననెను. అట్లే యుల్లోపముచేఁ దాన్నెన్ల ద్రు. ప్ర. లు
గాఁగా వానిపై గసడదవ లెట్లగును? ప్రాప్తింపని గసడదవలను నిషే
ధింప నేల? సీతనేఁ గొల్తు అని యెట్లయినదో యట్లే తాఁ జదివె నని
యవు. అట్టియెడ వీనిపై గసడదవాదేశనిషేధ మేల చేసెను. అనఁగా
గసడదవాదేశనిషేధముతో సంబంధము లేకయే తాను చెప్పె నని
యుండదు గానఁ బరుషపరకతలో నుల్లోపము నిత్యముగ నయి ద్రు:

ప్ర. యగు నను సహా. మతము ననుసరించియే వీని ద్రు. ప్ర.త్వము
'ఆత్మాస్మదోర్ద్వినా' యనుదానిచేఁ గాని 'వాత్మాస్మదోర్ద్రుతస్య' యను
దానిచేతఁ గాని జ్ఞాపితము చేయఁబడునది గా దనియుఁ గవిఁ పండి
తుఁడను అనుచో నెట్లు నినులు ద్రుతములుగాను దదంతములు ద్రు.
ప్ర.లుగాను గ్రహించుచుంటిమో యట్లే తాను నేనుల నువర్ణము
ద్రుత మనియు నయ్యవి ద్రు. ప్ర. లనియు గ్రహింపఁదగును.



'వినా ద్వితీయం స్యా దస్మ దాత్మనోస్స్వ_ద్వయో రపి'
యనుచో వి.వి. 'స్వ_ద్వయో రపి' యనుట కళ లైనప్పటికి ననుటకుఁ
బర్యాయముగఁ గూడఁ గానఁగవచ్చు. ద్రు. ప్ర. గాకయు ద్రు. ప్ర.
వలెఁ గార్యము లందు నని వి. వి. ఉద్దేశించుటయే తాను నేను
ద్రుతప్రకృతికతుల్యంబు లనుసభ్రాయమునకు మూల మేమో యని
పించును. కాని చిం. 'వాత్మాస్మదోర్ద్రుతస్య' యనుచో నువర్ణమును
ద్రుతముగా వ్యవహరించియున్నది. ఎల్లయెడల నకారము ద్రుత మని
భావించిన యప్పటికి విన్న ఇత్యాదులు (ద్రుత మున్నను!) ద్రు.
ప్ర.లు గా వని చెప్పినట్లే చిం. కూడఁ దాను నేనుల నువర్ణము ద్రుత
మయ్యును నయ్యవి ద్రు. ప్ర. లు గానేర వని యెంచినదా? పై రీతిని
దలఁచిన యప్పు. మాత్రము తాను నేనులు ద్రు.ప్ర. లనియే పేర్కొ-
నెను. ఇంకను నీనువర్ణము ద్రుత మని చిం.యే చెప్పుచుండఁగాఁ
దుదిని ద్రుత ముండఁగాఁ దాను నేనులు స్వాంతము లైనను యేషాం
ద్రుతో న స్యాత్తనుదానిచేఁ గళ లే యనుటకుఁ గునురదు. కాఁగాఁ
జివర ద్రుతముగా గుర్తించిన నాశబ్ద మెట్టి దైనను నన్వ్య యను
సూత్రముచే ద్రు. ప్ర. గాక తప్పదు. ఇట్లు వాత్మాస్మదోర్ద్రుతస్య
యనుచున్న చిం. తానునేనులు ద్రు. ప్ర. లే యని తెల్పుచున్నది.
అయిన యెడల 'ఆత్మాస్మదోర్ద్వినా'యని గసడదవాదేశనిషేధ మేల నో
పైని గమనించితిమి.

కవిని బందితుండను అనువానయ్యవి ద్రు. ప్ర. లే. వానిపైఁ బరుషములకు గసడదవలను నిషేధించెనా? అయ్యవి ప్రథమేతరాంతములు గావు గదా. దానిపై నవసరము గాని గసడదవలనిషేధము దానునేనులపై నేల? యని సందేహము. కవిని బందితుండను అనువానినులు ప్రథమపైఁ జేరినవి గాఁగా నిటఁ దానునేనులనువర్ణము సుస్థానమున నైన దగుట వీనియందుఁ గొంతవిశేషముగా గుర్తింపవచ్చును. కవివి గదా భక్తుఁడవు సుమీ యనురీతిగా నట్టివానిపై గసడదవలు సమ్మతింపవలయును. కానఁ గవిని బందితుండను అన్నవి ప్రథమాంతములే యవును. దానునేనులనువర్ణముమాత్రము సుస్థానమున నాదేశముగా వచ్చుటచేత సందేహము గల్గకుండ నాదేశము నివారించియుండెను. (పైనను 'నాత్మాస్మదోర్వినా' యనుటవలన స్పష్టత తప్ప నెట్టి ప్రయోజనవిశేషము నేపక్షమునను గానరాదనవచ్చును.)

దానునేనులపై గసడదవలగు ననుటకు చిం. వి.పి. లలో నెట్టియాధారమును లేదు. అహో. వీనిపై గసడదవలును లే వని స్పష్టము చేసెను. ఇంకను నేను వివధ నప్రయోగమే పాఠాంతరాధిక్యముచేఁ బ్రబల మనరాకుండఁగా నద్దాని నాధారముగఁ జేసికొని యీయవి కళ లనియు వీనిపై గసడదవలె యుండు ననియు భాషాసామాన్యమును నియమింపఁజూచుట సక్రమము గానేరదు. ఏనువతించు ననురీతినొండు రెండుస్థలము లెట్లును బ్రత్యేకములుగా గుర్తింపఁదగును. దానునేను లుత్వవిశిష్టములే ద్రు. ప్ర. లని సారాంశము.

దానునేనులు కళ లనునభిప్రాయమును ఖండించుచు (శ్రీ) చర్ల గణపతిశాస్త్రిగా రివి ద్రు. ప్ర. లే యని సిద్ధాంతించిరి. కాని వారి యభిప్రాయమునఁ గొంత వైరుధ్యము గోచరించుచున్నది; ఇవి

ద్రు. ప్ర. లనుటకు వారు "దానును బయిఁ బూసికొనుట (విరా. 1-125) అనుపద్యములోఁ దానును అని ద్రుతప్రకృతికముగా వాడఁబడినది. ఇట సముచ్చయము కాదు. పాదపూరణ మని త్రోసివేయుట యుక్తముగా (139-140 నారా.) ననురీతిగా వివరించిరి. తాను నేనులు ద్రు. ప్ర. లే కాని యటఁ బ్రథమైకవచన మగునువర్ణముపై నిం కొకనువర్ణము చేరవలె. ప్రథమైకవచన మగునువర్ణము ద్రుతము గాక ద్రు. ప్ర. యగుటచే దానిపై ద్రుతము, నువర్ణము చేరు నన్న మాట. రామునిచేతను ఇత్యాదులందువలె నన్యే ద్రుతప్రకృతయ యను సూత్రముచేతనే యీప్రథమాంతము పయిని గూడ ద్రుతము చేరు ననఁదగునా? ఏ మైనను నీ ద్రు. ప్రల స్వరూపము తానను నేనును అనురీతిగా రెం డేసి నువర్ణములతో నుండవలె ననుట విచార్యము.

వీ రింతకు ముం దప్పవచనముల నుద్ధరించి యస్మదాత్మార్థకముల ప్రథమైకవచనాంతరూపాలు ద్రు. ప్ర. లే యనిరి. నే మనును, నేను మనుదు నను నప్పవచనములును నేఁ జదివి ప్రోడనైతిని, నేను జెప్పి (నారా. 139) అను కృష్ణభూపాలీయవచనములు ము న్నగువానింబట్టి తాను నేను అనునవే ద్రు. ప్ర. లని నిర్ణయింపవలసియున్నది. ఇంకను ప్రౌఢ. ప్రత్యయాత్మక మైనను వర్ణము ద్రుత మనుటకు నేను అనునది చూపుటను వీరును గుర్తించిరి. సూరి యభిప్రాయము నట్లు యగుట స్పష్టము. వాని ననుసరించి దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్సుజసో॰ మూ వురూ చ స్తః అనుసూత్రముచే సుస్థానమున నయి ప్రత్యయ మయినను వర్ణమే ద్రుత మగుచున్నది. ప్రత్యయ మగునీనువర్ణము ద్రుతము కాఁగాఁ దదంతములు ద్రు.ప్ర. లగు. అట్టివచనము లాధారముగా నాత్మాస్మదర్థకములను ద్రు.ప్ర.లని

నిర్ణయించునపుడు తానునేనులే ద్రు. ప్ర. లనవలెను గాని తానును నేనును అని రెండునువర్ణములను జూపుట యెట్లు? తానునేనులే ద్రు. ప్ర.లయినపుడు వాని ద్రు.ప్ర.త్వమునకై యే జ్ఞప్తిని నింకొక ద్రుతను చేర్పరాదు.

లాక్షణికులు తానునేనులే ద్రు.ప్ర. లని (ప్రథమైకవచన) నువర్ణమే ద్రుత మని చెప్పినప్పటికిని కవులు వీనిని తానును అనియే ప్రయోగించి రని చెప్ప నెంచిరా? నేనును వచ్చితి ననుకీత్తిస్థలములందుఁ టీకాకర్తలు నేనును - నేను అని మాత్రమే. యర్థము చేసి యుందురు గాక; (నా రా. 140) యట్టి స్థలములందు సముచ్చయాద్యర్థవిశేషములు లేకున్నఁ బాదపూరణమునకు దేని నుశబ్దము చేరిన దని చెప్పఁదగును గదా. పాదపూరణమం దయినదియుఁ గా దనియుఁ (అయ్యది చాద్యర్థక నుశబ్దమే కా దని యభిప్రాయము) జెప్పిరో నా ద్రుత మెట్లు చేరినది? స్వాంత మగుటచేఁ గళ గాం కావలసియున్న నెట నే దీని ద్రు. ప్ర. త్వము జ్ఞాపితము గాఁగా నస్యే యని ప్రథమాంతము లయినప్పటికిని వీనిపై ద్రుతము చేరు నని చెప్పవచ్చును. కాని దానివలన నిర్బంధము లే కాని ప్రయోజన మేమియుఁ గానరాదు. తానును నేనును అనునవే యీ ద్రు.ప్ర.ల యసలుస్వరూప మైనప్పు డంతకు ముందు పైన ప్రస్తావించిన లాక్షణికులవచనములు వీ రుద్దేశించిన ప్రయోజనమును సాధించునవి గా వని గుర్తింపవలసియున్నది.

'ఆత్మాన్మద్భ్యోర్ద్వినా'యను దానిచేతనే వీని ద్రు.ప్ర.త్వము జ్ఞాపితమై యస్యే యని ద్రుతము చేరి తానును నేనును అని యగు ననుకొందము. అప్పుడు ద్రుతమున కగుబిందువాదికార్యములు తానును నేనును అనుచోట్ల నున్న రెండవనువర్ణమునకే కావలసియున్నది. అట్టి

యప్పుడు 'వినా ద్వితీయం స్యాద్వస్వదాత్మనోః' అని వి. వి. చేయు చున్న సంశ్లేషనిషేధ మాత్రముతమునకే' యనఁగా రెండవనువర్ణము నకే యని గుర్తింపవలెను. కాని వీని ప్ర.ప్ర.త్వమునకయి వీరు చూపిన నేనుక్ వినియెదఁ గా కని-అనుకవిప్రయోగమునం దున్నది సంశ్లేషమే కద. నేను వ్వింటి నిత్యాను లసాధువులే యనవలెనా ?



ఇంకను నీపక్షమున నే మనుదు, తాఁ జదివె నిత్యాదులు సాధ్యములు గావు. నేనును+మనుదు తానును జదివె అనుచోట నేను మనుదు ననునది లోప ముయినరూపమును దానుఁ జదివె నన్నది ఖండబిందు వైనరూపము నగుచున్నది. నే మనుదుఁ, దాఁ జదివె నని యున్న ట్లు! దీనిస్వరూపము రెండునువర్ణములు కల్గిన దైన ప్పుడు తాను + చదివె ననురీతిగా నుండుట కవకాశమే లేదు. వ్యాఖ్యా నాను చేయుదమున్ కొలిచితినిన్ అనునుత్తమపురుషైకవచనాంతము లలో ననుసరించినపద్ధతినే యుక్కడ తానును తాను అనుసాధించుట కనుసరింపవలసియుండును. ప్రథమైకవచనమువర్ణము నెప్పు డైన ప్రమత ముగా నంగీకరించుపక్షమున నువర్ణకాంతమే ప్ర.ప్ర. యవుచుండఁగా ప్ర. ప్ర.త్వమును జ్ఞాపితము చేసికొనుటయుఁ ప్రథమైకవచనముపై మరితమును జేర్చుటయు ననవసరము లే గాక యసంగతములు నని స్పష్టపడుచున్నది. ప్రథమైకవచననువర్ణమునకు మరితత్వాను సంగీ కరింపనిపక్షమున చేయుదమున్ చేయుదును అని యెట్లు తానును తాను అని చేసికొనవలెను దాఁ జదివె ననురీతిరూపములు సిద్ధింపవు గదా. నువర్ణకము నిత్యముగనే విధింపఁబడినది గావుఁ ప్రథమైకవచనమే లోపించి (తానును) అనుదానిలో ప్రమతి నుగు చివరినువర్ణమే మిగులు నని యూహించుట కవకాశము లేదు.

(26)

ఇంకను ప్రథమైకవచనసువర్ణము ద్రుతమే యన్నను ప్రయోజనము లేదు. అవసానద్రుతలోపము చేసి ముందటినకారము నకు నాయాద్రుతకార్యములు చేయుటలోఁ గలయిబ్బందు లట నట గ్రహించియేయున్నాము. కావున కొలిచితిన్ + అబ్ధిజ ననుకృతిగా నఝ్ఝలవారు నిల్పుటయే యసంగతము. కాన నిటను నాపద్ధతిలో తాను + చదివె నని యుండుట యసంభవమే యగుచున్నది. కాఁగా నీద్రు.ప్ర.లు తానును నేనును అనుకృతిస్వరూపము గల వని భావించు పక్షమునఁ దాఁ జదివె ననుకృతిరూపములు లక్షణానుగుణములు గానేర వని నిశ్చయింపక తప్పదు. ఇట్టినియమము కవిప్రయోగములకు విరుద్ధ మనుటయు నిశ్చయమే.

నేఁ జదివితిఁ దా విని ననుకృతిరూపములకయి ప్రథమైకవచన మైన యీనువర్ణమును ద్రుతముగా నంగీకరింపక తప్పదు. అట్టి కవి ప్రయోగముల ననుసరించియే లాక్షణికులు తానునేనుల విషయమును ప్రత్యేకముగాఁ బ్రస్తావించియుండి రని గ్రహింపవచ్చును. కావునఁ ద్రు.ప్ర.తకై తానునేనులపై నొకద్రుతము చేరుప్రసక్తి లేదు.

వీరు సైతము ఉత్వము లోపించిన - నేన్, తాన్ అనునవే ద్రు. ప్ర. లు (నేను తాను అని యున్నఁ గళలే యగును) అను నభిప్రాయమును దిరస్కరించుచు ద్రుతమునకు నుస్వరూపము నంగీకరించి యుండుటంజేసి నేనుదానులలో నువర్ణమే ద్రుత మని తమసిద్ధాంత మింతకుముందు స్పష్టము చేసియున్నారు.

నేను, తాను అన్నని ద్రు. ప్ర. లని యంగీకరించుచు, లాక్షణికు లిట్లు పేర్కొని యుదాహరించుటను బ్రస్తావించుచు వీని స్వరూపమున్ను దానును నేనును అనుకృతిగాఁ జెన్నుట విరుద్ధము గదా. అ ట్లెంచనిచో దానును అనుచో నువర్ణము సముచ్చయార్థక, విశేష

ములందు (పాదపూరణము) వచ్చునశబ్దముగా మాత్రమే చెప్పవలసి

యుండ నట్టిది నుశబ్దము గా దని తే, మఱి యీ నువర్ణము ద్రు.ప్ర. అవ
యవను యనవలెం గదా. అది సరి కా దని తాను నేను అన్న వే
ఈ ద్రు.ప్ర ల సాధారణస్వరూపము లనియు నిశ్చయింపఁదగును.

ఇంకఁ గవిప్రయోగములందుఁ దానును బూసికొను నేనును నచ్చితి నిత్యాదిస్థలములలోఁ బ్రథమైకవచనముమీఁద నున్న నువర్ణములన నవి ద్రు. ప్ర. లగుట లేదు. ఇక నానువర్ణ మవ్యయ మైన నుశబ్దమే యని గుర్తింపవలసియున్నది. అవసరానుగుణముగా నర్థ విశేషమునందుఁ గాని పాదపూరణమందుఁ గాని యయిన దని గుర్తింపఁదగును.

కావునఁ దాను నేను అన్న వే ద్రు. ప్ర. లనుట కవిప్రయోగానుగుణమును లాక్షణికమతానుగుణము నై యున్న దని నిశ్చయింప వచ్చును.



# ఏని గళ యగునా ?



'ఏని' శబ్దము కళయా లేక ద్రుతప్రకృతికమా ? ఇత్యాది ద్రు.ప్ర.లలో సూరిచేఁ బరిగణింపఁబడలేదు. అయినను వలయుచో వల్లె ప్రభృతులలోఁ జేర్చి ద్రు.ప్ర.త్వమును సాధించుకొనునవకాశము గలదు. కళలను బేర్కొన్న చిం. దీనిని కళగా స్పష్టము చేయలేదు. అయినను గళయే యని గ్రహింపవలయుచో 'ఆద్యా నభిదధతి కళా' యనుచోటియావ్యాఖ్యముచేఁ గళగా గ్రహింపఁదగియున్నది. 'నిబంధనేషు ప్రాచాం చేచ్ఛబ్దోఽన్యః పరిదృశ్యతే' అను సహోబలుని వివరణముచేఁ తద్వ్యాఖ్యాత 'ఏని' అనునది కళగా గ్రహింపఁదగు నని పేర్కొనెను. కాని యది యుక్తము గా దని స్పష్టము.

ఇంతకు నీయని ద్రుతప్రకృతికమా ? కళయా ?

సూరి ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదను సూత్రమునొద్ద ద్రు. ప్ర. లైన యిఁకాదులను ఇఁక ఇఁగ – ఎట్టకేలకు 'ఎట్టకేని' అని చూపెను. సూరి యిఁకాదుల వేనికిని జివర ద్రుతమును జూపలేదు. 'ఎట్టకేని' అనుచోటి యేని ద్రుతాంత మని భావించెనో లేదో యెట్లు నిర్ణయింపవలె ? ఇట వజ్ఝలవారు ఇఁక ఇఁక ఎట్టకు (ఏలకు) అనునవి ఇఁకాదులుగా భావించిరి. ఎట్టకు నను దానికి ఏలకు ఏని అను రెండుశబ్దములుమాత్రమే పరముగా నుండుటయు నప్పుడు సంధి వైకల్పికముగా నగుటయు ననుసరించి స్పష్టతకై ఎట్టకేని అనునది చూపఁబడిన దని యభిప్రాయము. కాని ఎట్టకేలకు అనుచో నేలకు అనునదియు ద్రుతాంతమే. అట్లే యిట 'ఏని' ద్రుతాంతము గావచ్చును. అస లిందలి నివర్ణమే ద్రుత మని యంగీకరించు పక్షమున 'ఏని' ద్రు.ప్ర.గా దనుట కం దెట్టియాధారము నుండదు. ఏని అనునదే ద్రు.ప్ర. యైనను నది యిఁకాదులలోఁ జేరదు. ఏన్ +

అగు ఏ నగు ననియే యగు. ద్రుతపూర్వక మగు నేకారమునకు సంధి యిష్టము గాదు గావున నేని ఇఁకారములోని దని చెప్పరాదు. స్పష్టతకయి యెట్టకేలకు ననుదానితో పా టెట్టకేని నన్నదియుఁ జూపె ననుట యంగీకార్యమే.

కాని బా.వి. ఇఁకాదిసూత్రవివరణములో 'ఎట్టకేనిన్' అని యెట్టకేనిశబ్దమును ద్రుతాంతముగాఁ జూపెను. ఏని ద్రు. ప్ర. యే కాని యంతలినివర్ణము ద్రుతము గాదు. ద్రుతమైననివర్ణము వేఱొకట దానిపై నున్న దన్నమాట. దీనిస్వరూప మేనిని అని యభిప్రాయము. 'ఎట్టకేనిన్' అనుచోటియికారమునకు నిఁకారాదిత్వముచేతనే సంధి యవు నని బా. వి. భావము. అందులకే ఎట్టకేనిన్ + ఏఁగెను ఎట్టకే నేఁగెను ఎట్టకేని నేఁగెను అని లక్ష్యము లిచ్చినది. ఇట్టి యెడల నేనిలో నిత్తునకు సంధి రావలయు నన్న ఎట్టకున్ అన్నది దానికిఁ బూర్వమం దుండవలెనా ? కాని బా. వి. ఏని నేమ్యాదు లలోఁ జేర్చకని యేమ్యాదిసూత్రమునొద్ద దేని నేనిన్ + ఇమ్ము దేని నే నిమ్మని చూపినది. తుల్యత్వం బే నగు నని సూరి ప్రయోగించెను. కాఁగా నట్టకుశబ్దము పూర్వమున లేకున్నను ఏనిశబ్దేకారమునకు సంధి రావలసియే యున్నది. కావున దీని నేమ్యాదులలోఁ బఠించుట యుచితమే. కాని యట్టిచో నిఁకాదిసూత్రమునొద్ద నేనిశబ్దేకారమునకు సంధిని జూపుట సంగతము గా దని నిర్ణయింపఁ దగును. ఇయ్యది బా. వి. నిర్వహణములోని ప్రమాదమే యున్నను దీన నొకయభిప్రాయ మిట గుర్తింపవలసియున్నది. ఏని అన్నది ద్రు. ప్ర. యని దానిస్వరూపము ఏనిన్ (ఏనిని) అని.

ఇట ఏని అన్నది కళయా? లేక ద్రు. ప్ర. యా యన్నదానితో పాటు ద్రు. ప్ర.త్వపక్షమున ఏని అనియు యుండునా?

లేక దానిసహజరూప మేనిని అని రెండువర్ణములు గలిగియుండుటా యని యాలోచింపవలసియున్నది.



ఇది కళ యనుటకుఁ శ. ర. చూపిన యొక్కేయొకయాధారము 'నేనియును' అనురూపము. ప్రౌఢవ్యాకరణమునం దీతఁడు నుశబ్దమును విధించుచో (శబ్ద. 116) కళ లగునవ్యయములమీఁద నగు ననియు కళ లైనయునుదంతశబ్దములమీఁద యువర్ణపూర్వకము విభాష నగు ననియుఁ జెప్పెను. 'పని' అనునది ద్రు.ప్ర. యన్న నీయవ్యయముపై నుశబ్దము రా దన్నమాట. (యువర్ణపూర్వక మగుటయుఁ గళలకే యనియుఁ జెప్పుటచే పని ద్రు. ప్ర. యన్న దానికీకార్యము రా వీలు లేదు) 'పనియును' అని కాదు. అట్లు కావలయు నన్న 'పని' కళ కావలయును. కాబట్టి పనియును అనురూపముంబట్టి యది కళయే యని బ.సీ. శ. ర.లోనే నిర్ణయించుకొన్నట్లు గ్రహింపవలసియున్నది. ఈ యభిప్రాయమును వజ్ఝలవారు నంగీకరించిరి. (వ్యా. సం. స. 101)

కాని పని ద్రు. ప్ర. మైనమాత్రాన 'నేనియును'అని యగుటలో నిబ్బంది యేమి? కళలకే యనురీతి నియమింపకున్న పనియును అని యవును. నుశబ్దము ద్రు. ప్ర.లకు రా దని వజ్ఝలవారు నెంచియుండలేదు. నాకున్ + ఉన్ 'నాకునున్' అనురీతిగా ద్రు.ప్ర.లపై 'ఉన్' శబ్దమును జేర్చుటవలన వీరు చిం., వి.వి.లవలెను (ద్రుతము) నుస్వరూపమును సాధింప యత్నింపఁగలిగి రనుట స్పష్టము.

ప్రౌఢవ్యాకర్త మైనను కళలకే యనునియమము నవ్యయములఁ జేసెనే కాని నామసర్వనామములయెడఁ జేయలేదు. కాన నట ద్రు.ప్ర.లపై సైతము నుశబ్ద మగును. ఇంకఁ బ్రౌఢ. ద్రుతము నుస్వరూపము గలిగినదిగా భావించియుండుటంబట్టి నువర్ణమే యగును.

నాచేతను అనునీతిగా ద్రు. ప్ర. లపై నుశబ్ద మగుటను జూపియే  యున్నాఁడు.

ద్రు. ప్ర. లనుదంతము లగుట ద్వితీయాసప్తమ్యేకవచనములకుఁ గొన్నియెడలను భూతార్థకక్రియాపదములందును సంభవించును. క్రియలపైఁ బ్రౌఢ. నుశబ్దమును జెప్పలేదు. కాని చెప్పవలసియుండుటంజేసి ప్రాప్తించు ననుమార్గముననే యాలోచింతము. వ్యాఖ్యలవారు తిఙంతములపైని గల దనియే చెప్పిరి. (వినఁడును గానఁడు స్మృతియు మొ॥) రామునిని, రామునికిని (వచ్చితిని) అనువానిపైని రాకుండుట 'కళ' లగునదంతశబ్దములమీఁద (శబ్ద. 116) ననుటలోఁ బ్రయోజనము గావలెను. కాని యిట యవర్ణపూర్వకత్వము గదా చెప్పఁబడినది. నుశబ్దము కళలైననామసర్వనామములకే యగు ననలేదు. కాఁగాఁ గళలు గాని యీయనుదంతములపై యవర్ణపూర్వకత లేకుండుఁగాక. 'నాచేతను' అనుచో నైనట్లుగా నుశబ్ద మగుటలోఁ బ్రౌఢ.లో నిబ్బంది లేదు గదా. రామునిని రామునికిని 'ను' అని యయి ఇకారంబుమీఁది - యనుసూత్రముచే నువర్ణమునిత్త్వమున కిత్త్వము రాఁగా రామునినిని - రామునికినిని (వచ్చితినిని) అని కావలదా?

కాని యిటఁ బ్రౌఢవ్యాకర్త యదంతము లగు ద్రు. ప్ర. లపై నుశబ్ద మొసఁగుటకు 'నాచేతను' అనునీతిగా నుదాహరించెను. తృ (ద్వి) తీయాదులకు నుగాగమము రాఁగా నాచేతను అని యగును. దీనిపైని నుశబ్దము చేరఁగా 'తనచేతనును' అనునీతిగా నువర్ణములు రెండుండవలసియుండఁగా నొక్కటే చూపెనే. ఇయ్యవి నుశబ్దాంతము లగుటకు లక్ష్యములుగాఁ జూపఁబడుటంజేసి 'తనచేతను' అనుచోటి నువర్ణము సముచ్చయార్థకమగు నుశబ్దమే యందము. అయిన దానికిముందు తృతీయకైన నుగాగమ మే మైనది? లోపించు నని

సూత్రమునఁ జెప్పఁబడలేదు. అయిన నుదాహరణసామర్థ్యము ననుసరించి ద్రు. ప్ర. లకు సర్గవిశేషమున నుశబ్ద మగునప్పుడు ముందటి ద్రుతమునకు (అనఁగా ద్రు.ప్ర.ల చివర నుండు ద్రుతమునకు) లోపము గల్గు నని యూహింపవలెను. అట్లు నియమించుకొనఁగాఁ బైని రామునిని+ను రామునికిని+ను (వచ్చితిని+ను) అనుచో నుశబ్దపరకతలోఁ దుదిద్రుతము లోపించి రామునిని, రామునికిని, (వచ్చితిని) అనియే యగును. కావున రామునినిని అనుకృతియగురూపములు ప్రసక్తి లేదన వచ్చును. ఇట్టియెడల నాసూత్రమున యువర్ణపూర్వకత యనుదంతములగుకళలమీఁద ననుట సార్థక మగును. లేకున్న రామునియును రామునికియును (వచ్చితియును) అనుకృతిగా నరూపము లేర్పడవలసివచ్చుఁ గదా. కాఁగాఁ దానును నేనును అనుకృతిగా ద్రు. ప్ర. లపై నుశబ్ద మగుట యిష్టమే. కాని యనుదంతములమీఁద యువర్ణపూర్వక మగుట ద్రు. ప్ర. లపై ననిష్టము. కాఁగా రామునిని మున్నగునిదంతము లగు ద్రు.ప్ర.లపైని నెచ్చటను నుశబ్దము యువర్ణపూర్వక మగుట లేదు గావున నొక్క యేనిశబ్దముపై సూత్రమే యువర్ణపూర్వక మగు నని చెప్పుట యేల? యని శ. ర. కర్త భావించి యుండవచ్చు. ఇంకను రామునిని, నాచేతను అనుకృతిగా నుశబ్దపరకత్వమున ద్రు.ప్ర. తుదిద్రుతము లోపించుచుండఁగా నేనికిఁ సూత్రము లోపింప వలదనుటయు భేదమే. ఇది యాతఁడు స్పష్టముగా సూత్రమునఁ జెప్పకున్న లక్ష్యసామర్థ్యమునుబట్టి యట్టి యూహ యాతని కుండవచ్చును. (ఏని - అనియుండునని భావించుచో ద్రుతలోపమువలనకు కుదురును)

కాఁగా 'ఏని' ద్రు. ప్ర. కా దనియుఁ గళయే యనియుఁ ప్రౌఢవ్యాకర్త భావించియుండును. వజ్ఝలవారు నన్నయాథర్వణుల

ఇట్లని దీనిని కళగా నిర్ణయించిన సిం. కౌ. కర్తో భేదము గల్గుచున్నది. ఏమేఁ గర్మము, ఎందే డెందము, అంపితేఁ జాలును ఇత్యాదిగా 'నేని'లోని నకారమునకు ద్రుతకార్యములు నియతముగా నే కానవచ్చును. ఎంతే కృప అనున మపేక్ష్యము గా నున్న నట నేత్వమర్థవిశేషమునం దైన దని సమన్వయించుట కవకాశము లేకపోలేదు.

ఇంక నీరీతిప్రయోగముల ననుసరించియే శ. ర. కర్త దీని ద్రు.ప్ర.త్వమునుగూర్చి శంకించె ననవచ్చును. 'ఏనియును' అనురూపమునుబట్టి యిది ద్రు.ప్ర.గా దని చెప్పనేమియవసర మేమి? పోని శబ్దమునెడల దాని ద్రు.ప్ర.త్వమునుగూర్చి ప్రస్తావించెనా? కాఁగా ఏని శబ్దమునెడల ద్రు.ప్ర. యగు ననుటకు నవకాశము కలదు. ఏమేఁ గర్మము మున్నగురీతిప్రయోగములనుబట్టి. అందుకే యని ద్రు. ప్ర. యను నభిప్రాయమున కవకాశ ముండ ఏనియును అను శబ్దము దాని ద్రుతప్రకృతికత్వమునకు బాధకముగా నుండుటచేతనే ఏని అనునది ద్రు.ప్ర.గా దనె నన్నమాట. కాఁగా నేనిశబ్దమునెడల ద్రు. ప్ర. ప్రస్తావన మేర్పడిన దనఁగా నిందు ద్రు.ప్ర.లక్షణము లున్న వన్న మాట. అవి యే యేమేఁ గర్మ మనురీతిస్థము లని గుర్తింపవచ్చును.

'ఏనియును' అనుదానింబట్టి యేనిశబ్దము కళయే యని నిర్ణయించిన వీరు ఏమేఁ గర్మ మనురీతిరూపము లెట్లు సాధింతు రన్నది ప్రశ్నము.

శ. ర. కర్త 'ఏనియున్' అనుదానిలో యువర్ణము లోపించి 'యేనిన్' అనియు నివర్ణము లోపించి 'ఏన్' అనియు నగు ననెను. ఏమేఁ గర్మ మనువానిఁ బిందుస్థానిక మగునది ఏనిశబ్దములోని నివర్ణము గా దనియు నియులు లోపింపఁగా మిగిలినను శబ్ద మనియుఁ దాత్పర్యము. వజ్ఝలవారి రీతియభిప్రాయ మసహజ మనియు (ఏనియున్

నుశబ్దము యణ్వర్ణపూర్వకమై వచ్చినచో నపుడు 'పనియున్' అని యుండును. ఇట్టియెడల నివర్ణము లోపించిన 'పయున్' అని కావలెను. పనియు ననునర్థమున పయు ననురూప మున్నదా? అట్టియెడల నుశబ్దము యణ్వర్ణముపూర్వకము కాకుండ నొంటరిగ వచ్చినపుడే నివర్ణము లోపించు నన్నమాట. పనిన్ అనుకృతిరూపము సంగీకృతమే యవుటం జేసి లోపము వికల్ప మన్నమాట. అనఁగా నుశబ్దము యణ్వర్ణపూర్వకము గాకవచ్చినపుడు మాత్రమే మొదలోనినివర్ణము వికల్పముగా లోపించు నన్నమాట. ఇట్లొకసూత్రము చెప్పకపోవునా? (అట్లు ప్రత్యేకించి సూత్రింపవలసినసందర్భ మెట్లును వచ్చునపుడు కళ లగు అవ్యయంబులకు అనుచో కళలగు అనువిశేషణము తొలఁగించుటయు పని (ము.ప్ర.)పై యణ్వర్ణపూర్వకముగ నగుటయుఁ జెప్పిన నేని 'కళ' యని భావింపవలసిన యవసరమే యుండదు గదా. ఎట్లును పనిశబ్దము విశిష్టమే. ఆవిశేషము నట్లు సంగ్రహించిన నేమి? ము.ప్ర. యనఁ దగియుంటంజేసియే కదా శ. ర. కర్త పనియును రూపము బాధక మన్నది. పనియు ననురూపము ము.ప్ర. పక్షమున సాధించుకొనఁ గల్గినచో ము.ప్ర. నయ్యది యనుట నిర్బాధ మనియే గదా శ. ర. తాత్పర్యముగా సిద్ధించుచున్నది.)

అట్లే సూత్రించును గాక. నుశబ్ద మిట యణ్వర్ణపూర్వకము గాకయు రాఁగా నాపక్షమున ని లోపించినది. ఇట శబ్ద ముత్వవిశిష్ట మగునకారము గదా. 'పనియున్' అనుకృతిగా శ. ర. కర్త దీనిని బొల్లుగాఁ జూపుట స్పష్టతకే యనుకొనవలె. ఏ మైనను 'ను' శబ్దములో పని+ను నిలోప మైన పను+కర్మము పఁ గర్మము. పక్షమున స్వత్వము కాఁగా నేను గర్మ మని యగునా? ప+ను అనుచో నువర్ణకము నుత్వమున కిత్వము రాదు. ఇకారంబు మీఁదఁ గదా చెప్పఁబడి

ఇంకను నన్నయప్రయోగములందు స్వరలోపానంతరమ
యైనను 'ఏని'లో నకారము ద్రుత మనుటకుఁ దగిన సాధారములు
గానరావు. ఏమేఁ గర్మ మనురీతి ప్రయోగములు తిక్కనాదులకావ్య
ములనుండి గానవచ్చుచున్నవి. నన్నయప్రయోగములం దొక్కచో
నాలుగేన్ పాఁడికుఱ్ఱు లని యున్నది. వజ్ఝలవారిచ్చట నాలుగే
న్బాఁడికుఱ్ఱు లనురీతిగా సరళాదేశమును జూపిరి. పరుష మట్లే యుండు
టయుఁ బెక్కుచోట్లఁ బ్రవర్తించిరి. ముద్రితప్రతులందు నాలుగేన్
పాఁడి యని పరుషమే కానవచ్చుచున్నది. (ఆపిళ్ళ. 137) నన్నయ
పదప్రయోగకోశము నాలుగేన్ పాఁడి అనుపాఠమునే చూపినది. కాని
యచ్చోటి 'ఏన్'అనునది ఏను(ఐను)అనునదిగాఁ జూపినది. వజ్ఝలవా
రేని అనియు గావచ్చు నని భావించిరి. 'నాలుగేన్' పాఁడికుఱ్ఱుల నీఁడె
అనుచో నాలు గైదు అనురీతి కూర్పు తెలుఁగు నుడికారమున కను
గుణమే. ధన మోపఁ డేనియు దీనమూర్తికి నాలు గేన్ పాఁడి
కుఱ్ఱుల నీఁడె అనుచో నాలుగు పాఁడికుఱ్ఱుల నైన నీయఁడా యని
యెంచుటయు సందర్భానుగుణ మైయుండును. అట్టియెడల స్వరలోపా
నంతరము 'ఏన్' శబ్దమునపై సరళము గానరామి నకారమును ద్రుత
మననగునా ! ఇటఁ దె.వ్యా.వి. ఏన్ (అయిదు) పాదాంతమున నుండు
టచే నిట సంహితావిరహితముగా భావించి సరళాదేశము చేయక యే
చూపఁబడె (462) నను నభిప్రాయము నంగీకరించుచున్నది. ఇట్టిస్థితి
భారతమునం దీయొక్కచోటనే యని చెప్పకొనవలసియుండు. అయి
నను వజ్ఝలవారి సిద్ధాంతము ననుసరించి సంహితాభావము పాదాంత
మున వాక్యాంత మయినపుడే పొసఁగును. ఇట నట్లు గామింజేసి
వారు నాలు గే న్బాఁడి యని సరళాదేశమును జూపియుండురు. వారే
పరుష మట్లు చూపుట స్పష్టము. ఈ ప్రయోగమునుగూర్చి స్థలాంతర

మున స్పష్టము. మొత్తముపై నీప్రయోగము ఏకే ద్రు.ప్ర. యని నిర్ణ
యింప సాధారముగా నిల్వఁజాల దనవచ్చును. కావున నపిశబ్దార్థస్యైత
యనుదాని నహో. వఙ్ఝలవారును జూపినప్రయోజనమును నిశ్చ
యింప వీలు లేదు.

కాఁగా నపిశబ్దార్థస్యైత యనుసూత్రము సైతము సర్వపరక
కస్థలములం బ్రసక్తమే యనఁదగును. బా.వ. ప్రభృతు లెల్లరు
పక్షాంతరమున నేనిపై యప్రశక్తని జూపిరి. ఏది ద్రు.ప్ర. యన్న
దానిపై యప్రశక్తి యపూర్వ మనఁతప్పదు. వై. చం. రామునికి
యిచ్చె ననురీతివానిని సైతము ప్రస్తావించినది. (15 పుట) ఏనిపై
యప్రసక్తి యట్టిదియును గాదు. ఇట నిత్యసమాసమునందే యప్రశక్తి
యైనది గదా.

పద ప్రయోగకాలమున లేనిశబ్దముపై యడాగమమును బహు
పము (సంశాదేశాభావమును) లక్ష్యే యుండుటయుఁ జూపుచున్నచోట్ల
సైతము పెక్కెడల ముద్రితప్రతులలో నేనిశబ్దముపై నకారమును
(స్వరపరకతయుండు) విరుపమునకు సరళము లవుటయుఁ గానవచ్చు
చున్నది. కాని యట్టియెడ నేనిచిహ్నమునకును నాదేశసరళమునకును
నడుమ నఱసున్నయో నెఱసున్నయో కన్పించుచున్నది. కాఁగా
నచ్చోటిశబ్ద మేనిన్ అనునదే కాని యేని కా దనవలసియున్నది. అట్లే
స్వరపరకతలోఁ గానఁగు నకారము కూడ నేనిన్ శబ్దసంబంధియే కాని
ద్రుతంబుబుమీఁది నకారముగాఁ జెప్పరా దనవలె. ఇంక నేనిశబ్ద
ముపైని యడాగమము గాని గసడదవలు గాకున్నను బహుపము లక్ష్యే
యుండుట గాని ప్రాసఘటితము లై ప్రబలాధారము లనఁదగినవి కాన
రాకున్నవి. కళయో ద్రు.ప్ర.యో యనువివాదము గల్గినస్థల మగు
టచే (శ. ర. ననుసరించియు నీవివాదమున కాధార మూహింప

వచ్చును) నిట్టియెడఁ బ్రాసఘటితప్రయోగమే నిర్ణాయక మగు ప్రబలాధారముగా నెంచుట యుచితమే కదా. కాఁగా నివి ద్రు ప్ర.యా? అయిన ఏనిని అని యుండునా? లేక ఏని అనియా? ఏని అనునది కళయా యనునంశమున ముద్రితగ్రంథముల ననుసరించి స్పష్ట మైన నిర్ణయమున కవకాశము చాలమన్న దనియే చెప్పవలెను.

ఏనిన్ అన్నది శబ్ద మన్న నపిశబ్దార్థస్వత యున్నది ద్రుతపరకస్వరమునకు సంధిని జెప్పుచు 'అనాదిషు, చోర్వా' యనువానివలె విశేషస్థలమే యనవచ్చును. (నిజమునకుఁ గిమస్థివలె దీనిని గూడఁ గిమాదులలోఁ జేర్పనవు.) కాని యిప్పటిమునను దీనిపై యాక్షేపతి కవకాశము లేదు. ఏనిన్ + అగు ఏ నగు ఏని నగు నని యవు.

వారిని యడిగె, ఉండెడిని యుతఁ దనుకీతిరూపములను వారించుటయు నిం కొకప్రయోజనముగా సూరి స్వరపరకత్వమున ద్రుతస్వరమునకు లోపము చేసెను. అంటిని నిందట కనుకీతిని ద్రుతముపై నకారము గన్పించు కొన్నిస్థలములందుఁ దప్ప స్వరపరకతలో ద్రుతస్వరము లోపించుట దాదాపు నియతమే యైయున్నది. ఏని అనునదియే ద్రు. ప్ర. యైనయెడలను నిర్ణము ద్రుతము, కాఁగా స్వరపరకత్వమున సంధలిస్వరమునకు లోప మై ఏని - ఏన్ + అగు ఏ నగు నని యవు. ఏని నగు ననుచో ద్రుతముపై నకారమైన దనవచ్చు. కాఁగా ఏని అన్నదే ద్రు.ప్ర. యనుచోఁ అపిశబ్దార్థస్వత యన్నది వ్యర్థమే యగును. ఏనిన్ అన్నది యన్ననది కొం తేని గుదురును. ఏ మైనను నేనిపై యాక్షేపతిని జూపిన బా. స. ప్రభృతులమతములో ఏని కళయే యని నిర్ణయింపవలయును. వారివివరణము నట్లుంచి చూచిన నేనిన్ అన్నది శబ్ద మన్న సంధి

ద్యైన నే నగు ననియు లేనిపక్షమున నేని నగు ననియుఁ బ్రయో గానుగుణముగ సిద్ధించును. ఏనిశబ్దమునందు నివర్ణము నిల్చియున్నపుడు స్వరపరకత్వముచే దానికిఁ బైని నకారమునకే ముద్రితగ్రంథములం దె క్కుడఁగా వచ్చుచున్నది గదా. ఇట్లే యేనినివర్ణమునకును నాదేశ సరళములకును నడుమ ఖండబిందువు గానఁబడుటయు నేనిన్ శబ్దముచే సమన్వితమగును. ఇట్టియెడల నేనే నేఁ సర్వ మిత్యాదు లెట్లు? ఎన్నెన్ ఎన్ అనుకృతిగా ఏనిన్ ఏన్ అని యువ్వని యూహించు కొని యిట్టివి సాధించుకొనవచ్చును. యువర్ణపూర్వకముగాక నుశబ్దము చేరునప్పుడుమాత్రమే నివర్ణలోపము గాకుండ జెప్పకొనకుండుట యొక్కటి యిందు విశేషము. కాని ప్ర. ప్ర. యగు దీనిపై యువర్ణ పూర్వకముగా నుశబ్దము గుట తప్పదు.

అయినఁ సూరి దీని నేసూత్రములలోఁ బఠింపకుండుట యేలనో యాలోచింపవలసియున్నది. చిం. చెప్పిన కిమాదులును పదాదులను గలిపి యేమ్యాదులుగాఁ జెప్పి యేమ్యాదులలోఁ బదాదులఁ జూపిన సూరి బా. న. ప్రభృతుల ననుసరించి యేని గళ యనియే తలఁచినను నేమ్యాదులలో నేల చూపలేదు? ఆకృతిగణమనుటఁ జేసికొన వీలున్నమాట నిజమే. కాని చిం. ప్రస్తావించిన యేని నాతఁడు స్పష్టముగాఁ బదాదులవలె నేలఁ జెప్పఁడాయెను? అట్లు చెప్పిన మూఁడుసూత్రములయభిప్రాయ మొకలక్షణమున సంగ్ర హింపఁబడి యింకను విశేషముగా నుండెడిది గదా. ఏనియుత్వంబున కని సూరి తనయితరవ్యాకరణములం [illegible] ప్రస్తావించియే యుండెను.

ఒకవేళ నిటుఁ జిం. ఏనిన్ అన్నదే యుకారాంతముగా నుద్దే శించిన దన్నను నది సూరి యంగీకరించియున్న సిద్ధాంత నేమ్యాదులలోఁ

జేర్చకతప్పదు.  ఇది ద్రు.ప్ర. యందు సంధి గదా. సూరి యిఁకా దులకుఁ దప్ప ద్రు.ప్ర.లకు సంధి లే దని నిర్ణయించెను. అట్టియెడ నేనిన్ + అగు ఏ నగు యనునీతిసంధి యసాధు వగును. ద్వితీయైకవచ నాంతతుల్యత్వం బే నగు ననుచో సూరి యిట్టిసంధిని బ్రయోగించియే యుండెను. ఇఁకాదులలో ఎట్టకేని అని చూపుటచే ఏనిశబ్ద మింకా దులలోని దనియు నందుచే సంధి వికల్పముగా వచ్చు ననియుఁ జెప్పుట కుదురదు. అట్టి యభిప్రాయ మున్నచో నేనిశబ్దమును వేఱుగాఁ జూపు టయే యుక్తము. ఎట్టకుశబ్దముపైఁ జేర్చిచూప నేల? సూరి కట్టి యభిప్రాయ మున్న నేని నిఁకాదులలోఁ గాక యేమ్యాదులలోనే చేర్చెడివాఁ డనవచ్చు. కిమన్ని నిఁకాదులలోఁ గాక యేమ్యాదులలో నెట్లు చేర్చెను? ఇత్త్వసంధిని కథించుస్థలమునఁ గిమస్తిలోపా దేనియు గ్రహింపఁబడుట సక్రమము. ఇఁక ఇఁగ అనుచో నత్తున కనుసూత్ర ముచే సంధి వికల్ప మయ్యెను నట వీనిని బ్రస్తావించుట కేమ్యాదివలెఁ గుదురదని గ్రహింపవచ్చును. కాఁగా సూరి యప్యర్థక నేనిన్ అను నదిగా భావించియున్న యెడల నద్దాని నేమ్యాదులలోఁ గిమస్తిలోఁ జూపెడివాఁడే యని నిర్ణయింపవచ్చు. అట్లు చూపకుండుటంబట్టి శబ్ద మేనిన్ అన్నది కాదు. కళ యైనను ద్రు.ప్ర యైనను నప్యర్థక మేని అన్నదే యని మాత్రము సూరిమతమును నిశ్చయింపవచ్చును.

ఇంక ఏని కళయె యైనను నేమ్యాదులలోఁ జూపకుంట విశేషము. కిమాదులలోని దనఁదగినపుడుశబ్దమును జూపుటకంటెఁ గూడ నేనిశబ్దమును జూపుటలోఁ జిం. యభిప్రాయమును సంగ్రహిం చుటలోఁ బ్రయోజన మధికము గదా. ఏమ్యాదివివరణములో సూరి చిం. యభిప్రాయమును గ్రహింపఁబూనుట స్పష్టమే. తదాదుల నెల్లఁ జూపినసూరి యేని అన్న దొక్కటి యధిక మగు నని యుపేక్షించె

నన రాదు గదా. కాఁగా నేసని ప్రత్యేకాభిప్రాయముతోనే సూరి

యిటుఁ బరిహరించియుండవలె.

అది యేని అనునదే ద్రు.ప్ర. యని యెంచుట న్యాయముండ వలె. ఏని ద్రు. ప్ర. మైనచో డంపలినివర్ణము ద్రుతము. స్వరపరకత్వమున సూరి ద్రుతస్వరలోపము చేసి చూపుట స్పష్టమే. కావున నింపును ద్రుతస్వరము స్వరపరకత్వమున లోపించును గదా. (ఏని - ఏన్ + అగు) ఏనగు నని యగు కావున సిద్ధిరూపములకై దీని నేమ్యాములలోఁ బరికింపవలసినయవసరము లేదు. కావున సూరి చూపలే దని గుర్తింపవచ్చును. ఎట్టకేని అనుచో సింహాదులయందు ద్రుత మైనవర్ణమును జూపుట స్పష్టత కేదగును. ఇఁక ఇఁగ ఎట్ట కేలకు అనుచోఁ బూర్వస్థలమున ద్రుతము చూపలేదు గదా. ఇట నట్లే ఎట్టకే అని చూపిన నస్పష్టముగా నుండు నని స్పష్టతకై యెట్ట కేని అని యిట నిద్రుతమును జూపుట విరుద్ధము గానేరదు గదా. సూరి బా.ల.లో నేనిశబ్దముపై నెచ్చటను యడాగమము చేయక యే నగు ననుకీతి సంధ్యభావరూపమును ద్రు. ప్ర. సాధారణముగాఁ బ్రయోగించుట గానవచ్చు. ఈతనినీతిచంద్రికయందు నైతమేని శబ్దముపై యడాగమము గానరాదు. ఏని ... వ్యనుకీతిగా (అంటేని నింపటకు) ఏనిపైని నుడి ... ద్రుతమే కానవచ్చుచున్నది. ఇంకను నంపితేఁ జాలు ననుకీతిగా నేమేఁ గనుక్రమమువిధము లైన ప్రయోగము లధికముగాఁ గానవచ్చును. అన్నాటింట నెల్ల సముచ్చయార్థకనుశబ్దమునే సూరి ప్రయోగించె ననుట సముచితమా? కాన నీతిచంద్రికప్రయోగముల ననుసరించి చూపినను మీరు ఏని ద్రు.ప్ర.గా నెంచె నని లోఁపకమానదు.

అయిన ఎక్కడేఁ జనుము అంపితేఁ జాలు ననుకీతిస్థలము లనుబట్టి ఏని ద్రు.ప్ర. యని సూరియభిప్రాయము నెన్నరా దనియు

మనఁ బోల్లనకారము ద్రుతమని భావించినవారు గావున వజ్ఝలవారి మతము ననుసరించి ఏనిపైఁ (యద్రుతియురు!) బరుషములు సరళములు గాక గసడదవ లగుటయో లేక పరుషము లట్లే యుండుటయో చెప్పవలె. కాని సూత్రమతమున స్వత్వసహితమే కదా, ద్రుతము. స్వత్వము విషయమున సూత్రమతమున భేదము గల్గును. ఏని - కళ, ఏన్ ద్రు.ప్ర. యనురీతిగా నొకశబ్ద మేకదేశమాత్రవికృతిచేఁ గళయు ద్రు ప్ర.యు నగు నసుట యసహజముగా నున్నది గదా.

అప్వ్యార్థకము ద్రు ప్ర. మని యంగీకరించుపక్షమున దీనిపై యడాగమము గాని పరుషములు సరళములు గాకుండుట గాని కుదురదు.

పదప్రయోగకోశముచు వేర్వేఱుముద్రితప్రతులందుఁ గాన వచ్చు దానికిని భేదము మిక్కిలిగాఁ బొడఁగట్టుచున్నది. ఏనిపై స్వరమునకు యడాగమమును బరుషము లట్లే యుండుటయు ఏనివర్ణముపై ద్రుతము నాదేశసరళములకు ముం దేనివర్ణముపై ఖండానుస్వారముండుటయుఁ బదప్రయోగకోశములో చూపినట్లుగనె భారతసంశోధితముద్రణమునఁ గానవచ్చుచున్నది. భిన్నస్థలము లత్యల్పములు. తె.ప.కో., (శాం. 5-337) ఏని నట్టి అని చూపు సం. ము. ఏని యట్టి యనిమాత్రమే చూపె. ఏని సాధయ-అని కోశము చూపుచుండ సం. ము. యడాగమముతోడిది పాఠాంతరముగాఁ జూపినది. సం. ము. ఏని ద్రుతాంతముగా గ్రహింపఁబడుట కొన్నిప్రమాణములను గళగాఁ గొన్నిప్రతులు గ్రహించుటయు నట నటఁ బ్రస్తావించినది. I 392, 415, V-45, మొ॥ ఒకచో ఏని నట్టి అని చూపుచునే యిది ద్రుతాంత మగుట కాకరము లే దన్నది. (V 330) తాళపత్రప్రతు లలో ఏనిశబ్దము కళగా కన్పించుచున్నది (IV. 607) యన్నది. కాని

తాళపత్త్ర ప్రతులలో ద్రు.ప్ర.లపై యడాగమాది కళాలక్షణము లుండుట ప్రచురమే. కాన దానింబట్టి నిర్ణయించుట కుదురదు. ఇంతకు నేనిని కళగాఁ జూపిన పెక్కెడల వావిళ్ళ. ప్రతి ద్రుతాంతముగనే చూపుట గమనార్హము.

తి. ప. కో. (సూ.ని.) ఏని యన్యాయంబు (అను 4-136) ఏని యోకమలమిత్ర (వి. 2-108) అని యడాగమము చూపఁగా ఆం. భా. ని. 'ఏని నన్యాయంబు ఏని నో' అని పైని ద్రుతము చూపినది. వావిళ్ళ. ప్రతియం దిది యిట్లు యున్నది. ఆం. భా. ని. ఏని కళగాఁ గూడఁ గొన్న ముద్రితప్రతులం గానవచ్చుచున్న (1459) దనుటంబట్టి దీనిని బ్రధానముగ ద్రు.ప్ర.గనె యెంచిన దని గుర్తింపవచ్చును. ఇది కళ యనుటకు ఆం.భా.ని. ఏట యేని పోయెడన్ (ద్రో. 2-288) అన్నది చూపినది [అంతకుముందు ఏనియింటికి (వి.2-1 3) అన్నది చూపినది కాని యటఁ గళాత్వప్రసంగము చేయ లేదు.] తి.ప కో.లోను వావిళ్ళ. ప్రతిలోను నిటఁ బరుష మట్లు యున్నది. కాని యానందముద్రణ ప్రతిలో ఏట యేనిఁ బోయెడన్ అని యాదేశసరళము గానవచ్చుచున్నది. ఏనియింటి కనుచో నానంద ముద్రణమునను నట్లు యున్నది. తి.ప.కో. ఏని చాల (వి. 1-47) అని చూప ఆం.భా.ని. ఏనిఁ జాల నని ద్రు.ప్ర.గాఁ జూపినది. వావిళ్ళ. ప్రతియం దిట్లె యున్నది. శ్రీనాథాదిప్రయోగకోశములయెడను నిట్టి వైవిధ్యము గోచరించును.

ఇట నిన్ని భేదములు గల్గుట (కివి ప్రాసగతములు గాకుండుట కారణముగా గుర్తింపవచ్చును. ప్రాసేతరస్థలములనుబట్టి తాళపత్త్ర ప్రతు లాధారముగాఁ గళయో ద్రు.ప్ర.యో నిర్ణయించుట కుదురదు గదా. ఏని ద్రు.ప్ర.త్వ మిందుచే నిర్ణయింపరామి వివాదాస్పద మగు

యత్లేయుండునో గసడదవ లగునో సరళము లగునో నిర్ణయించుట యింకెట్లు? అట్లే ఏనినివర్ణము వళిస్థానమున నుండ దానిపై స్వరము గల్గుతావులు ప్రాసఘటితము లై యున్నవి. కాని యట యడాగమము లేదు. ఏ-నినిభంబు (ఆను. 1-218) ఎందే - నినోకని (శాం.5-328) (ఏ-నిని శ. 1-58) అనుకీతిగా నకార మగుటయే కానవచ్చు.

కాఁగా లభ్యము లగుచున్నప్రాసస్థలములందలి ప్రయోగములనుబట్టి చూచిన నేనిశబ్దము కళ యనుట కవకాశము లే దనియే నిశ్చయింపఁదగియున్నది గదా.

శ. ర. కర్త యేని గళ యనుటకు నట్టికళాత్వనిరూపకప్రాస ఘటితప్రయోగము చూపకుంటంజేసి యట్టివి యాతనికిని లభ్యము గా లే దని గుర్తింపవచ్చును. అందుకే యాతఁడేని గళ యనుటకు నేనియును అనుదానినే యాధారముగాఁ జెప్పుట గమనార్హము. అనఁగా నేనిపై యడాగమము లేదా పరుషము లట్ల యుండుట (లేదా గసడదవ లగుట) యనునంశములు ప్రస్తావింపలేదు. అట్టి ప్రయోగము లున్న నవియే దీనికళాత్వమును నిరూపింపఁజాలును గదా. అట్లు వివరింపకుండుటయే కాక యట్టిప్రయోగములను జూప లేదు. (సూ. ని. చూపినప్రయోగములు సైతము ప్రబలములు గావు.) కాఁగా యడాగమము సరళములు గాకుండుట యనువానిని శ. ర. కర్తయే ప్రస్తావింపకుండుటంజేసి యట్టిస్థితు లెటనేఁ బ్రయోగములుఁ గాననైనను నవి నిర్ణాయకములు గామి నుపేక్ష్యము లనియే శ. ర. ననుసరించి గుర్తింపఁదగియున్నది.

ఏనియును అనురూపమునుబట్టి యేని గళయే యని శ. ర. పేర్కొనుటలో దీని ద్రు.ప్ర.త్వ మనుమానింపఁదగిన దగుట స్పష్టము. ఒకవేళ నిది ద్రు.ప్ర. మైన నైనిన్ అని యుండవలె నని శ.ర. శంకించె

కన వీలు లేదు. ఇంక ఏనియున్ ఏనిన్ ఏన్ అనురీతిగా ఏన్ అన్నది యేర్పడుటను వివరించుటనుబట్టి చూడఁగా ఏనిశబ్దమే కళా లేక ద్రు. ప్ర.మూ యని యెన్నిన ట్లూహింపవచ్చును.



ఇంక నేని గళ యనుటకు (శ. ర. ననుసరించియు) నొకే నొకయాధారము ఏనియును అన్నరూపమే. ఇది ద్రు.ప్ర. యన్న నీరూప మగుచో ద్రు.ప్ర. యనఁదగు ననియో శ. ర.నుబట్టి నిర్ణయింప వచ్చును.

ద్రు.ప్ర.లపై నుశబ్దము నంగీకరించిన ప్రౌఢ. నన్నను తనచేతను అనురీతిగా నుదాహరించుట గమనించితిమి. నన్నను అను ద్వితీయాంతమునుండి యుదాహరించుట ద్రు.ప్ర.లపై నెల్ల నుశబ్దము చేయుట సూచించుటయో. నన్నను అనుచో నువర్ణ మాగమాత్మక ద్రుతమున నుదాహరణముగా నకారం బసాధారణంబు ద్రుతం బనుచోఁ జూపెను. అటనే యవ్యయాత్మక మగు నదానికి అన్నయును అన్నదియుఁ జూపె. మఱి నన్నను అన్న చోట నుశబ్దాంత మె ట్లయి నది? నన్నను అనునాగమాత్మకద్రుతముపై నుశబ్దము చేరఁగా నన్ననును అని యగావలెను గదా. నన్నను అనియె చూపి యది నుశబ్ద మైనస్థలముగాఁ జెప్పుటచే నింకలిచివరినువర్ణ మవ్యయ మగు నుశబ్దమే యగును. మఱి యంతమునందలి యాగమనువర్ణ మే మైనది? లోపించిన దని యూహింపవలె. లోపమును ప్రౌఢవ్యాకర్త లక్షణ మున విధించియుండ లేదు. విధింపవలసినదే. నన్నను అనియే చూపె నేమి? నన్ననున్ అనియుండదా? ఉన్న నట మఱల ద్రుతంబు మీఁద నకార మయినట్లుగా అదియునన్నాకేత్యాదులవలె గుర్తింప వలెనా? నన్నేలిన దేవయానికి నరేశ్వర భర్తవు గావున నాకునుం బోలఁగ భర్త వీవ (ఆది 3-171) యనుచో నెట్లు? ఇట సముచ్చ

యర్థము స్పష్టమే. నాకును అను ద్రుతప్రకృతిపై నుశబ్దము చేరఁగా నాకును + ను అనియుండ నాగమద్రుతము లోపించి నాకును అని కాఁగా మఱల ద్రుతముపై నకారము చేరి (అదియు నున్నాక) నాకునుం బోలెఁగ నని యవ్యోగ నని సమన్వయించుట యుచితమా? నుశబ్దపర కత్వమున ద్రు.ప్ర.ల ద్రుతము నిత్యముగా లోపించు నందురు. నన్ననున్ అనుకృతిగాఁ గూడఁ జూపఁదగును. ఇట నాకునును అను కృతిస్వత్వరూప ముండదు. బిందువులు లేనట్టి సంశ్లేషము నిత్య మని నియమించుకొనఁదగును. ద్రుతంబుమీఁది ద్రుతంబునకు స్వత్వంబు లే దని నియమించుకొనుట పెక్కుచోట్లఁ బ్రయోజనమును సాధించు. కాఁగా నుశబ్దపరకత్వమున ద్రు.ప్ర.ల ద్రుతము వికల్పముగ (తెలుగు గనో) లోపించు ననవలె. అవిశేష మెట్లును జెప్పవలసినదే కదా. దానితో నేని ద్రుత మేమాత్రము లోపించ దని చెప్పవచ్చునే కదా. నేను తాను అనుచోఁ బ్రత్యయాత్మక మను ద్రుతముగా నీతఁడు స్పష్టము చేసెను. ఇట నేనును దానును అని నుశబ్దమునకు ముందటి ద్రుత మసలు లోపించదు గదా. అట్లే యిటఁ గూడ. నాకునుం బోలెఁగ ననుకృతిస్థలములమాత్రమే ద్రు.ప్ర.పై నుశబ్దము చేరు నని చెప్పుచో నుశబ్దపరకతలో ద్రు.ప్ర.ల ద్రుతము లోపించు నని చెప్ప నవసరమే లేదు.

అయిన నేని అవ్యయము కదా, అవ్యయములమీఁదఁ గళ లకే కదా యవు ననెను. (శబ్ద 116) ఏని ద్రు.ప్ర. మైన నసలు నుశబ్ద మగు టెట్లు? వండింపనుం గాన స్నేర్చి (శాం. 1-181) చంప నుం జెఱుప వేచుట (శాం. 8-20) అనుకృతి ప్రయోగములంబట్టి ద్రు.ప్ర. లగునవ్యయములపైఁ గూడ నుశబ్దమును జెప్పవలసినదే యని స్పష్టము. (చూ.త్రి.శ్రే.)

ఇంక నేనిశబ్దము విషయమున మాత్రమే కానగు విశేష మొక్కటే. అది యువర్ణపూర్వక మగుట. యువర్ణపూర్వక మగుట కళ లగుననుదంతశబ్దములపై నని ప్రౌఢ. చెప్పుచున్నది. రామునికిని+ను-రామునికిన్నియును అనుకృతిరూపము లుండవు గావున కళ లగునను దంతములపైనే యనుట యవసరమే. ఏని అన్నది యనుదంతమ ద్యైనను ప్రౌ.ప్ర.వ్యా. ప్రౌ.ప్ర.లలో సిద్ధానిపై మాత్రమే యువర్ణ పూర్వకముగా నుశబ్దము చేరుట విశేషము. ఆ యొక్కటి విశేషముగా వివరించియున్న నేనియును అనురూపమగుటలో నవరోధము లేదు. నుశబ్దమును విధించు ప్రౌఢ. లక్షణము సమగ్రముగా లక్ష్యసాధక ము గాకుండఁగా (మా.త్రి.శే) దానింబట్టి యేనియును అనురూప మసాధ్యమని యుండ ప్రౌ.ప్ర. గావని చెప్పఁదగునా?

కావున నేసని ప్రౌ.ప్ర. గా ప్రయోగానుసారముగా గుర్తించి దానిపై నుశబ్దము యువర్ణపూర్వకముగా విభాషగా వచ్చుటను విశేషముగా గుర్తింపక సూచితము గాని యట్టి యొకరూపమును మాత్ర మాధారముగాఁ జేసికొని యిది కళ యని నిర్ణయించు టుచితమా? ఏనియున్ అను దానినుండి ఏన్ సాధించిన ప్రక్రియకంటెఁ బైకేల నేసిపై మాత్ర మిచ్చిన మగు ప్రౌ.ప్ర.పై నుశ బ్దము యువర్ణపూర్వకముగా విభాషగా వచ్చునను టుచితమే యని నిశ్చయింపవగును.

కాఁగా నేని గ్రాహ్య మని నిశ్చయించుటకుఁ బ్రబల మైన ప్రమాణమే లేదని గుర్తింపవచ్చును. అసికర్తార్థస్యేతి యనుచో బా.స. ప్రభృతులమతము ననుసరించి యేని కళ యని గాని లేదా ఏనిన్ శబ్ద మనిగాని తలఁచిననే యావిధి కొంతవఱ కేని సరిపడును. దీనికళాత్వమును

నిర్ణయించుసందర్భమున శ. ర దీని నుద్దేశించినట్లు గానరాదు. ఏలన్ అన్నదే యప్యర్థక మనుట సరి కాదని సూరిలక్షణము ననుసరించి నిర్ణయింపవచ్చును. చిం.లోఁ గొంతభిన్నమైనమార్గము సూరి యనుసరించె ననవలసియుండును. అట్లని సూరియుఁ గళ యని యెంచె నంత మన్నను నేమ్యాయములలో దీనిఁ బఠింప లేదే.

కాఁగా నప్యర్థకము ఏని అనునదే కాని దానిసహజరూప మేనిన్ అని కాదని మొట్టమొదట నిర్ణయింపవచ్చును. ఏని అనునది కళ గాదనియు ద్రు.ప్ర.యే యనియుఁ బిదప గుర్తింప వచ్చును. దీనిని నన్నెప్రభృతులలోఁ జేర్చుకొనఁదగును. సూరి యట్లు నుదాహరింపకున్నను నట్లు గ్రాహ్యము.

ఇంకఁ జివరకు సారాంశముగా నొక్కయంశము. ప్రాసఘటితమై యేనినివర్ణముపై యడాగమము గన్పించినచోటులఁ బై విచారణ మెల్లఁ గుదురక యది కళయే యని చెప్పఁగొనవలసియుండును. ప్రాసఘటితమై యేనినివర్ణముపైఁ బరుషము గనఁబడని ప్రయోగము లభించినను నంతే. ఇంకఁ బరుషములే యున్నను నేని గళయే యనవచ్చును గాని యట్టియెడఁ గాన తగం బొందుట యనుకృతిప్రయోగములతో సాదృశ్యము నాలోచింపవలసియుండును. మొత్తముమీఁద నేనినివర్ణముపై యడాగమము (లేదా పరుషములు గనఁబడవలు) ప్రాసఘటితముగా దొరకునంతవరకు యేని ద్రు.ప్ర.యే యని చెప్పఁదగు నని తోఁచుచున్నది.

—:|—

ఢోస్తు అని వక్కాణించుటచే డిప్రత్యయ మధర్వణసమ్మతము గా దని తెలియుచున్నట్లు (వ్యా.సం.స. 1484) పేర్కొనిరి. ఢోస్తు అన్నప్పటి తుశబ్దముచే నిట్లు నిర్ణయింపఁదగును. కాని యొడివర్ణాంతము విశేషణము గాదా ?

శత్రర్థేతూతశ్చానోః అనుసూత్రవివరణమున సహో. తుశబ్దో౽త్ర చార్థే యని తుశబ్దము చార్థక మనెను. అటఁ బ్రయోజన విశేషము గ్రంథాంతరమున గ్రహింతము. ఇక్కారికయందు తుశబ్దమును చార్థకముగా గ్రహించిన డువర్ణముతోపాటు డివర్ణమును గ్రహింపఁబడి యొడ్యంతమును విశేషణ మగుట సిద్ధించును. కాని యుహో. కూడ దీనిని సమ్మతింప లేదు. ఇంక నెడియొ డులలోపము తో సూరి సాధించినరూప మొం డున్నది. వి.వి. తద్ధర్మప్రథమే స్యాతాం డుడివర్ణౌ చ నాన్యకౌ యనుచో చశబ్దముచే డుడివర్ణములు రాని స్థితియు నంగీకృతము. చిం. ప్రథమైకవచనలోపముచే సాధించిన - ఘటించున్ అనురీతిరూపములును గల వని తేలును. ఢోస్తు అను చోటిచార్థకతుశబ్దముచే డివర్ణముతోపాటు డిడులు చేరనిరూపములు సైతము (డుడ్యాదివర్ణే యనుటచే డిడులు రాకున్న నెత్వమును రాదు గదా.) విశేషములుగా గుర్తింప నవకాశము గల దనవచ్చును.

మొత్తముమీఁద నే దేమైనను నీరూపము లొక్కవిధము లై సవిశేషణరూపము లెల్లధాతువులనుండి యేర్పడుచు ధాతుజవిశేషణము లగుచున్నవి.

## స్త్రీసమములా ?

ధా.వి.లు స్త్రీసమములని వజ్ఝలవారు పెక్కుచోట్ల (వ్యా.సం.స. 88,341,446,706 మొ॥) పేర్కొనిరి. అది యుచితమా? అసలు స్త్రీసమ మన నేది ?

చిం. వికృతౌ సర్వేశబ్దాః స్త్రీసమాః క్లీబసమాశ్చ నాన్యే స్యుః అను సూత్రమున స్త్రీసమక్లీబసమములను జేర్కొన్నది. అనుతాం స్త్రీయాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ అనుకీర్తిప్రయోగమును బట్టి స్త్రీసమమును దద్ది (క్లీబసమమును) సంజ్ఞగా గ్రహింపవలసి యున్నది. 'స్త్రీ'తో సమ మైనవి స్త్రీసమములు. శబ్దప్రపంచమున స్త్రీలింగశబ్దములతో సమ మైనది స్త్రీసమ మని స్పష్టము స్త్రీలింగమే యైనచో తత్సమత్వవిధాన మనవసరము. కాఁగా స్త్రీలింగములు గానివి స్త్రీలింగశబ్దములతో సమ మైనవి స్త్రీసమములు. అనఁగా నెట స్త్రీలింగము లయినశబ్దము లెట్టికార్యములను బొందుచున్నవో యట్టి కార్యములను బొందుటయే స్త్రీసమత్వఫలము. స్త్రీలింగములు గాక స్త్రీలింగకార్యములను బొందునవి స్త్రీసమము లనునర్థమున నీసంజ్ఞ యన్వర్థము నగుటచే నర్థము చెప్పఁగావచ్చును చిం. స్త్రీవత్ స్యుః స్త్రీసమాః అని స్త్రీసమములు స్త్రీలింగములవలె (నట్టికార్యముల నొందు) నుండు నన్నది. వికృతౌ అను సూత్రమునుబట్టి యాచ్ఛికభాష యం దని గ్రహింపఁదగు.

చిం. ననుసరించి బాల. సైతము స్త్రీసమక్లీబసమసంజ్ఞలను స్వీకరించినది. చిం.లో వలెనే స్త్రీసమక్లీబసమభేదమును (వ్యవహారమును) నాచ్ఛికశబ్దములందే పొందుటయు గమనార్హము. రమా. ప్రభృతి వ్యాఖ్యలు లీభేదమును గుర్తించి యట్టివ్యవహార మాచ్ఛికశబ్దములకే యని నిర్ణయించుట యుక్త మయియున్నది. కాఁగా స్త్రీలింగము కాకయు స్త్రీలింగకార్యమును బొందునట్టి యాచ్ఛికశబ్దము స్త్రీసమ మని తెలియుచున్నది. అట్టిదే సంస్కృతసమ మైన దాని కీసంజ్ఞ చెల్లదు. అట్టివానిని స్త్రీసాల్యము లిత్యాదిగా వ్యవహరించుచు సూరి స్త్రీసమత్వ మాచ్ఛికములయెడ స్థిరపఱచియున్నాఁడు.

ఇది యాచ్ఛికములయెడనే యని నజ్ఞులవారు తలంపలేదు. బా.ల.లో సైతము ఈసందర్భమునందలి స్త్రీసమశబ్ద మాచ్ఛికమాత్ర విషయకము. పిత మాత ము న్నగునవి ప్రథమైకవచనలోపాదికమునకై స్త్రీసమములుగా సూరిచే సూత్రింపఁబడినను నట్టితత్సమముల నిచటి స్త్రీసమములలోఁ జేర్పరాదు. (వ్యా.సం.న. 342) ఈ (నుగాగము) సందర్భమునందే గా దేసందర్భమునం దైనను స్త్రీసమశబ్దముచేఁ సంస్కృతసమములు గ్రహింపఁబడవు, పైఁగాఁ బ్రథమైకవచనలోపాదికమునకై పిత మాత మున్నగువానిని సూరి స్త్రీసమములలోఁ జేర్చె ననుట పొరపాటు. ఆచ్ఛికశబ్దంబు లెల్లనను మన్నగుసూత్రముచే స్త్రీసమములుగా సంగ్రహింపఁబడుట కివి యాచ్ఛికములు గావు గదా. ఒకవేళ నట్లే నాసూత్రముచేత సంగ్రహింపఁబడి యీయవి స్త్రీసమములయినచో (అనఁగా నిం కొకసూత్రము బా.ల.లో స్త్రీసమములను జెప్పనది లేదు గావున నిది యొక్కటి కాకతప్పదు.) స్త్రీసమములను సామాన్యముగా విధింపఁబడినకార్యము కొన్నింటికి రా దని నియమించుటకే దేని ప్రమాణము చూపినఁ జక్కగా నుండెడిది. ఇంతకును సూరి పిసిని స్త్రీసమములలోఁ జేర్పనే లేదు. ప్రథమైకవచనలోపాదికమునకయి పిత్రాదులకు స్త్రీవద్భావమును మాత్రాదులకు స్త్రీత్వమును విధించియున్నాఁడు. సంస్కృతసమములయెడ నీరీతివ్యవహారము గానరాదు. స్త్రీలింగకార్యములు పొందవలసియున్నను సంస్కృతప్రాతిపదికలకు స్త్రీత్వమో స్త్రీవద్భావమో స్త్రీతుల్యతయో చెప్పఁబడుట గమనింపవచ్చును.

ఇట్లే క్లీబసమములు నాచ్ఛికములే కంధరాదులు క్లీబతుల్యములు, మున్నగురీతిగా సంస్కృతప్రాతిపదికలయెడఁ జెప్పుట గమనింపవచ్చును. ఇట్టిప్రత్యేకదృష్టి లేనప్పు డెచ్చట నేని సాంకర్య ముండె

లోపించినవి స్త్రీసమములు. అని యిది వచ్చునుగదా లోపించుటకు? ఉదాహరణమున కన్నశబ్ద మున్నది. ఇది మహద్వాచకమే కాని పుంలింగము కాదు. కావున నుత్వమును డుజ్ఞును రావు. పుంలింగం బయి మహద్వాచకం బైననామంబు తుదియత్వంబున కుత్వం బగు, పుంలింగ మగు మహద్వాచకమునకు డుజ్ఞు ననుసూత్రములచే మహద్వాచకమగుటతోపాటు పుంలింగము గూడ నయినం గాని డుప్రత్యయము రాదు గదా. మఱి డుజ్ఞే రానపుడది లోపించుట యెట్లు? పుంలింగతుల్యత్వము లేనిదే యాచ్ఛికశబ్దములకు డుజ్ఞు రాదు. (కయిరానులకుం దప్ప) పుంలింగతుల్యత్వము డుజాద్యర్థ మవుటచే నట్లయిన డుజ్ఞు లోపింపదు. ఇట్లే సూరి వివరణానుసారముగా క్లీబసమత్వము లేనిదే మువర్ణకము గా దాచ్ఛికములకు. అట్లు వచ్చిన మువర్ణకము లోపింపదు అట్టియెడ 'ద్వారప్రత్యయములు లోపించుట' యనుట నెట్లు గుదురు నిట. కాంగా ప్రథమైకవచనములోపము గలవి స్త్రీసమము లనుట కొంతవఱకొప్పును. నిజమునకు స్త్రీసమత్వాతిదేశమువలనం బ్రథమైకవచనలోపాదిక మగును. కాని ప్రథమైకవచనలోపాదిక మగుటచే నయ్యది స్త్రీసమ మగుట లేదు. కాని యాయవి స్త్రీసమము లిత్యాదిగా గుర్తింపంబడుటకుం బ్రయోగములందాయా శబ్దములయిట్టిలక్షణములే యాధారములు గావున స్పష్టత మాత్రమే యుద్దేశించి ప్రథమైకవచనలోపాదికము గలయాచ్ఛిక శబ్దములు స్త్రీసమము లనురీతిగాం జేర్కొనుట జరుగుచున్నది.

ఇంక వజ్ఝలవారి యొక్కచోట నైనను స్త్రీసమము లాచ్ఛికములే యని గుర్తించుట జా గున్నది. కాని యీయభిప్రాయము వారికి స్థిరముగా లేదు.

స్త్రీసమత్వాతిదేశంబునం జేసి అసుర – దూత శ్వత్థామ బ్రహ్మ–ఆత్మ ము న్నగుసంస్కృత స్త్రీసమములకు ఆవు మన్నగు

నాచ్ఛిక స్త్రీసమములకును చదివినన్ మొ॥ స్త్రీసమశబ్దములకుఁ బ్రకృత సూత్రముచేతనే ప్రథమైకవచనలోపము గల్గును. (583_586) అనిరి. ఇట్లే పుట 582 లోను సంస్కృతస్త్రీసమముల ప్రసంగము కన్పించుచున్నది. ఇట్లు తరువాతిస్థలముల నంతకుముందు పేర్కొన్నట్లుగా నాచ్ఛికశబ్దములే యనునభిప్రాయమును విడిచిపుచ్చుట గమనార్హము. దీనిబట్టి చూడఁగా స్త్రీసమశబ్ద మాచ్ఛికమాత్రవిషయక మని వీరికి నిర్ణయము లేదు. కాని సూరి యట్టినిర్ణయము గల్గినవాఁ డగుటంజేసి తల్లక్షణములం దీనియమమును నియతముగాఁ బాటించెను. ఆపద్ధతిని మార్చిన వ్యాఖ్యలవారికిఁ దమవలననే తత్సూత్రార్థనిర్ణయసమయమునం దాచ్ఛికములకే యని ప్రత్యేకించి చెప్పవలసిన యవసర మేర్పడినది. స్త్రీసమశబ్దమును బ్రయోగించిన సూరిసూత్రస్థలములం దెల్ల నిట్టియవసరము తప్పకుండుట ననుసరించి యైనను నాతఁ డాచ్ఛికముల యెడనే స్త్రీసమసంజ్ఞను పేర్కొన్నట్లుగా గుర్తింపవచ్చును గదా.

ఇట్లే వీరు చిం.లో సంయుతము స్త్రీసమశబ్దమును సంస్కృత సమశబ్దముల విషయమునఁ బ్రయోగించుట కానవచ్చును. ఒకచోఁ జిం.ని వివరించుచు అసుర_యోష_మాత మున్నగుసంస్కృత స్త్రీసమములకు సులోపము (వ్యా. సం. సూ. 582) మొదలుగాఁ జేర్కొనిరి. కాని స్త్రీసమశబ్దము నాచ్ఛికమాత్రవిషయకముగా సూరి పేర్కొనుట చిం. కనుగుణముగనే యని చిం. బట్టి గ్రహింపఁదగియున్నది.

వికృతౌ చ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చ యని చిం. పేర్కొన్నది. ఆచ్ఛికశబ్దంబు లెల్ల ననుసూరిలక్షణము నిట స్మరింపఁదగు. వికృతిశబ్దార్థము విషయమున భిన్నాభిప్రాయము గలవారయ్యును వ్యాఖ్యలవారు కూడ నేతత్సూత్రమునొద్ద వికృతిశబ్దమునకచ్చ తెనుఁ గనియే (వ్యా. సం. సూ. 702) యర్థము చేసిరి ఇట్లు

స్త్రీసమ క్లీబసమశబ్దముల సచ్ఛతెనుఁగుల విషయముననే చిం. ప్రయో
గించినది. సూరి దీని ననుసరించెను.

ఇచ్చట నున్న సమశబ్దమునకు వ్యాఖ్యలవారు స్త్రీలింగసమము
లని యర్థము చేసిరి. స్పష్టత కిట్లు చెప్పుట యుక్తమే కాని యిచ్చటి
స్త్రీసమశబ్దము స్త్రీలింగము లైనశబ్దములతో సమ మైనకార్యములను
విధించునది మాత్రము గా దనియు స్త్రీసమము లనుసంజ్ఞను జెప్పు
నదే యనియు గ్రహింపఁదగియున్నది. స్త్రీసమ మనునది సంజ్ఞ గావు
ననే యట్టిశబ్దములకుఁ గూడ నేమి యన 'స్త్రీవత్ స్యుః స్త్రీసమాః' యను
సూత్ర మారంభింపఁబడినది. కాఁగా స్త్రీసమ మనుసంజ్ఞ కలిగిన
యూయుశబ్దములకు స్త్రీలింగములవంటికార్యములు విధించునది
స్త్రీవత్ అనులక్షణమే కాని వికృతౌ చ అనుసూత్రమునందలి స్త్రీసమ
శబ్దము గానేర దని స్పష్ట మగుచున్నది. కాఁగా నీ నది సంజ్ఞగా
నుద్దిష్ట మగుటచే స్త్రీసమముల యెడ (నట్లే క్లీబసమముల యెడను)
పర్యాయముగా స్త్రీలింగసమములు స్త్రీతుల్యము లిత్యాదిశబ్దములు
ప్రయోగింపరా దనియే చింతామణ్యాదుల యభిప్రాయము నెన్నఁ
దగు. (ఇట్లే క్లీబసమ మనుసంజ్ఞ వికృతౌ చ అనుసూత్రమువలనఁ
గొన్నింటికిఁ గుదురఁగా నదఁగా నాసూత్రముచేత వికృతిశబ్దములు
గొన్ని క్లీబసమములు కాఁగా నట్టిక్లీబసమత్వమువలనఁ బ్రయోజన
మును క్లీబసమా అనుహ్రస్వత్వలక్షణముచేఁ జెం. స్పష్టము చేసి
నది. కావునఁ గ్లీబసమమనుటవలన మున్నెక మగు నని యాఃకృతౌ
చ అనుసూత్రమునొద్దనే యర్థము చేయ వీలు లే దన్నమాట.)

ఇట్లు స్త్రీసమ క్లీబసమములు సంజ్ఞలుగా గుర్తింపఁదగియుం
డఁగా వ్యాఖ్యలవా రట్లు గుర్తింపమిచేతనే 'స్త్రీషిశేషణే' యనుదానికి
స్త్రీసమ మగునట్టి శేషణమున కని యనుదిష్టార్థము చేసిరి. (వ్యా.సం.

స. 1071) ఇయ్యది వికృతిశబ్దములకే చెల్లున దని చిం. మతము నను. అందువలననే సంస్కృతముల స్త్రీలింగములకు స్త్రీలింగ కార్యములు చెప్పవలచినపుడు స్త్రీసమము లనురీతిగా వ్యవహరించుట బా.ల.లో వలెనే చిం. లోను గానరాదు. 'స్త్రీవద్ గ్లౌః' - అనుచో గ్లౌశబ్దమునకు స్త్రీవత్త్వము చెప్పబడినది. స్వీత్వ బహ్వంతే యనుసూత్రమున సుదశబ్దమునకు స్త్రీత్వము చెప్పబడినది. ఇంతే గాని స్త్రీసమత్వ మెచ్చటను జెప్పబడలేదు.

అనుతాం స్త్రీయాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః అనుసూత్రము స్త్రీసమము లాచ్ఛికములే యని స్పష్టము చేయజాలియున్నది. ఇట సర్వస్య స్త్రీసమస్య అనుదానికి నజ్ఞుల వారు ఆచ్ఛిక స్త్రీసమములకే కాక వాచనిక స్త్రీసమములకు యోధ అనుకము న్నగుసంస్కృతశబ్దములకును సులోపము కల్గు (వ్యా.సం.స.581) ననిరి. యోధాసురాది సంస్కృతశబ్దములను గూడ స్త్రీసమము లనుట విశేషము. చిం. యోధాసురాదులను స్త్రీసమము లనలేదు. స్వీత్వ స్త్రీవత్త్వాదులు (యథా తుల్యత్వాదులు) విహితము లైనను నట వానికి అనుతాం స్త్రీయాం అనుదానిచేతనే సులోప మవును గాని సర్వస్య స్త్రీసమస్య చ అనుదానిచే గాదు. ఇట స్త్రీసమశబ్దము (సంస్కృత) సమేతర మని స్పష్టము చేయుట గమనార్హము

సమానాం అనుతాం స్త్రీయాం సులోపః అని సంస్కృత సమములలో స్త్రీలింగసమముల కనుదంతములకే సులోప మగును. ఇయ్యది స్త్రీసమస్య సర్వస్య అనగా స్త్రీసమముల కన్న నన్నింటికి వచ్చు నని చెప్పుచున్నది. (వ్యా.సం.స. 551) ఈ క్రమము నుబట్టి చూచినచో స్త్రీసమములు సమభిన్నములు. అనగా సంస్కృతసమేతరములు. అనగా నాచ్ఛికము లన్నవిషయము స్పష్టమే కదా. కాగా

సంస్కృతసమములకును దంతములకును లోపము సంస్కృతసమేతరములైన యాచ్ఛికములకు స్త్రీసమముల కన్నింటికిని ననఁగా నూరుపేరు మున్నగునుదంతములపైని సయితమగు నని యర్థమగుచున్నదే కదా. చిం. స్త్రీసమశబ్దము నీ రెండుసూత్రములందుమాత్రమే ప్రయోగించినట్లు గానవచ్చుచున్నది. ఈ రెండింటఁ గూడ నిది యాచ్ఛికశబ్దములయెడ మాత్రమే వర్తిల్లుట స్పష్టము.

స్త్రీత్వము విధింపఁబడిన సంస్కృతప్రాతిపదికలకు స్త్రీసమవ్యవహారము లేమి సర్వస్య స్త్రీసమస్య చ యనుదానిచే లోపము రానేరదు. స్త్రీత్వాదివిధానమువలన నట అనుతాం సమానామ్నుదానిచే నగు నని గ్రహింపవలెను. వజ్ఝలవారు యోధాసురాదులను స్త్రీసమములుగా నెంచి అనుతాం స్త్రియాం అనుదానిచేఁ గాక సర్వస్య స్త్రీసమస్య చ అనుదానిచే లోపమగు ననిరి. 'ఇట్లని స్త్రీత్వము విధింపఁబడినవాని కెల్ల స్త్రీసమస్య అనుదానిచే లోపమగు నని వారెంచియుండకపోవచ్చును. ఏల యనడుమస్త్యత్సదారాజ్ఞః అనుచో రాజన్‌శబ్దమునకు డుప్రత్యయము విహితము. ఇట వారు అది డావలె స్త్రీప్రత్యయమువంటిదే గావలసియున్నప్పటికిని నాపక్షమున సర్వత్రోదోతోర్వ్యాఖ్యవతి మువత్ అని వ్యవస్థకమై దానికి స్త్రీత్వమునందు లోపము లేమింజేసి తెనువు వధువులవలెనే రాజువు మునిరాజు నని గావఁసివచ్చు ననిరి. ఇందలియుత్తరానౌచిత్యములపరిశీలనమున కిటఁ బ్రిసక్తి లేదు. ఇంకఁ బ్రస్తుతము వధు అనురీతిగా నిటఁ బ్రథమైకవచనము లోపింప దనుటచే నిడుప్రత్యయము స్త్రీప్రత్యయమువంటిదైనను అనుతాం స్త్రియాం సమానామ్నుదానిచేతనే లోపము చేయవలయు నన్నమాట. అనఁగా స్త్రీత్వాదులు విధింపఁబడిన (యిట్టి) సంస్కృత

శబ్దము లెల్ల స్త్రీసమములే యను చో సర్వస్య స్త్రీసమస్య చ అను
దానిచేఁ గదా లోపము రావలసినది. అనుతా మ్మాతనియమము
సంస్కృతసమముల కయినను యోధాసురాదులకు స్త్రీసమస్య
అనుదానిచే లోపము చేయుఁగా స్త్రీసమములకు కుదంతములకును
లోపము రావచ్చును గావున రాజు అనుదానిపైఁ గూడ నట్లు వచ్చునే
కదా నన్నయలవారు వు (ను) లోపింప రాదని తలంచుటచే అనుతాం.
సమానా మ్మనుదానిచేతనే చేయుఁబూనుట స్పష్టము. యోధాసు
రాదుల నైన నన్నయలవారు స్త్రీసమములుగాఁ జేర్కొనుటకు యోధాసు
రాదిశబ్దానాం స్త్రీసమత్వ మిహోచ్యతే యను వి.వి. లక్షణము కార
ణము. చిం. యిట్టి సంస్కృతశబ్దములను స్త్రీసమములుగా వ్యవహరింప
లేదు గావున నా చిం. మతమున మాత్రము స్త్రీసమము లాచ్ఛికములే
యని సిద్ధాంతమునకు వైరుధ్యము లేదు.

కాఁగా చిం. యభిప్రాయమున కనుగుణముగనే సూరి
స్త్రీసమ క్లీబసమవ్యవహార మాచ్ఛికములకు మాత్రమే పరిమితము
చేసె నని గుర్తింపవచ్చును.

ఇంక భేదము వి.వి. వచనమున నున్నది. ఇట నహో. చిం.
యభిప్రాయము గుర్తింపలేకో లేక వి.వి. ననుసరించియో కాని యిట్లు
చేర్కొన్నాఁడు.

'అసుశేషి స్త్రీసమ ప్రయోగ స్తు-యోధ కుంత-శతాన్నాన్నాః
స్త్రీసమాః ప్రసిద్ధాః' అని సంస్కృతశబ్దముల నితఁడు స్త్రీసమములను
ట గలదు. దీనికిఁ గారణము వి.వి. అగునా? వి. వి. స్త్రీసమశబ్దమును
ప్రయోగించిన తావులను బరిశీలింతము.

1. 'అమిశ్రే స్త్రీసమా!త్కేచిత్ ప్రయోగశ్శరణం కవేః'—
నన్నయలవారిట అమిశ్రే మిశ్రేతరసమాసమునందు అనఁగా నాచ్ఛిక

సమాసమం దని (వ్యా.సం.స. ౨౭౬) యర్థము చేసిరి. కాఁగా నిచ్చట స్త్రీసమశబ్ద మాచ్ఛికములనే బోధించుటలో బాధ లేదు. అయినను సూరి పేర్కొన్ననుగాగను లక్షణమునకు నాధార మైనయిద్దానియం దెల్లు గ్రహించుట యుక్తమే.

2. 'భవేత్కః స్త్రీసమానాన్మమ్నః'— అనుచో వివరణమున వజ్ఝలవారే స్త్రీసమానాన్మమ్నః — స్త్రీసమనామముకంటెఁ బరముగా ననఁగా నాచ్ఛిక మగు స్త్రీసమప్రాతిపదికమునకంటెఁ బరముగా (వ్యా. సం.స. (27౮) ననిరి. కాఁగా నిచ్చట స్త్రీసమశబ్దము సంస్కృతసమములను గ్రహించునది కాదు.

3. 'సిద్ధస్త్వత్ర స్త్రీసమయోః' — అనుకారికయందు స్త్రీసమమనునది యాచ్ఛికమే గావలయును (10/1) అని వజ్ఝలవారె చెప్పిరి. ఈ 2-ఠ స్థలములయందు వజ్ఝలవా రిట్టినిర్ణయము ప్రయోగానుసారముగాఁ జేసియుందురు. యోధాసురాదులు స్త్రీసమములే యని భావించుపక్షమున యోధున్ అసురున్ అనుకీతిరూపముల ప్రసక్తి లేక పోవునా? ప్రయోగములే యాధారములు. స్త్రీసమములకు నన్నింటికి నిట్టిప్రయోగము లుండవు గదా. అయినను నిచ్చట స్త్రీసమశబ్ద మాచ్ఛికమాత్రములకే చెల్లిన నిబ్బంది లేమిమాత్రము స్పష్టము.

4. 'స్త్రియశ్చ స్త్రీసమస్యేతి ప్రమతస్య స్యా స్నశ్రుతిః క్వచిత్' – వజ్ఝలవారిపాఠ మిది. ఇట పేర్కొన్నయు నాచ్ఛికములనే యుదాహరించిరి. సంస్కృతశబ్దములకు గ్రహణము లేదు. స్త్రీసమస్య చ ఇతిః అనుటచే (స్త్రీలింగములు పూర్వోక్తములు) సంస్కృతసమములు గ్రహింపఁబడవలయు నన్న నిదంతములే కదా! ఇదంతములకుఁ బ్రథమైకవచనలోపమునకై స్త్రీతుల్యతావిధాన మనవసరము. సోర్లుప్తిః అని యున్నది గదా. తండ్రి తల్లి మున్నగు

నాచ్ఛికకేవలాంతములకు పోర్లుగిత యనుదానిచేతనే సులోప మగు
చున్నను స్త్రీసమము లగుచునే యుండును. స్త్రీసమ క్లీబసమము లగు
నవియు 'ప్రకృతియందు నాన్యే స్యుః' అనుటచే నితరము లుండ వీలు
(సామాన్యముగా) లేదు. కావున నివి స్త్రీసమములు గాక తప్పదు.
కాఁగా నిచ్చోటి స్త్రీసమశబ్దమునయితేము కేవల మాచ్ఛికములనే
బోధించుచున్నది.

5. 'యోధాసురాదిశబ్దానాం స్త్రీసమత్వ మిహోచ్యతే'—
ఈ సూత్రమందుఁ దప్ప వి.వి.లో నైనను మఱొకచోట స్త్రీసమశబ్దము
శబ్దము ప్రయుక్తమైనట్లు గానరాదు. దీనిలోఁ గూడ నిదియే విరుద్ధ
ముగా నున్నది యోధా అసుర అని సంస్కృతశబ్దముల నుచ్చరించి
స్త్రీసమత్వము విధించుటచే నిట సంస్కృతశబ్దములే స్త్రీసమము లయి
నట్లు చెప్పకతప్పదు

ఈ సూక్తిచోటఁ దప్ప వి.వి.లో నైనను స్త్రీసమశబ్దము
సంస్కృతశబ్దములనెడఁ బ్రయుక్తమును గానరాదు. విశేష్యమాత్రే
స్త్రీతా స్యాత్ స్త్రీసువాదీనాం సంక్షిసందర్భమున నే స్త్రీత్వము చెప్పఁబడి
యున్నది- కాని యంతకుముం దహో. అసురేతి స్త్రీసమప్రయోగస్తు—
'యోధశుంఠేత్యాద్యాః స్త్రీసమాః స్మృతాః' అనునీతి నన్నమాట
లెట్టివి? వి.వి.కారకునుబట్టి యహోబలుఁ డెన్నఁడా లేక యహోబల
పతిప్రమాదమే వి.వి.లోఁ జోటుచేసికొన్నదా? లక్షణ మియ్యావి
యహోబలేతర (అధర్వణ) కృతి మనవోఁ దత్కర్త స్త్రీత్వబవాలతే
మున్నగు సూత్రస్థలముల లక్ష్యములను స్త్రీసమము లని తలఁచెనా?
అయినఁ జిం.లో నిట వైరుధ్య మేర్పడిన దని చెప్పుట సాహసము
గాదు. ఇంక వి.వి. ఇతరస్థలములలో నీ స్త్రీసమశబ్దమును నాచ్ఛికముల
విషయమునఁ బ్రయోగించుట స్పష్టమే. సంస్కృతశబ్దములయెడఁ
క్లీబసమశబ్దము ను బ్రయోగించుటయు వి.వి.లోఁ గానరాదు.

కాఁగా సహోబలాదులు కొందఱు సంస్కృతశబ్దము లను స్త్రీసమములుగా వ్యవహరించుట గల దని మాత్ర మంగీకరింపవలసి యున్నది. వఝ్ఝలవారు సహో. వలెనే భావించి రన్నమాట. కాని చిం. బాలలందు మాత్రము స్త్రీసమ క్లీబసమశబ్దము లాచ్ఛికశబ్దముల విష ముననే నియతముగా నుండుట స్పష్టము. అయ్యది శాస్త్రమున ననేక స్థలములయందుఁ బ్రయోజనవంతము నై యుండుటచే నగ యట్లే గ్రహించుట యుక్తము.

కాఁగాఁ బ్రథమైకవచనలోపాదికము గలయాచ్ఛికశబ్దములకే స్త్రీసమము లనువ్యవహారము చిం. కర్తృప్రభృతిలాక్షణికసమ్మతము. ప్రౌఢవ్యాకర్తయు సహోబలాదులవలె సంస్కృతశబ్దములకుఁ గూడ నిట్లు వ్యవహరించుటఁ (సమా. 33) గానఁగుచున్నది. చింతామణ్యాదులఁ ననుసరించి యిది యుచితము గాదు.

### ధాతుజవిశేషణము లిట్టి స్త్రీసమము లగునా ?

ఎడిసెడు ప్రత్యయాంతాలగు ధాతుజవిశేషణము లేదు. ఇవి యెల్లధాతువులనుండి యేర్పడుచున్నవి. ఆచ్ఛికధాతువులనుండియే కాక సంస్కృతధాతువులనుండి పైతఁ దీనివిశేషణరూపము లింతగంతగా నున్నై యేర్పడును. ప్రవహించెడు మున్నగునవి యాచ్ఛికములు గావు గదా. వీనికి స్త్రీసమత్వము గుదురునా? వండుట-వండెడు మొద లగునవి స్త్రీసమము లనవచ్చు. ఇంకఁ బ్రవహించుట ప్రవహించెడు మొద లగువానిస్థితి యేమి? ఈ యని శ్చయంతము లగుటచేఁ బ్రాతిపదిక ములు గాక తప్పదు. నచ్చుటచేత నచ్చుటంబట్టి యిత్యాదిగ నుండును. అట్లే వచించుటవలన నేమి! మఱి ప్రథమైకవచనలోపము వీని కెట్లు? ఇట్లే రామునితన (ము) ఇత్యాది తద్ధితాంతములును ప్రాతిపదికలే కదా. అందుకై యాచ్ఛికశబ్దంబు లెల్ల (వికృతౌ సర్వే శబ్దాః) అనుచో

నాయయిభక్తులు చేరఁగా ఆ (ప్రాతిపదికము) తత్తద్విభక్త్యంత రూపముల నందు. మహద్ధమున వాఁడు ఇత్యాదిగా నగును గావున ప్రహరించినవాఁడు వచ్చినవారియందు అనుకీతిగ నవు. అనుహద్ధమున అది ఇత్యాదిగా నవును గావున వచ్చినది ప్రహరించినవాని యందు ననుకీతి నగును. కాఁగా వచ్చినవాఁడు మున్నగురీతి రూపములసిద్ధి ననుసరించి ధా.వి.లపైఁ ప్రథమైకవచనలోపాదిక ప్రసంగమే లేకుండుట స్పష్టమే కదా. ప్రాతిపదికమునకే సూరి తచ్ఛబ్దమునను ప్రయుక్తము చేయుటచే వచ్చిన వీణ్యాకలలో తచ్ఛబ్దము లెవ్వకమైయుండకయే ధా. వి. కుఁ జేసినదో యూయర్థమునందే యుండుట సిద్ధించుచున్నది. వీఁడు వచ్చినవాఁడు మున్నగుచోట్ల నిట్టిస్థితి స్పష్టమే. వీని విఱుపుము యని నోడినవాని సేనఁ నయకో సెర్వ్యన్ (ఆది7-47) వీరి సుఖ సుప్తులై యున్న వారి (ఆది 8-199) (న్యా. సం. స. 1176) ఇట్టిప్రయోగాలు సూరి ప్రణాళికసామంజస్యమును స్పష్టము చేయుచున్నవి.

ఏదే మైనను ప్రథమైకవచనలోపాదికము లేమి నివ్వానిని స్త్రీసమము లనుట సూరి యభిప్రాయమునకు విరుద్ధము. సూరియు వీనిని స్త్రీసమము లని భావించెనని వజ్ఝలవారు తలఁచుట సరికాదు.

'కర్మధారయంబు' త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపదం బయియుండు ననుసూత్రమున స్త్రీసమములతో పాటు ధాతుజవిశేషణములను గూడఁ బ్రత్యేకముగాఁ జేర్కొనుట దీనిని స్పష్టము చేయుచున్నది. ధా.వి.లు స్త్రీసమములే యైనచో స్త్రీసమశబ్దముచేతనే యవి కూడ సంగ్రహింపఁబడుచుండఁగా వానిని బ్రత్యేకముగాఁ జేర్కొనక స్త్రీసమములనుమాత్రమే పేర్కొన్నచోట్ల నాయాకార్యములు ధా. వి. లకు రాకుండుటయు గమనింపవచ్చును.

స్త్రీసమములకుఁ బరుషసరళపరకతలలోఁ జెప్పిన (సంధి. 25) నుగాగమములు ధా.వి.లకు లేవు. ముద్దు చేయుకొందును మొ॥ ధా. వి. లపై విభక్తి తచ్ఛబ్దపూర్వకమై (విశేషణావయవ మీతచ్ఛబ్దము) నిలిచియే యుండఁగా వీనికి (స్త్రీసమత్వము లేక) పదత్వము సిద్ధించుట స్పష్టము.

కానీ వీనిపదత్వసిద్ధినిగూర్చి వజ్ఝలవారొకచో నిట్లనిరి. "ధాతుజవిశేషణములు పుంస్త్రీక్లీబసమములలో నేతరగతియందును జేరకుండుట సరి కాదు. మఱియు వీనికి స్త్రీసమత్వము లేనపుడు ప్రథమైకవచనలోపమునకు మార్గము లేమిం జేసి పదత్వసిద్ధియుఁ బొసఁగదు. (వ్యా.సం.స. 342) ఇట్లనుటలో బాల. ననుసరించి ధా.వి.లకుఁ బదత్వము సిద్ధింపలేదని సిద్ధాంతీకరించి రన్నమాట. స్త్రీసమత్వము లేమి యింతకు ముందు స్పష్టము. ప్రథమైకవచనలోపము లేకున్నఁ బదత్వమే సిద్ధింపదా? అట్లని వీనిని స్త్రీసమములే యందము. ప్రథమైకవచనము లోపించి వచ్చెడు మున్నగునవెల్లఁ బదత్వమును బొందు. కాని ప్రథమైకవచనము వచ్చెడు అది రాని ఇత్యాదిగనే ప్రయుక్తమవుచున్నవా? అదియట్లుండె లోపమైనను ప్రథమైకవచనమునకే గాదా ఇతరవిభక్తులు లోపింపనేరవివి స్త్రీసమములే యైనను. అన్నలు అన్నట్లుగా వచ్చెడులు అని యుండవలయును. ఇట్లే వచ్చిన వచ్చినకై రాఁగలకున్ వచ్చునన్-అని త్రిప్రయోగములున్నవా? వీనిని స్త్రీసమములుగా నంగీకరించిన నపూర్వములైన యిట్టి పదములెన్నో యేర్పడును.

వజ్ఝలవారే వేఱొకచో నిట్లు వ్రాసిరి. "ఆచ్ఛికవిశేషణములకు విభక్త్యంతరూపభేదము లుండవు. అవి స్త్రీసమములు గానఁ బ్రథమైకవచనలోపము గల్గి పదత్వము సిద్ధించును. ఉదా. చదివిన

పుస్తకము మొ॥ (వ్యా.సం.స. 1175) ఆచ్ఛికవిశేషణము లని సామా
న్యముగాఁ జెప్పినప్పటికిని (సూత్రసందర్భమునుబట్టియును) నుదాహృతిగాఁ జదివినపుస్తకము నిచ్చుటనుబట్టి ధా.వి.లను గూడ వీరు స్త్రీసమములుగా భావించుట తెల్లమైనది. అందువలననే ప్రథమైక వచనము లోపించి పదత్వము సిద్ధించిన దనిరి.

వీరే యింకొకచో చేసి - మున్నగులాక్షణికావ్యయములకును (చేసినన్...మున్నగు ధాతుజవిశేషణములను ఇవి 'చింతామణి పక్షమందలివి) చేసిన ... మున్నగుధాతుజవిశేషణములకును తెల్ల... మున్నగుగుణవిశేషణములకును స్త్రీసమత్వము నంగీకరించి స్త్రీలింగ ప్రథమైకవచనలోపమును జేసి పదత్వమును సంపాదించి...(వ్యా.సం. స. 446) అనుట యీయంశమునే స్పష్టము చేయుచున్నది. చిం. పక్షమున ద్రుతాంతములుగాఁ బ్రత్యేకముగా నిచ్చిరి. కళలుగాఁ జిన్నయ మతము ననుసరించి పేర్కొనుటంబట్టియు బాల.లోనే వీరు వీనిని స్త్రీసమములుగా భావించినా రని స్పష్టము. ఇదే యభిప్రాయమును వీ రింకొకచోట (88) నిట్టే సూరిసూత్రమునొద్దనే ప్రకటించిరి.

కాఁగా ప్రథమైకవచనలోపమును విభక్త్యంతములుగాఁ బ్రయోగాభావమును బ్రథమైకవచనాంతములు సైతము విశేష్యముతో సమసించు ననియుఁ జేర్కొనుటచే వచ్చెడు - వచ్చెడువరు ఇత్యాదిరూపము లుండవని తెలియవచ్చును. ఇంతకు ముం దూహించినయుపరూపము లిట్టు వారిమతము లైన నన్నమాట.

కాని యాచ్ఛికవిశేషణము లని పేర్కొన్నవీరిమాటల ననుసరించి తదితరములగతి యేమి? పరిహరించెదు మొదలగు సంస్కృతసమవిశేషణరూపణరూపములు గూడ నవిభక్తికములే యగునా! తెల్ల మున్నగువిశేషణములు విభక్త్యంతములుగా విడిగాఁ

ప్రయుక్తములు గావని యంగీకరింతము. ప్రవహించెడు మున్నగు
సంస్కృతసమధా. వి. లును ప్రయోగింపఁబడవా? ఇట్లని లాక్షణికు
లితరులు చెప్పినట్లు గావరాదు. సూరి తచ్ఛబ్దానుప్రయోగముతో
ధా. వి. లన్నింటికిఁ బ్రత్యేకప్రయోగమును సాధించియున్నాఁడు.

పైని సంగతము స్థలాంతరమున నిట్లు పేర్కొన్నారు.
(సమాస. 9) సూత్రము చొప్పునఁ దచ్ఛబ్దము ధాతుజవిశేషణముల
కనుప్రయుక్త మగును. ఈ సూత్రములోని ధాతుజవిశేషణము లన్నవి
తక్కిన విశేషణములకు నుపలక్షకములుగాఁ జేసి విశేషణముల కెల్ల విభక్తి
వివక్షయందుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగును. (వ్యా. సం. స. 107)
ఇతరవిశేషణసంగతి యిట స్పష్టము. సూత్రమున స్పష్టముగా
నిర్దేశించిన ధా. వి. లకుఁ దచ్ఛబ్దానుప్రయోగము స్పష్టమే కదా.
ఇచ్చటఁ బ్రథమైకవచనాంతప్రసక్తి లేదే మని యన్నచో స్త్రీసమత్వ
మెట్లు ?

మఱికొన్నిచోట్ల ధాతుజవిశేషణములు తచ్ఛబ్దార్థకా
లగు అది అవి వాఁడు మున్నగువానితో సమాసించెను. వానియందలి
తచ్ఛబ్దము విధేయవిశేషణము (117) వసిరి. ఇది ధా. వి. లకు
విభక్తి వివక్షించునను ననుసూత్రసూత్రమునకుఁ జెందినవివరణము.
ఇట సూత్రాన సమాసప్రసంగమే కానరాదు. మఱి దీనిగాన వీనిని
సమాసము లని యెట్లు పేర్కొనిరో ? ఇంతకు మున్ను వాక్యములను
బట్టి యివి స్త్రీసమములు గావుఁ బ్రథమైకవచనము లోపించి విశే
ష్యముతోఁ గర్మధారయము నందు ననుట స్పష్టము. ఇట పట్టికర్మధార
యమే విధింపఁబడినదా ? కర్మధారయంబు త్రిక స్త్రీసమ - మున్నగు
సూత్రములచేఁ గర్మధారయ మేర్పడెనా ? ఇవి స్త్రీసమము లనుపక్షము
ననుసరించి కర్మధారయమును జెప్పినయాసూత్రములందే స్త్రీసమశబ్ద

ముండఁగా ధా.వి.ల పృథగ్గ్రహణము వ్యర్థమవుచుండఁగా నది చాలక మఱియు నిట సమాసమేల చెప్పవలె? ఇంక నిట విశేషమే మనఁ దచ్ఛబ్దము తదర్థకముగా నుండుట. ఇంకను జెప్పఁదలఁచిన నీవిశేషాంశమును జెప్పక సిద్ధించుసమాసమునే చెప్పనేల? అన లీసూత్రము సమాసమునే విధించుట లేదనుట స్పష్టము. ఆవిషయమును వజ్ఝలవారును గుర్తింపకపోలేదు.

ఇట వీరివలె బా. సా. పే. సమాస మనుటను స్థలాంతరమున విమర్శింతుము మఱియు (సమాస. 9) సూత్రమునఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మని చెప్పఁబడెను గాన నది సమాసస్థలము గాదు (408) అని తిరస్కరించిరి. మఱి వీ రిచ్చటఁ జెప్పిన దేమి? స్పష్టముగా సమసించు ననియు నైనను దచ్ఛబ్దమున కర్థవిశేష ముండ దనియు. వజ్ఝలవారు పేర్కొన్నద్వివిధాభిప్రాయములలోను బా.సా.పే.ను విమర్శించుచోఁ జెప్పిన-సమాసము గా దనునీయభిప్రాయమే సమంజసము. దీనికిఁ దరువాతసూత్రమున నెల్లయెడల నని సూరి వచ్చినట్టివాఁడు సమాసమునకును వచ్చునట్టివాఁ డన్నది వ్యస్తస్థితికిని లక్ష్యముగాఁ జూపియున్నాఁడు. కాఁగా విభక్తివివక్షలో ననుప్రయుక్తముగాఁ జెప్పినతచ్ఛబ్ద మయినస్థలములు సమాసములు గావని స్పష్టముగా గుర్తింపఁదగియున్నది. (406-407) (విభక్తివివక్షలో) ధా.వి.ల కను ప్రయుక్తముగాఁ జెప్పుటచేతనే నిచ్చటఁ దచ్ఛబ్దము ధాతుజవిశేషణముల యర్థములోనే యుండును గాని యర్థవిశేషమునం దుండ దని స్పష్టముగా గుర్తింపనగును.

కాఁగా వచ్చెడు మొదలగు ధా.వి.లు వచ్చెడువాఁడు రానివారియందు ననురీతిగాఁ దత్తద్విభక్త్యంతములుగాఁ బ్రయోగింపఁ బడుచునే యున్నవని స్పష్టము.

కాఁగా ధా. వి. లకు విభక్త్యంతరూపములుండవని వజ్ఝలవారింతకు ముందు చేర్కొన్నయంశము సముచితము గాదు. వచ్చెడు అను ధా. వి. యొక్క ప్రథమావిభక్త్యేకవచనాంతరూపము మహార్థమున వచ్చెడువాఁడు మొ॥ ఇట్టి యితరస్థలములయందును నాయవి గుర్తింపఁదగియున్నవి.

ఇంక నిట్లు ప్రథమైకవచనము వీనిపయి లోపింపుట లేదు. కాఁగా వీనికి స్త్రీసమకార్యము లేవియు లేవు. కాన నీయవి స్త్రీసమములు గావనియు నందువలననే ప్రథమైకవచనలోపాదికము లేదనియు స్పష్టము. కాఁగా వజ్ఝలవారటనట వీనిని స్త్రీసమము లనుట పొరపాటు.

సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకు—అనుసూత్రమునఁ జెప్పిన నుగాగమము ముద్దు చేయుకొడుకు మొదలగుచోట్ల ధా. వి.లపై రాకుంట కవి స్త్రీసమములు గాకపోవుటయే యని స్పష్టముగాఁ జక్కగాఁ జెప్పిన వజ్ఝలవారైయుండి వీనిని స్త్రీసమములుగాఁ జేర్కొనుచుండుట పొరపాటే యనఁదగును గదా. ఇంక నీయవి స్త్రీసమములనఁ జెక్కులబోలుందెలనాఁకు లనుకతియల్ప ప్రయోగములు సాధింపఁబడుఁ గాక. ముద్దుసేయకొడుకు వంటియనల్ప ప్రయోగము లసాధువులు చేయుట యుక్తము గాదు. వీనిని స్త్రీసమములనియు నిట్టి వైరుధ్యమునకుఁ బరిష్కారము వజ్ఝలవారు చూపలేదు.

ఇట్లు ధా.వి.లు స్త్రీసమములు గావు గనుకనే బాల.లో నామ్యైలక్షణములందలి స్త్రీసమశబ్దము ధా.వి.లకు గ్రాహకము గాలేదని సముచితముగా గుర్తింపఁదగియున్నది.

కాఁగాఁ దచ్ఛబ్దానుప్రయోగమును స్పష్టము చేసినవారల. మతమున నీయవి స్త్రీసమములు గా వని యంగీకరింపక తప్పదు కాని చిం కాని వి. వి గాని ధా.వి. లపై నిట్లు తచ్ఛబ్దానుప్రయోగమును జెప్పియుండలేదు. మఱి యాలక్షణగ్రంథముల యభిప్రాయము ననుసరించి యివి స్త్రీసమములే యనవలయు నేమో యని యనుమానము గల్గుట సహజము. చిం., వి. వి.లు స్పష్టముగాఁ జెప్పని లక్షణకోటిలో నిదియుఁ జేరఁగలదు.

తచ్ఛబ్దవస్య లోపస్స్యాత్త్వను వి. వి. లక్షణముచేతనే తచ్ఛబ్దానుప్రయోగమును జ్ఞాపితము చేసికొనవచ్చును. ఆపద్ధతిలోనే నన్నయాదులప్రయోగములం బ్రసిద్ధము లైన యిట్టిరూపముల కవకాశమా వ్యాకరణములందుఁ గలదు.

కాఁగా నెల్లరమతమునను ధా.వి.లు స్త్రీసమములు గా వనియు — నీయవి తచ్ఛబ్దానుప్రయోగముతోఁ దత్తద్విభక్త్యంతములయి ప్రయోగింపఁబడుచునే యుండు ననియు సముచితముగా గ్రహింపఁదగును.

## ద్రుతప్రకృతికములా ?

ధా.వి. లు ద్రు.ప్ర.లా యను ప్రశ్నయే బాల. ననుసరించి యసంగత మైనది. విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగము చెప్పుటచేఁ దచ్ఛబ్దవిరహితముగా ధా.వి. కేవలముగాఁ బ్రయోగింపఁబడదు. కావున నిది ద్రు.ప్ర.యా? కాదా? అని ప్రకృతినిగూర్చి విచారింపరాదు గదా. ధా. వి. లు తచ్ఛబ్దముతోఁ దత్తద్విభక్త్యంతము లై యుండును. కావునఁ దదంతము ద్రు.ప్ర. యగునా యని ప్రశ్నింపవలె. అట్టియెడఁ బ్రథమాకయిపట్టి యొక్కేతరములు ద్రు.ప్ర. లను వివర

రణము ననుసరించి ధా.వి. లును (అనుప్రయుక్తతచ్ఛబ్దముపై నున్న) ప్రథమాకయుపట్టి నొకొక్కాంతములు కళలును నితరవిభక్త్యంతాలు ద్రు.ప్ర.లు నగును. వచ్చినవాఁడు ప్రథమాంత మగునీ ధా.వి. కళ. వచ్చినవానిన్ ద్వితీయాంత మగునీయది ద్రు. ప్ర. ఇట్లు సామాన్య లక్షణము ననుసరించియే గుర్తింపవలసియుండు ధా.వి.లు ద్రు.ప్ర.లా? అను ప్రశ్న యెట్లు? రాముశబ్దము ద్రు. ప్ర. యగునా? యని ప్రశ్నించుట యెట్లసహజమో యట్లే ధా.వి.లు ద్రు.ప్ర.లా యని ప్రశ్నించుటయు నని గుర్తింపవలెను. అందువలననే ద్రు. ప్ర.లలో ధా. వి.లు సూరి ప్రత్యేకముగాఁ బేర్కొనలే దని గుర్తింపవచ్చును.

కాని వింత యదియే. ధా.వి.లు ద్రు.ప్ర.లా? కళలా? యను ప్రశ్నము గల్గుటయే కాక సన్నయాథర్వణులమతమున నీయవి ద్రు. ప్ర. లనియు సూరిమతమున నీయవి కళ లనియు నభిప్రాయము వజ్ఝలవారివచనములం దింతకుముందు గమనించియుంటిమి. ఇట్టి ప్రశ్న వజ్ఝలవారికి ముందే యెప్పుడో యేర్పడినదా యనిపించును.

'నసాత్త్వద్ధర్మోక్త' యను సూత్రవివరణసందర్భమునం దహో. 'తద్ధర్మపదేన తద్ధర్మక్రియా తజ్జన్యవిశేషణఞ్చ గృహ్యతే' యని పేర్కొని 'రక్షణ మొనర్చు నంబుజాతాక్షున్' అని యుదాహరించె. సంధి లేదని చెప్పుటనుబట్టి యిచటఁ జూపిన నకారము పూర్వపదసంబంధి యని గ్రహింపవలె. కాఁగా ముందున్న ధా.వి. ద్రుతాంత మని తేలుచున్నది. దీనికి వి. వి. కొంతకారణము గావచ్చును. తద్ధర్మప్రథమే స్యాతాం డుడీవర్ణౌ చ నాన్తకౌ ఽస్తు భేదకేఽపి స్యాత్ త్రిషు డుడీవర్ణములు (తద్ధర్మప్రథమైకవచనమున) ద్రుతాంతములుగాఁ జెప్పటం జేసి యిచట డువర్ణమును (భేదకము) ద్రుతాంత మగుటయు దాని ననుసరించి ధా. వి. లన్నియు ద్రుతాంతములు గావలసియుండుటచేత

ధా.వి లను ద్రు.ప్ర. లని యహో. భావించుటకు బా. స. వాక్యము నాధారము గావచ్చును. బా. స. క్రియ లనియే చెప్పి ధా. వి. లను జెప్పకున్నను (సూత్రైక్యత ననుసరించి) రక్షించునంబ అని యుదాహరించెను. రక్షణ మొనర్చునంబుజాతాక్షున్ అనునహో. లక్ష్యమునకు దీనితోఁ బోలిక గల దనఁదగు. అహో. వివరణ మప్ప. నాధారము గల్గినది గావచ్చు.

'నసాంత్యత్రేద్ధర్మేతి' యను సూత్రస్థలమునఁ గ్రియాపదము లనుమాత్రమే యప్ప గ్రహించెను. ధాతుపదసమ్భవానాం విశేషణానా మత స్గధా ను మచి యనుసూత్రముచే ధా.వి.ల కుదంతముల కచ్చరకత్వమున నుసాగమమును భిన్నలక్షణముచే సాధించెను. ఆ పాఠము ప్రక్షిప్త మని మని బా. స. పాఠమునే యనుసరించి యీ రూపములనుగూడ సిద్ధింపఁజేయునుద్దేశముతో నహో. తద్ధర్మక ధాతుజవిశేషణములను సైతి మిచ్చుట సంధినిషేధసందర్భముననే గ్రహించియుండవచ్చును.

ఏది యె ట్లున్నను సంధినిషేధము క్రియాపదములందు మాత్రమే సమన్వయించి ధా. వి. లకు నుమాగమమును సాధించిన యప్ప. మతములో ధా.వి.లు ద్రు.ప్ర లన నవకాశము లేదు. అహో. సమన్వయదృష్టిలో నయ్యవి ద్రు.ప్ర.లై కవి. ఇట్లు రెండుమతము లేర్పడె.

వజ్ఝలవారు నహో. మార్గములో నసాంత్యత్రేద్ధర్మేత యను సూత్రముచేతనే తద్ధర్మకధా. వి. లయందును సంధినిషేధమును జెప్పిరి.

ఈ ధా.వి.లను సాధించినది వి. వి. నసాంత్యత్రేద్ధర్మేత యను సూత్రమునకు వివరణ మయిన యాకారిక ప్రథమశ్లోకమునైవ తాను తద్ధర్మసంజ్ఞకౌ ధాతాద్యవిషయా తత్ర చైకత్వార్థాభి

ధాయకౌ ఉపస్థాచ సదా నాస్యాన సంధి ర్యత్ర కల్ప్యతే' - యను
నది. నస్యాత్తనుసూత్రమునందలి తద్ధర్మశబ్దముచే దద్ధర్మకము
లైన ప్రథమోత్తమపురుషైకవచనములుమాత్రమే గ్రహింపవలయునని
యిది చెప్పుచున్నది. వి. వి. చెప్పిన ధా.వి. లకు తద్ధర్మశబ్దముచే
గ్రహణము లేదు గదా. ఇట్టి ధా.వి. లను జెప్పిన వి. వి. కర్తయే
సూత్రగతతద్ధర్మపదముచే తద్ధర్మకము లైనధా.వి.లను గ్రహింపవలె
నని చెప్పఁడాయె.

తత్ర చైకత్వార్థాభిధాయకౌ యను కారికయందలి వివర
ణము క్రియారూపములనే యుద్దేశించుటను స్పష్టము చేయఁజాలి
యున్నది. ఇయ్యది క్రియారూపముల యెడనే సరిపడును. రక్షింపఁబడు
నార్తులు రక్షించునపర్ణాపరమేశులు అనురీతిసములయందు ధా.వి.లు
ఏకత్వార్థాభిధాయకము లవునా? ఆ కారికకడ నున్నయహో. వివరణము
నైతము ధా.వి.లనుగూర్చి ప్రస్తావించుటలేదు. (అసలీకారికయే
యప్పకవీయ 'నస్యాత్తద్ధర్మత'సూత్ర వివరణమూలక మేమో యని
యనుమానము. ధా.వి.లకును సంధినిషేధమును వి.వి.కర్త యుద్దేశిం
చిన నవ్వానిని స్పష్టముగా నేల చెప్పలేదు? కాఁగా సహో. వఝల
వారును నిట ధా.వి.లనుట గ్రహించుట పై వి.వి. కారికచే గ్రహింపఁ
బడునది కాదని స్పష్టము. అందుకే కాఁబోలును వఝలవారు "తద్ధర్మక
విశేషణోకారసంధి నిషేధింపఁబడమింజేసి—వచ్చితిఁడు మున్నగు నసిష్ట
రూపములు దుర్వారము లగును. కాన నీపక్షమున ధాతుపదసంభవా
నాం విశేషణానా ముత స్తథా ను మచి అను నప్ప. చిం. పాఠము ప్రక్షి
ప్తము గాదని యంగీకరింపవలసియుండు. (246) అసిరి. అధ్వానము చే
సుదంత ధా. వి గ్రహింపఁబడమింజేసి—ధాతుపద—అను నప్పకవి పాఠము
ప్రక్షిప్తము గాదా! అప్ప. చిం. లోనియనేకములలో నిది యొకటి

గ్రహింపవలసియుండుట విచిత్రమే. పై శ్లోకమునం దీనియొక్కయర్థమే గ్రహింపఁబడుటయుఁ బ్రక్షిప్తము గాదనుట కింతయే.

ప్రక్షిప్తము గాదని యట నొక్కమాటలోఁ దేల్చిరి కాని దీనివలన వారు చేసికొన్న యింకొక సిద్ధాంతము వ్యర్థ మయిపోయినది. "ధాతూకారసంధినిషేధస్వారస్యముచే ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు అనుచోప్పున ద్రుతలోపము గలుగజేసెను. తత్కాలధాతుజవిశేషణములచోటులందు...ద్రుతలోపము గల్గి" (245) మొదలుగా ననిరి. పై వాక్యములనుబట్టి వి వి. మతానుసారముగా నస్యాత్సూత్రమునొద్ద ధా.వి.లు గ్రహింపఁబడలేదు. కావున నీసూత్రముచేఁ (కారికచే నెట్లును) ధా.వి.ల యుకారమునకు సంధినిషేధము లేదు. అట్టియెడల సంధినిషేధస్వారస్యముచే నింతకు ముందు సాధించుకొన్న ప్రయోజనము భగ్న మయినట్లే కదా కాఁగా ద్రుతస్య-అనుసూత్రముచే ధా వి.లకు నెల్లయెడల ద్రుతము లోపించు ననియే చెప్పవలెను. సమాగమము చెప్పుచున్న ప్రక్షిప్తము కాని యప్ప చిం. పాఠము ననుసరించి చేసెడు నతఁడు చేయునతఁ డనుస్థలములందు నయితము మొదట ద్రుతము లోపింపఁగా నాపిదప సమాగమమును జేయవలసియున్నది. వచ్చిన యాతఁడు చేయుకొడుకు ఇత్యాదులం దెట్లును ద్రుతము లోపింపక తప్పదు.

ఇట్లెల్లయెడల నా ద్రుతము లోపించునప్పుడు వీనిని ద్రు.ప్ర. లని పేర్కొనవలసినయవసర మేమి? ప్రక్రియాగౌరవమునకా?

ధాతుజవిశేషణములు కళలపట్టికలోఁ జేర్పఁబడలేదు. అట్టి యెడలఁ బ్రయోగములనుబట్టియే గ్రహింపవలసియుండును. ప్రయోగములం దీధా.వి.లపై ద్రుతము గానవచ్చుట లేదు. చేయునతఁడు అనురీతిస్థలములో నకారము గానవచ్చుచున్నది. కానీ యది సమాగమ

సంబంధియే కాని ధా.వి.లకు (సహజముగా) సంబంధించిన ద్రుతము

కాదు. (చెప్పఁబోలుం దెలనాఁకు లనురీతియట్టి ప్రయోగము లెట్లును
విశేషములే.) అనఁగా ధా.వి.లపై నెచ్చటను ద్రుతము కానరా
దన్నమాట. కాఁగా ద్రుతో న యేషాం స్యా త్తన్నలక్షణమున కను
గుణముగా నిటఁ జివర ద్రుతము లేదు గావునఁ గళాలక్షణమే
యున్నది. కావున 'ఆద్యా నభిదధతి' యనుచోటి యాద్యశబ్దముచేత
గ్రహింపవచ్చునే కదా. శా.ల.లో నిట్టియుద్దేశముతోడనే కళలుగా
గణింపఁబడిన వన్నభావమును వీరు వ్యక్తీకరించియున్నారు. (౮౮)
ఈపక్షమున నప్పకవీయమునందలినుమాగమసూత్రము ప్రక్షిప్తము
గా ననుచున్నారు. కావునఁ జిన్నయ గ్రంథమునందువలె నకారా
గమము చెప్పఁబడినట్లు యయినది. దీనివలన నీపక్షమున నిందును
ధా.వి.లు ద్రు.ప్ర.లు గా వని నిర్ణయింప నవకాశ మేర్పడినట్లే కదా.
సూరిమత మింతకుముందు స్పష్టము.

కాని వీరం కొకచోట చేసెదనతఁడు చేయునతఁడు మున్నగు
చోటులందు ద్రుతాగమమును విధింపనినన్నయాధర్వణులకు ధాతుజ
విశేషణముల ద్రుతప్రకృతికత్వ మభిప్రేతమే (88) అని చెప్పిరి. ఇంత
కును ద్రుతాగమమును జెప్పుచున్న ధాతుపదసంభవానా మ్మను
సూత్రము ప్రక్షిప్తమా? కాదా? ప్రక్షిప్తము కా దన్న నుమాగమము
చెప్పుచున్న చిం. పక్షమునను సంధినిషేధింపని వి. వి. పక్షమునను
అనఁగా నన్నయాధర్వణులపక్షమునను ధా.వి.లు ద్రు.ప్ర.లు గావు.

ఇంక నీసూత్ర మప్పకవీయమం దున్నది ప్రక్షిప్తమే
యన్న ధా.వి. లకు వి. వి. సంధినిషేధము చెప్పలే దని గుర్తించరి
కదా. ఇయ్యది నన్యాత్తనుసూత్రమునందలి తద్ధర్మశబ్దమునకు వివర
ణమే యగుటంజేసి వి. వి. అనుసారముగాఁ జిం. మతమునను ధా.వి.

లకు సంధినిషేధము లే దనవలె. అప్పు డీయన్నయాథర్వణులపక్షమున వచ్చుతేఁ డనురీతిరూపములు సిద్ధింపక తప్పవు.

అప్ప. చిం.లో నున్న యీనుగాగమసూత్రము బా.వ. చిం.లోను దాని ననుసరించినవానియందును లేమిఁ బ్రక్షిప్తమే యుండును. నుగాగమవిధానము లేదు. ఇది వాని ప్రు.ప్ర.త్వమును నిశ్చయింపఁగలదా ?

వి. వి. లక్షణమున ధా.వి.లకు సంధి నిషిద్ధము కాకుంట వజ్ఝలవారే స్పష్టము చేసిరి గదా. అయినఁ జిం.లో 'తద్ధర్మోత్రతః' అనుదానికిఁ దద్ధర్మ్మధాతూకారమున కని వజ్ఝలవా రర్థము చేసి తమవలె నర్థము చేయనివారిపక్షమునందు పై వి.వి. లక్షణము చెప్పఁబడినట్లు చెప్పిరి. కాఁగా వజ్ఝలవారివలె ధాతూకారమున కని యర్థము చేయనిపక్షమునఁ జిం., వి.వి.లు రెండింటిమతమునను ధా. వి.లయు కారములకు సంధినిషేధము లే దన్నమాటయే. ఇంకను వి.వి. ననుసరించి చూచిన వీరు ధా.వి.లకు నిషేధించుట చిం. సమ్మతేను గా దనవలె. కాఁగాఁ జిం.లో నైనను ధా.వి.లకు సంధినిషేధము గల దనవలె నన్న వజ్ఝలవారివ్యాఖ్యానపద్ధతి ననుసరించిననే కుదురును. ధాతూకారమున కనురీతిగా నర్థము చేయుటవలనియనౌచిత్యములు స్థలాంతరమున స్పష్టము. (చూ. ప్రకృ.కా. ద్రుతపూర్వస్వరసంధి) కాఁగా నట్టి యర్థ ముచితము గాదు. కాఁగాఁ జిం., వి.వి.మతములు రెంట ధా.వి.లకు సంధినిషేధము లేకుంట సార మైనది.

సంధినిషేధస్వారస్యముచే నిట ద్రుతము లోపింపక చేయునతఁ డిత్యాదు లగు ననిరి. (ఇదియు సరి కాదు) సంధినిషేధము లేమి పైని స్పష్టము. కాఁగా ద్రుతము లోపింపకుంటకు వీలు లేదు. ద్రుతాంతత యనర్థకమే.

వాలాయుంగోవగో శిత్యాదులలో ద్రుతము కన్పించు. కానీ యిట ద్రు ప్ర.లైన ధా.వి లయొక్క ద్రుతలోపము వారింపఁబడుట కేది సాధనము? వఝఃవారిసమన్వయ మచ్చరకతలోనే కుదురలేదు. కాఁగా నిట ద్రుతమును లోపింపఁజేసి యాపిదప నెట్లో సమాగమము చేయవలె నవి ద్రు. ప్ర. లనుటవలనఁ బ్రయోజన మిట్టి ప్రక్రియా గౌరవమే కావలెను.

ససామ్యాత్తిసుసూత్రమునొద్ద ధా.వి.లను గ్రహింపఁగా సంధి నిషేధస్వారస్యముచే ద్రుతలోపము లేదని పేరిమతము. కానీ సంధి నిషేధమునకు ద్రుతలోపమునకును నెట్టిసంబంధ మున్నదో యర్థమగుట లేదు. సామాసికద్రుతలోపము వచ్చినపుడు సంధినిషేధము వర్తింప వీలు లేదా? అట్లయ్యెను ధర్మార్థకక్రియాపదములందు నావిధానము సార్థకమే యగుటంజేసి వైయర్థ్యమే లేదు గదా. ఇంక సామర్థ్యము నాశ్రయించుట కాధార మేది? ధా.వి. లను మాత్రమే నిషేధము చేయఁబడలేదు. ఇంక ధా వి.లకును గల దని వానిని బ్రత్యేకముగా నుచ్చరింపను లేదు కావున సామాసికద్రుతలోపము వచ్చినచో సంధినిషేధము ప్రవర్తింప నవకాశము లేనప్పు డచ్చటమాత్ర మీ సంధినిషేధము వర్తింపకపోవుఁ గాక. శాస్త్రమున బాధ యేమి? పైఁగా సామాసికద్రుతలోప మగుచో సంధినిషేధము వర్తించుటలో బాధ యున్నదా? ధా.వి లు ద్రు.ప్ర. లైనపేరిమతములో సామాసిక ద్రుతలోపానంతరము సంధ్యభావముచేత యశ్రుతితో రానియది యనుకీతిరూపములు లేవా? అట రా నది యని సంధి వచ్చినరూపము లేదు గదా. కాఁగా సంధిర్నాచోఽచ్యుత యనుదానిచే సంధి నిషిద్ధమే. ఇంకను వి.వి. 'వినా లవర్ణం నో సంధిః మిశ్రితత్సమయో ర్యుకి' యున్నది. అచ్చో సామాసికద్రుతలోపము రాఁగా లవర్ణమునకుఁ దప్ప

మిగిలినయకారములకు సంధి లేదని వజ్ఝలవారును వ్రాసియున్నారు. అచ్చట ద్రుతము లోపించినను సంధినిషేధము వర్తింపలేదా? అట వర్తించినది యిట **మాత్ర**ము మేల బాధిత మవుచున్నది. చెలువమూనన మనురీతిగా నట యశ్రుతి వచ్చుచున్నది. అట్లే యిటను యశ్రుతి వచ్చి చేయుయతఁడు చేసెడుయతఁడు అనురీతిగాఁ గావలయును. ఉత్త్వముపై యశ్రుతి ప్రయోగవిరుద్ధ మనుమాట యథార్థమే. కాని ప్రయోగవైరుధ్యము ననుసరించి ద్రుతము లోపింప దనవచ్చునా? అయినను నట్టియెడ సంధినిషేధస్వారస్యముచే నని కాక ప్రయోగవైరుధ్యము కారణముగాఁ జెప్పవలయును గదా. శాస్త్రమునం దెట్టి యాధారము లేకుండఁగాఁ బ్రయోగైకహేతుత్వమునుబట్టి నిర్ణయింప వలసివచ్చుచో నిట్లే యేల? ధా. వి. లీయవి కళలే యనియుఁ బ్రయోగనాస్త్యముచేత సమాగమ ముగు నని యేని జెప్పవచ్చుఁ గదా.

ఒకవేళ వజ్ఝలవారిమతము ననుసరించి సంధినిషేధ మిట యున్న దన్నను నది కారణముగా ద్రుతము లోపింప దన వీలు లేదు. అందుకే గాణపత్యగ్రంథమున స్త్రీనుతిలోపాభావము (సంధినిషేధము నకు బదులుగా) ప్రత్యేకముగా సూత్రింపఁబడిన దని గుర్తింపఁదగును. అయినను ధా.వి.లకు సంధినిషేధము (స్పష్టముగా) చిం. గాని వి.వి. కాని పేర్కొనలేదు. పేర్కొననిదానిం బురస్కరించుకొని చేయుయతఁ డనురీతివానింగూర్చి ప్రశ్న యేల? ఇట్టియపరూపముల యాపత్తి వజ్ఝలవారి వివరణమునఁ బసే గదా కల్గినది. అయిన ధా.వి.లు ద్రు.ప్ర.లు గా నన్నను చేయుయతఁ డనియే కావలయును గదా యనవచ్చును. సమాగమము చెప్పలేదు గదా. కానీ యప్పు డది యనుక్తలక్షణ మగునే కాని యపరూపములను సాధించు ప్రసక్తి శాస్త్రమునం దుండదు గదా. ఉదాహరణమునకుఁ దెలుఁ

గుణ ద్వంద్వసమాస మేర్పడుటఁగూర్చి చిం. నియమింపలేదు. అట్లని తన్మతమున మగబిడ్డలుఁ (మగఁడును బిడ్డలును) ననురీతి యుపరూపము లేర్పడుచున్న వని చెప్పవచ్చునా? ఇట్లే వి.వి.లో.

ఇఁకఁగా నస్వాతంత్ర్యసందర్భమున ధా వి.లు గ్రహింపఁబడు చున్నటను, సంధినిషేధస్వారస్యముచే ద్రుతలోపము లే దనుటయుఁ గుదురునవి కావు.

స్థలాంతరమున 'తద్ధర్మాద్ధర్మకవిశేషణధాతూకారమునకును బర రూపసంధినిషేధముచేతనే యిష్టరూపసిద్ధి గల్గుటంచేసి ధాతుపదసమ్భవానా మిత్యాదిపునరుక్తమగుచుఁ బ్రక్షిప్తముగాఁ దలంపఁబడుచున్నది. (౩౮౦) అని వీరు పేర్కొనిరి. వచ్చెఁడు మున్నగురూపము లథర్వణ మతానుసారముగా నివారించుట కిది ప్రక్షిప్తముగా దన్నవీరే యిచట నిట్లు పేర్కొనుట వింతయే. మఱి యీపక్షమునందు వారి యథర్వణునిమతమున వచ్చెఁడువంటిరూపములనే సాధింతురా? వీరివలె వ్యాఖ్యానింపనిపక్షమున నథర్వణుఁ డట్లు, పేర్కొనె ననుటచేఁ దదనుసారముగాఁ జింతామణియు నిట్టిరూపములే సాధించు నందురా? ఇంకఁ బైపరిశీలనమువలన నిష్టరూపసిద్ధి గల్గుట లేదు గావున ధాతుపదేత్యాద్యప్పు. చిం.సూత్రము ప్రక్షిప్తము గా దనవలయునా?

అన లప్పు. చిం.సూత్రములు ప్రక్షిప్తము లనియుఁ గా దనియు నిర్ణయించుటకుఁ బ్రమాణ మేది? బా.న. చిం.లో నుక్తము గాని యంశము పునరుక్తమయ్యెడునవకాశము లేదు గావున నట్టిదప్పు. చిం.లో నున్న దది ప్రక్షిప్తము గా దనియు నన్నయకర్తృకమే యనియు నిర్ణయింపవచ్చునా? లేక యథర్వణోక్తమును గానఁ జే యది పునరుక్తము గా దని యప్పు. చిం. పాఠము ప్రక్షిప్తము గా దనవలెనా? ఇట్టి ఈపద్ధతిలోని సామంజస్యముగూర్చి విచారింపఁ బని

లేదు. అప్ప.చిం.లో నొకటి ప్రక్షిప్తమును మఱియొకటి గా దనియు నిర్ణయించుటకుఁ బ్రబలములును బ్రమాణములు నైన చారిత్రకాద్యాధారములింకే వేని జూపఁదగును.

కాఁగా బా.స. అప్ప. ప్రభృతు లగునాయా వ్యాఖ్యాతలమతము ననుసరించి నవ్యాత్మ్యాత్రస్థలమున ధా.వి.లు గ్రహింపకుండుటయే సమంజసము. వానిని గూడ సంగ్రహింప నెంచినయెడల బలాబలపక్షము నంతటియిబ్బందులనుబట్టి ధా.వి.లను గ్రహించుట యెట యుక్తము గాదు.

కాఁగా నీకారణములనుబట్టి ధా.వి.లు ద్రు.ప్ర. లని నిర్ణయించుట యుచితము గా దనకతప్పదు.

ఇవి ద్రు.ప్ర.లే యనుటకు వజ్ఝలవారిం కొకహేతువు నిట్లు పేర్కొనిరి. "మఱియు నుదంతములకుఁ గర్మధారయాదులలో నుమాగమవిధాన ... (సుమ్నాతః తలుకుంజెన్కులు) నయితము వానిద్రుతాంతత్వమును వ్యక్తపఱుపఁజాలును." (88)

ఇచటనే తెల్లందన మున్నప్పటినుమాగమము సైత మిట్టిదే యన్నారు. ఇట్టి దన నెట్టిదో యర్థ మగుట లేదు. పైని గూడ నుదంతములకు నుమాగమము చెప్పుట ధా.వి.ల ద్రుతాంతత్వమును వ్యక్తీకరించుచున్న దన్నారు. సంబంధము స్పష్టము గా లేదు. కాఁగా వారి యభిప్రాయము నిట్లూహింపవచ్చును. కర్మధారయములం దుదంతములకుఁ జెప్పిననుమాగమము ధా.వి.లకు (ఇట్లే తెల్లనుఁకు) విధింపలేదు. అనఁగా నవి సహజముగా నకారాంతములు అని.

కానీ యీయభిప్రాయమూ సమంజసము గాదు. తెల్లాదులకుఁ జిం. నుమాగమము విధింపలేదు. కాని 'తనే చ కుత్రచిదతః'

అని వి.వి. చిం. సూత్రవివరణపు సందర్భమునఁ జెప్పినది. కావున వి.వి. మతమునఁ దెల్లానులు ద్రుతాంతములు గా నన్నమాట విధింపని చిం. మతమున నీమని ద్రు.ప్ర.లు. విధించుచున్న వి.వి. మతమునఁ గళ లై చిం. యభిప్రాయమును వి.వి. తిరస్కరించిన దనవలెను. లేక కారిక చిం. సూత్రవివరణమే యనియు నందువలన నయ్యది చిం-యభిప్రాయమే యనియుఁ జెప్పినఁ జిం. మతమునఁ దెల్లాదివిశేషణములు కళలే యనవలయును. అందు చిం, వి.వి.ల మతమునఁ దెల్లానులు కళలన్న యంశమున విరోధము లేదనవచ్చును

ఇంక ధా.వి.ల సంగతి. 'సమ్మోహిత' యన్నది కర్మవాచకములలోఁ బరుషసరళపరకత్వమునకే సమాగమము చెప్పియున్నను ధా.వి.లకుఁ జెప్పలేదు. అంతమాత్రాన నవి ద్రుతాంతములు లగుటెట్లు? చేయుకోడుకు మొదలగువిధమున హల్పరకత్వమున ధా.వి.లకు సమాగమము గన్పట్టదని వారే చెప్పినారి గదా. "చేయు-చేసెడు మున్నగుధాతుజవిశేషణములయందును సమ్మ భారతాదిప్రాచీన కావ్యములందెంతమాత్రమును లేదు." (337) కాఁగా వీనికి సమాగమము లేమి విధింపకుండుటయే యుక్తము. తెలుఁగుం జెక్కడను రీతిగాఁ జేయుం గొడుకనురీతి ప్రయోగము లున్నపుడు సమాగమము విధింపకున్నను ద్రుతము గానవచ్చుచున్నది గావున నయ్యది శబ్దమున సహజముగా నున్నదనియు (నందుచేకే విధింపలేదనియు) గావున నవి ద్రు.ప్ర.లనియుఁ జెప్పుట యొప్పును కాని చేయుం గొడుకువంటి రూపములే లేనపుడు సమాగమవిధానము చేయుటవలన నయ్యవి ద్రుతాంతములనుట యుక్తము గానేరదు.

వాలాయంగొనగోళ్లు, చెక్కులఁ బోలుందేనాకులు అని యాధునికప్రయోగములలో నరుదుగ సమాగమ ముండుటను వారును

జేర్కొనిరి. అందుచేతనే ప్రయోగశ్శరణమ్మని యథర్వణుఁడు చెప్పె

నన్నారు. అనఁగా నేమి? ప్రయోగానుసారముగా ధా.వి.లపైఁ
గూడ సమాగమము చేయఁదగు ననియే యథర్వణాభిప్రాయ మైనది.
ప్రయోగశరణము గావున చేయుకొఁడు కిత్యాదులలోఁ బ్రయోగము
లతో లేమి సమాగమము చేయరాదు. వాలారుంగొనగో ళ్లన్నప్ర
యున్నది గావునఁ జేయవలె. ఇట్లు ప్రయోగములం దున్నపుడు సమా
గమము చేయవచ్చు నని యథర్వణుఁ డంగీకరించినట్లు వీరివివరణము
ననుసరించియే స్పష్ట మగుచుండఁగాఁ గర్మధారయములో సమాగమము
తెలుఁగు మొ॥ వానికే యన నేల? ప్రయోగానుసారముగా నువంత
ధా.వి.లపైఁ గూడ విధింపఁబడియే యున్నది గదా. పైఁగా ఉవంతి
శబ్దముచే నుదంతములైన ధా.వి.లను గ్రహింపరా దనుటకు నాధార
మేమి? అట్టియాధారము లేదు గనుకనే గదా వీరు ప్రయోగములందు
లే దని సమర్థించుకొన్నారు. ధా.వి.లు స్త్రీసమము లనియే వీరియభి
ప్రాయము. అమిశ్రే స్త్రీసమాస్త్రసుచో నివి యేల గ్రహింపఁబడవు?
తెలుఁగు అనుదానిపై సమాగమము (స్త్రీసమ మగుట) వచ్చినట్లు
చేయు చేసెడు అను స్త్రీసమములపై రాక తప్పునా? అందుకే ధా.వి.
లకుఁ బ్రయోగములందు లే దని వీరికి సమర్థించుకొనవలసియవసర
మేర్పడినది. ఇవి స్త్రీసమములు గా వని గమనించితిమి.

ఒకవేళ ధా.వి.లు ద్రు.ప్ర.లే యైనను నాద్రుతములకు
సమాసమున లోపము చేసికొనకతప్పదు. 'వాలారుంగొనగోళ్ల'ననుచోఁ
బ్రయోగానుసారముగా (నీద్రుతాంతములచివరిద్రుతమునకు లోపము
చేసి యాపిదపనే) సమాగమము చేయవలసియుండు. (రామునాజ్ఞ
మొదలగువాని ప్రక్రియను స్మరింపఁదగు) ధా.వి. ద్రుతాంత మన్నవారు
ద్రుతమునకు లోపము చేసి సమాగమము చేయఁగలయనువా

బట్టి దృతిలోపరూపప్రక్రియాగాగమము లేకయే సమాగమము చేయుదురు.

అసలిది యిట్లుండఁ బ్రాచీనకావ్యములం దెట్టియెడ ధా.వి.లపై సమాగమము లేదు గదా. ప్రయోగానుసారముగా వాలాకుం గొనగోళ్ల నిత్యానులందలి సమాగమము సాధింపఁ జెప్పుటకుఁ దత్కర్త యెప్పటివాఁడు ?

కాఁగా నేవిధముగాఁ జూచినను నుదంతములకుఁ గర్మధారయములఁ జెప్పినసమాగమమువలన ధా.వి.ల ద్రు.ప్ర.త్వము వ్యక్తమగుచున్న దనుట సమంజసము గానేరదు.

ఇట్లే నల్లందవ మున్నప్పటిసమాగమము సైతము ఏవి ద్రుతాంతత్వమునకు వ్యంజకము కానేరదు. "ధాతుజవిశేషణములతో పాటు గుణవిశేషణములును జింతామణిపక్షమున ద్రుతప్రకృతికము లే యనకతప్పదు" (67) అనుటయు సరి కాదు. నల్లాదులు సయితె యొక వేళ ద్రు.ప్ర. లన్నను వద్ధితవృత్తిలో నాద్రుతము లోపింపకతప్పదు. ఆపిదపనే సమాగమము. కాఁగా వజ్ఝలవారు ధా.వి.లును వానితో పాటే నల్లాదిగుణవిశేషములును ద్రు ప్ర. లనుటకును జూపినహేతు వేదియు సముచితము గా దనియు నింకను నావివరణమునుబట్టి ద్రు. ప్ర.లు గా వనియో (తఱుకు మొ॥ వానింబట్టియు) నిశ్చయింపఁదగి యున్నది.

ధా.వి.లతోపాటు గుణవిశేషణములును జిం. పక్షమున ద్రు.ప్ర. లనకతప్ప దందురు గాని యంత తప్పనికారణ మేమియుఁ గానరాదు. ఇంక తనే చ కుత్రచిదతః అనియుఁ బ్రయోగశ్శరణమ్మనియుఁ జెప్పినది వి.వి. కావున వి.వి. మతమున సీనువి ద్రు.ప్ర. లన నక్కరలే దనునభిప్రాయముతోనే వీరొకవేళఁ బైని 'జిం.

పక్షమున నని యున్నారేమో యున్న నట్లును జెప్పనక్కరలేదు. ధా. వి.లపైఁ బరుషసరళపరకతలో సమాగమ మాధునికము. ప్రాచీన ప్రయోగములు లేమిఁ జెప్పకుండుటయే యుచిత మని స్పష్టము. (గుణవిశేషణములసంగతి పైని స్పష్టము.)

ఇంకఁ జిం. పక్షమున నీధా.వి.లు ద్రు ప్ర లే యనకతప్పని హేతు వేదియు లేమి స్పష్టము (వ్యాఖ్యలవారు స్పష్టము చేయుచున్నను నీయవి) కళలపట్టికలో ననఁగాఁ దిఙ్మధ్యశేషషష్ఠీత్యాదిను త్రిమున గణింపఁబడియుండమింజేసి యన్య యనుసూత్రముచే ద్రు.ప్ర.లు కాక తప్ప దని యూహింపవీలులేదు. అట్టియెడల నందు గణింపని వచ్చుచున్నాఁడు రామునికై మొదలగునవియు ద్రు.ప్ర.లే కాకతప్పదు. అంతే గాక యందుఁ జెప్పఁబడినవే గ్రహింపవలసివచ్చుచో నాలక్షణమున నింక నాద్యశబ్ద మేల? ద్రుతో న యేషాం న్యాస్య త్తేనునిర్ణయ మేల? కాఁగాఁ బ్రయోగానుసారముగాఁ నందుఁ బఠింపకున్నను నాద్య శబ్దముచే ధా.వి.లను సల్లాదిగుణవిశేషణములను గళలుగా గుర్తింప వచ్చును. సూరి వీనిని ద్రు.ప్ర.లలోఁ బరిగణింపలే దనియే వీ రివి సూరిమతమునఁ గళలుగా నిర్ణయించి రేమో. ధా వి ల విషయమున నది యొప్పదు.

ఉదంతము లగుధా.వి.లకు నచ్పరకత్వమున సమాగమము గలమాట నిజమే. దానికి సమ్మోచిత యన్నదానితో సంబంధ మెంత వఱకు? అనుక్తలక్షణముగా గ్రహించుట కొంతవఱ కేని యుక్తము కావున ధా.వి.లు (గుణవిశేషణములు) ద్రుప్ర. లనుట కెట్టియాధార మును లేదు.

ఇంక ధా.వి.లు ద్రు.ప్ర. లనుటవలన నష్టములే కల వని యిట్లు సారాంశము గుర్తింపనగు. భాషయందివి ద్రుతాంతములు గాకయే

కనిపించుచుండఁగా ద్రు.ప్ర. అని నిర్ణయించుట అన్య ద్రుతప్రకృతయ యనుఁ లక్షణమునకే విరుద్ధమగుచున్నది

ప్రక్రియాగౌరవ మేర్పడుట యున్నది పెద్దలోపము. ఇవి ద్రు.ప్ర. లన్నను హల్పరకత్వమున ద్రుతస్య సర్వత్ర అని నియతముగా లోపము చేయవలసియున్నది. ఇవి యెప్పుడును విశేష్యముతో సమసించియే యుండు నని వీరు చెప్పిరి. (89) కావున నెప్పుడు సమాసమునే యుండుటచే లోపింపక నిల్చియుండుస్థితి యెచ్చటను లేదు. ఉదంతము లగువానికి సైతము ద్రుతలోపము రాకతప్పదు. చేయునతఁడు ఇత్యాదులందలి నకారము నన్యథా సాధించికొనవలసినదే కాని ధా.వి.యొక్క ద్రుతమే లోపింపక నిల్చియుండె నని భావింప నవకాశము లేదు. వాలాయింగొనగోళ్లు (నల్లందనము) ఇత్యాదులు సైతము సాధింపఁ దలఁచినచో వజ్ఝలవారు పేర్కొన్నట్లుగా 'ప్రయోగశ్శరణం కిం వేః' అనుదానిచేతనే సాధించుకొనఁదగును. అయ్యది చిం. కూడ సాధింపకతప్ప దన్న సా.వి. వచనము చిం. వివరణమే కావునఁ దద్వివరణానుగుణముగ సామ్యాతి యనుదానిచేతనే గుర్తింపవలె. ఏమైనను (సారియుఁ బ్రస్తావింపని) ఈ సాధువక్రప్రయోగములు చిం., వివి.లచే సాధింపవలె ననునాగ్రహమే యనవసర మనుచితము. చేయునతఁడు ఇత్యాదులకై మా.ద్రు.కా.ద్రుతపూర్వస్వరసంధి. ముందు ద్రుతమునకు లోపము చేసి యాపిదపనే సున్న చేయవలె. కాఁగా నీద్రు.ప్ర.లద్రుతమున కెల్లయెడల లోపము చేయవలసియే యుండుట ప్రక్రియాగౌరవమే కాని ప్రయోజన మేమియు లేదు.

వజ్ఝలవారే 'ధాతుజవిశేషణములు ద్రుతప్రకృతికములే యైనను నవి సదా విశేష్యములతోఁ గర్మధారయముగ సమసించుచుండును గాన వాని ద్రుతమునకు సదా సామాసికలోపము కల్గును.

ఇట్టిస్థితి నరసింహుండే కావలయు నూరి ద్రుతాగమమును విధింపక వానిని గళలుగ సాధించె' (వ్యా.సం.స. 88) ననిరి. ద్రుతము సదా లోపించుటను గుర్తించియు వీరు వా.ప్ర.లు ద్రు.ప్ర.లే యనుట యుచితము గా దని వారివచనములవలననే యిట స్పష్టమగుచున్నది గదా.

వీనికి విశేష్యముతో నియతముగా సమాసము సంగీకరించుటనే వజ్ఝలవారిమతమున వా.వి.లు వ్యస్తం. గాఁ బ్రయోగింపఁబడవలసివచ్చినది. కాఁగా వచ్చెడువాఁడు మొదలగునవి నయితము వీరిమతమున సమాసములే యైనవి. అట్లుగాక బాల.లోవలె వచ్చెడు వాఁడు మొ॥ వ్యస్తము లన్న ద్రు.ప్ర.పక్షమున (సంధినిషేధము సాధించుకొన్న) వచ్చునతఁడు వచ్చెడునతఁ డనురీతివి సిద్ధింపఁగలవు కానీ వాల్పరకస్థితిలో సమరూపము లగును. వచ్చెడున్ + వాఁడు అనుచో స్థిరపరకత్వములో ద్రుతము లోపించి వచ్చెడువాఁ డని యగు. లుగ్వా యనుటచే లోపము లేనపుడు సంశ్లేషద్విత్వము లయి వజ్ఝల వారిమతమున వచ్చెడున్ వాఁడు వచ్చెడు న్వాఁ డనియు నహో. మతములో వచ్చెడు న్వాఁడు వచ్చెడును వాఁ డనియుఁ గావలసి వచ్చును. ఇట్లే యితరస్థలములందుఁ జేసెడినట్టివాఁడు రానినట్టివాఁ డనురీతిగాఁ గూడ సమరూపము లె న్నని చెప్పవలసియున్నది. వచ్చెడువాఁ డనురీతివానిని వజ్ఝలవారొక్కచో వ్యస్తములుగాఁ గూడ నంగీకరించిరి. (447) అందుకే వజ్ఝలవా రీచింతామణ్యాదుల పక్షమున నెల్లయెడల సమాసముగనే సమన్వయించిరి. ఈయవి సమాసము లనుట విచార్యము.

చేసినన్-చేయనిన్ వంటివి స్త్రీసమము లగు ననియు నిట్టి వానికిం బైని సువిభక్తి లోపించు ననియు (481) అనుకూం స్త్రియాం అను మొదలగుసూత్రములయొద్దఁ జెప్పినిరి. ప్రథమైకవచనమునందు

వచ్చినన్ - దానిన్ మొదలగువిధముగా నేర్పడుచున్నయీయవి ప్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడ వని వారినిర్ణయము. నిజమునకుఁ దెలుఁగునఁ దెల్లాదు లగువిశేషణములును విభక్త్యంతము లయి - యుండఁగా వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడుట గానరాదు. వానివలె చేసినన్ వచ్చినన్ మొదలగునీధా.వి.లు కూడ విడిగాఁ బ్రయుక్తములు గాకుండుట యొకలోపము గా దనవచ్చును. సూరి విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దముఁ బ్రయుక్త మవుటను జెప్పి వచ్చినవాఁడు మొదలగురీతిగా ధా.వి లు ప్రథమాదివిభక్త్యంతము లై ప్రయోగింపఁబడుటను సాధించియుండెను. వజ్ఝలవారిమతమున నీయవి తచ్ఛబ్దముతోనైన సమాసములు.

“పెద్దచిన్న మొదలగుధర్మివాచకములు స్త్రీసమవిశేషణములు గావున వానిపయి షష్ఠీవిభక్తి నిలుపనేరదు. కానిఁ దద్ధితవృత్తివిగ్రహారచనకై వానికి విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దముతో నవి సమసించు” (1262) అనిరి. ధా.వి. లిందే చేర్పఁబడినవి. కానీ వీరు బా.సా.పే.ను విమర్శించునపుడు తప్ప (406–407) బాల.లోఁ గూడ నిట్టివి సమాసము లనుట మిక్కిలివిరుద్ధము.

సూరి విభక్తి వివక్షించునపు డని సామాన్యముగాఁ జెప్పఁగా వీరు తద్ధితవృత్తివిగ్రహారచనకై విభక్తి వివక్షించునపు డనుట విశేషమే. అప్పుడుమాత్రమే యిట్టి దంగీకరించినయెడల వచ్చినవాఁడిత్యాదు లెట్లు సిద్ధించును? చిం.లోను శబ్దాత్తచ్ఛబ్దాత యనుచోరానిది ఇత్యాదులు సిద్ధించుచున్నవి గదా. అట్టిచోట్ల తద్ధితప్రసక్తి యసలే మున్నది. ఇచ్చోటిసమాస మెట్లు? విభక్తివివక్షించునపుడు తచ్ఛబ్దముతో సమాస మనఁగా నప్పటికింకను విభక్తివివక్షయుండే యున్నది గావున ధా.వి.సుబంతము కాలేదు. వారే స్పష్టము చేసిన (1109పుట) సమాసలక్షణమునుబట్టి యిట సమాస మెట్లు?

సూరిగారి మతమునకు (సరి కాని) వ్యాఖ్య చేయునప్పుడైనఁ గొంత జాగరూకతతోఁ జెప్పుట గనిపించు. స్త్రీసమములు గావున వానికిఁ బ్రథమైకవచనలోపము గల్గి పదత్వము సిద్ధించును. అట్టి విశేషణము విశేష్యముతోఁ గర్మధారయముగ సమసించును. ఇట్టి ధాతుజవిశేషణములు తచ్ఛబ్దార్థకము లగు అది-అవి-వాఁడు మున్నగువానితో సమసించు. కాని యందలి తచ్ఛబ్దార్థమున కర్థవిశేష ముండదు (1175) ఇటఁ బ్రథమైకవచనలోపముచే (స్త్రీసమత్వమువలనఁ) బదత్వము సాధించియుండుటచే సమాసము గుదురుపడియున్నది. అట నట్లు చెప్పియు నిట సమాసలక్షణమును బొసఁగకుండ విభక్తి వివక్షించునప్పుడు తచ్ఛబ్దముతో సమసించు ననుట యుక్తము గాదు గదా.

ఇంక వీ రనుసరింపవలసినమార్గము నిట్లూహింపవచ్చును. ధా.వి.లు స్త్రీసమములై ప్రథమైకవచనలోపము నందును. ఇవి యెప్పుడును విశేష్యముతో సమాసము నందియే యుండు. ధా.వి.లు విడిగాఁ బ్రయుక్తము గావు. తచ్ఛబ్దముతో సమసించియే యట్టియెడలఁ బ్రయుక్త మవును. తద్విగ్రహము సంతత మిట్టి తచ్ఛబ్దముతో సమసించిన ధా.వి. రూపముపైనే జరుగు ననుకొని యెన్నుట వా రనుసరించినసంప్రదాయమునకు ననుగుణము. కాఁగా విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దముతో సమసించు ననుటయే పొరపాటు. అట్టియెడ నాకొన్న వానియొక్క అనుసమాసరూపముపైనే తద్ధితమును జేయఁదగును.

స్పష్టముగాఁ జెప్పనిచో, ధా.వి.లపక్షమున వీ రిట్లన్న ట్లుండుఁ గాక. స్పష్టముగాఁ జెప్పినసూరిమతమునకు భిన్నముగాఁ జెప్ప నేల? విభక్తి వివక్షించునప్పుడు ధా.వి.లకుఁ దచ్ఛబ్దమునఁ బ్రయుక్తమగు నన్నదానికి సమాసముగా సమన్వయము గుదరదు విభక్తి యింకను వివక్షావస్థలోనే యున్నది గాన నిప్పటికి ధా.వి.లపై విభక్తి

చేరలే దన్నమాట. ధాతుప్రకృతికము లుబ్బన్నప్రత్యయ మైనది కావునఁ
దదంతము కృదంతము. కాఁగాఁ బ్రాతిపదికము. ప్రాతిపదికమగుఁ దచ్ఛబ్ద
ముతో సమాస మైన దని వ్యాఖ్యలవారియభిప్రాయ మన్నమాట. (ఇం
కను విభక్తి వివక్షలోఁ దచ్ఛబ్దముతో సమాసమున నాతచ్ఛబ్దమును
బ్రాతిపదిక మైన రెండుప్రాతిపదికలకు సమాస మగును.)

సూరి యీతరవాతిసూత్రమున నెల్లయెడల ధాతుజవిశేష
ణముల కట్టియుపపదము విభాష ననుప్రయుక్త మగుటను విధించెను.
ఎల్లయెడల ననుటచే సమస్తవ్యస్తస్థితులు రెంట నని తత్తద్వ్యాఖ్య
లలో స్పష్టము. (ఘం బా వి.) వచ్చినట్టిరాముఁడు వచ్చినట్టివాఁ డను
నచ్చోటిలక్ష్యము లీయంశమును స్పష్టము చేయఁజాలియున్నవి.
విభక్తి వివక్షించునపు డనునాసూత్రమునందలిదళమును నిచ్చటియభి
ప్రాయమునే చెప్పుచుండె. కాని వ్యాఖ్యలవా రది సమాస మనుమ
నందలితచ్ఛబ్దార్థమున కర్థవిశేష ముండ దన్నారు (1175) ఆలుశ్శ
మర్థము మాఱఁగా నిరూపించిన సూరి యిచ్చటఁ దచ్ఛబ్దము తిష్ఠకము
గా దని యేల చెప్పలేదు? దీనికిఁ బూర్వముసూత్రము 'సర్వశబ్దంబులు
సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు' నని చెప్పుటచే నచట
సమసించినతచ్ఛబ్దము సంబంధార్థమాత్రమే కలిగియుంట స్పష్టము.
ఈసూత్రమునందలిసమాసముల కట్టియవకాశము కల్పింపఁ డేల ?
(విభక్తి వివక్షించునపుడు) అనుప్రయుక్త మనుటవలననే యర్థవిశే
షము లే దని స్పష్ట మగుచుండుటనుబట్టి. కాను ననుప్రయుక్తము గా
సూరి విధించుటను విమర్శించువారు వ్యాఖ్యలవా రనుప్రయుక్త మనుటవలన
నది యర్థవంతము గాకుండఁబోయిన దనుట గమనింపవచ్చు. (చూ.
బా.సూ.)

ఈసమాసప్రకరణమున ధా.వి.ల విభక్త్యంతరూపముల నేల ప్రస్తావించె నని యనుమానము గల్గవచ్చును. (తత్సమపరిచ్ఛేదమునందో లేక యాచ్ఛికపరిచ్ఛేదమునందో చెప్పఁదగు నన్నమాట.) కారకపరిచ్ఛేదమున షష్ఠీసమానవర్ణకము చెప్పుట స్మరింపఁదగు. సర్వశబ్దంబులనుపూర్వసూత్రము షష్ఠ్యంతములకుఁ దచ్ఛబ్దముతో సమాసము చెప్పుచున్నది. ధా.వి.లకుఁ దచ్ఛబ్దమే భిన్నస్థలమునఁ జేరుచున్నది. అట్టి పదానుప్రయోగము ధా.వి.లకు సమస్తవ్యస్తస్థితులు రెంటఁ గలదు. దానినే తరువాతిసూత్రము చెప్పుచున్నది. ఇట్లు నడుమ ధా.వి.ల విభక్త్యంతరూపనిరూపణ మిట సుప్రసక్తమై యున్న దని గ్రహింపఁదగు. పూర్వసూత్రమున సమసించుటను బేర్కొని యిట ననుప్రయుక్తమగు ననుటయు నీయంశమున స్పష్టము చేయుచున్నది.

ఇంక నిట్టియభిప్రాయమునుబట్టి చూడ వీనిని సమాసములనుటయే యనవసర మని గుర్తింపఁదగియున్నది. విభక్తి వివక్షలో వీనికిఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగు నని సూరి చెప్పఁగా వీరు త్రిసమములై ప్రథమైకవచనము లోపించి యెప్పుడును దచ్ఛబ్దముతో (ఇతర విశేష్యములతో) సమసించియే యుండు ననుచున్నారు. ఇతరవిశేష్యములతో సమసించినపుడు వచ్చినరాముఁ డిత్యాదిస్థలములలో నావిశేష్యమున కర్థమునఁ బ్రాధాన్య ముండును. తచ్ఛబ్దముతో సమసించినపుడుమాత్ర మాతచ్ఛబ్దమున కర్థవిశేష ముండదు అందలివిశేషమేమి? అట్టియర్థవిశేషము లేమిని నజ్ఝలవారు 'సంబంధే క్వచిదర్థః స్యాదసంబంధే విలక్షణః'- అను వి.వి.వచనముచే సాధించిరి. ఇది సరి కాదు. వ్యస్తతయం దొకయర్థము గలిగినశబ్దము సమస్తతలోఁ దద్విలక్షణార్థము నిచ్చుచున్న దని యాకారిక చెప్పుచున్నది. అది వీరును జెప్పిరి. ఆలుశబ్దము వ్యస్తతలో భార్యార్థక మైయుండఁగా ధీనురాలు

ఇత్యాదికర్మధారయస్థలములందు వద్యలక్షణముగా స్త్రీయనునర్థము మాత్రమిచ్చుచున్నవి. అది లక్ష్యము.

కాని ప్రస్తుతస్థల మట్టిది గాదని గుర్తింపదగు. వ్యస్తత యందు దదర్థక మైనతచ్ఛబ్దము ప్రస్తుతసమాసములలో (వచ్చినవాఁడు) నర్థవిశేష మేమియు బోధించుట లేదు. తదర్థకము నగుట లేదు. మఱి యర్థవైలక్షణ్యమున కీయది లక్ష్య మగు టెట్లు ?

ఇంక నీయవి స్త్రీసమము లనియుఁ బ్రథమైకవచనము లోపించు ననియుఁ జెప్పిరి. కాని యివి యెప్పుడును విశేష్యముతోనో తచ్ఛబ్దముతోనో సమసించియే యుండవలయుటచే వచ్చెడున్ మున్నగు రీతిగాఁ బ్రథమైకవచనాంతములుగాఁ గూడఁ బ్రయుక్త మవుటయే లే దన్నమాట. అట్టియెడల వీనికిఁ బ్రథమైకవచనలోపమును నందులకై స్త్రీసమత్వమును జెప్పవలసినయక్కర యేమి ? అనఁగా విశేష్యములతోనో లేక తచ్ఛబ్దముతోనో సమసించుటకుఁగాను వీనికిఁ బదత్వము సిద్ధింపఁజేయుటకయి వీనిని స్త్రీసమము లన్నా రన్నమాట. కాఁగా వీని స్త్రీసమత్వమువలనఁ బ్రయోజనము సమాస మగుటయే. ఆసమాసమును దచ్ఛబ్దముతో జరుగునప్పుడు తచ్ఛబ్దమున కర్థవిశేషము లేదు. దీనివలన నీవచ్చెడు మొదలగువానివలెనే ప్రహరించెడు మున్నగు తత్సమవిశేషణములు సైతము విభక్త్యంతములుగాఁ బ్రయుక్తములు కా వని చెప్పవలసియున్నది. స్త్రీసమము లగుట మొదలుకొని యేర్పడినయిబ్బందులను దొలఁగించినచిన్నయప్రణాళిక యెంతయు నుచిత మైయున్నది.

విభక్తి వివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగవిధానమువలన నాతనిమతమున నీయవి స్త్రీసమము లన నక్కర లేదు. దీనివలన చేయు

కొండుకు మున్నగు సమాసములలో సంగాగమము మొదల గుచువాని ప్రసక్తి వారింపఁబడినది.

విభక్తివివక్షలో ధా.వి.ల కనుప్రయుక్తమవునదిగాఁ జెప్పి టంజేసి తచ్ఛబ్దము తదర్థకము గాకుండుట సముచితముగా సాధింపఁ బడినది. విభక్తివివక్షలోఁ జెప్పుట నాయావిభక్తులయందు వచ్చిన వాఁడు వచ్చినవానియందు ననురీతిగా వ్యస్తముగాఁ (వత్తిద్వౌభక్త్యం తముగాఁ) బ్రయోగము సాధింపఁబడినది.

ఇట్టిసూరిప్రణాళికలో వీనిని సమాసము లను టెట్లు? అను ప్రయుక్త మనుటచే నీయవి సమాసములు గా వని (406-407) వీరే సముచితముగా బా.సా.పే.ను దిరస్కరించిరి. అమార్గము యుక్తము. వజ్ఝలవారు నీరీతి ననుప్రయుక్తముగాఁ జేర్చొనక నడపినప్రక్రియలో ప్రయోజనము, వి.వి. ఐనను సాధించినమార్గము సముచితముగా లే దని మాత్రము చెప్పఁదగియున్నది.

అయినఁ జిన్నయవలెఁ జిం. గాని వి.వి. కాని యిట్టితచ్ఛబ్దానుప్రయోగమును జేర్కొనియుండ లేదు గదా. తన్మతమున సమన్వయము వజ్ఝలవారిపద్ధతిలోనే నడపవలయునా? అని సందేహము గల్గుట సహజము.

కాని యాదృశవిధేయ వర్తమానార్థకక్రియారూపము లన్నింట నిట్లే (తచ్ఛబ్దానుప్రయోగము గలధా.వి.గా) ప్రయోగించె నని వజ్ఝలవారు స్పష్టము చేసిరి. (1327)

పొరపాటునఁ గావచ్చును గాని వజ్ఝలవారు వికృతివివేక మునందు ధాతుజవిశేషణములకుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగుటను గూర్చి ప్రస్తావించిరి. నామ్నః తచ్ఛబ్దానుప్రయోగము లేనిశబ్దములకు

సూత్రితమే - ఇట్లనుటచేత నుముపురు - అనునవి ద్రవ్యగుణవాచక
శబ్దములకును క్రియాజన్యవిశేషణములకును బరముగా నయితము నిలుచు
చుండును (1089) అని చెప్పి వల్లనివాఁడను వచ్చినవాఁడను అని చూపి
యుండిరి. దీనిఁబట్టి 'వచ్చినవాఁడను' అన్నప్పటితచ్ఛబ్ద మనుప్రయుక్త
మయినట్టే దని వి.వి.అభిప్రాయముగాఁ దేలినది. అనుప్రయుక్త మైన
దని చెప్పుటవలన నియ్యది సమస్త మయ్యెడునవకాశము లేదు. కా
దని వీరే చెప్పిరి గదా. (406-407) 'నామ్నః' అనుదానికి కీయర్థ
మున్నదా? మున్నగునంశము లప్రస్తుతములు గ్రంథాంతరమున స్పష్టము
లగు. పైని దచ్ఛబ్దానుప్రయోగ మున్నరూపములవిషయము చెప్పఁ
బడినది. కాని తచ్ఛబ్దానుప్రయోగమును జెప్పినలక్షణమును నాగ్రంథ
మున వ్యాఖ్యలవా రెచ్చటను జూపియుండలేదు. ప్రయోగప్రసిద్ధ
మైయున్నయద్దాని నెట్లు గుర్తింపవలెనో సూక్ష్మేక్షణమున.

ఉన్నకలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారమునకు లోపము
చెప్పునది వి.వి.లోని 'తచ్ఛబ్దవస్య లోప స్స్యా దథాతోః క్వచిదేకతా'
యనునది ఇటఁ దచ్ఛబ్దవకారమునకు లోపము చెప్పుట నాధారముగాఁ
జేసికొని ధా.వి.లపైఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగుటను జ్ఞాపకము
చేసికొనుట యుచితముగా నుండు నేమో యని తోఁచుచున్నది. నవ
ర్ణకమును విధించకయే చిం. 'కేషాంచిదుదంతానాం నేతివిభక్తా వునో
లుక్స్యాత్' అని యున్లోపమును జెప్పెను. ఉన్లోపవిధానము ననుస
రించి యాసూత్రముచేతనే ఊరుసన్-ఇత్యాదులందును వనమున
ధేనువునన్ - ఇత్యాదిస్థలముల నుదంతములపై నవర్ణకము జ్ఞాపిత
మయినట్లుగా నిచ్చట ధా.వి.లపైని దచ్ఛబ్దవకారలోపవిధానమును
బట్టి తచ్ఛబ్దానుప్రయోగమును జ్ఞాపితము చేసికొనుట యుచిత మగు
నని తోఁచుచున్నది.

వజ్ఝలవారికారికయొద్దఁ గూడఁ దచ్ఛబ్దముతోడి సమాస మనురీతిగనే వివరించిరి. కాఁగాఁ బైని 'నామ్నః' అనుచో ననుప్రయుక్త మనురీతిగా నర్థము చేయుట పొరపాటు గావచ్చును. బాల.లోఁ గలిపి వివరించుటవలన (చిం.,వి.వి.లను) నిట్టితడఁబాట్లు గలిగియుండును.

అయిన నిట వజ్ఝలవారివలె సమాసములనే యేల గ్రహింపరా దనవచ్చును. నిజమున కనుప్రయుక్త మయిన దని చెప్పుటకు బల మైనయాధారము లేదు. కాని 'అదాతోః' అనునది వజ్ఝలవారు చూపిన పాఠము. అథాతోః - అని యహో. చూపినపాఠము. దాని చేతనే నాతఁ డికార్యమును నవర్ణకాంతముపైనే యని చెప్పెను. 'అథాతోరిత్యుక్తేః నస్య నకారాత్పరత్వం జ్ఞాయతే తేన వచ్చువాఁడు పోవువాఁడు ఇత్యాదౌ నాతిప్రసక్తి రితి జ్ఞేయం. ధశరథేశనడుగులకుఁ దప్పినాఁడు' 'అథాతోః' అని చూపి వజ్ఝలవారు అదంతము లెల్ల గ్రహించిరి. అయిన నికార్యము థా.వి.లపైనే యని యహో. వివరణమునుబట్టి స్పష్టము. దానికి సూత్రమున నాధార మేదియుఁ గాన రాదు. ఇదియు నట్లే విశేషముగా గ్రహింపఁదగును. ఇంతకంటె నే యొకయాధారము గానరాదు. ఇందే గొంత యేని సంబంధము గలదు. కావుననే యొట్లో దీనికి ముడిపెట్టుకొనుట యొకమార్గము. థా.వి.లను నదిమాత్రమే గ్రహింపవలెను గాని యూతచ్ఛబ్ద మనుప్రయుక్త మైన దని తలంపరా దన్న నింక నొకమార్గము లేదు. సూరిలక్షణమున కిది కొంతవఱకే నాధార మైనఁ గావచ్చును. అట్లుగాక సమాసము లను రీతిగాఁ బెక్కుబ్బందులను గొనితెచ్చుకొనుటకంటె యుచితమే యని పించుచున్నది.

ప్రయోగములంబట్టియు వజ్ఝలవారి వివరణసారమునుబట్టియు సూరిప్రణాళిక సముచిత మనుట స్పష్టమే. ఆయంశమును నీచిం.,వి.వి.లు

స్పృశింపలే దనఁదగు. (అది యెట్లును దప్పదు. జ్ఞాపితము చేసికొన్నఁ గొంతయాధారము గనుపింపవచ్చు.) ధా.వి. లని చిం. వ్యవహరింపనే లేదు. వి. వి. ఒకచో క్రియాజవిశేషణ మ్మనుట గానవచ్చు. (ఇటఁ గ్రియా చ విశేషణ మ్మని నారా. చూపినది.) ధాతువులకుఁ జెందిన యాయాయురూపములలక్షణము బాల.లోవలెఁ జిం., వి.వి.లలో విస్తృతముగను జెప్పఁబడలే దనుట స్పష్టమే. ఇట్టియంశ మనుక్తకోటిలోఁ జేరుట లోపమును గాదు.

ఇంకఁ దచ్ఛబ్దానుప్రయోగము గలసూరిమతమ్మున (రామాది శబ్దములవలె) ధా.వి.లు ద్రుతప్రకృతికములా? కాదా? యన్నప్రశ్నయే లేదు. ప్రథమైకవచనాంతమైనప్పుడు కళ యగుటయుఁ దదితరవిభక్త్యంతము లైనప్పుడు ద్రు.ప్ర. లగుటయు సిద్ధమే. కావున ధా.వి.లను సూరి ద్రు.ప్ర.లలోఁ జేర్పలేదు గావునఁ గళలలోఁ జేర్పఁబడినట్లును ధా.వి.లు కళ లైనట్లును సూరియభిప్రాయముగా వర్ణించుట సమంజసము గాదు. తత్తద్విభక్త్యంతము లీయవి కళలును ద్రు.ప్ర.లు నాయవి యగును.

ఇంకఁ జిం.,వి.వి.లమతమునను బైకేతి తచ్ఛబ్ద మను ప్రయుక్త మయినదిగాఁ దలంచినఁ బైసూరిమతమే వీనియందును సమన్వయింపఁబడును.

అట్లు గాక తచ్ఛబ్ద మనుప్రయుక్త మని స్పష్టముగాఁ జెప్పమి దానితో సమాన మందురా? అయినను ధా.వి.లు చిం.,వి.వి.లమతాన ద్రు.ప్ర.లు గావనియే నిర్ణయింపవలసియున్నది. ఎట్లనఁగా నీవచ్చెడు మొదలగు ధా.వి.లకు విడిగాఁ బ్రయోగమే లేదు. ప్రథమాబహువచనము మొదలుకొని యేవిభక్తియు లేదు. వచ్చెడులు వచ్చెడులం తని యుండదు గదా. ఇంక స్త్రీసమ మనియుఁ బ్రథమైకవచనలోప

మనియుఁ జెప్పఁగాఁ (ప్రథమైకవచనాంతస్థలమునఁ బహుత్వము)సాధింపఁ బడినది. అయినను నీప్రథమైకవచనాంతము సైతము విడిగాఁ బ్రయుక్త మగుట లేదు. వాఁడు వచ్చెడున్ అది రానిన్ అని యుండదు గదా. ఇంక నిది యెప్పుడుఁ దచ్ఛబ్దాదులతో సమసింపవలె. సమాస మగుట తోనే లోపము తప్పదు. అట్టియెడల వీని ప్రథమాంతతవలనఁ బ్రయోజన మేమి? ఎప్పుడును లోపించు ప్రథమ మున్న దన్న నేమి ప్రయోజనము? లే దన్న నేమి నష్టము. కావున నీయవి ప్రథమాంతములుగాఁ గానన రామింజేసి ప్రథతో న యేషాం స్వాత్త్వనులక్షణమునుబట్టి ద్యా నభిధతి కళా యనుచోటియాద్యశబ్దముచేఁ గళలుగా (వచ్చుచున్నాఁడు రామునికై మొ॥ వలె) గుర్తింపఁదగుఁ గదా.

అస లింతకును ధా.వి.లు స్త్రీసమము లన నేమి లాభము? ప్రథమైకవచనము సైతము తచ్ఛబ్దముతో సమసింపక ప్రయోగింపఁ బడుట లేదు. వచ్చినవాఁ డనియే యుండును గాని వచ్చినన్ అని ప్రయోగింపఁబడుట లేదు. చిం. పేర్కొన్న స్త్రీసమత్వమును సమన్వ యించిన ప్రయోజనము లేదు. అవసర మైనది తచ్ఛబ్దముతో సమసిం చుట. అది చిం పేర్కొననే లేదు. చిం, వి.వి.లు పేర్కొననితచ్ఛబ్ద ముతోడిసమాస మును దంగీకరించునప్పు డశ్లే యేల చెప్పవలె? తచ్ఛబ్దము తదర్థముతో నుండుట లే దనియు గుర్తించి, స్త్రీసమ మన్నను ప్రథమైకవచనమున నేని ప్రయోగము లేకుండఁగా స్త్రీసమ త్వమువలనఁ జేకూడు కిత్యాదుల ననుయోగము మపుల మొ॥ ఇబ్బందు లుండఁగా, తచ్ఛబ్దముతో సమాస మన నేల? సమాససిద్ధికై స్త్రీస మత్వ మేల? ఎల్లను జిం., వి.వి.లు చెప్పనిలక్షణమునే గుర్తించు చుండిరి గావున నయ్యాది సూరి పేర్కొన్నట్లుగా ధా.వి.లు విభక్త్యంత ములుగాఁ బ్రయోగించుసందర్భమునందు విభక్తివిపక్షలోఁ దచ్ఛబ్ద

మనుప్రయుక్తమగుట సరియే చెప్పఁబోవలయునుగదా. అదియే యుచి తము. 'గ్రామాన్నాత్తు సుఖా తయోః క్రమేణ త్తః' అన్నది. చిం. దానిఁబట్టి బాలురచేతను అన్నది సరియగుననియు బాలులచేతను అనియే యుండ వలయు నని చెప్పవలెనా? అట్లే ధా.వి.లనే స్పష్టముగా నిరూపింపని చిం. విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగము చెప్పకుంట యింత గాదు. చెప్పకున్నను బాలురచేత నిత్యాదుల రత్వమువలె నీధా.వి లకు విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగ మంగీకరింపఁదగు. అయ్యది చిం.' వి.వి.లు చెప్పనిలక్షణభాగములలో నొకటి. కాఁగా నిట్టియెడల ధా.వి.లు ప్రమ.ప్ర.లా కాదా యనుప్రశ్నము బాల.లో వలెనే సమంజస మని గుర్తింపవచ్చును.

వ్యాఖ్యలవారే కొన్నిచోట్లఁ దద్ధితవృత్తివిగ్రహరచనకై విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దముతో సమాసము చెప్పుట విశేషము. విభక్తి వివక్షలోఁ దచ్ఛబ్దముతో సమాసమైన దనుటకంటెఁ దచ్ఛబ్ద మను ప్రయుక్తమైన దనుట కొంతయుచితము. వచ్చినవాఁడిత్యాదులు సమాసము లనియు నయ్యెను దచ్ఛబ్దము నిరర్థక మనుటకంటె నొక్క తద్ధితవిగ్రహరచనకగుచుష్టీవిభక్తివివక్షాస్థలములందే కాక సాధారణ ముగా విభక్తివివక్షయం దని చెప్పుట యింకను ప్రయోజనవంత మనుట గుర్తింపఁదగును. అందుకే సూరి యట్లు చెప్పె. అది సర్వత్ర యంగీ కార్యము.

విభక్తివివక్షించునపు డనుటలో ధా.వి.లకుఁ దచ్ఛబ్ద మను ప్రయుక్తమగుట యవ్వానిని విభక్త్యంతములుగాఁ బ్రయోగింప నెంచునప్పుడే యనిపించుచున్నది. ధా.వి.లకు మీఁదివిశేష్యముతో సమాసమును గాని లేదా తద్ధితప్రత్యయము మొ॥ వానిని వివక్షయందుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము కాదనిపించు. వచ్చినట్టివాఁడైనవాఁడు

అనువర్థమున వచ్చు అను ధా.వి. అట్లే సమసించునని తోఁచు చున్నది. ప్రాతిపదికలైనవీనికి సమాస మెట్లు? 'కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపదం బయియుండు' ననుచోఁ ద్రికమువలె ధా.వి.పూర్వపదత్వనిర్ణయమునుబట్టి యట్లు సమన్వయింపవచ్చు. లేక వచ్చువాఁడు రాముఁడు అనువానికి సమాసము చేసిన ధా.వి.ల కనుప్రయుక్తముగాఁ జెప్పినతచ్ఛబ్దము విభక్త్యనయవము గాని విభక్తి లోపించునపుడే తచ్ఛబ్దము లోపింపదు గాదా. సారి వచ్చినరాముఁడు మడిసెడువడము లనురీతిసమాసములలోఁ దచ్ఛబ్దమును జూపలేదు గదా. ఆ-అనుదానికే కన్య-యనుదానితో సమాసమయి యాకన్య యని యవుచున్నదా? త్రికపూర్వపదత్వవిధానమును బట్టి ఆ ఈ ఏలు పదములు గాకయు మీఁదిపదముతో సమసించిన వనవలెను. అట్లే మడిసెడువడము లిత్యాదులును.

అట్లు కానియెడల నదిశబ్దమునకుఁ గన్య యనుదానితో సమాసమయి అది-కన్య-అనుచోఁ ద్రికపూర్వపదత్వవిధానముచే నది యనుదానికి బదులుగా ఆ (అది-కన్య-ఈకన్య-ఏది-కన్య-ఏకన్య) నిల్చు ననురీతిగా సమన్వయించుట కవకాశ మున్నది. కాని మడిసెడునవి యైనవడములు అనువిగ్రహము చొప్పున మడిసెడునవి వడములు అనుచో మడిసెడువడములు అని యగు టెట్లు? విభక్తి యగు వివర్ణకము పోయినను తన్నిమిత్తకము లగునానువికారము లట్లె యుండును గావున (హ్రస్వ మట్లే యుండఁగా) మడిసెడునవడము లని గదా కావలయును. తచ్ఛబ్ద మెట్లు లోపించు. ఆ ఈ ఏలు త్రికము లనుటచేఁ (ననుచిత మనఁదగినను) అది వాఁడు మున్నగువానికి నాప్రభృతులు చేయుదమే కాక. ధా.వి.లు నిల్చు నన ననుప్రయుక్తమైనతచ్ఛబ్దము ధా.వి.అవయవమే యగుటచే నిల్వ నడ్డంకి లేదు. ఇది యెట్లును సిద్ధిం

చును గాన ధా.వి.పూర్వపదత్వ మిట విశేషముగాఁ జెప్ప నేల యన వచ్చును? అచ్చోటివివరణము ననుసరించి బల్లిదుఁడు మల్లుఁడు అను రీతివానికిఁ గర్మధారయము కుదుఱదు. కాన వచ్చినవాఁడు రాముఁడు (వచ్చినరాముఁడు) అనుచో వచ్చినవాఁ డనునది త్రికస్త్రీసమముగంతములలో నేదియును గాదు. ఉమంతము పూర్వపదముగా నిల్వ వీలు లేదు. కాని ధా.వి. లట్టివియు నిల్చుచున్నవి. కాఁగా మడిసెడునవి యన్నది స్త్రీసమము గాదు గదా. ధా.వి.లకును బూర్వపదత్వము సిద్ధించుటకు వీలుగా ధా.వి.లను ప్రత్యేకముగా సూత్రమున నిర్దేశించుట జరిగిన దనవచ్చును. కాన నిట్టి ప్రత్యేకనిర్దేశమువలన నెయ్యదియు విశేషము సిద్ధించు నని యూహింప నవకాశము లేదు.

కాఁగా విభక్త్యంతములుగాఁ బ్రయోగించునప్డే తప్ప నతులలోనే ధా.వి.లకుఁ దచ్ఛబ్దము చేరు నని చెప్పఁదగు నని తోఁచు (ఘం) ఇట్టిదానివలన సమాసములందును దద్ధితవృత్తియందును దచ్ఛబ్దానుప్రయోగ మన్నదే లేదు కావున నద్దానికి లోపప్రసక్తియే లేదు. మడిసెడుదడము లిత్యాదిగా నిట ధా.వి.లు సుసంతములుగాకయే కర్మధారయము నందు చుండుటంజేసి వీనికి సూత్రమునఁ బృథగ్గ్రహణము ప్రస్తుతస్థితియందును నవసరమై ప్రయోజనవంత మగుచున్నది. ఈయంశమున విస్తరమునకై చూ. తి.శే.

ఇట్లు సమాసవృత్తియందును దద్ధితవృత్తియందును దచ్ఛబ్దానుప్రయోగము లేక ధా.వి లట్లు యున్న నయ్యవి దు.ప్ర.లా కళలా యనుప్రశ్నకుఁ దావు లేదు. అట నవి ప్రకృతులుమాత్రమే యగును గదా. ద్రు.ప్ర.కళావివక్ష ప్రకృతులయెడ నసంగత మగుట వజ్ఝలవారును స్పష్టము చేసిరి. తచ్ఛబ్దము చేరని ధా.వి.లు సమాసగతము లయియో తద్ధితాంతము లయియో మాత్రమే యున్నవి.

కళా ద్రు.ప్ర.వివక్ష పదములయెడనే ధా.వి. లట్లు ప్రథమాది విభక్త్యంతముగాఁ బ్రయోగింపఁబడునపు డప్రయుక్తతచ్ఛబ్దాంతాలై యుండును గావున నటఁ బ్రథమాకయుపట్టియొక్కేతరములు ద్రు. ప్ర. లనువివరణము ననుసరించి ధా.వి.లు తత్తద్విభక్త్యంతములు గళ లును తత్తద్విభక్త్యంతములు ద్రు ప్ర.లు నవు నని గుర్తింపఁదగును.

## (గుణ)విశేషణములు - ద్రుతప్రకృతికములా ?

ధా.వి.లు ద్రు.ప్ర.లుగాఁ జెప్పుటనుబట్టియుఁ గావచ్చును గాని వీరు నల్లాదిగుణవిశేషణములను సైతము ద్రు.ప్ర.లుగనే తలఁచిరి. అనఁగా వీరిమతమున నల్లన్ - తెల్లన్ అనురీతిగా నీవిశేషణములును ద్రు.ప్ర.లే.

దీనింగూర్చి యొకచో "తెల్లన్ + కన్ - తెల్లంగన్ తెల్లఁగన్ మున్నగునసిష్టరూపములు గల్గవా యని శంకింపరాదు. తెల్లమున్నగు విశేషణములను విశేష్యతావివక్షచే నవి ప్రథమాంతములే యగును కాన నట్టిశంకకుఁ బ్రసక్తి లే" (88) దనిరి. తెల్లన్ అని యివి ద్రు. ప్ర.లే యగుచోఁ దెల్లంగన్ మున్నగురూపము లేర్పడకతప్పదు. వజ్ఝలవారు వారించినపద్ధతి యుక్తముగా లేదు.

ఈ విశేషణము విశేష్యముగానే గ్రహింతము. అయిన దానిప్రథమాంత మే మగును? విశేషణములు ద్రు.ప్ర. లనుటచే నీ శబ్దములే విశేష్యము లగుచో ద్రు.ప్ర.లు గాక కళలే యగు నని వీ రభిప్రాయపడిరా? కాని తరువాత విశేష్యతావివక్షలోఁ బ్రథమాంతములే యగు ననిరి. అనఁగా విశేష్యము లవుటవలనఁ గాక తద్వివక్షచేఁ బ్రథమాంతము లవుటవలన నీయవి (విశేష్యపక్షమున) కళ లగు నన్నమాట. తిజ్ఝధ్యశేషషష్ఠీసు స్సుమదానింబట్టి సుసంతతవలనఁ గళాత్వము సిద్ధించు నని యభిప్రాయము. ఇది యుక్తమే. కాని యిట

ననుమానము. విశేష్యతావివక్షచేఁ బ్రథమాంతము లగు (తన్మూల
మునఁ గళలును) నగుఁగా విశేషణపక్షమున నీ తెల్లానులు ప్రథమాంత
ములు గావా! ఇంతకును దీగుణవిశేషణములును స్త్రీసమములే
యనియుఁ బ్రథమైకవచన మందువలన లోపించు ననియుఁ జెప్పుచు-
న్నారు గదా. అది దేనికిఁ బదత్వమునకు. స్వాంతతఁ బదత్వము గల్గిన
దన్నమాట. ఇట్లేగదా యిను ప్రథమాంతములే యవుటచేఁ గళ లేల
కావు? ప్రథమాంతతనుబట్టి విశేష్యములు కళ లయినప్పు డదే
విధముగాఁ బ్రథమాంతములే యయిన విశేషణములు కళలు గాకపోవు
టేమి? అట్టియెడలఁ బ్రథమాంతము లవుటచే సుస్ అనుదానిచే నీయవి
కళలే. కాఁగా 'అన్యే ద్రుతప్రకృతయః' అని ద్రుత మెట్లు చేరినది?

అయిన నిట వాదమున కిట్లు నొకవిధముగాఁ దలఁపవచ్చును.

'నపదాన్యవ్యయసుప్తిఙ్క్త్వాతుమునామ్' - అనుసూత్రమున
నవ్యయశబ్దముచేతనే నిషేధము సిద్ధ మగుచుండఁగా క్త్వాతుమున్నంత
ములకుఁ బ్రత్యేకముగా గ్రహణమువలన నవ్యయముల కెల్ల నిషేధము
లే దని వ్యాఖ్యాతము. అదేవిధముగా నిచ్చటఁ గూడ 'తిఙ్మధ్యశేష
షష్ఠీసుస్'- అనుచో సుస్ - అనుశబ్దము చేతనే సుసంతములకుఁ గళా
సంజ్ఞ సిద్ధించుచుండఁగా 'యదా, తదా'- మొద లగువిధముగాఁ బ్రథ
మాంతములను బ్రత్యేకించి చెప్పుటవలనఁ బ్రథమాంతములలోఁ
గొన్నింటికిఁ గళాసంజ్ఞ లేక ద్రు.ప్ర.త్వము సిద్ధించు నని వ్యాఖ్యా
నించుకొనవచ్చును. అప్పుడు తెల్లన్ - మున్నగువిశేషణములు ప్రథ
మాంతములే యైనను ద్రు.ప్ర. లే యనవచ్చును. కాని యిచట న[illegible]
వారు విశేష్యతావివక్షచేఁ బ్రథమాంతములే యగు ననుట యిందు
లకు విరుద్ధము గదా. 'ఆమాట ప్రథమాంతము లైన వెల్లఁ
గళలే' యగు ననియే చెప్పుచున్నదే కదా! అట్టియెడల విశేష్య

ములకుఁ గళాత్వమే యిష్ట మగునెడల వానిప్రథమాంతత్వమును గూర్చి ప్రస్తావింపకుండుటయే యుచితము.

అందుకే కాఁబోలును వజ్ఝలవారు ప్రయోగార్హతకై పదత్వసిద్ధికీ కితిగా స్త్రీసమములుగా గుర్తించి ప్రథమైకవచనప్రత్యయము లోపింపఁజేయుచో నది కళాత్వసంపాదకము కాదని నన్నయాథర్వణులమత మనిరి. కళాత్వసంపాదకము గాదు గాని ద్రు॥ప్ర. త్వసంపాదక మగు నదియే విశేషము. ఏమైనఁ (బ్రయోగార్హతకై) పదత్వసిద్ధికయి ప్రథమైకవచనము లోపింపఁజేయుశబ్దములు కళలు గా నన్నమాట. స్త్రీసమము లెల్ల నిట్టివే కదా. అమ్మ అన్న మొ॥ వానికి సులోప మేల? అట్లు చేయనిచో నవి నామమాత్రము లవుటచేఁ బదత్వము లేదు. కావునఁ బ్రయోగార్హత యుండదు. అందుకై పదత్వము సిద్ధించుటకే ప్రథమైకవచనలోపము. దానికై స్త్రీసమత్వము చెప్పఁ బడినది. స్త్రీసమము లేవియుఁ గళలు గావా? పదత్వసిద్ధి ప్రయోగార్హతకే యని వీ రారంభించుట గమనార్హము. స్త్రీసమములుగాఁ జెప్పినయన్నాదులే యట్లు ప్రథమైక వచనము లోపించి ప్రయోగింపఁ బడుచున్నవి. కాని ప్రయోగార్హతకై పదత్వమునకై స్త్రీసమముగాఁ జెప్పి సాధించినయీతెల్లాదిద్రు॥ప్ర. విశేషణములు ప్రథమైకవచన లోపములోఁ ప్రయోగింపఁబడుచున్నవా? ప్రయోగార్హతకై యని ప్రారంభించుటలో వజ్ఝలవారివాక్యము వా రుద్దేశించిన దానికి విరుద్ధమైనయర్థమును సాధించుచున్నది.

ఇంక నితరవిభక్తివచనములలో నసలు ప్రయోగమే లే నప్పుడు మాత్రమే యిట్లు పదత్వమునకు (ప్రథమైకవచనస్థలమం దేని ప్రయోగ ముండవలెనో యక్కర లేదో) స్త్రీసమత్వము నంగీకరించు నవి మాత్రమే కళలు గాకుండునా? వారియభిప్రాయము స్పష్టము

చేయలేదు ఇతరవిభక్తులందును లేక ప్రథమయందును లేక స్త్రీసమ
త్వమువలన నింకఁ బ్రయోగార్హత సిద్ధింపఁజేయు టెలో యర్థము
గాదు. ఇంతేకాదు వీరు విశేష్యము లన్న తెల్ల పల్ల ఇత్యాదులకు నట్టి
ప్రయోగము లున్నవా? అయ్యు నయ్యవి కళలే యైన వేమి? (నల్లా
దులు విశేష్యములుగాఁ బ్రథమైకవచనస్థలమం దేయరుదు. ఇతర విభక్తి
స్థలముల నల్లను నల్లచేత నిత్యాదిగాఁ గానరావు.) ఇది నన్నయాధ
ర్వణాశయ మనుట కేమి యాధారమో స్పష్టము చేయరే. తెల్లా
దుల కిట్టి స్త్రీసమత్వమువలనఁ దచ్ఛబ్దానుబంధిసమాసమే యని వీరి
వివరణము ననుసరించి గ్రహింపవచ్చును. కాని దానికిని ద్రుప్ర.త్వము
నకును సంబంధ మేమి? పదత్వమునకుమాత్రమే సులోపము చేయుచో
నది స్వాంతము గాదా కళ గాకుండును. విశేష్యమునకు విశేషణము
నకు రెంటికి స్త్రీసమత్వము సులోపము సమాన మైయుండ నం దొకటి
కళయు నొకటి ద్రుప్ర.యు నవుటకు లక్షణప్రమాణ మేమియుఁ
గానరాదు.

ఇంక 'తెల్లంగా' మున్నగు నవరూపములను వారించుటకు
వజ్ఝలవారు పేర్కొన్నట్లు తెల్లయను విశేష్య మగుకళాశబ్దమే
యున్న దనియు, తెల్లన్ అనుద్రు.ప్ర. యగువిశేషణము కా దనియు
నిప్పటికి నంగీకరించి చూతము. వే ఱొకచోఁ గలయిబ్బంది నిట్లు
గుర్తింతము.

చిన్నయ గుణవచనంబు లగునల్లాదులకు నవర్ణకమును
ద్వ్యర్థమున విధించియున్నాఁడు. చిం. (వి.వి. కాని) యిది స్పష్టము
సేయలేదు. కాని వి.వి.చే వీరు సాధించిరి. భావార్థమున సూరి చూపిన
ఱిక-ఇమి-న-ఇక-మున్నగు ప్రత్యయముల ను-అథర్వణోపదిష్టములే
(1278) అని యన్యే చ దేశ్యావర్ణకాః యనుకారికచే నవర్ణకమును

సాధించియున్నారు. 'నల్లన్' అనువిశేషణముపైని నవర్ణకమును జేర్చిన నల్లన్న-మున్నగునవిష్టరూపములు గావా? త్వప్రత్యయము వలెనే తనప్రత్యయము సైతము ధర్మివాచక(విశేషణ)ములపైనే నిల్చును-- ఇట్లగుటచే నీభావార్థకప్రత్యయములు పోఁడిమి వాఁడిమి మున్నగుధర్మవాచక (విశేష్య)ములపై నిలువనేరవు - (1262) అని వీరు స్పష్టము చేసినదానింబట్టి నల్లమున్నగువిశేష్యములనిట గ్రహింప రాదు గదా.

అయిన నల్లన్ అనుదానిపై నవర్ణకము రాదు. పెన్న-చిన్న-అన్నవి ధర్మివాచకస్త్రీసమవిశేషణములు కావున వానిపయి షష్ఠీ విభక్తి నిలువనేరదు. కానఁ దద్ధితవిగ్రహవ్యుత్పత్తిరచనకై వానికి విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దముతో నవి సమసించును-(1262) అన్నారు. ఇందలి యనౌచిత్యములు స్పష్టమే. ధా.వి.లయెడ నేర్పడినయిబ్బందులే యిటఁ గూడఁ బ్రాప్తమవుచున్నవి. కాఁగా ద్రు.ప్ర.లైన నల్లాదులను బ్రథమైకవచనస్థలమునందు సంయుతము విడిగాఁ బ్రయుక్తము గా వని యింతకు ముందు ధా.వి.లసంబంధమునఁ జేసినవివరణమునుబట్టియే స్పష్టమగుచున్నది. అట్టియెడల వీని ద్రు.ప్ర. లన నేల?

అవుఁ గాక. నల్లాదులు నిత్యే యిట విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దముతో సమసించు నని యంగీకరింతము. నల్లదానియొక్క-భావము. నల్లదాని - న అనియవును. ఇటఁ దచ్ఛబ్దలోప మెట్లు? విభక్తితో పాటు తచ్ఛబ్దమునయితము లోపించు ననిరి (1262) విభక్తివివక్షలో సమాసము చేయఁబడినసమాసము గదా యని విభక్తితో పాటు తచ్ఛబ్దమును లోపించు నని వారియభిప్రాయము గావచ్చును. కానీ యది సరి కాదు. విభక్తిలోపముచే ముందటితచ్ఛబ్దమునకు లోపము రావీలు లేదు. రామునితనము ఇత్యాదులలో విభక్తి లోపించినను నిగాగమ యి

లోపింపకుండుట గమనార్హము. ఇట్టి ఛచ్ఛబ్దము ప్రాతిపదికావయవము గాకున్నను నాసమాసమున నుత్తరపదమువిభక్తి లోపించు నన్న నుత్తరపద మెల్ల లోపించు ననుటెట్లు?

ఇదియు నంగీకరించినను నింకొకయిబ్బంది లేకపోలేదు. నల్లదానియొక్క భావము అను అర్థమును వివక్షింతము. అట నల్లదానియొక్క అనునది సమాసమే కదా. 'నిష్కర్షకస్యాస్య బహుళమదన్త్యాద్గుణవాచకాత్తని నిష్కర్షము వచ్చినచో 'నల్లనిదానియొక్క' అని యగును నిష్కర్షకము చేయఁగా విభక్తితోపాటు తచ్ఛబ్దమును లోపించినను 'నల్లనిన' అని కావలయును గదా. ఈనిష్కర్షము నెట్లు లోపించును? పెద్దవిద్వాంసులకు లేనినిష్కర్షకము (నిగాగ మని సూరి) నల్లానుల కున్నది.

ఇంక నచ్చటఁ దచ్ఛబ్దము లోపించుటచేత సమాసమును బోవునా? అట్లయినచో సమాసము కామి నిష్కర్షకమును బోవు ననవలెను. కాని యిట నింకొకయిబ్బంది. విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దముతో సమాసమైనది. తచ్ఛబ్దముతో సమాసమగుటవలన నీద్రు.ప్ర.ల ద్రుతము లోపించినది. తద్ధితప్రత్యయపరకతలో విభక్తి లోపించినది. (విభక్తి నిమిత్తకమగు) తచ్ఛబ్దముసైతము లోపించినది. కాని తచ్ఛబ్దముతో సమాసమగుటవలన లోపించినద్రుతముమాత్రము లోపించియే యుండునా? విభక్తితోపాటు తన్నిమిత్తక మగుతచ్ఛబ్దము లోపింపఁగాఁ దచ్ఛబ్దముతోడిసమాసమున లోపించినద్రుతముసైతము వెనుకకు రాఁగా 'నల్లన్న - తెల్లన్న' అని కావలయును గదా.

ఇంక నీయది తద్ధితవృత్తియే కావున 'దుశ్శిష్య సర్వాత్...' అనుదానిచే ద్రుతమును లోపించు ననవలయును. ఇట్టిప్రక్రియాగౌర

పదమువలన సాధింపఁబడిన దేమి? నల్లాదులకు షష్ఠ్యంతరూపమా? సమాసకమునకై వీనిని షష్ఠ్యంతములు చేయుటకై యింతటి ప్రక్రియ యేల? నల్లాదులుఁ నల్లన్ నల్ల(న్)లు అనుకృతిగా విభక్త్యంతములై ప్రత్యేకముగాఁ ప్రయోగింపఁబడునని 'కావు.' తద్ధితవృత్తిస్థలమునను విగ్రహారచనమునకై నల్లదానియొక్క అని సాధింపఁబడినది. కానీ యటఁ దచ్ఛబ్దము లోపింపకతప్పమి గమనార్హము. నల్లదానితనము నల్లదానిన-అనుకృతివై భాషికరూపములు వజ్ఝలవారికి సమ్మతము లన లేము కదా. అనఁగా నీయుత్తరపద మగుతచ్ఛబ్దము నియతముగానే లోపించు నన్నమాట. అంతమాత్రమే కాక విగ్రహరచనకైయు తచ్ఛబ్దముతో సమాస మగుటకు నాధారమును లేదు. చిం.,వి.వి.లే కాక సూరియుఁ (బాల.లోను) జెప్పలేదు. (ప్రౌఢవ్యాకర్త నల్లనివాఁడు నల్లవాఁ డనుకృతివానిని సమాసములుగా భావించెను.) ధా.వి.లపైవలె నీనల్లాదులకు విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగమును నియతము చెప్పియుండలేదు. నల్లనివాఁడు పద్మనయనమ్ములవాఁ డనుకృతిగా నిగాగమాదులనుబట్టి వీనిని సమాసములుగనే సూరి బాల.లో నభిప్రాయపడియుండవచ్చును.

కాఁగా వజ్ఝలవారనుసరించినయీసమాసకల్పన మెట్లును నిరాధారమే. అదియును నిర్దుష్ట మయినప్రణాళిక కలది గాదు గదా. సూరి నల్లాదు లని సూత్రించి నల్ల తెల్ల - ఇత్యాదిగా నుదాహరించుటచే నల్లయొక్క అనుకృతిగా వివక్షించుటయే యుద్దిష్ట మనవచ్చును. నల్లయొక్క అనుకృతిగాఁ గూడ విడిగా వ్యవహారము లేదు కాని యట్లని వజ్ఝలవారు సాధించికొన్ననల్లదానియొక్క అనువిభక్తివివక్షలోఁ దచ్ఛబ్దముతో సమాస మయినరూపములును లేవు గదా. నల్లాదిస్త్రీసమములు తచ్ఛబ్దముతో సమాసము లైనపోనీనుండి యిట్టివి కలవు. కాని

యట్టితచ్ఛబ్దముతో సమాస మైనరూపము లిచ్చట తద్ధితప్రత్యయ మగు
నపుడు ప్రసక్త మగుట లేదు అట్టియెడల సాధించినయిట్టిరూపము
తద్భిన్నముగ గమనింపఁదగును. అయ్యది కేవలతద్ధితప్రత్యయ మగుటకై
కల్పింపఁబడినది. తద్ధితవృత్తివిగ్రహవచనలో నని స్పష్టముగాఁ జెప్పియే
యున్నారు. కావున నియ్యది పిడిగాఁ బ్రయుక్తము గా దనుట
స్పష్టమే. అట్టియెడలఁ దచ్ఛబ్దముతో సమాస మనుటలోను నల్లావులపై
నెక్కి చేయుటలోను బ్రయోజన మొకటే. ఇంక సమాసపక్షమున
సమన్వయమున నున్నయిబ్బందులు సూరిపక్షమున లేవు గావున నది
యుచిత మయి గ్రాహ్య మయి యున్నది.

తెల్లంగ ననుకృతిరూపములును దుర్వారములే. ఇట్టివి కావుం
డుటకై వీరిట తెల్లయనువిశేష్య మైనకళయే యున్న దనిరి. 'తెల్ల
గన్ - తెల్లన యగునట్లుగా' అని గదా యర్థము. (88) అనిరి. ఇది
సరి కాదు. హంస తెల్లగా నున్నది అనఁగా తెల్లన-యగునట్లుగా. -
(ఈగాను అప్రయుక్తము గా దనియు నన్వయించు ప్రత్యేకపద
మనియు వీరిసిద్ధాంతము. చూ. బా. సూ.) ననుకృతియర్థము సహజము
గాదు. తెల్లగా నున్నది అనుచోఁ దెల్లఅనునది క్రియావిశేషణము
గావున గా ననుప్రయుక్త మయిన దని సూరిమతానుసారముగా
గ్రహింపవలె. అట్టియెడల నిట నీయది విశేషణమే. హంస తెల్లనిది
గా నున్నద ననుకృతి నీ తెల్లశబ్దము ధర్మియే విశేషణమే యగు
చున్నది. అయ్యది ద్రు.ప్ర. యని వీరిమతము. కావున తెల్లంగ -
ఇత్యాదిరూపములు తప్పవు. (కాఁగా చక్కంగ అనుకృతిస్థలములో
నవర్ణమునం దత్వలో పానంతరావశిష్టనకారము ద్రుత మై ద్రుతకార్య
ముల నందు ననుకృతిసమన్వయ మనవసరము.) ఇట్టిరూపములను వారిం
చుటకొఱకే యిట విశేష్య ముండు ననిరి. కని యది సరిగామి
కుదుర లేదు.

ఇటఁ బూర్వోక్తమగు నొక్కయంశము స్మరింపఁదగియున్నది. వజ్ఝలవారింతకుముందు గుణాపిశేషణము లిని ద్రు.ప్ర.లనుటకుఁ జెం. సమాగమమును విధింపకుంట నొక హేతువుగాఁ జూపుట గమనించితిమి. ప్రస్తుతవివరణమునుబట్టి యది కొంతవిరుద్ధమగు చున్నది. తినవర్ణకము తాదర్థ్యమునం దవునది. అది షష్ఠ్యంతముపై నవునది గావున నికతి సమాసాదికములో నల్లదానియొక్క - తిని అని గదా నిలుచున్నది. విభక్తియుఁ దచ్ఛబ్దమును లోపింప నల్ల - తిన యనునుండనను-ఇప్పుడు సమాగమము విధింపలే దనుకొందము. ద్రుతి మెట్లు వచ్చును? నల్లానులు ద్రు.ప్ర.లే యన్నను నీప్రక్రియ ననుసరించి ప్రాంతము నిలువదే. అట్లు పూర్వోక్తమార్గములో విభక్తితచ్ఛబ్దములు లోపింపఁగా సమాసమున నింతకుముందు పోయినద్రుతము వెనుకకు వచ్చిన దనియో వజ్ఝలవారు నెంచిరా? అప్పుడే యిది ద్రు.ప్ర. యవుటవలన నుమాగమును విధింప నక్కఱ లేకపోవుటయుఁ జెం. నుమాగమము విధింపక పోవుటంబట్టి యిది ద్రు.ప్ర యే యని వ్యక్త మగుటయు సిద్ధించును. ఇట్లు ద్రుతము తిరిగి వెనుకకు వచ్చినప్పుడు నల్లంటివ మనుసూపము నుమాగమము లేకయు సిద్ధించుట బాగుగనే యున్నది. కానీ పైని చేర్కొన్నట్లు నల్లన్న - అనుకలిసూప మవార్యమే. స్థిరపరకత్వమున సంశ్లేషము రావలెను గదా. వజ్ఝలవారిమతమున నన్న స్వాత్వసంశ్లేషముల నల్లనీన నల్లన్న యని యవు. అదే యహోబలాదులమతము ననుసరించిన నల్లన్న నల్లనుప-అని యవును.

వజ్ఝలవారివి ద్రు.ప. లనుటవలన నేర్పడిన యపసూపము లన్నమాట యివి.

ఇటఁ దద్ధితవృత్తియందు విభక్తిలోపించినది (తచ్ఛబ్దము సైతము లోపించినది) అనఁగా సమాసమునవలె నైనది. మఱి 'ద్రుతస్య

సర్వత్ర లుక్సమాసేషు' అనుదానిచే నా ద్రుతమేల లోపింపదు? అన్న
నుఅల నిట సమాగమము విధింపనిసామర్థ్యమున లోపించిన దని
యెంచవలయునా? సక్రమముగా ద్రుతమును లోపించు నని యెంచుచో
నల్లన్న యనుకృతిరూపములు గావు. ద్రు.ప్ర. గదా యని సమా
గమము విధింపనిచిం,మతమున నల్లందన మనుకృతిరూపములును గావు.
ఇంక ద్రుతము లోపించుచునేయుండ ద్రు.ప్ర. యని సాధించినప్రయో
జనమేమియు లేకుండుటయు గమనార్హము.

ఇంక నేకారణముచేత నైనను నీధా.వి.లును గుణవిశేషణ
ములును త్రిసమములని మీరు పేర్కొన్నారు గదా. త్రిసమము
లన్నతరువాత ప్రథమైకవచనలోప మవుఁగాక యన్వాదిపై నితర
విభక్తులు లేమి విశేషముగాఁ జెప్పకొనవలసినదే. కాని త్రిసమ
ముల కితరవిభక్త్యంతరూపము లుండకపోవుట సహజము కాదు.
అనఁగా నట్టివి త్రిసములకుణ మని చెప్ప వీలు లేదు. అమ్మ-అన్న
మున్నగు త్రిసమముల కితరవిభక్త్యంతరూపములు లేవా? వజ్ఝలవా
రొక్కచో 'పెద్ద-చిన్న-తెల్ల'మున్నగుధర్మి (విశేషణ) వాచకశబ్ద
ములు గాన వీని కితరవిభక్తులు లేమి తద్ధితవృత్తివిగ్రహరచనలో-
ననుకృతిగాఁ జేర్కొనిరి. అది మనోరంజనము. (త్రి. శే.) అట్టియెడల
'నల్లన్' అనునది ప్రథమైకవచనాంత మగుపదము. షష్ఠ్యంతము నైన
దానిపై తగాదులు వచ్చు నని యుఁ జెప్పవచ్చును. దానికే తచ్ఛబ్ద
ముతో సమాస మని మున్నగుకృతి సమన్వయ మేల? 'నల్లన్' అనుకృతిగా
వీనిని ద్రు.ప్ర.లుగా భావించినపుడు షష్ఠిలో నల్లన్ యొక్క అని
యవునా? నల్లయొక్క అవునా? అనుకృతివిచారణముతో వజ్ఝలవా
రామార్గము ననుసరించియుండకపోవచ్చును. అసలు ప్రథమైకవచనాం
తమే విడిగాఁ బ్రయుక్త మవుట లే దని పేర్కొన్నారు గదా.

ఏది యే మైనను నీవానిని స్త్రీసమము లనుటయు ద్రు ప్ర. లనుటయు సమాసము నుద్దేశించి కల్పింపఁబడినయంశములే కాని యథార్థములు గా వని మాత్రము గుర్తింపనగు ఆసమాసకల్పనాదు లుచితములు గామి నీమార్గ మనుసరణీయముగా లేదు.

ఈగుణవిశేషణములును (ధా.వి.లును) స్త్రీసమము లనియుఁ గావునఁ బ్రథమైకవచనలోపము చేసి పదత్వము సాధించి ప్రయోగించి కొనవలయు ననియుఁ జెప్పిరి గదా. (68-706-581) ఇట్లు వీనిపై నేకారణముచేతనైనఁ (స్త్రీసమము లని) బ్రథమైకవచనలోపము చేసి యున్నారు కావున నియవి స్వంతము లైనవి. ఇట్టివే యయిన (స్త్రీసమము లయి ప్రథమైకవచనము లోపించిన)అన్న-అమ్మమున్నగు నవి కళ లవుట లేదా? అక్కయెడల నన్యే ద్రుతప్రకృతయు యని ద్రుతము చేరు టెట్లు? ఈనల్గానులు విడిగాఁ బ్రయోగింపఁబడకపోవుఁ గాక. అంతమాత్రమున వఝ్ఝలవాని వీనిని ద్రు.ప్ర. లగుట యెట్లని యనుమానించియున్నారా? ఎక్కడను విశేష్యముతోనో తచ్ఛబ్దము తోనో సమసించియో యివి కళలలోఁ గాని ద్రు.ప్ర.లలోఁ గాని పరిగణింపఁబడ వని తెలుప లేదు గదా. అట్లయ్యు నివి కళలా ద్రు.ప్ర.లా యని యాలోచించునపుడు (ప్రథమాంతతనుబట్టి) ద్రుతాంతము లనుటవలనఁ బ్రయోజనము లేమి వీనిని గళ లనియే పేర్కొనుట యుక్త మని స్పష్టము.

విశేషణము లెల్ల సామాన్యముగా ద్రు.ప్ర. లని చిం., వి.వి.లమత మనియు ద్రు.ప్ర.లపట్టికలోఁ జేర్పమిఁ గళ లని సూరి మత మనియుఁ జెప్పి చిం.,వి.వి.లలో ద్రు.ప్ర. లనుట కొకయాధారము నిట్లు చూపిరి. తెల్లన-తెల్లనివస్త్రము మున్నగురూపముల నరసినపుడు తెల్లాదివిశేషణములు ద్రు.ప్ర. లని తోఁపకమానదు. (87)

బహుశః చారిత్రక మైనదృక్పథముతో నీ రీతిగా గ్రహించి యుండరు. తెల్లన అనుచో నవర్ణము గాని తెల్లనివస్త్రి మనుచో నివర్ణము గాని దాని ద్రుతత్వమునకు సూచకము లగుట యీశబ్ద శాస్త్రమునుబట్టి నిర్ణయింపరాదు. చిన్నయ నవర్ణకనిగాగమము లనుగా నీవానిని సాధించియుండుట స్పష్టమే. చిం. వీనిని పేర్కొనలేదు. 'అన్యే చ బహవో దేశ్యావర్ణకాః' అనుకారికచే నవర్ణక మధర్వణోపదిష్ట మని వృద్ధులవారు చెప్పియుండుట గమనించితిమి. 'నివర్ణకస్స్యా ద్బహుళ మదన్త్యాద్గుణవాచకా' త్తనుచో వి. వి. నివర్ణకమును జెప్పి తెల్లనివస్త్రము ఇత్యాదులను సాధించుచున్నది. ఇట్టి నవివర్ణకవిధానములచే నీయవి ద్రుతము లని గాని ద్రుతసంబంధు లని కాని నిర్ణయించు టెట్లు ?

వి.వి. కర్త అదన్త్యాద్గుణవాచకా త్తనుట గమనింపఁదగియున్నది. ఒకవేళ నీయవి ద్రు.ప్ర. లే యందము. తెల్లన అనుచో నవర్ణ మా ద్రుతమునకుఁ జెందినవికారమా ? నివర్ణక మట్టిదా ? తద్ధితసమాస వృత్తులందు ద్రుతమునకు లోపము తప్పదు గావున నవివర్ణకములు చెప్పఁబడినవా ? తెల్లన అనుకృతివానిం గూర్చి యింతకుముందు గమనించియుంటిమి. కాఁగాఁ దెల్లన తెల్లనివస్త్రము అనుచో తెల్లశబ్దముపైఁ గనిపించుచున్న నకారము దాని ద్రుతత్వమును (తెల్లాదుల ద్రుతాంతతను) నిరూపించుచున్న దనుటకు నీవ్యాకరణములయం దాధారము లే దనుట స్పష్టము.

తెల్లఁబడు పుల్లఁబాఱు చక్కఁబడు చక్కఁబెట్టు ఇత్యాదు లున్నవి కాని యట్టివి సైతము వీని ద్రుతాంతతకు నిరూపకములు కాఁజాలవు. వి.వి.కర్త 'కేచిచ్ఛబ్దవిశేషాః స్యుః క్రియాయోగే ద్రుతాన్వితాః' అని చెప్పెను. అహోబలుఁడు కారికకు తెల్లఁబడు ఇత్యాదు

లనే యుదాహరించె. ఈ కారికార్థనిర్ణయమున వజ్ఝలవారు సహో బలుని ప్రమాణీకరించిరి. (వ్యా.సం.స. 1689) సూరి శబ్దపల్లవములలోని వర్ణవికారములనుగూర్చి చెప్పఁబూనినవాఁడు గాఁడు. చక్కగా ఇత్యాదులు స్థలాంతరమునఁ బరిశీలింపబడినవి.

కాఁగా విశేషణములు ద్రు.ప్ర. లనుటకు నెట్టియాధారమును లేదని స్పష్టము.

ఇట్టిమార్గముననే వజ్ఝలవారు 'చేయుచున్' మొదలగు వానినిస్సైతము త్రిసనుములుగా గ్రహించి ప్రథమైకవచనము లోపింపఁ జేసిరి గదా. ప్రథమాంతముగుటంబట్టి యివ్వానియుఁ గళలే యన వలయునా! అని యనుమానము గల్గును.

సూరి ప్రథమాకయిపట్టిసొంక్త్వేతరములయినవిభక్తులని చెప్పి 'శత్రుతుమున్నంతర్వ్యచేదార్థకములను (నేనుతానుపదములు, వలెప్రభృతులు వలె) బ్రత్యేకముగఁ జెప్యానులవలనఁ బ్రథమాంతములైనను కళాత్వము గల్గక ద్రు.ప్ర.త్వము సిద్ధించినది. ఈయేర్పాటు చిం.లో నెట్లు?

వజ్ఝలవారు 'కిష్వ్రత్ప్రశంసనేత్యాదులచేఁ గొన్ని ప్రతిపదోక్తావ్యయములకుఁ గళాత్వోపదేశమే యిట్టివ్యాఖ్యకు మూలము కానోపు' నని చేయుచున్ మున్నగువాని ద్రు.ప్ర.త్వమును సాధించుచున్న దనిరి. ఆహా అవ్యయ మున్నగునవి స్వాంతములే కళలే యవుచుండఁగా మఱలఁ గళాత్వోపదేశ మేల? కావున స్వాంతము లెల్లఁ గళలు గావు.) తెల్లన్ మున్నగునవి (విశేషణములు) స్వాంతము లయ్యు ద్రు.ప్ర.లే. తెల్ల విశేష్య మిది కళయే. ఏ రీతులు జ్ఞాపకము చేసిన యర్థమువలనఁ బ్రయోజనము లేదు.

'తిఙ్మధ్య శేషషష్ఠీ' యన్నసూత్రమునఁ బ్రత్యేకముగాఁ బఠింపఁబడిన వెక్కువగా నవ్యయములే. అవ్యయేతరములు 'యత్తాతదాకిమ్'-శబ్దములు మాత్రమే. ఇట్లు చెప్పుట (యత్తదా) ప్రపంచార్థమని సూరి పేర్కొనియున్నాఁడు. స్పష్టతమాత్రమే ఫలమన్నమాట. 'కిమ్'శబ్దమును జేర్చుటకూడ నిట్టిదే యనవచ్చును. నేను తాను అను నకారాంతములు ద్రు.ప్ర. లగుట కలదు. 'యుష్మాం ద్రుతో న స్యాత్తను' దాని ననుసరించి యిది నకారాంతమైనను ద్రుతము గలిమి కళ గాక యన్యో యని ద్రు.ప్ర. యగును. కాఁగా సూరి పేర్కొన్నట్లు యదాతదా (కిమ్) గ్రహణము ప్రపంచార్థమే యనుట లెస్స. (అన్యయేతరములు తాను నేను భిన్నములు ప్రథమాంతములు ద్రు.ప్ర. లవుట లేదు గదా.) కాఁగా దీనింబట్టి నకారాంతములైనను గొన్నిశబ్దములు (విశేషణములు) ద్రు.ప్ర.లే యవు ననుకొనిని ప్రయోజనము లేనియర్థకల్పన నక్కరయే లేదు.

తిఙ్మధ్యసూత్రమునఁ జెప్పు లవ్యయములే. కించిత్ ప్రశంసన-అన్యత్ర-సంతాప-ఏవ-క్వా-కిల-తూష్ణీమ్ - అనుకొనిగా నివి ప్రత్యేకముగాఁ జెప్పలు పేర్కొనఁబడియుండుటంజేసి యవ్యయము లెల్లఁ గళలు గా వని గ్రహింపవచ్చును. అనఁగాఁ గొన్నియవ్యయములు ద్రుతాంతములై ద్రు.ప్ర. లవుట గల వని గుర్తింపవచ్చును. చేయుచున్-చేయున్ ఇత్యాదులు గళలు గానేర వనియు నింక నన్నీ ద్రుతప్రకృతియ యని ద్రు.ప్ర. లగు ననియు నూహింపవచ్చును. కాఁగా వానికి నన్యే యనుసూత్రముచేతనే తుదిని ద్రుతము చేరి యవి ద్రు.ప్ర. లగుట సిద్ధించును. ఇట్లు చేయుచున్ మొ॥ వాని ద్రు.ప్ర.త్వమును జిం.లో గుర్తింపవచ్చును.

మొదలగునవి గమనార్హములు. ఇట్టియెడల వీనిపై షష్ఠీవిభక్తి నిల్పుట విశేషము. సామర్థ్య మాశ్రయణీయము. ప్రత్యేకముగా నుచ్చరింపని 'సర్వశబ్దంబు' లనులక్షణమున సర్వశబ్దమే యాశ్రయణీయము. (చూ. త్రి. శే.)

సూత్రాంధ్రాదులలో ధా.వి.లపై వలె వీనిపైని దచ్ఛబ్దాను ప్రయోగమును జెప్పినసూరి బాల.లో ధా.వి.లుమా తమే గ్రహించు టంజేసి నల్లనివాఁడు నల్లనిది యనురీతి విట్టివి కా వని యే భావించియుండు నని నిర్ణయింపవలె. (మూఁడనవాఁడు మూఁడనది-యనుస్థలాంతరలక్ష్య ములకు వీనికి నేదేని సంబంధ మున్నదో పరిశీలనార్హము) చిం.,వి.వి.లు ధా.వి.లయెడవలెనే యిటఁ గూడ స్పష్టమైననిర్ణయము చేసి యున్నవి కావు.

వీనిని స్త్రీసమములుగా నంగీకరింపవలె. ఐనను వీయువి ద్రు.ప్ర. లనుటకుమాత్ర మెట్టియాధారమును లేదు. ద్రుతము నంతమందుఁ జేర్చుటవలనఁ బ్రక్రియాగౌరవమే. కాని ప్రయోజన మావంత లేదు. విశేషణములయెడ సూరిమతవర్ణనములో వ్యాఖ్యలవారు నీయంశమును గుర్తించియే యున్నా రనవచ్చు.

అయినను వారు ద్రుతాంతములే యని చిం.,వి.వి.లమతమున సాధించిన దేమియు లే దని గమనించితిమి. ఒకవేళ కళలపట్టికలోఁ జేర్పఁబడుండుటయే ద్రుతప్రకృతికనిర్ణయమున కాధార మైన నది బలమైనది గాదు అచ్చోటియాద్యశబ్దము వీనిని సంగ్రహింపఁగలదు. 'చేయునతఁడు తెల్లందనము' అనునవే యుద్దేశించిన ద్రు.ప్ర. పక్షమునను నవి యసాధ్యములే. కాఁగా విశేషణములు ద్రుతప్రకృతు లని చిం., వి.వి.లమతమునను నిర్ణయింపరాదు.

—:*:—

వలె ప్రభృతులలోని ద్రుతము శబ్దావయవమే కాన నట నన్యే యని ద్రుతము చేయుట లేదు. ద్రుతో న యేషాం న్యాస్తి నుట ననుసరించి వలె ప్రభృతులు ద్రుతము గలిగిన వగుటచేఁ గళలుగా వనియు నింక నన్యే యని ద్రుతప్రకృతే యవునని యు గుర్తింపఁదగును.

సూరి భా.వి.లకువలె గుణవిశేషణములకు విభక్తివినపులోఁ ద్వచ్ఛబ్ద మప్రయుక్త మగు నని చెప్పియుండలేదు. (బాల.లో) నల్లనివాఁడు నల్లనిది యనుకృతిరూపముల ననుసరించి యయ్యవి సమాసములే యని భావించియుండును. ప్రౌఢవ్యాకర్త తెలుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబు లని పేర్కొనుచు అట్టివాఁడు (అట్టిఁడు) అనుకృతివానింగూర్చి ప్రస్తావించుటంబట్టి యాతఁడు నయ్యవి సమాసములే యని భావించినట్లు గుర్తింపఁదగును. అట్టియెడల విశేషణములు విడిగాఁ బ్రయుక్తము గా వని యంగీకరింపవలసియున్నది. విభక్తి లేకుండఁ గేవలప్రకృతి ప్రయోగింపఁబడు టెట్లు? అట్లనను నల్లనికలువ—ఇత్యాదిగా నీనల్లాదులకుఁ గర్మధారయము ఘటియిల్లు వలయు నన్న సిద్వానిని స్త్రీసమములుగా నంగీకరింపవలె. (లేక గుణవచనంబు లగునల్లాదులకుఁ గర్మధారయంబున అనుటచే నల్లనివలగు వానికి స్వాంతములు గాకయే సమాసమును జ్ఞాపితము చేసికొని నిగాగమము చేయవలసియుండు. నవర్ణకంబు గుణవచనంబు లగునల్లాదులకగు ననుచో నల్లయొక్క భావము నల్లన అనుకృతిగనే విగ్రహము చెప్పుకొనవలె.) నల్లనివాఁడు మున్నగు సమాసములందుఁ ద్వచ్ఛబ్దము తిఙ్గాకముపుట లేదే. వచ్చినవాఁడు అనుచోటవలె మున్న దనవచ్చు. సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ ద్వచ్ఛబ్దంబుతోడ సమసించు నని సమాసము చేసికొన్న నల్లయొక్కవాఁడు (ఆధారాధేయసంబంధమగు) నల్లవాఁడనుచోఁ ద్వచ్ఛబ్దము సంబంధార్థమాత్రబోధక మైయుండును. నాడి

## అనుబంధము

# షష్ఠికి ద్వితీయాతుల్యత

ద్వితీయానువర్ణములు ప్రకృతము లగు నంతవఱకు యవకాశ మును గూర్చి యిటఁ బరిశీలింతము.

షష్ఠీ భవేద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నా మ్మనుచోఁ జం. ద్వితీయాప్రసక్తి తెచ్చినది. తత్పురుషసమాసగత ములు ప్రాతిపదికములపయి నిల్చియున్న షష్ఠీవిభక్తి ద్వితీయావిభక్తి తుల్య మగునాకారము గలది యగు (వ్యా.సం.స.116) ననుచున్న దీలక్షణము. షష్ఠికి ద్వితీయాతుల్యత యన నెట్లు?

షష్ఠ్యంతరూపము ద్వితీయాంతతుల్యరూపము నందు నని యొకమార్గము. నివర్ణాగము మున్న షష్ఠ్యంతమునకు నివర్ణక మున్న (ద్వితీయారూపమును) నివర్ణాగమము లేనిషష్ఠ్యంతరూపమునకు నివర్ణ కము లేని (అమ్ము లోపించిన) ద్వితీయాంతరూపము నిల్చు నిత్యా దిగా నిష్పత్తము న గుర్తింపవలె. కానీ యట్టియెడల సూత్రమునందు నామ్నా మ్మనుట ప్రయోజనహీనమే. నామములయొక్క షష్ఠ్యంత రూపమునకు ద్వితీయాంతతుల్యరూప మగు నన నేల? వజ్ఝలవారును పైని ప్రాతిపదికములపయి నిల్చియున్న షష్ఠియే ద్వితీయాతుల్యా కారము గల దగు నని చెప్పుట సక్రమ మైయున్నది.

నామములషష్ఠికి ద్వితీయ యనుటచే షష్ఠీవిభక్తిస్థానమున ద్వితీయాతుల్యవిభక్తి చేయవలయును. రాముని యొక్క + గుణములు అనుచో యొక్క షష్ఠిస్థానమున 'ని' అనుద్వితీయ వచ్చును. ఇట్లే సీత యొక్క శక్తి, సీతను శక్తి యని యగును. యొక్క కు ముందు నామము

నను నివర్ణాగమమైన రామునియొక్క, రామునిని (న్) గుణము లని యగు. నివర్ణాగమము లేనిపక్షమున రామునియొక్క, రాముని (న్) గుణము లని యగు. కాఁగా రాముగుణములు రామునిగుణము లని యిష్టరూపములతో పాటు రామునినిగుణము లనుననిష్టరూపము నేర్పడు. సీతయొక్క, సీతను(న్) శక్తి యనుచో సీతశక్తి యనుదానితో పాటు సీతనుశక్తి యనియుఁ గావలయును.

అయిన నిట ద్వితీయానినుతే ద్రుతము లన్న నవ్యానిపై సుఖాల ద్రుతము చేరదు. రామునిని + గుణములు, సీతను + శక్తి యనుచో సమాసమున ద్రుతము లైననినులే లోపించి రామునిగుణములు సీతశక్తి యని యగును. నివర్ణాగమము లేనిపక్షమున రామునియొక్క రాముని - గుణములు రాముగుణము లని యగు. సీతనుశక్తి, వనమును వగ్గఱ అనురీతియుపరూపములకుఁ బ్రసక్తియే యుండదు. కాని యీ పక్షమునను ద్వితీయలో నన్నొపము నేల చెప్పె ననుదానికి సమాధానము దొరకదు.

ఇంకను బహువచనస్థలమున నిబ్బంది. రాములయొక్క యనుచో యొక్కస్థానమున నేమి చేయుదుము? 'బుజనోలశసః' అని లవర్ణమే ద్వితీయాబహువచనము. రాములగుణము లనురీతిరూపములుమాత్రమే యేర్పడి రాముఁగుణము లనురీతికవిప్రయుక్తరూపముల కవకాశమే యుండదు.

కావున షష్ఠికి ద్వితీయ యనుచో యొక్కషష్ఠిస్థానమున ని,ను,లద్వితీనులను జేయుపద్ధతిని జెం.కర్త యుద్దేశింపలే దని నిశ్చయింపవచ్చును.

ఇంక షష్ఠికి ద్వితీయ చేయవలె నన నొక్కటియే మార్గము. తెలుఁగుషష్ఠికిఁ (దెలుఁగు) ద్వితీయ కుదురనప్పుడు సంస్కృతషష్ఠికి

(సంస్కృత) ద్వితీయ చేయుటయే. రామునియొక్క గుణములను
విగ్రహమున రామ+ఙస్ అని యున్న పూర్వపదషష్ఠికి ద్వితీయ
రాఁగా రామ అమ్ అని యగును. ఇట్లే రాములయొక్క రామ +
ఆమ్ రామ+శస్-అనువిధ మైనప్రక్రియలలో నిబ్బందులు లేవు. అమ్ము
నకు నివర్ణ మైన రాముని(న్) గుణములు, అమ్ము లోపించిన రాము
(న్) గుణము లనియు రామ+శస్, అనుచో శస్సునకు నివర్ణక మై
రాముల(న్) గుణము లనియు నిష్టరూపములుమాత్రమే సిద్ధించును.
కాని ద్వితీయకు నువర్ణ మగుస్థానమున నిబ్బంది గలదు. సీత+ఙస్,
సీత+అమ్ అని కాఁగా నమ్మునకు నువర్ణ మై సీతను(న్)శక్తి యని
కావలె.

షష్ఠికి ద్వితీయ చేయుటలో నింకొకమార్గము లేదు గావునఁ
బ్రయోజనవిశేషము ననుసరించి (సంస్కృత) ద్వితీయ చేయునీపద్ధ
తియే యనుసరణీయ మై చిం.సుతి మనఁదగియున్నది.

వజ్ఝలవారు సీతయొక్క సీతను న్-సీతన్ శక్తి (1167.) అని
వివరించిరి. అంతకు ముందు సూత్రమున కర్థము చెప్పుచోఁ బ్రాతిపది
కలపయి నిల్చియున్న షష్ఠీవిభక్తి ద్వితీయాతుల్య మగునాకారము
గల దగు ననిరి గాన యొక్కప్రత్యయస్థానమున ద్వితీయాప్రత్యయ
మైన దని యెంచి రేమో. అట్లయిన రాములయొక్క యనుచో
యొక్కస్థానమున నేప్రత్యయ మగును. ఇట్టివానిని వారటఁ బ్రస్తా
వింపలేదు. ఇట్లే 'రామునియొక్క + బాణము రామునిన్+బాణము
రామునిబాణము (1167)అనుటలోఁ దెలుఁగువిభక్తికే తెలుఁగువిభక్తి
చేసిరా యని సందేహము కల్గును.

కాని యంతకు ముందొకచో వజ్ఝలవారు 'కన్న ఓస్ +
కవ + సు అనునపుడు షష్ఠ్యర్థవేదిత్వాదిచో ప్పూర్వ రూపసిద్ధి చికీర్షిత

మగునపుడు సమాసరూపప్రాతిపదికయొక్క యవయవములోని ఓస్ ప్రత్యయము లోపింపక దానిచో ఔట్ ప్రత్యయరూపద్వితీయా కారము నిల్చును. కవశబ్దము మీఁదిసు ప్రత్యయముమాత్రము లోపించును. కన్నులకవ అని రూప మేర్పడు (1161) ననిరి. దీనినిబట్టి సంస్కృతషష్ఠీస్థానమున సంస్కృతద్వితీయయే యగు నని యెంచి రన వచ్చును. కాని ప్రధాన మగునీషష్ఠివేదిత్వాదిసూత్రవివరణస్థలమున నాయంశమును స్పష్టముగాఁ జెప్పిన బా గుండెడిది. సీతయొక్క శక్తి యనుచో సీత + ఙస్ + శక్తి + సు అనువిధముగాఁ జూపఁదగును గదా. అట్లు చెప్పకున్నను సూత్రవివరణమున వారియభిప్రాయ మిదియే యన్న నది యుచితమే. కాని యట వివరణము ననుసరించి తెలుఁగుషష్ఠీస్థానమున (దెలుఁగు) ద్వితీయ యగు నని భావించిన మాత్ర మది యసంగత మనక తప్పదు. సమాసకమునలం దలౌకికవిగ్రహమున సంస్కృతవిభక్తులే లోపించు నన్నపి రిచట షష్ఠికి ద్వితీయ చేయునపుడు గూడ నట్లే సంస్కృతషష్ఠికి ద్వితీయ చేయుట సక్రమము గదా. కన్న + ఓస్, కన్న + ఔట్ + కవ + సు కవశబ్దముమీఁది సుప్రత్యయముమాత్రము లోపించు (1661) ననిరి. ఉత్తరపదవిభక్తి లోపింపఁజేయునపుడు తెలుఁగుషష్ఠికి ద్వితీయ చేయుచో నుత్తరపదముపై మాత్రము సంస్కృతవిభక్తి యుండునా? లేక యటఁ దెలుఁగు విభక్తి లోపించు ననుట కుదురునా?

ఇంతేకాను పై ని వీరు కన్న - ఓస్ అని ద్వివచనమును జూపుట విశేషము. కన్నులు సాధారణముగ నెల్లరకు రెండే యుండును గదా యని ద్వివచనము చూపియుందురు. కాని తెలుఁగున ద్వివచన మేది? ఇద్దరు రాములు అని చెప్పుచో రామశబ్దముపై ఔ విభక్తి చేయుదురా? సంస్కృతమున నట్లయినను దెలుఁగున

నాయర్థమున ద్వివచనమునకు బహువచనము చేయుటతప్పదు గదా. (వ్యా.సం.స. 454) వీ రిట్లే షష్ఠికి ద్వితీయ చేయునపుడు ఓస్ ప్రత్యయమును జేసి కన్నుంగవ యగు నని తెల్పిరి. కాని ఓస్ చేయఁగా దానికి లవర్ణ మెట్లు వచ్చినది? లు జసో ల శసోఽలాన్త్రా త్త్రని లవర్ణము శస్సునకుఁ గదా విధించినది. ఇట వజ్ఝలవారు చేసిన ఓస్సునకు లవర్ణ మెట్లగునదో? విశేషము గాన వివరింపవలసినది.

కాఁగా వీ రిట కన్ను + ఓస్ కన్ను + ఔట్ అని చూపుట ప్రామాదిక మనియు కన్ను + అమ్ కన్ను + శస్ అని చూపుటయే యుచిత మనియు నట్లు చూపినమాత్రమునఁ గన్నులు రెంటికంటె నెక్కువ యున్న వని తెలుప నక్కఱ లే దనియు గ్రహింపఁదగును.

## తాంత్రికశక్తి :

సంస్కృతషష్ఠికి ద్వితీయ చేయు పక్షమునకు సీతనుశక్తి యనుకీతి ననిష్టరూపము లేర్పడుట గుర్తించితిమి. ఇట్టిరూపములను వారించుటయు నుద్దేశించి వజ్ఝలవా రొకవిశేష మిట్లు చేర్చిరి. 'సూత్రమునందలి ద్వితీయాతుల్య అనుదానికి తంత్రముచే నావృత్తి నంగీకరించి షష్ఠి ద్వితీయాతుల్యాకారము గల దగునపుడే ద్వితీయా తుల్యా - అట్టిద్వితీయాంతమువంటిరూపము నిల్చు నని వ్యాఖ్య చేసి కొనవలయు (1167) ననిరి. ఇందు షష్ఠి ద్వితీయాతుల్యాకారము గల దగుట యెట్లు? షష్ఠ్యంతమునకు ద్వితీయాంతమునకు విభక్తికిఁ బూర్వ మందలి ప్రకృతి తుల్యాకారము నుండవచ్చుఁ గాని షష్ఠీద్వితీయా విభక్తులు తుల్యము లగుట సంభవమా? అందుకే కానమ్మను. వారు పై యభిప్రాయమును వివరించుచు 'అనఁగా యొక్క లోపించినషష్ఠి రూపము తిమ్మధ్యసూత్రముచేత ద్రుతము చేరకముందటిద్వితీయాంత రూపమును బోలియున్నపుడే యీసూత్రము వర్తిల్లు (1167) ననిరి.

షష్ఠి ద్వితీయాతుల్య మగుటయను దానికిఁ జెప్పినయర్థమును స్ఫూర్తి యొంతమాత్రమును లే దని చెప్పుటకు సంశయింప నక్కఱ లేదు. ఇట్టియర్థమే సహజముగా లే దనక తప్పదు.

అదియుం గాక. తంత్రాంతరవృత్తిచే వీరు సాధించిన దేమి? సీతయొక్కశక్తి = సీతనున్ + శక్తి సాక్షికసులోపము సీతన్ - శక్తి సీతశక్తి ఇట్టి రూపసిద్ధి నంగీకరింపవచ్చును గాని సీతనుశక్తి మున్నగునవిష్టరూపసిద్ధి నంగీకరింపరాదు. (1167) సీతయొక్క + శక్తి యనుచో షష్ఠికి ద్వితీయ యై సీతనున్ + శక్తి యైనది. ఇపుడు సాక్షికసులోప మేల చేయవలె? సీతనుశక్తి యనున దిష్టరూపము గాకుండుటకుఁ దప్ప. లక్షణముచేత దాన వీరు విశేషముగాఁ జెప్పినతంత్రాంతరవృత్తిచేత నీయర్థము సిద్ధించుచున్నదా? సీత(యొక్క) యున్నది (షష్ఠి) సీతను(న్) అనుద్వితీయతోఁ దుల్య మైనయాకారము గలది గానపు డేమి చేయవలె? వీ రింతకు ముం దేమి చెప్పిరి? షష్ఠి ద్వితీయాతుల్య మగునపుడే యీసూత్రము వర్తిల్లు ననిరి. అనఁగా నపుడే షష్ఠికి ద్వితీయాతుల్యత యగును. షష్ఠి ద్వితీయాతుల్యముగా లేనపు డీసూత్రము వర్తిల్లదు. అనఁగా నపుడు షష్ఠికి ద్వితీయాతుల్యత రాదు. సీతయొక్క శక్తి యనియే యుండు నన్నమాట.

ఇంక నీతంత్రాంతరవృత్తితో వజ్ఝలవారు వ్యాఖ్య చేసినతీరు లక్షణమునకే కాక దానికి వీరే యింతకు ముందు చేసినవివరణమునకు ననుగుణము గాదని గమనింపవలసియున్నది. ఇట వీరు షష్ఠి ద్వితీయాతుల్యాకారము గల దగునపుడు ద్వితీయాంతమువంటిరూపముతో నిల్చు (1167) ననిరి. షష్ఠి ద్వితీయాంతరూపముతో నిల్చుట యసంగతము గావున షష్ఠ్యంతము ద్వితీయాంతమువంటిరూపముతో నిల్చు నని యభిప్రాయముగా గుర్తింతము. అంతకుముందు షష్ఠి ద్వితీయా

తుల్యాకారము గల దగునప్పు డన్నది సైతమిట్టిదే. సీత(యొక్క) యనుషష్ఠ్యంతము సీత(న్) అన్నద్వితీయాంతముతోఁ దుల్య మైన యాకారము గల దనియు నట్టిషష్ఠ్యంతమునకు ద్వితీయాంతమువంటి రూపము నిల్చు ననియు వజ్ఝలవారియభిప్రాయము నెన్నవలెను.

కాని వీ రింతకు ముం దీసూత్రమున కర్థము వ్రాయుచోఁ బ్రాతిపదికమయి నిల్చియున్న షష్ఠీవిభక్తి ద్వితీయాతుల్య మగునాకారము గల దగు (11౬౮) ననిరి. కాన విభక్తియే మారును. ఇట విభక్త్యంతమును బ్రస్తావించుట దాని కనుగుణము గాదు గదా. ఇటఁ గూడ షష్ఠీవిభక్తి ద్వితీయావిభక్తితోఁ దుల్యాకారము గల దగు నపుడు షష్ఠీవిభక్తి ద్వితీయావిభక్తివంటిరూపము గల దగు ననియే భావించి రనుటకు వీలు లే దని వారిలక్ష్యవివరణమునుబట్టియే గ్రహింపవచ్చును. వీరిసూత్రవివరణమార్గము ననుసరించి (అట్టితుల్యతకా?) ద్వితీయానువర్ణమును లోపింపఁజేయవలె నని యెంచుట వివరణమున కనుగుణమా? కా దని వారిమాటలనుండియే గ్రహింతము. సీతనున్శక్తి యనుచోఁ బాక్షికనులోప మేల చేయవలెనో తెలుపుటకుఁ గాఁబోలు నిట్లు పేర్కొనిరి. 'సీతనున్' అను ద్వితీయారూపములోని ను అనునది లుక్స్యాత్తనుసూత్రముచొప్పున విధానను లోపింపఁగా సీతన్ అని యేర్పడును. అట్టిరూపములోనితిఙ్మధ్యసూత్రసిద్ధద్రుతము చేరక ముందటిసీత అనునది సీతయొక్క అను దానిలోనియొక్క లోపించినదానిని బోలియుండునే కాని సీతనున్ అనుదానిలోనిద్రుతము చేరక ముందటిసీతను అనునది యద్దానిని బోలియుండదు గదా. కాన నిట్టిద్వితీయాతుల్యాకారము నిల్వనేరదు. (వ్యా.సం.స. 1167)

ఇట నంతకు ముందటివివరణమందలియభిప్రాయము తిరుగఁబడుట గానవచ్చును. ద్వితీయాతుల్యాకారము గల దగునపుడు షష్ఠికి

ద్వితీయాతుల్యత యగు నని యింతకు ముందు వివరణము. కాని యిపుడు షష్ఠితోఁ దుల్యత గలిగిన దగుటచేత సీతన్ అని ద్వితీయా తుల్యత యగును గాని షష్ఠితో నట్టితుల్యత లేకపోవుటచేత సీతనున్ అనుద్వితీయాతుల్యరూపము నిల్వదు. షష్ఠి ద్వితీయాతుల్యముగా నున్నపు డాషష్ఠికి ద్వితీయాతుల్యత యగునా? లేక షష్ఠితోఁ దుల్య మైనరూప మేదియో యదియే యగునా? ఇంచలిభేదము స్పష్టమే. మొదటిపక్షము ననుసరించి షష్ఠి ద్వితీయాతుల్యాకారము గలది గానిచో దానికి ద్వితీయాతుల్యత రాదు. రెండవపక్షము ననుసరించి షష్ఠికి ద్వితీయ యగును. కాని యది షష్ఠితోఁ దుల్య మైనయాకారమె యగును. అట్టియెడలఁ దంత్రావృత్తివలనఁ బ్రయోజన మేమి? ద్వితీయాతుల్యా షష్ఠీ ద్వితీయాతుల్యా భవే త్తన నేమి లాభము? సీత(యొక్క) అనుదానితోఁ దుల్య మగుట సీత(న్)అనునదే యగును గాని తుల్యము గాని సీతను(న్) అన్నది కలుగ దని చెప్పుచో షష్ఠి షష్ఠీతుల్యా ద్వితీయా భవే త్తని చెప్పవలెను గదా. వఝలవా రట్టి యర్థమును సూత్రముచే సాధింపఁగల్గిన నపుడు వఝలవారిపై లక్ష్య వివరణము లక్షణవివరణముతో సరిపడును.

కాఁగా వఝలవా రుద్దేశించినప్రయోజనము సాధింపఁ జాలమి 'ద్వితీయాతుల్యా షష్ఠీ ద్వితీయాతుల్యా భవే' త్తనుతంత్రము తోడి వివరణము నంగీకరింపరా దని వారిలక్ష్యవివరణమునుబట్టియే గ్రహింపనవచ్చును. కాఁగా నాసూత్రం షష్ఠీ ద్వితీయాతుల్యా భవే త్తన్నది యట్లే యన్వయింపనగుచున్నది. కాని విశేష మగుచున్న యము తత్కర్తచే నుద్దిష్టము గా దనియుఁ దంత్రావృత్తికిఁ బ్ర సక్తి లే దనియు నిశ్చయింపఁదగును.

అట్లే షష్ఠివిభక్తికి ద్వితీయా (తుల్య) విభక్తి యగు నని చెప్పవలసితీరులోఁ జెప్పినవీరు షష్ఠ్యంతరూపమునకు ద్వితీయాంతరూప

మగు నని చెప్పుట విరుద్ధము. ఇవ్వృత్తమునను నామ్నా యన్నది వర్జ్య
మని మొదటనే గుర్తించియుంటిమి.

ఏమైనను వజ్ఝలవారు సీతనుశక్తి యనురూపము లక్ష
ణానుగుణముగ వారింపలే దని గుర్తింపవలసియున్నది.

సీతనుశక్తి యనుకీతిరూపములు వారింపఁబడినవలె నన్న
సీద్వితీయానువర్ణము ద్రుత మనవలె. అపుడే ద్రుతముచేఁ బదాంతము
నకు ద్రు.ప్ర.త సిద్ధించుట నశ్యే యని యింకొక ద్రుతము చేరదు.
ఈద్వితీయానువర్ణము ద్రుతమే యగుట ద్రుతస్య సర్వత్ర లుక్ క్వాసి
లోపించుఁ గాన సీతశక్తి యనియే యగును గాని సీతనుశక్తి యని
యుండదు. (అప్పుడమ్మానకు నువర్ణము నిత్యమా !)

అయ్యును రామునిగుణము లనుకీతివాని ననుసరించి ద్వితీయా
నివర్ణకము మాత్రము ద్రుతము గా దనవలెను. ప్రౌఢవ్యాకర్త ద్వితీయా
నువర్ణము ద్రుతమే కాని నివర్ణము ద్రుతము గాదని యెంచె ననియు
నందుననే దానిన్ అనుచో నివర్ణముపై ద్రుతమును జేర్చి ధనమును
అనుచో నువర్ణముపైఁ జూపలే దనియు గుర్తించితిమి. కాని ప్రౌఢ.
నువర్ణమే ద్రుత మని యెంచుటచే నివర్ణము ద్రుతము గా దనుకొనుట
యొప్పినది. కాని అస్మద్యుష్మద్వ్యాచ్యాదేశత్వఙితోసహి యనుచోఁ
జెప్పఁబడిననివర్ణము ద్రుతమే కదా. అహో. దీనిని ద్రుత మని యెంచి
నట్లు చెప్పలేము. నే మహాకవి వచ్చితి ననుచో 'నిర్విశ్చ వాక్యచి'
త్రమనాథర్వణముచే నివర్ణము రాలే దనెను. (కవిశి. 600) ద్రుత
మని యెంచిన నివర్ణము వచ్చినను ద్రుత మగుట స్థిరపడకతలో
(వచ్చితి) లోపించిన దనవచ్చు. కావున స్వరపరుషపరకస్థల మేదియో
చూపెడివాఁడే. స్థిరానసానపరకస్థలము బలీయము గాదు గదా. కాఁగా
నీనివర్ణము ద్రుత మని యహో. యెంచలే దనిపించు. కాని యిది

ద్రుత మనుటలోఁ బ్రౌఢ. కభిప్రాయభేద మనవసరమే. అహో. పరేషాం తు అని యైనను వర్ణమునుగూర్చి యిట్లు చెప్పెను. నహుషు పుత్రుండఁ బూరుండను - జనకుండ యయాతి ఇత్యాదిశబ్దానుశాసన వచనాదుల్లోపో ద్రుతప్రకృతికకార్యం చ సిధ్యతీతి ధ్యేయమ్ (కవిశి. 601.) అహో. కూడఁ (వజ్ఝలవారివలె) బోల్లునకారమే ద్రుత మని భావించుటంజేసి తాను నేనులలోను సముచ్చయార్థకకను వర్ణములోను నల్లోపమును జెప్పినట్లు యిటఁ జెప్పెను. ఇటఁ బ్రౌఢ. నువర్ణమే ద్రుత మని యెంచు ననుట స్పష్టమే. పండితుండను అనుచో నువర్ణము ద్రుతము గాఁగఁ గవిని అనుచో నివర్ణ మట్టిది గా దని ప్రౌఢ. తలంచునా?

ఏమైన నీనువర్ణనిర్దేశమున (జనకుండ యయాతి) ద్రు.ప్ర. కార్యమును శేరొక్కన్న యహో. నే మహాకవి నచ్చితి ననుచో ప్రకృతికార్యము నిటఁ గాక నివర్ణము రాదే యని యెంచుటనుబట్టి నువర్ణము ద్రుత మైనను నివర్ణము ద్రుతము గా దనిన ట్లగుచున్నది. ఇది దేశగతి ననుసరించిన ద్వితీయానువర్ణము ద్రుతమే కాని ద్వితీయానివర్ణము ద్రుతము గా దని (ప్రయోగానుసార మగుట యింకను విశేషము) నిర్ణయించుట కవకాశము గల్గుచున్నది, కాని యప్పకవియుఁ జిం. నిలు విధించినచోట్ల నెల్ల నయ్యవి ద్రుతము లగుచుండ ద్వితీయానివర్ణ మొక్కఁడె ద్రుతము గాదే యనవలసివచ్చుచున్నది.

అంగా. షష్ఠీ భవేదిత్యాదిసూత్రము వివరించుచు నామ్నాం తత్పురుషసమాసే యా షష్ఠీ సా హి ద్వితీయాతుల్యా స్యాత్ రామునిగుణములు రాములగుణములు - వనముద్గఱ (కవిశి. 597) అనెను. రాములగుణము లనురూపము సిద్ధింపవలె నన్న సంస్కృత షష్ఠికే (సంస్కృత) ద్వితీయ చేయవలె నని గుర్తించితిమి. అహో.

స్పష్టము చేయలేదు గాని యట్లు చేసె ననుకొందము. అట్టిచో వనముయొక్క + దగ్గఱ అనుచో (వన + ఙస్) వన + ఆమ్ అని యుండ అమ్మునకు నువర్ణము రావలె. రామునిగుణము లయినట్లుగా వనమునుదగ్గఱ నని కావలదా? అయిన నహో. నువర్ణక మెప్పుడును దలఁచుగా లోపముతోనే వినిపించుచున్న దనెను. అరుదుగ నైనను వనమునున్ అని యుండనగును గదా. లేకున్న నువర్ణమును ద్వితీయగాఁ బరిగణించుటయే వ్యర్థ మగును. అయిన నహో. రాముని బాణములు రామబాణము లని నివర్ణకస్థలమున రెండురూపము లిచ్చియు నువర్ణకస్థలమున ద్వితీయైకవచనము లోపించినయొక్క రూపమే యిచ్చె నేమి? ఏమైన రామునిగుణము లని నివర్ణము గొన్నియెడల నిల్చుచుండఁగా వనముదగ్గఱ నని నువర్ణముమాత్ర మెప్పుడును నిల్వకుండుటనుబట్టి నువర్ణము నివర్ణముకంటెఁ గొంతభిన్న మైనలక్షణము గలదిగాఁ దోఁచకమానదు. అదే నివర్ణము ప్రుతము గాకుండఁగా నువర్ణము ప్రుత మగుట యనవచ్చును.

లక్షణము షష్ఠీ భవే ద్వితీయా తత్పురుషసంస్థితానామ్నా నున్నఁ జాలదా! తుల్యశబ్దమువలనిప్రయోజన మేమి? ద్వితీయా తుల్యా షష్ఠి ద్వితీయాతుల్యా భవే త్తనువజ్ఝలవారితంత్రోచ్చారణ మున నిది యుపకరించునట్లు తోఁచును. కాని యట్టిసమన్వయము ప్రయోజనవంతము గా దని గుర్తించియున్నారము. షష్ఠివిభక్తి ద్వితీయా విభక్తివంటియాకారముతో నిల్చు ననిరి. కాని వజ్ఝలవారును ద్వితీయా విభక్తియే చేసిరి. షష్ఠికి ద్వితీయయే యగునప్పుడు ద్వితీయా స్యా త్తనక ద్వితీయాతుల్యా యన నేల? అర్థమునకా? శబ్దమునకా?

ఇతరత్ర చ ద్వితీయా యని హేతి నన్నఱకెన్ అనుతీరుగాఁ దృతీయకు ద్వితీయ రాఁగాఁ దృతీయాస్థానిక మగుద్వితీయ తృతీయార్థ

కనే కదా. అట్లే లంకం గలకలం బనుచో సప్తమీస్థానికం బగు ద్వితీయ సప్తమ్యర్థకమే. అదేవిధముగా నిటఁ గూడ రామ + ఙస్, రామ + ఆమ్ అనురీతిగా షష్ఠికై నద్వితీయ షష్ఠ్యర్థకమే యగును. కావున ద్వితీయ యైనను నది ద్వితీయార్థకము గాక షష్ఠ్యర్థకమే యగుటకై తుల్యశబ్దము ప్రయోగింప నక్కఱ లేదు. అటఁగా నర్థమునకై తుల్యశబ్ద మక్కఱ లేదు.



శబ్దము నుద్దేశించియే తుల్యా యనెనా! షష్ఠీవిభక్తికి, ద్వితీయా విభక్తి చేయుటలో నెట్లును భేదము చూప వీలు లేదు. ఇంక నమ్మనలన నేర్పడుశబ్దస్వరూపమునే భేద మేదేని గల దేమో చూడవలె.

రామ + ఙస్ రామ + ఆమ్ అనుచో రామునిన్ రామున్ అను రెండు రూపములును నిల్చును. అట్లేరాములన్ అనుచోను. కాఁగా నిలవర్ణము విషయమున ద్వితీయారూప మట్లె నిలిచి యుండుఁ గావున నటఁ దుల్యశబ్దముప్రయోజన మేమియు లేదు. (ద్వితీయాతుల్య మనుటచే ద్వితీయాంతము గాదు గావున ద్రుతము చేరక రాముని రాము రాముల నిల్చు నన్న నిట ద్రుతలోపప్రసంగ ముండదు. కాని వ్యాఖ్యలవారిట్లు గాక రామునిన్ అనురీతిద్వితీయాంత రూపమునే నిల్పి ద్రుతస్య సర్వత్ర యని ద్రుతలోపము చేసిరి. అహో. కూడ నిట్లే.)

ఇంక నువర్ణకస్థలమున సీతనుశక్తి యనురీతిరూపములు లేవు గావున నిట్టియెడల నువర్ణకరహిత (అమ్ము లోపించిన) రూపమే నిల్చును గాని సీతనున్ అనురీతి నువర్ణకఘటితరూపములు నిల్వ వనవచ్చు నదియే తుల్యశబ్దమునకుఁ బ్రయోజనము. వ్యాఖ్యలవా రొకచో రుక్ రుగ్ అనురీతిని సంస్కృతమునఁ బ్రథమైకవచనరూపములు

రెండువిధముల నున్నను నందు చర్త్వరూపములే యనఁగా కచటత పాంతరూపములే తెల్గునఁ బ్రాతిపదిక లగును. (6:5) సుగ్, రాడ్ అనునవి గూడఁ బ్రథమైకవచనాంతములే యైనను నవి తెల్గునఁ బ్రాతిపదికలు గావు. ఈయర్థము నాసూత్రమునందలి తుల్యశబ్దము (ప్రథమైకవచనతుల్యం సర్వత్ర) సాధింపఁజాలుచున్న దనియుఁ బేర్కొనిరి. అట్లే యిటఁ గూడ ద్వితీయాతుల్యా యనుచోటి తుల్యశబ్దముచే సీతామ్ అన్నదియు ద్వితీయాంతరూపము యైనను (అమ్మునకు సవర్ణదీర్ఘ మగుట యున్నను) సీతన్ అనునదియే (అమ్మ్ లోపించియే) నిల్చు నని చెప్పకొన్న సరిపడెడిదే. కాని వ్యాఖ్యాత లట్లును జెప్పలేదు. నీలయెడల నట్లు నియమింపరాకున్నను నవసర మగుటంజేసి సవర్ణదీర్ఘములు మాత్ర మట్లు గ్రహింపనగు దప్పు లేదు గదా.

కాఁగా ద్వితీయాతుల్యా యని తుల్యశబ్దముచే షష్ఠికైన ద్వితీయ లోపించుటయే జరుగు ననియు (హారతిమ్ముఁడు, సీతకత్తి) దుమంతములయెడ మాత్ర మమ్ము లోపింపనిరూపము గూడ నుండు ననియు (రామునిగుణములు రాముగుణములు) కస్సునకు లోపము చెప్పఁబడనే లేదు గావున కస్సు లోపింపనిరూపము ప్రసక్తియే లే దనియు (రాములగుణములు, హారులతెమ్ములు) గ్రహింపవచ్చును. ద్వితీయయుం దమ్మస్సు లైనను ఆరూపములు నిల్చుటలోఁ గలభేదము నుద్దేశించియే తుల్యశబ్దమును బ్రయోగించె నని చెప్పఁదగును.

ఇట్టియెడల ద్వితీయానిసవర్ణములే ద్రుతము లన్నమాత్ర మిబ్బంది యేమి? నిసులే ద్రుతము లనుటవలన నేతదంతము ల్ద్రు.ప్ర. లకై వీనిపై ద్రుతము చేరదు.

అందు మొదటిది యమ్లోపము.  అమ్లోపవిధానమువలన నాపక్షమున (రాముని) రాము (సీతను) సీత అని యగును. ఈపక్షమున నిది ద్రుతాంతములు గాని ద్రు.ప్ర.తక్కై ద్రుతము చేసిన రామున్ (ని), సీతన్ (ను) అని యగును. అమ్ము లోపింప కున్నట్టి రూపములే యమ్లోపపక్షమునను నేర్పడుచుండ నమ్లోప మేల?

అమ్లోపము షష్ఠికి ద్వితీయ యగుస్థలముల నుద్దేశించియే చెప్పఁబడిన దనఁదగును. అట్లైన ఇందును స్పష్టముగాఁ బరిగణించినట్లే రాముగుణములు వనముదగ్గఱ హరికొడుకు అనుకృతి షష్ఠికి ద్వితీయ యైనస్థలములందలి రాము, వనము, హరి అనుకృతిరూపముల నుద్దేశించియే యమ్లోపము చెప్పె ననుట యుచితమే గదా.

ద్వితీయాంతముగాఁ బ్రయుక్త మగుచో ద్రు.ప్ర.తక్కై దానిపైని ద్రుతము చేరి రాముని, హరిని, సీతను అనుకృతిగా నగును. షష్ఠికి నగుచో ద్వితీయ కాక ద్వితీయాతుల్య యనుటచే నమ్ము లోపించినను నిది ద్వితీయాంతము గాదు. (ప్రథమైకవచనతుల్యమ్మని వాక్ అన్నది నామ మైన నది ప్రథమైకవచనాంతము గాదు గదా.) కావున నిది ద్రు.ప్ర.యును గాదు. కావున నందుకై దానిపైని ద్రుతమును జేరదు. సమాసములం దిట్టిరూపమునకై యమ్లోపము చెప్పఁబడిన దని గ్రహించిన నది యొకయవరోధము గానేరదు.

ద్వితీయావిభక్తము ద్రుత మనఁగా రామునితమ్ముఁ డనుచో సమాసమున నిద్రుతము లోపింపనలేదు గదా. అప్పుడు నట్టి రాముతమ్ముఁ డనిదే యగును. అందుకై యమ్లోప మేల? యని సందేహము. అట్లని యీద్రుతము లోపింప దన్న (దలంబ్రాలనుకృతి గా) రాముందమ్ముఁ డిత్యాదిగఁ గావలెను. ద్వితీయావిభక్తికము ద్రుతమే. కాని యిట నివర్ణము ద్రుతము గాదు. తుల్యశబ్దముచే షష్ఠికి

ద్వితీయ యైనస్థలమునందలినివర్ణము ద్వితీయవంటిదే గాని ద్వితీయ గామింజేసి యది ద్రుతము గాదు. కావున నీనివర్ణమునకు లోపము ప్రసక్తి గాని ద్రుతకార్యముల ప్రసక్తి గాని లేదని గుర్తింపవచ్చును.

అట్లయిన వన + జస్, వన + అమ్ వనమునువగ్గఱ ననుచో నువర్ణమును ద్వితీయవంటిదే గాని ద్వితీయ గామి ద్రుతము గాదు గదా. వనమువగ్గఱ నని యగు టెట్లు? ఇట్లే హారిసికోదుకు. కాని నువర్ణకము రాఁదగినస్థలము లందును ఇదంతాదులయెడను షష్ఠికైన అమ్ము లోపించుటయే జరుగునని యింతకుముందే యనుకొంటిమి గదా.

ఈపక్షమున నువర్ణకస్థలమునను నన్లోప మంగీకరింపవలె. అది విశేషమును గాదు. చిం. నువర్ణకమును ప్రత్యేకముగాఁ బేర్కొనలేదు. కాని చిం. చెప్పిన నివర్ణకాన్లోపములనుబట్టి వ్యాఖ్యాతలితరస్థలముల నువర్ణకాన్లోపములను వ్యాఖ్యానించియే యున్నారు గదా. హరి అనుకృతి మహత్పుంలింగములపై నివర్ణకాన్లోపములు చిం.చే సిద్ధములు.

ఇదేపద్ధతిలో రామ + అమ్ రామ + శస్ రాములు అని యగుచో నిదియు ద్వితీయవంటిదే గాని ద్వితీయ గామింజేసి ద్రు. ప్ర.తయు నందుకై దానికిఁ బైని ద్రుతము చేరు ప్రసక్తియు లేదు. అనఁగా షష్ఠికి ద్వితీయ యైనస్థలమున నెచ్చటను ద్రుతస్య సర్వత్ర యను ద్రుతలోపప్రసక్తి లేదు. అందుకే ఆం.సా.ప.బా.స.లోను కవిజ.లోను ద్రుతస్య సర్వత్ర యనుసూత్రమునొద్ద షష్ఠీతత్పురుషము లుదాహరింపఁబడలేదని గుర్తింపఁదగును. కాఁగా రామునియొక్క + ఆజ్ఞ – రాము + అమ్ రాము + ఆజ్ఞ, నుమాగమునపై రామునాజ్ఞ. ఇట్లు ద్రుతలోపముప్రసక్తి లేమి నొకలాఘవముగా గుర్తింపఁ

వగును. నిజమునకు షష్ఠీతత్పురుషముల షష్ఠికి నెల్లయెడల ద్వితీయ యగుచుండఁగా ద్వితీయకుఁ జివర ద్రుతి యుండఁగా రాము నాజ్ఞ యనుచో దానిని లోపింపఁజేసి సమాగమమును విధింప నేల? రాముతమ్ముఁ డిత్యాదులందువలె నిట లోపింపవలసియుండఁగా సూరి యెట్లు తెల్గుభాష్యాదుల ద్రుతమునకు లోపము లేమిని సమ్మతించెనో యట్లే యిటఁ గూడ షష్ఠీసమాసమునం దుత్తునకచ్చు పర మగునపుడు ద్రుతమునకు లోపము లేదనుట యుచితము గదా. నకారము నాగమముగాఁ జెప్పవలయుచో నానకారమునే లోపింపఁ జేయ నేల? కాఁగా షష్ఠ్యా ఉతోఽచి నుమ్వా యనునుమాగమవిధా నమే షష్ఠీతత్పురుషములందు ద్రుతస్య సర్వత్ర యని ద్రుతలోపము ప్రసక్తి లేదని స్పష్టము చేయుచున్నది. అది సూరిలక్షణమువంటిదే. నీచేతిప్రోపు ఇత్యాదుల ద్రుతలోపము నది సాధించును. (వినా ల వర్ణం నోసంధిర్మిశ్రేతత్సమ యోర్లుకి యను వి.వి. వచనము దీనికి బాధ కము గాఁ గనిపించును. కాని యది వివాదములకు లోనైనది. దాని విషయము గ్రంథాంతరమునఁ జూతము.)

ద్వితీయానినువర్ణములు ద్రుతము లనుటలో వి. వి. విరో ధించు నేమో చూతము.

వి.వి. 'మహతోఽనుష్ఠు విష్ణుక్ స్యా దన్యత్ర స్వత్ర ను ర్భవే త్తన్న భాగము నిరమో మహతాం లుక్ స్యా త్తసుదాని యర్థము నే యిచ్చుచున్నది. మహతోఽనుష్ఠు విష్ణుక్ స్యా త్తనుచోటికి తుశబ్దము చార్థకి మని వ్యఞ్జిత యున లుక్ తు-లోపమును వచ్చు నని యర్థము నోసిరి, అమః నిః స్యాత్ అమః లుక్ స్యా త్తని అమ్ముకై నినర్గమను లోపమును వచ్చును.

పిదప నన్యత స్వత్ర నుర్భవే త్తని నువర్ణము విహితము. ఇటఁ గూడ తుశబ్దముచేఁ బాక్షికలోప మగు నని రీ వారి. (488)

కాని మహాత్పుంలింగేతరముల కన్నచో నవి తుశబ్దము భిన్నక్రమము నుద్దేశించినదిగాఁ దోఁచును. అహో. ఇట నువర్ణకము నిత్యముగనె విధింపఁబడిన దని తలఁచుటచేతనే పైని ఉదన్తాత్తు అని యుదంతములపైనే వికల్ప మన్న నెల్లయెడల నువర్ణక(అమ్)లోపము శాస్త్ర వ్యవస్థతో గ్రహింపవలె ననెను.

చిం. మతమునఁ బరిశేషన్యాయముచే నువర్ణమును సాధించి యట దానికి లోపము వికల్ప మనియే యహో. కూడ వివరించెను. నివర్ణకస్థలమున నస్లోపము చెప్పఁబడుటచే నర్థానిచే నూహింపఁబడు నువర్ణకస్థలమునను నస్లోపము వికల్పముగాఁ జెప్పుట సక్రమమే యనఁదగియున్నది. అందుకే బా.స.ప్రభృతులు నట్లు భావించి రనఁదగు. అట్టియెడల వి.వి. నువర్ణము నిత్య మని యెంచినదా? కారికకిట్లర్థము చెప్పఁదగు. అత్ర — ఈ యాంధ్రమున మహతః తు అమః — మహాత్పుంలింగములైన శబ్దములకుఁ బరమైన అమ్మునకు నిః — నివర్ణము అన్యతః తు - మహాత్పుంలింగేతరస్థలముల నన్నచో నమ్మునకు నుః— నువర్ణము భవేత్ — అగును. లుక్ స్యాత్ - ఆ (నినువర్ణములకు) అమ్మునకు లోపము వచ్చును. ఇంకను మహతః అమః తు నిః, లుక్ స్యాత్, అన్యతః తు నుః భవేత్, లుక్ స్యాత్తనియు లుక్ స్యాత్తన్నదానిని రెండింటితోడ నన్వయింపఁదగు. కాఁగా నిను లగుట వికల్ప మనియు నొకపక్షమున నమ్ము లోపించుటయు నన్వయింపఁదగును.

ఇ ట్లీకారికపూర్వార్థము చిం.అభిప్రాయము ననుసరించి దానిని స్పష్టము చేయుచున్నది. తరువాతియర్థము విశేషము.

గ్రంథము (ముద్రిత.) 117 పుటలోని రెండవ పేరా ప్రమాద పతితమైనది యది తొలగింపఁదగును.

ఇదాదిభ్యస్తు నిత్యం లుగుదన్తాత్తు స వా భవే త్తనుసహాః.

పాఠము నన్లీ వజ్ఝలవారును స్వీకరించి ఇఈఉవర్ణాంతశబ్దములకన్నఁ బర మైనఅమ్ప్రత్యయమునకు నిత్యముగా నివర్ణకముమాత్రమే యాదేశ మగు నని, లుక్ తు భవతి - తుశబ్దము చార్థకము. దానికి లోపమును వచ్చు (4౮౪) ననిరి. (లుక్ తు భవతి యనుచో వజ్ఝల వారివివరణమున భవతి యున్నది యథావ్యాహృతము. ఇదాదిభ్యస్తు అనుచోటితుశబ్దము లుక్తు అని పిదపఁ జేర్చి యది చార్థక మనిరి. కాని యిదియు భిన్నక్రమమునే దెల్పుచున్న దనఁదగు.) నివర్ణకమే వచ్చు ననుట విశేషము. నిజమునకుఁ బూర్వోక్తము నువర్ణము గావున నువర్ణమే నిత్యముగా నగు ననవలెను. కాని యది ప్రయోగ విరుద్ధము. అందుకే నివర్ణక మని యుందురు. ఇది నిత్యముగాఁ జెప్పుచో లుక్ - అని లోపము నేల చెప్పెను? లోపమును జెప్పఁ బోవుచు ముందు నిత్య మ్మనుట యుచితము గాదు గదా.

నివర్ణకమును (అమ్ము) లోపించుచున్నది యట నిత్య మని చెప్పెనా? ఇట నిత్య మన నేల? 'ఇందలినిత్యశబ్దము నువర్ణకాత్యంతాభావమును బోధించు నని యెఱుంగునది' (4౮౫) యనిరి. నిత్యశబ్దము ప్రయోగించుటవలన నిది ప్రయోజనమా? అయిన నిత్య మన కున్న నువర్ణము వచ్చెడిదా? మహాత్స్వంలింగేతరములకు నువర్ణకముతో పాటు నివర్ణకము వచ్చునా? అట నిత్య మనలేదు గదా. నివర్ణ మగును. దానికి లోప మగు నని నిత్యశబ్దము లేకుండఁ జెప్పిన నిట నువర్ణకము వచ్చెడి దనుట సరి కాదు. కావున నిత్యశబ్దమునకు వజ్ఝల వారు చూపినప్రయోజనము సమంజసము గాదు. అది పీఠును గుఱించి రని తరువాతివారిమాటలవలన గ్రహింపవచ్చును. పరిశీలింపఁగా నిత్యమ్ అనుచో నిత్వమ్ అనుపాఠము గ్రంథకృదభిప్రేత

మనుట లెస్స' (489) యనుటలో నిత్యపాఠము వారియర్థములో సముచితముగా లేదని, దానికి వారు చూపిన ప్రయోజనమును సరిగా దని వారే గుర్తించి రనవచ్చును. ఏమైన నిత్యమ్ లేదా నిత్యమ్మని వఝ్ఝలవారు సాధించుహారినిన్ అనుకీతిరూపములు కేవల మసాధారణములు. అట్టివానిని సాధారణముగా సాధించుట యొప్పదు గదా.

కావున నింతకుముం దనుకొన్నట్లుగా ఇదాదిభ్యస్తు నిత్యంలు క్కని యమ్మునకు నిత్యముగా లోప మగు ననుట యొప్పును. నిత్యలోపముచే హారి అనియే యుండును గదా. అనఁగా నిది ద్వితీయాంత మగునపుడు ద్వి.ప్ర. కావునఁ జివర ద్విత్వము విధింపఁబడమి నన్యే యని నిద్రితము చేరి హారిని అని యగును. అమ్ము లోపించినను నన్యే యని నిద్రితము చేరునపుడు నివర్ణమే నిత్యముగా నగు ననక యమ్లోపము చెప్ప నేల యని సందేహము

హారి యనుచో మహాత్ప్రంలింగము గాన హారిని అని నివర్ణకమగును. కాని గిరి అనుచో నమహాత్తు గావున నువర్ణక మై గిరిను కావలెను గదా. ఇట్లే రైను పైను శ్రీను మొ॥ అట్టియెడల నిత్యమ్మనుట యెట్లును గుదురదు. వఝ్ఝలవా రూహించినట్లు నిత్యమ్మని యుండవలె. నిజమునకుఁ బూర్వోక్తము నువర్ణ మగుటచే హారి మొదలగువానిపైఁ గూడ నువర్ణకము నిత్యముగా నగుటయో యమ్లోపము నిత్య మగుటయో చెప్పవలె. ఇట నమ్లోపమును జెప్పుటయే యుచితము గదా. నిత్య మ్మని హారిని, గిరిని అని సాధించిన నొప్పునా? రాముని రాము అనుచో నమ్లోపము షష్ఠికి ద్వితీయాతుల్యత యగు స్థలము నుద్దేశించిన దనుకొంటిమి. ఇట హారినిత్యమ్మ దని యుండదే.

ఇదాద్యంతములయెడల షష్ఠికి ద్వితీయాతుల్యత యగు సందర్భమున హారితమ్ముఁడు గిరికూఁతు రనుకీతిగా నివర్ణరహితరూప

ములు మాత్రమే నిల్చుచున్నవి. కావున రాముని ఇత్యాదులందువలె నిట నివర్ణస్థితి కవకాశమే లేమి నల్లోపము నిత్యముగాఁ జెప్పఁబడిన దని గ్రహింపవలెను. షష్ఠికి వచ్చుచోట నమ్ము లోపించినను నది ద్వితీయాతుల్యమే కాని ద్వితీయాంతము గామిఁ బైని ద్రుతము చేరదు. ద్వితీయాంత మగుచో ద్రుప్ర. కావున ద్రుతము విధింపఁబడమింజేసి యన్యే యని ద్రుతము చేరఁగా వాలిని గిరిని అని యగును.

అయిన సీతనుశక్తి వనముపగ్గల ననురీతిస్థలముల నువర్ణక మును నిల్చుట లేదు గదా! అట నుప్తభవే త్వని యేల విధించెను? ఇదానులపైవలెనే మహాత్మ్యంలింగేతరస్థలములను నల్లోపమే నిత్య ముగా నగు నని యేల చెప్పఁడు? అని సందేహము. నిజముగ కట్టి చెప్పవలసియున్నది. కాని యట్టియెడల నువర్ణము రాఁదగినచోట్ల నెల్ల నమ్ము నిత్యముగ లోపించు ననవలె. అట్టిచో నువర్ణము నిల్చు చోటే యుండదు. మఱి సూత్రమునం బయో భవే ద్వితీయా తు అని నువర్ణమును ద్వితీయగాఁ జెప్పుట వ్యర్థము గదా. కాఁగా ద్వితీయగాఁ బరిగణించుట సార్థక మగుటకై నువర్ణకము వచ్చుటను జెప్పవలసినదే. సీతశక్తి వనముపగ్గల ననురీతిగా షష్ఠికి ద్వితీయాతుల్యత యగుస్థల ముల నుద్దేశించి యన్లోపము ననుపదమే. ఇందుకై నువర్ణకా న్లోపములు రెండును జెప్పఁగా షష్ఠికి ద్వితీయాతుల్యత యగుసంద ర్భమున నమ్ము (లోపించినమాపమే) లోపించుటయే యుండు నని తుల్యశబ్దముచే గ్రహింపఁదగును.

రామునితమ్ముఁ (రాముతమ్ముఁ) డనుచో నివర్ణము నిల్చుట ననుసరించి యట నమ్మునకు నివర్ణము చెప్పఁబడిన దనియు నందుకై నివర్ణమును ద్వితీయగాఁ బరిగణించుట యవసర మనియు గ్రహింప వచ్చు. రాముని అనుచో నివర్ణము ద్వితీయగాఁ జెప్పుట ననుసరించి

సీతను అనుచో నువర్ణము చెప్పిచిం. నువర్ణమును ద్వితీయగాఁ జెప్పిన దని యూహింపవచ్చును, ఇంకను జిం. హారిని హారి అని సివర్ణము నమ్లోపము నుద్దేశించి రాముని, హారిని, సీతను అని ద్వితీయాంతములను డిఁచె ననఁదగు. గిరి ఇత్యాద్యమహాదిదంతాదులపైని జిం. ననుసరించి నువర్ణకము రా ఏ లుండ నట్టివానిని గూడ నుద్దేశించి వి.వి. ఇదాదులపై నమ్లోపముమాత్రమే చెప్పియుండు. అహో. ఈభాగమునుమాత్ర మిట వివరింపకుంటకుఁ గారణము స్పష్టము గాదు.

ఉదస్తాత్తు స వా భవే త్తనుదానికి ఎజ్జులవారు చెప్పిన యర్థముంగూర్చి యింతకుముందు చూచితిమి. సః - అమ్లోపము (ఇదాదులపై నిత్యముగా నగునది.) ఉదస్తాత్తు ఉదంతములపై నన్నచో వా భవేత్ - వికల్పముగా నగును. ఇచ్చోటితుశబ్దముచే మహాత్సంలింగము లైనయుదంతములే గ్రహింపఁదగును. (లేదా వాశబ్దమునను మహాత్సంలింగేతరము లిట గ్రహింపఁబడ వని వ్యవస్థ చేసికొనఁదగును.) దీనివలన మహాత్సంలింగేతరములకు నన్యత స్త్వతి నుర్భవేత్ లుక్ స్యా త్తని వైకల్పికలోప ముదంతానుదంతములకు నెల్ల (పూర్వోక్తనిత్యలోపస్థలములఁ దప్ప) నగు నని గ్రహింపవచ్చును.

మహాత్సంలింగములకుమాత్ర మిట్లు చెప్ప నేల? మహాతో వస్తు నిర్భవేత్ లుక్ స్యా త్తని వైకల్పికామ్లోపము పూర్వసిద్ధము గాదా? కాన నిది వ్యర్థమే. అయ్యును నిది పైని మహాత్సంలింగములకుఁ జెప్పినయమ్లోపము మహాత్సలింగముల కుదంతములకే యని నియమించును. అనుదంతము లగుమహాత్సంలింగములపై నమ్మనకు లోపమసలు లే దని గ్రహింపవచ్చును. మగని వన్నకాని అనురీతిగా నివర్ణక మగుట నిత్యము. మగనిమాట ఇత్యాదిస్థలముల మగమాట యను రీతిరూపములు లేకుండుట స్పష్టమే గదా. సవిత్సవిధాత్సమాం

ద్వితీయాతుల్యత యగుసందర్భమున లేక మగనిగాణము నకు గ మాత్రమే యుంట ననుసరించి మగని అనియే ద్వితీయాంతరూపము చిం. (వి.వి.) సాధించె నని గుర్తింపవచ్చును.

మగనిని అనురీతివానిని వజ్ఝలవారు సాధించిరి. సంబిన్దుకస్య డోః స్థానే నిన్నిత్య ముపతిష్ఠతే యనుకారికచే నేకాదులకు కాద్రత్య యాంతాదులకును ద్వితీయా ద్యేకవచనపరకత్వమున నివర్ణము నిత్యముగా నగు నని వివరించిరి. (492) ఈకారిక నేకాదులయెడ నుపయోగించు ట ట్లుండఁగా దీనివలన మగనినిన్ అనురీతిరూపములు వీరు సాధించిరి. రాముని జూచె నన్నట్లు మగనినిం జూచె ననురీతిరూపములు సాధింపఁబూనుట విశేషము. వన్నెకానిని అనురీతిగ మాత్రమే వి.వి. సాధించె ననుట వ్యవహారిసమ్మత మగుమార్గము గదా. ద్వితీయాద్యేకవచనపరకతలో నువర్ణము నిత్య మగుటచే వన్నెకానిచిన్నె లనుచో (సీతమశక్తి వలెనె) వన్నెకానిని చిన్నె లనియుఁ గావలె. వన్నెకాను + అమ్ అనుచో నిట నామ మిద్ధంత మైనది గావున ఇదాదిభ్యస్తు నిత్యం లుక్ అని అమ్ము లోపించును. హరి + అమ్ అనుచో వలె. కాన వన్నెకానిచిన్నె లనియె యగును. ద్వితీయాతుల్యము గాక ద్వితీయాంతమ యగునపు డీనివర్ణముపై నన్యే యని ద్రుతము చేరి వన్నెకానిని అని యగును. నివర్ణకస్యాద్యపహాల్వ మతన్నా త్రనుచో వలె నీనివర్ణము ద్రుతము గాదు గావున ద్వితీయాంతము గాన దుని ప్రకృతికై ద్రుతము చేయుట యొప్పుచున్నది. హరి ఇత్యాదులయెడ హరిని అని మాత్రమే కాఁగా నిట శబ్దమునకు నివర్ణవిధానమువల్లన వన్నెకానిని అని యగుచున్నది.

లవర్ణకాదులపై ద్రుతమును విధింపనిచిం., వి.వి.లు ద్వితీయ యందుమాత్రమే నినులు ద్రుతములుగా ద్రుతమును జెప్పుటను

గూర్చి సందేహింప నక్కఱ లేదు. ధాతుతదర్థార్థములఁ బ్రథమైక వచనలోపము మాత్రము చెప్పిన చిం. ఉత్తమపురుషైకవచనముగా ను సూత్రమును విధించినది గదా. డుడినర్ణా చ నా స్తి కా యన్న వి.వి. తదర్థార్థమున డిదులు ప్రమతాంతములుగాఁ జెప్పినది గాని ప్రథమైక వచనస్థలమున డిదులు లేనప్పుడు ప్రమతాంత సంగతిని ప్రస్తావింప లేదు. ధాత్వర్థేచాపి తస్యైర్థ్యవే త్యన్నది గాని ప్రమతమును ప్రస్తావింపలేదు. కాఁగా చిం., వి.వి.లు ప్రమ.ప్ర ల ప్రమతమును జెప్పుటచో నొకవిధమైన ప్రణాళిక యేర్పఱచుకొనలే దని గుర్తింపవచ్చు.

ఇట్లు చిం, వి.వి.లలో ద్వితీయాసినులే ప్రమతము లనఁదగును.

చిం.,వి.వి.లలో ద్వితీయాసినులు రెండును ప్రమతములు గా వనియుఁ దదంతముల ప్ర.ప్ర.తక్కె వీనిపై నన్వయ యని ప్రమతము చేరు ననియు వజ్ఝలవారి మతము. సీతనున్ హానిన్ వన్నెకానినిన్ అను రీతిగాఁ బ్రయోగప్రసిద్ధములు గాని రూపము లేర్పడుట ననుసరించి యిది యంగీకారయోగ్యముగా లేదు.

ద్వితీయానువర్ణము ప్రమతము గా దని యెంచినయెడల. అది సాధారణముగా లోపించు నని చెప్పవలసివచ్చును. సింహామును వనమును అనురీతిగా మాత్రమే సాధారణముగాఁ బ్రయోగము లుండుట ననుసరించి యట్టిలోప మంగీకార్య మనక తప్పదు. కాని యట్టి యెడల ద్వితీయానువర్ణ మెల్లయెడల లోపించి యాగమప్రమతము నిల్చు ననుటకంటె నువర్ణము ద్వితీయగాఁ జెప్పినచిం.,లక్షణ మెంతయు సార్థక మగునట్లుగా సింహామును ఇత్యాదులందలినువర్ణమే ప్రమతమే ద్వితీయావిభక్తి యను టుచితము గదా. కాఁగా ద్వితీయా నివర్ణమువిషయ మట్లుండ నువర్ణకము ప్రమతము గా దనుట యొప్పకున్నది.

ద్వితీయానివర్ణము ద్రుతము గాదు గాని నువర్ణమాత్రము ద్రుతమే యనియుఁ ప్రౌఢవ్యాకర్తమతము. నివర్ణము ద్రుతము గాదన్న దానికి అని ప్రౌఢవ్యాకర్తయే చూపినట్లుగా హరినిన్ వన్నె కానినిన్ అని కావలదా? ఉక్త యనుటచే నిదంతములపై మాత్రమున్ను నిత్యముగా లోపించు నన వచ్చు. అప్పుడు (దానిన్ హరిన్ (ని) అనియే యగును. కాని నివర్ణము ద్రుతము గా దంటకు మూలముగాఁ జిం.లో నువర్ణముమాత్రము ద్రుతము గాని నివర్ణ మెప్పుడును ద్రుతము గా దనుట కవిని ఇత్యాదులనుబట్టి కుదురునది గాదు. అయినఁ జిం.లో నివర్ణమును ద్రుత మగుట కలదు గాని ద్వితీయావిభక్తి యగునివర్ణముమాత్రము ద్రుతము గా దనుట సరియైనమే యనఁ గల్గువో నీమార్గ మవలంబింపవచ్చు. అయిన నీపక్షమునను షష్ఠీ సమాసమున ద్రుతలోప మంగీకరింపవలసియున్నది గాన షష్ఠీ ఉతోఁఒచి నుమ్మే యని నుమాగమ మేల చెప్పె నట ద్రుతలోపము లే దనియో చెప్పఁజాలును గదా యన్నదానికి సమాధానము వెదుక వలసియేయున్నది.

ఇఁక ద్వితీయానినువర్ణకములు రెండును ద్రుతములే యనుట కొందఱిమతము. రాముని రాము అనుకృతిగా బా.స. ఉదాహరించిన తీరు ననుసరించి యిది బా.స.మతముగా నెన్నుట దోషము గాదు.

విరాధుని జావ 'మొత్తె, మహీజాతను గొనివచ్చె నని ద్వితీయానినువరములే ద్రుతము లని యప్పకవిమతము స్పష్టమే. ఇయ్యది సూరిసమ్మత మగుమార్గ మనుట నిర్వివాదమే. రాముని ని అనుకృతివానికై నిగాగమమును విశేషముగా విధించెను సూరి.

వజ్ఝలవారు మతినిన్ నిధినిన్ అశ్వత్థామనున్ విశ్వకర్మనున్ గురువునున్ అనువానికి స్థితి లేకపోవుచున్న (490) దని యొకయిబ్బంధిని జూపిరి. కాని యట్టిహరినిన్, వన్నెకానినిన్, సీతనున్ అనుకృతివి

ప్రయోగప్రసిద్ధము గాఁగటను నిరూపింపఁగ్గైరి. సూరిసమ్మతము లగు హరిని వన్నెకానిని సీతను అనియే సాధారణముగా నెంచుట యెంతయు నుచితము

ఉత్వాయుతో వనకాక్రో యని విధించినసువర్ణమును (భూతాదుతాం పరేషామి త్తిని యిత్వ మందినదియు) అస్మద్యుష్మద్వాచ్యార్థాని చెప్పినసువర్ణమును ప్రాకృతములే ద్వితీయానువర్ణము ప్రాకృత మనక తప్పదు. అట్లే ద్వితీయానువర్ణము ప్రాకృత మని గుర్తించినచోఁ బదాంతములగు జం నిసులు విధించినచోట్లనెల్ల నవి ప్రాకృతములే యగుట యున్నది సమానముగ సిద్ధించును.

ఈవిషయమున నింకను సాధకబాధకములు విశదముగఁ బరిశీలింపఁదగు నని గుర్తించుచు నిప్పటికిఁ జిం., వి.పి.లమతమున ద్వితీయానిసులు ప్రాకృతములే యని స్పష్టముగా నిరూపించినయప్పకవిమతము సమంజసమై యామోదయోగ్యమైయున్న దని నిశ్చయింపఁదగును.

## సమాసకమున - షష్ఠికి ద్వితీయ :

చిం: షష్ఠీ భవే ద్వితీయాతుల్యా యన్నవిధము నాచ్ఛిక సమాసములందు లోపశ్చ విభక్త్యాదేశ్చద్వైషు స్యా త్సమాసకాద్వేషు అని విభక్త్యాదిలోపమును జెప్పినది. సాంస్కృతికాచ్ఛికమిశ్రసమాసములలోఁ దెలుఁగున సాంస్కృతికమిశ్రసమాసములందు షష్ఠికి ద్వితీయాతుల్యత యగును. సమాసకములందు షష్ఠికి లోప మగునా? ద్వితీయాతుల్యత యగునా?

అగును. లోపశ్చ యనుసూత్రమునొద్ద వేల్పుదొర కైవడు దాని ఇత్యాదౌ విభక్తిలోపః (కవి.శి. 643) అనె. వేల్పు(ల)యొక్క దొర యనువిగ్రహము ననుసరించి యిట షష్ఠీవిభక్తి లోపించినది. అంతకు ముందు షష్ఠీ భవేద్ద్వితీయాతుల్యా యనుసూత్రమునొద్ద

నహో. — శంభునిచెలువ నగముద్దుఅ కొండలరాయుడు ఇత్యాది (587) అనెను. ఇందుఁ గొండలరాయఁ డన్నది సమాసకము. కొండల యొక్క రాయఁ డనువిగ్రహముచొప్పున నిట షష్ఠికి ద్వితీయాతుల్యత యైన దన్నమాట. ఇట్లుదాహరించుటలో నభిప్రాయ మేమి? సంధి పరిచ్ఛేదమును గమనింపవచ్చును.

ప్రమాణస్య సర్వత్ర లుక్సమాసేషు అనుసూత్రమునొద్ద 'ముద్దులగుమ్మ ఒప్పులకుప్ప వారలనేస్ప ఇత్యాది సమాసకబహువచనతత్పురుషశబ్దోదాహరణమ్. వారి పెంపు వీరిసొంపు ఇత్యాది సమాసకానాం లోపశ్చ విభక్త్యాదేశిత్యనేనైవసిద్ధిః (కవిశి. 514) అనెను. దీనినిబట్టిసమాసకములలో షష్ఠీబహువచనతత్పురుషములందు (కొన్నింట) షష్ఠికి ద్వితీయాతుల్యతయే యగు ననియు షష్ఠ్యేకవచన సమాసకములందుమాత్రము విభక్తిలోప మగు ననియు నహో. యభిప్రాయము గుర్తింపవచ్చు. షష్ఠీ భవే స్త్రీను సూత్రమునొద్ద కొండల రాయఁ డని బహువచనతత్పురుషమును లోపశ్చ యనుసూత్రము నొద్ద వేల్పుదొర కైదువదారి యని షష్ఠ్యేకవచనసమాసమును జూపుట తదనుగుణముగ నున్నది. ఇట్లు భేద మేర్పడుటకుఁ గారణ మేమియో యహో. స్పష్టము చేయఁ డాయె.

అందుకే కాఁబోలును వఝలవారు "షష్ఠీ భవే ద్వితీయా తుల్యేత్యాదిసూత్రముచొప్పున నన్నచో సాంస్కృతికమిశ్రసమాసములే కాక ఆచ్ఛికసమాసములును ధారాళముగా నేర్పడు (1161, 1167) నని షష్ఠ్యేకవచనసమాసములందును ద్వితీయాతుల్యతను జూపిరి. విభక్తిలోపము గాక షష్ఠీసమాసకములందు ద్వితీయాతుల్యత యేల చేయవలెనో కారణము వివరించిరి. 'తమ్మునికొడుకు వేల్పుల దొర విభక్తి పరం బగునపుడు ప్రకృతికి విధింపఁబడినవిఁలు విభక్తి

సంబంధులు గాక ప్రకృత్యవయవము లగుటం జేసి వానికి లోపము రా
దన్న గాణ.ను నిరసించుచు వీరు 'ఇది సరి కాదు. అలౌకికవిగ్రహ
వాక్యములోనే సమాససంజ్ఞ కల్గఁగా నట్టిసమాసరూపప్రాతిపదికమున
కవయవము లగుసుబ్విభక్తులు లోపించుటచేత నిలలు వచ్చుటకుఁ
బ్రసక్తి లేదు. (1160) అని పై.గాణ. ఉదాహృతులు షష్ఠీ భవే
త్తను సూత్రమునకే గాని లోపశ్చ సూత్రమునకుఁ గా దని తేల్చిరి.

కాని వజ్ఝలవారే నిలలు నిలువనిషష్ఠీసమాసములందు
ద్వితీయాతుల్యత చేసినట్లు గానరాదు. గాణ. చెప్పినది తప్పన్న
వీరు 'వేల్పు + ఆమ్ + దొర + సు అనుసమాసరూపప్రాతిపదికావ
యవము లగు ఆమ్, సు అన్నవి లోపింపఁగా వేల్పుదొర అని మిగు
లును (1160) ఇట్లే కన్న + ఓస్ + కవ + సు అనువిగ్రహమున
సుబ్విభక్తులు లోపింపఁగా కన్నఁగవ అని సిద్ధించు (1161) ననిరి.
షష్ఠీభవేత్తన్నది ధారాళము గా నాచ్ఛికసమాసములయెడఁ బ్రవ
ర్తించు నన్నవీ రిట్లు ధారాళముగ విభక్తిలోప మెట్లు చేయఁగలిగిరో.

అలౌకికవిగ్రహమునందే సుబ్విభక్తులు లోపించుటచే
తమ్ముకోడుకు, ననదండ, వేల్పుదొర యగు (1161) నన్నవీరు తమ్ము
అని యాప్రాతిపదిక యుదంత మని యెంచి రనిపించును. కాని తమ్ము
యని యిది యుదంతమో యని సూరిమతము ననుసరించి గుర్తింపవలసి
యున్నది. కృతోత్కం బగుసంస్కృతనామంబు సంబుద్ధిఁజనుకు
లోపంబు విభాష నగు ననుసూత్రవివరణమున సూరి 'సంస్కృతనామం
బన కనుటం జేసి ఓతమ్ముఁడ ఓబల్లిదుఁడ ఇత్యాదులందు లోపంబు లే
దనెను. ఇటుఁ దమ్ము అని నామ ముదంత మగుచో సంస్కృతనామం
బనకున్నను గృతోత్క మనుటం జేసియే (యిది కృతోత్కము గామి)
డుజ్లోపము లేదు గదా. సంస్కృతనామంబనుటవలన లే దను టెట్లు

గుదుకును. అట్లనుటచేతనే తమ్ముఁడు బల్లిదుఁడు అనుచో నామములు కృతోత్కములే యనియుఁ గాని సంస్కృతములు గామింజేసి లోపము రాలేదనియు సూరియభిప్రాయము స్పష్టము. ఆచ్ఛికమునకు (తమ్మ) సంస్కృతతుల్యమైనప్పటికిని (బల్లిద) సంస్కృతము గామి దుర్లోపము రాలేదని భావము. తమ్మ అన్నది కృతోత్క మన్నఁ బ్రాతిపదికము తమ్మ యని యదంతమే కదా. వజ్ఝలవారును కృతోత్కం బగు - ననుసూత్రమునొద్దఁ దమ్మ అనుదాహరింగూర్చి ప్రస్తావింపలేదు గాని యంతకు ముందొకచోఁ 'అల్ల తమ్మ పగతె మున్నగువాని కుత్వాదులు వచ్చు (493) ననిరి. అనఁగా నీప్రాతిపదిక మదంతము యని వారును గుర్తించి రనవచ్చు.

కాఁగా నిట తమ్మ + ఇన్, కొడుకు + ను అని యుండ, విభక్తి లోపించినఁ దమ్మకొడుకని యగునే గాని తమ్ముకొడుకని గాదు. కాఁగా విభక్తిలోపముచేఁ దమ్ముకొడుకని యగు ననుట ప్రామాదికము. అనఁగాఁ దమ్ముకొడుకని కావలె నన్నను షష్ఠికి ద్వితీయాతుల్యతనో చేయకతప్ప దని చెప్పవలెను.

కాఁగా వజ్ఝలవారు షష్ఠికి ద్వితీయాతుల్యత ధారాళమనిరే కాని యెచ్చట విభక్తిలోపము? ఎచ్చట ద్వితీయాతుల్యత? అనఁగా సమాసకములందుఁ బూర్వపదము ప్రాతిపదికలోఁ గేవలము సమాన మైనరూపముతో నిల్చియున్నప్పు డట విభక్తి లోపించు ననియు, నట్లుగాక ప్రాతిపదిక ముత్వము ని, ల మొదలగువికృతులతో నిల్చిన నట షష్ఠికి ద్వితీయాతుల్యతయో కాని విభక్తిలోపము గా దనియు వారివివరణమార్గము ననుసరించి చెప్పవలె. ఇట్టినిర్ణయమునకు లక్షణమున నేమి యాధారమో వారు స్పష్టముగాఁ జెప్ప లేదు. అహో. కొన్నియెడల విభక్తిలోపమును గొన్నియెడల ద్వితీ

యనుచుం జేయు నఝ్ఝనా ర్యులచోట్లనే చేయుచున్నను షష్ఠీతత్పురుష సమాసకములందును రెండుమార్గములు ననుసరించిరి.

ప్రాతిపదికవంటియాకృతితో నిల్చినను సమాసకములందు షష్ఠికి ద్వితీయాతుల్యత చేసిన నిబ్బంది యేమి? వేల్పులదొర యనుచో నెట్లు ద్వితీయ యైనదో యట్లే వేల్పుదొర యనుచోఁ గూడ ద్వితీయ యైన దనఁ దగును గదా. సీతను శక్తి యెట్లు వారించికొనిరో యట్లే వేల్పునుదొర యన్నదియు వారింపఁగలదు.

సమాసములందు షష్ఠికి ద్వితీయాతుల్యత! చేయు నేల యన్నది ప్రశ్న. తమ్ముఁగోడుకు ననలవంత (తమ్ముఁగోడు కనుచో నుత్వము) - అనుచో నలౌకికవిగ్రహమున సుబ్లోపముచే సిద్ధించవు గాన షష్ఠికి ద్వితీయ చేయవలె నని యొకహేతువు చూపిరి. అనఁగా నిట ముఖ్యమైనయంశ మలౌకికవిగ్రహమును సంస్కృతవిభక్తుల లోపమును. అట్లు గాక తెలుఁగువిభక్తులు లోపించు నన్నఁ బ్రకృతి సంబంధికకృతులు నిలిచియుండుఁ గాన నెప్పుడు ద్వితీయాతుల్యత యక్కర లేదు.

స్పష్టము చేయుచున్నను నహో. కూడ నఝ్ఝనావారివంటి యభిప్రాయమే కల్గియుండెనా? ముద్దుఁగుమ్మ యనుచో ద్వితీయా తుల్యత యగు ననె. లోపస్స్య యనుసూత్రమునే సంస్కృతవిభక్తికే లోపము చేయవలెఁ గాన ముద్దు + అమ్ + గుమ్మ + సు అనుచో విభక్తులు లోపింపఁగా ముద్దుఁగుమ్మ యగును. అనఁగా విభక్తి లోపమువలన బహువచనసమాసకము నేకవచనసమాసకమువలెనే యగును. కావుననే బహువచనస్థలము షష్ఠికి ద్వితీయాతుల్యత యగు ననె నన్నమాట. అట్లయిన తమ్మునిమాట మగనియానతి

యనుచో తమ్ముమాట మగయానతి యన కావలదా? షష్ఠ్యేకవచన సమాసములందును విభక్తిలోప మెల్లెడలఁ గుదురు నెట్లు? అయిన నిట్టివాని నహో. ఉదాహరించినట్లు గానరాదు. కావున నిపి యాతని దృష్టికి రాకపోవుటచే బహువచనస్థలములనే ద్వితీయాతుల్యతను బ్రస్తావించె ననియుఁ తమ్మునిమాట యనురీతిని స్పృశించిన వజ్ఝలవారివలె నేకవచనసమాసకము లందును ద్వితీయాతుల్యత చెప్పెడివాఁ డనియు నూహింపవచ్చునా? శంభునిచెలువ యనురీతివాని నిట నుదాహరించిన యహో. సమాసకములం దట్టివానిని మఱచె ననవలసివచ్చుట విశేషమే.

ఇంక బహువచనసమాసకములందును వారిపెంపు వీరిసొంపనుచో విభక్తిలోప మనియెనే కదా. వారియొక్క పెం పనుచో + అమ్ + పెంపు + సు అని యుండ విభక్తి లోపించిన నా పెంపని యగునే కాని వారిపెం పగు నెట్లు? వజ్ఝలవారు వారిమాట అనుచో ద్వితీయాతుల్యత (1167) చెప్పఁగా సంస్కృతవిభక్తులే లోపించు నని యహో. యెంచిన వారిపెం పనుచో విభక్తిలోపమును గాక వజ్ఝలవారివలె ద్వితీయాతుల్యత చెప్పఁడా? అనఁగా వారియొక్క + పెం పని యుండ యొక్క యను తెలుఁగువిభక్తి లోపించు నని యెంచినపక్షముననే వారిపెం పని విభక్తిలోపముతో సమాసరూపము సిద్ధించును. తమ్మునియొక్క మాట తమ్మునిమాట యని యవుచు షష్ఠ్యవచనసమాసకములందు ద్వితీయాతుల్యత గాక విభక్తిలోపమే యగు ననుటయు సమన్వయించు. అట్లయిన వారల యొక్క + పెంపు అనుచోఁ గూడ విభక్తిలోపముచేతనే వారలపెంపని యగుచుండ నట ద్వితీయాతుల్యత యేల చెప్పె ననుదానికి సమాధానము దొరకుట లేదు.

అహో. శు మండజీ చిం. వ్యాఖ్యాత లేరును సంస్కృత విభక్తికే లోపమగు నని యెంచినట్లు నిశ్చయింపరాకున్నది. మొదటి వ్యాఖ్యాత యగు శా. స. లోపశ్చ - సూత్రవివరణమున వేల్పుల యొక్కదొర వేల్పు(ల)దొర ఇచ్చట షష్ఠికి లోపము. కైదువయొక్క దారి కైదువదారి ఇచ్చటను షష్ఠికి లోప (247) మనెను. అనఁగా యొక్క యను తెలుఁగు విభక్తియే లోపించు నని యెంచె ననిపించు. అయిన వేల్పులయొక్క దొర వేల్పుదొర యగుటెట్లు? అట్లు గావలె నన్న వేల్పు + ఆమ్ + దొర + సు అని యుండఁగా సంస్కృత విభక్తులె లోపించె ననవలయును. లేకున్న వేల్పులదొర యని కావలదా! కాని శా. స. యాపిదప 'విభక్తి లోపించినను పిలుకు లోపము లేదు' అని యుండఁగా వావిళ్లప్రతిలో నాపిదప వేల్పుల తేనియింతి రామునిగుణములు రాజుసభ కవులవార్తలు ఇవి యలుక్స మాసము(247)లని యున్నది. నిలలు లోపింపనియవి యలుక్సమాసము లగునా? విభక్తి లోపించినను అనుచునే యివి యలుక్సమాసము లనుట యెట్లు? రామునిగుణము లనురీతిసాంస్కృతికసమాసములను గూడఁ జూపుటచే నవి షష్ఠికి ద్వితీయాతుల్యత యైనసమాసములు గావున నలుక్సమాసము లనియు (షష్ఠి లోపింపలేదు గదా.) నట్లే వేల్పులతేనియింతి వేల్పులయొక్క యింతి యిత్యాదులందును (రామునిగుణ ములు రాజులసభ అనురీతిగా) షష్ఠికి ద్వితీయ యయ్యె ననియు నెంచెనా? కాని సంస్కృతవిభక్తులే లోపించు నని యెంచి నపక్షమున నింతకు ముందు విభక్తి లోపించినను నిలలకు లోపము లే దనుట సందర్భపడదు. పైఁగా సమాసికముల స్థితమున రామునిగుణము లను రీతివానిం జూపుటయు సమన్వయింపదు. ఇంకను వావిళ్లప్రతిలో సూత్రార్థవివరణమున విభక్తులకు సిద్ధసమాసములందువలెనె లోపము

నచ్చు నని యుంట విశేషము. విభక్తి లోపించిన నిలలు లోపింప వనుటలోఁ దెలుఁగువిభక్తులె లోపించు నని యెంచినట్లును వేల్పుఁ జేనియానతి, రాముని గుణము లని నిలలు లోపింపనియట్లే ఇలుక్సమాస ములను సమాసకముల సిద్ధసమాసములందువలె విభక్తిలోప మగు ననుటయునుబట్టి సంస్కృతవిభక్తులే లోపించు నని యెంచినట్లును భిన్నాభిప్రాయములు దోచుఁచు నిది వివాదాస్పద మయియున్నది.

కాని ఆం. సా. ప. ప్రతిలో సిద్ధసమాసములందువలె లోపించు ననుమాట లేదు. విభక్తిలోప మైనను నిలలకులోపము లే దనిసూత్రి ముండఁగా వావిళ్లప్రతిలోవలె రాముని గుణము లిత్యాదులవివరణము లేను. వావిళ్లప్రతిలో షష్ఠీవిభక్తిసూత్రము వివరింపఁబడి యుటపట్టి కలుములపడఁతి యని సమాసకములు సుదాహరింపఁబడినవి. కాని ఆం.సా.ప ప్రతిలో వివరణోదాహృతు లీసూత్రమునకు లేవు. అనఁగా నాచ్ఛికసమాసములందు షష్ఠికి ద్వితీయాతుల్యత యగు ననుటకు ఆం.సా. ప ప్రతి ననుసరించి యెట్టియాధారమును లేదు. ఇంకను విభక్తి లోపించి నను నిలలు లోపింప వని మాత్రమే యుండుటచే ఆం.సా.ప.ప్రతి ననుసరించి సమాసములలోఁ దెలుఁగువిభక్తులే లోపించు ననియే చెప్ప వలె. ఇప్పటుమున వేల్పులదొర వేల్పుదొర యగు టెట్లు! ఆం.సా.ప. ప్రతిలో వేల్పు(ల)దొర యని లవర్ణకమును గుండలీకరణమున నుంచఁ బడినది.

వేలుపులయొక్క దొర వేలుపుదొర కైదువయొక్క + దారి కైదువదారి ఇట్లు అన్నిటికి విభక్తిలోపము తెలియునది. విభక్తిలోప మైనఁ దదాశ్రితము లైననిలలకు లోపము లే (108) దని కవిజ. స్పష్టము చేసెను. ఇట బా.స. వాక్యములె యుద్ధరింపఁబడిన వనవచ్చు. కవిజ. తెలుఁగువిభక్తులకె లోపము చేసె నని స్పష్టము. అయినను

